


ఎమ్. ఇల్యీన్,
యై. సెగాల్

# మానవుడే మహాశక్తి సంపన్నుడు

# తృతీయ మహా యుగం

| ఒలిగోసీన్ | | మియోసీన్ |
| --- | --- | --- |
| 3,70,00,000 యేళ్లకు పూర్వం | 2,60,00,000 యేళ్లకు పూర్వం | |



ప్లియొపీధికస్



ప్రొకాన్సల్



డ్రియొపీథికస్



ఒరియొపీథికస్

## చతుర్థ మహా యుగం

### ప్లైస్టొసీన్

1,20,00,000 యేళ్లకు పూర్వం

30,00,000 యేళ్లకు పూర్వం



రమాపీథెకస్

ఆస్ట్రలోపీథికస్ ఆఫ్రికన్

ఆస్ట్రలోపీథికస్ మహా

ఆస్ట్రలోపీథికస్ పరిణతి

అనిల్

ఎమ్. ఇల్యీన్, యై. సెగాల్

# మానవుడే మహాశక్తి సంపన్నుడు



"రాదుగ" ప్రచురణాలయం • మాస్కో

అనువాదం: ఆర్వియార్
కవర్ డిజైన్: ఎ. బెన్యమిన్‌సొన్, బి. కిషీ్ట్రమొవ్

М. Ильин, Е. Сегал

КАК ЧЕЛОВЕК СТАЛ ВЕЛИКАНОМ

*На языке телугу*

Ilyin M., Segal E.

HOW MAN BECOME A GIANT

**In Telugu**



**ISBN 5-05-000612-0**

# విషయసూచిక



1*

ప్రకరణం పదకొండు



ప్రకరణం పన్నెండు

యీ పుస్తక విషయాన్ని ఎమ్. గోర్కీ సూచించాడు. ‘‘అలాంటి పుస్తకాన్ని నేను యెలా మొదలెడతానో తెలుసా? అవధి లేని అంతరాళాన్ని వూహించండి, నక్షత్రాలు, గోళాలు.... ఎక్కణ్ణో మహాగోళం సూర్యుడు ప్రకాశించ మొదలెడతాడు. గోళాలు సూర్యుణ్ణుంచి విడిపోతాయి. ఒక చిన్నగోళపు ఉపరితలంమీద పదార్థం జీవం పొందుతుంది, తనని గురించి చైతన్యం సంతరించుకుంటుంది. మానవుడు ఆవిర్భవిస్తాడు....’’ అని ఆయన అన్నాడు.

యీ పుస్తకపు రచయితలు 1936లో తమ రచన ప్రారంభించారు. మానవుడు యెలా ఆవిర్భవించిందీ, యెలా శ్రమించ నారంభించిందీ, ఆలోచించ నారంభించిందీ, అగ్నినీ ఇనుమునీ సాధించిందీ, ప్రకృతిమీద అధికారం సంపాదించిందీ, యెలా ప్రపంచాన్ని గురించి అర్థం చేసుకుని పునర్‌నిర్మించిందీ యీ రచయితలు వివరిస్తున్నారు.

# మానవుడే మహాశక్తి సంపన్నుడు

యీ ఇలమీద ఒక మహాశక్తి సంపన్నుడున్నాడు.

అతని చేతులు యంత్రాన్ని సులభంగా వేగవంతం చెయ్యగలవు.

అతని పాదాలు ఒక్క రోజులో వేలాది మైళ్లు చుట్టిపోగలవు.

అతని రెక్కలతన్ని యే పక్షీ యెగరలేనంత యెత్తులో మేఘాల పైగా విహరింప చేస్తాయి.

అతని హస్తాలు యే చేపరెక్కలకంటే దృఢమైనవి.

అగోచరమైనదాన్ని అతని కళ్లు చూడగలవు. ప్రపంచపు అవతలి అంచున మాట్లాడే మాటలని అతని చెవులు వినగలవు.

అతనెంత శక్తివంతుడంటే పర్వతాలగుండా సొరంగ మార్గం చేసుకుపోగలడు, జలపాతాలని విశ్వామిత్రుడు త్రిశంకుని ఆపినట్టు ఆపగలడు.

అతను భూమి ఆకారాన్ని మార్చేస్తున్నాడు, అడవులని నాటుతున్నాడు, సముద్రాలని కలుపుతున్నాడు, యెడారి మరుభూముల్లోకి నీళ్లను మళ్లిస్తున్నాడు.

యెవరీ మహాశక్తి సంపన్నుడు?

మానవుడు.

కాని అతను మహాశక్తి సంపన్నుడెలా అయాడు, యీ యిలకి అధినాథుడెలా అయాడు?

అదే యీ పుస్తకంలోని కథ.

# ప్రకరణం ఒకటి

## అదృశ్య పంజరం

ఒక కాలం వుండేది. అప్పుడు మానవుడు అతి మానుషుడు గాడు, మరుగుజ్జు. ప్రకృతికి అధినాథుడు గాడు, దానికి అణిగిమణిగివుండే బానిస.

అడవిలోని పశువుకూ, ఆకాశంలోని పక్షికీ ఉన్నంత తక్కువ స్వేచ్ఛా ప్రకృతిమీద అధికారమూ అతనికి వుండేవి.

పక్షి అంత స్వేచ్ఛగా అని ఒక నానుడి వుంది. కాని పక్షికి నిజంగా స్వేచ్ఛ వుందా?

అవును, దానికి రెక్కలున్నాయి. దాన్ని దాని రెక్కలు అడవులమీదా, కొండలమీదా, సముద్రాలమీదా, యెక్కడికేనా తీసుకుపోగలవు. ఆకురాలు కాలంలో దక్షిణాదికి పకులు యెగిరిపోతూవుంటే మనమెన్ని సార్లు అసూయపడ్డాం కాదు. వినీలాకాశంలో శ్రేణులు గట్టిన రెక్కల విన్యాసం చూసి కిందవున్న మనుషులు మోరలు పైకెత్తి ఆశ్చర్యంతో ''ఆ పకుల్ని చూడండి! అవి యెక్కడేనా యెగిరిపోగలవు!'' అంటారు.

కాని నిజం అంతేనా? వూరికే అవి ప్రయాణం అంటే యిష్టపడుతున్నాయి కాబట్టి పకులు వేలాది మైళ్లు యెగిరిపోతాయా? కాదు, పకుల్ని అలా ముందుకు తోసేది అవసరం కాని, సరదా కాదు. వేలాది సంవత్సరాలు, లెక్కలేనన్ని తరాలు, జీవన పోరాటంలో యీ వలసపోయే అలవాట్లు అబ్బాయి.

పకులు ఒక చోటినుంచి యింకో చోటుకి సునాయాసంగా యెగిరిపోగలవు కాబట్టి ప్రపంచంలో ప్రతి చోటా ప్రతి పక్షిజాతీ కనిపించదేమని యెవళ్లేనా అడగడం సమంజసమే కదా.

అదే జరిగితే మన ఉత్తర ప్రాంతపు పైన్ చెట్ల అడవుల్లోనూ, బర్చ్ చెట్ల చిట్టడవుల్లోనూ రంగు యీకల రామచిలకలూ, భరద్వాజ పిట్టలూ నిండుగా వుండి వుండాలి. కాని అలా లేదే, అలా యెన్నటికీ వుండదు కూడా. ఎందుకంటే పకులు కనిపించినంత స్వేచ్ఛ వున్నవి కావు. ప్రతి పక్షికీ ప్రపంచంలో దాని చోటు దానికి వుంది. ఒకటి అడివిలో వుంటుంది, యింకోటి పొలంలో వుంటుంది, మరోటి సముద్రతీరంలో వుంటుంది.

చూడండి గద్ద రెక్కలు యెంత గట్టివో! అయినా గూడు వెతుక్కునేటప్పుడు అది కనిపించని హద్దు దాటిపోదు (ఆ హద్దుని వాస్తవానికి పటంమీద గియ్యొచ్చు). చెట్లులేని విశాలమైన బయలు ప్రాంతంలో బంగారు గద్ద తన గూడు కట్టుకోదు, మైదానాల్లో వుండే గద్ద అడవుల్లో తన గూడు కట్టుకోదు.

అడివినీ మైదానాన్నీ అగోచరమైన హద్దు విడదీస్తుంది. ఆ హద్దుని యే పక్షీ, యే పశువూ దాటలేదు.

నిజంగా అడివిలో వుండే అడివికోడి, బంగారు శిఖ పక్షి, ఉడుతలు మైదానాల్లో కనిపించవు. మైదానాల్లో జీవించే బుస్టర్డ్ పక్షి, ఎలుక జాతి జంతువు మీకు అడివిలో కనిపించవు.

దీనికి తోడు ప్రతి అడివీ, ప్రతి మైదానం, యెన్నో సూక్ష్మ ప్రపంచాలుగా విడిపోయిన అనేక చిన్న అగోచర హద్దులతో వుంటుంది.

# అడివిలో విహారం

మీరు అడివిలో వెడుతూవుంటే అదృశ్య హద్దుల్ని దాటుతూ వుంటారు. మీరు యేదేనా చెట్టు గనక యెక్కితే మీ శిరస్సు యింకా యెన్నో అదృశ్య హద్దుల్ని అధిగమించిందన్నమాట. మొత్తం అడివి అంతా పెద్ద యిల్లులాగ గదులుగా, అరలుగా విభజితమై పోయింది. మీరు వాటిని చూడలేకపోయినా అవన్ని నిజంగా వున్నాయి.

ఉదాహరణకి యిక్కడ ఫర్ చెట్లు కనిపిస్తాయి, యింతలోకే పైన్ చెట్లు తగుల్తాయి. యీ పైన్ చెట్లు ఒక చోట యింకో చోటకంటే నిటారుగా పెరుగుతాయి. యిక్కడేమో మీరు తడి నాచుతివాచీమీద నడుస్తారు, ఆ పక్కనే నేల పచ్చగడ్డితోటీ, పాకుడు జాతి మొక్కలతోటీ వుంటుంది.

నగరవాసికి పల్లెటూరు ఒక రకపు అడవిలా వుంటుంది. కాని అడివిలో వుండేవాణ్ణడిగితే అక్కడ ఒకటి కాదు నాలుగు అడవులున్నాయంటాడు. చెమ్మగా వుండే ఖాళీ ప్రదేశంలో ఫర్ చెట్ల తోపు వుంది, కింద ఒత్తుగా వుండే మెత్తటి నాచు తివాచీ. యింకా అటు పోతే, యిసక వాలుమీద అడివి తుప్పలు బెర్రీ దుబ్బులు యెక్కడ పడితే అక్కడ వుండే ఆకుపచ్చటి నాచుమొక్కల పైన్ తోపు. యిసక గుట్టల పైకి పోతే కింద తెల్ల నాచు వున్న పైన్ తోపు, యింకా అటు వార చిత్తడి నేలమీద పైన్ చెట్లు వుంటాయి. అక్కడ కింద పచ్చగడ్డి పెరిగిపోయి వుంటుంది.

చూశారా మీరు గమనించకుండానే నాలుగు అరణ్య ప్రపంచాలని వేరుచేసే మూడు గోడలని దాటేశారు.





అడవిలో వుండే రెండు పక్షులు: ఒకటి క్రాస్‌బిల్, రెండోది వడ్రంగిపిట్ట

యిళ్ల దగ్గర పేర్ల బోర్డులుంటాయి కదా? అలాగే అడివిలో పేర్ల బోర్డులు వుంటే ఫర్ అడివి చెట్లమీద యీ బాపతువి మీకు కనిపిస్తాయి: శ్రీ క్రాస్‌బిల్, శ్రీ సిస్కిన్, శ్రీ బంగారు శిఖపిట్ట, శ్రీ వడ్రంగిపిట్ట చిగుళ్లు తొడిగే అడివిలో మీకు యీ పేర్లు కనిపిస్తాయి: శ్రీ ఆకుపచ్చ వడ్రంగిపిట్ట, శ్రీమతి గోల్డ్‌ఫిన్చ్, కుమారి బ్లూ టిట్‌మస్, శ్రీ ఫ్లై కాచెర్, శ్రీమతి షిఫ్ షాఫ్, శ్రీమతి మాకింగ్‌బర్డ్, శ్రీ బ్లాక్‌క్రాప్, శ్రీ బ్లాక్ వడ్రంగిపిట్ట యింకా అలాంటివి.

ప్రతి అడివికీ అనేక అంతస్తులున్నాయి. పైన్ అడివికి రెండు, ఒకో అప్పుడు మూడు అంతస్తులుంటాయి. అడుగుది నాచు, గడ్డీ వున్నది. మధ్యదాంట్లో పొదలుంటాయి. పై అంతస్తు పైన్ చెట్లది.

ఓక్ చెట్ల అడివిలో యేడు అంతస్తులున్నాయి. పై భాగం ఓక్, ఆష్, వేప, మాపిల్ చెట్ల అగ్రభాగాలతో యెక్కణ్ణో యెత్తుగా వుంటుంది. వాటి అగ్రభాగాలు వేసవిలో ఆకుపచ్చని కప్పూ, ఆకురాలు కాలంలో పసుపు అరుణిమ కప్పూ యేర్పాటుచేస్తాయి. కొండ ఆష్, అడివి యాపిల్, భేరీ చెట్ల శిఖరాలు బ్రహ్మాండమైన ఓక్ చెట్ల నడిమి భాగానికి చేరే యెత్తులో వుంటాయి.

వాటి కింద కాయలపొదల హాథారన్లు, కదుళ్ల చెట్ల జీబురు పొదలుంటాయి. ఆ పొదల కింద పువ్వులూ, గడ్డీ వుంటాయి. అవి కూడా అంతరాలు అంతరాలుగా పెరుగుతూ వుంటాయి. నీలిఘంట పువ్వులు మిగతా వాటికంటే యెత్తుగా పెరుగుతాయి. వాటికింద చెంగల్వపూలు, పాలుగారు మొక్కలు ఫెరన్ గుబురుల్లో వుంటాయి. హరిత భరితంగా వుండే అడివి మెత్తటి నాచుమీద పెరిగే వూదాపూలూ, స్ట్రాబెర్రీలూ యింకా నేల బారుగా వుంటాయి.

నేలలోపల అడివి నేలమాళిగ వుంటుంది. అక్కడ చెట్లవేళ్లూ, పొదల వేళ్లూ, పూల వేళ్లూ వుంటాయి.

పైన్ చెట్ల అడివిలోనూ, హరితభరితమైన చెట్ల అడివిలోనూ ప్రతి అంతస్తులోనూ వాటి వాసస్థులు వాటికి వున్నారు. గద్ద అన్నిటికంటే యెత్తులో గూడు కట్టుకుంటుంది. దానికి దిగువగా చెట్టు తొర్రలో వడ్రంగిపిట్ట కుటుంబంతో కాపరం వుంటుంది. బ్లాక్‌కాప్ పొదల్లో వుంటుంది. ఉల్లంకి పిట్ట కింది అంతస్తులో వుండి కింద పచార్లు చేస్తుంది. నేలమాళిగల్లో అడివి చుంచుల సారంగాల యిళ్లు వుంటాయి.

యీ పెద్ద యింట్లో అన్ని రకాల గదులూ వుంటాయి. పై అంతస్తుల్లో యెండ తగులుతూ పొడిగా వుంటుంది. కింది అంతస్తుల్లో చీకటిగా, చిత్తడిగా వుంటుంది. అక్కడ వేసవి కాలంలో విడిదిగా ఉపయోగపడే చల్లటి గదులుంటాయి. సంవత్సరమంతా పనికొచ్చే వెచ్చని గదులూ వుంటాయి.

నేల బొరియ వెచ్చటి గది. శాస్త్రజ్ఞులు నేలలో అయిదడుగుల లోతు వున్న బొరియ శీతోష్ణస్థితిని కొలిచారు. శీతాకాలంలో బయట $-18°C$ వున్నప్పుడు బొరియలో థర్మామీటరు $+8°$ చూపించింది.

చెట్టు తొర్రలో బాగా చలిగా వుంటుంది. శీతాకాలంలో యే పక్షైనా గానీ అక్కడ గడ్డకట్టిపోతుంది. అయితేనేం వేసవి కాలంలో అది హాయి అయిన చోటు. యెకణ్ణోమూల చీకట్లో, యెండ కనిపించకుండా రోజంతా జోగుతూ గడిపే ''నిశాచరులైన'' గుడ్లగూబలు, తల్లకిందుల పకులు లాంటి వాటికి మరీ ముఖ్యంగానూ.

మనుషులు మామూలుగా యిళ్లు మారతారు. ఓ అంతస్తునుంచి యింకో అంతస్తుకి పోతారు. కాని అడివిలో అలాంటిది అసంభవం.

ఉల్లంకి పిట్ట చీకటిగా చిత్తడిగా వుండే చోటునుంచి పొడిగా యెండతగిలే అటకమీదకి తన కాపరాన్ని చచ్చినా మార్చదు. యెక్కడ్నో పై అంతస్తులో వుండే గద్ద నేలమీద చెట్టు మొదలు దగ్గరికి చచ్చినా మారదు.

# అడివికి బందీలు

ఒక ఉడత, జెరోబా యిళ్లు బదలాయించుకున్నాయనుకుందాం. ఉడత అడివిలో వుంటుంది. జెరోబా ఆరుబయలు మైదానంమీదా, యెడారిలోనూ వుంటుంది.

ఎక్కడ్నో చెట్టు యెత్తులో తొర్రలో, లేదా కొమ్మల మధ్యలో వుంటుంది ఉడత కాపరం. జెరోబా నేలలోని బొరియలో వుంటుంది.

జెరోబా తన కొత్త యింటికి మారాలంటే చెట్టు యెక్కాలి. కాని అది అలా యెక్కలేదు. దాని పంజాలు చెట్టు యెక్కడానికి నప్పేవి కావు.

ఉడత బొరియలో అసలుండలేదు. దాని అలవాట్లూ, పద్ధతులూ అన్నీ చెట్లమీద కాపరం చేసేటందుకు అనువైనవి.

అది ఎక్కడ కాపరం చేస్తోందో తెలుసుకోడానికి దాని తోకా, పంజా చూస్తే చాలు.

చెట్ల కొమ్మలు పట్టుకునే దానికీ, చెట్లనుంచి గింజలూ పైన్ కాయలూ కోసుకోడానికీ అనువుగా వుంటాయి ఉడత పంజాలు. కొమ్మమీదనుంచి కొమ్మమీదకి యెగిరేటప్పుడు పట్టు తప్పిపోకుండా నిలబెట్టే సిసలైన గాలిగుమ్మటం లాంటిది దాని తోక. అడివిపిల్లి బారినుండి దూసుకుపోవాలన్నా, గెంతాలన్నా పారిపోవాలన్నా ఉడతకి దాని తోక కాపు కొస్తుంది.

పచ్చిక మైదానంలో నివసించే జెరోబాకి ఉడతలాగా కాకుండా భిన్నమైన పంజాలు, తోకా వున్నాయి. దాంకోడానికి పొదగాని, రక్షణ యివ్వడానికి చెట్టుగాని పచ్చిక మైదానంలో లేవు. శత్రువునుంచి తప్పించుకోవాలంటే పారిపోవడమో, అదృశ్యమై పోవడమో, నేలమీద జారిపోవడమో తప్ప మార్గం లేదు. జెరోబా చేసేది సరిగ్గా అదే. పైన గుడ్లగూబ చక్కర్లు కొట్టడం జెరోబా చూసిందో యెంత వేగంగా వీలైతే అంత వేగంగా గెంతుకుంటూ పోయి తన నేల బొరియల్లో ఒక దాంట్లోకి మాయమైపోతుంది. దాని పొడుగాటి వెనక కాళ్లు గెంతడానికి ఉపయోగిస్తే, పొట్టిగా వుండే ముందు కాళ్లు నేలని తవ్వేస్తూ వుంటాయి. అది నేల బొరియలో శత్రువుల బారినుండి రక్షించుకునేందుకు దాంకుంటుంది. ఆ బొరియ వేడీ, చలీ తగలకుండా దాన్ని కాపాడుతుంది.

మరి దాని తోక మాటేమిటి?

జెరోబా తోక దాని పంజాలకి తమ్ముడి లాంటిది. అది వెనక కాళ్లమీద కూర్చుంటే, ఆనుకోడానికి మూడో కాలులాగా వుంటుంది తోక. అది గెంతినప్పుడు ఆ తోక దాన్ని చుక్కానీలాగా నడిపిస్తుంది. తోక లేకపోయినట్లైతే గెంతిన ప్రతిసారీ నేలమీద ఢబేల్న పడుతూ జెరోబా పిల్లి మొగ్గలేస్తూ వుండాల్సిందే.

అందుచేత అడివినుంచి పచ్చిక మైదానానికీ, తొర్రనుంచి నేల బొరియకీ ఉడతా, జెరోబా యిళ్లు మార్చుకోదలిస్తే అవి పంజాలనీ, తోకల్నీ కూడా బదలాయించుకోవాలి.

అడివిలోనూ, పచ్చిక మైదానాల్లోనూ నివసించే మిగతా వాటిని కూడా మనం దగ్గరగా పరిశీలిస్తే వాటిల్లో ప్రతిదీ తన స్థావరానికి అదృశ్య అభేద్య శృంఖలంతో బంధితం అయిపోయినట్టు మనకి కనిపిస్తుంది.

ఉల్లంకి పిట్ట అడివిలోనే కింది అంతస్తులో వుంటుంది. యెందుకంటే దాని కిష్టమైన ఆహారం నేలమాళిగలో

వుంటుంది. దాని పొడుగాటి ముక్కు నేల లోపలి వానపాముల్ని యేరుకోవడానికి అనువుగా వున్నట్టు కనిపిస్తుంది. చెట్టుమీద దానికి ఆసక్తి కలిగించేది యేదీ లేదు కాబట్టి ఉల్లంకి పిట్ట చెట్టుమీద యెప్పుడూ కనిపించదు.

కాని మూడు కాలి వేళ్ల వడ్రంగిపిట్టగాని, పెద్ద మచ్చలున్న వడ్రంగిపిట్టగాని మీకు నేలమీద కనబడవు. వడ్రంగిపిట్ట ఫర్ చెట్టుని గాని, బర్చ్ చెట్టుని గాని పొడుస్తూనే వుంటుంది.

పొడవడం యెందుకు? దానికేం కావాలి?

ఫర్ చెట్టు బెరడుని గనక మీరు కొంచెం తొలగించి చూస్తే తెల్లటి వంకర గాడులు అన్ని వేపులకీ పోతున్నట్టు కనిపిస్తాయి. అవి ఫర్ చెట్లమీద స్థిర నివాసంచేస్తూ, అచ్చు ముద్రలు కొట్టడంలో నేర్పు సంపాదించిన బెరడు పురుగులు కొరికి చేసిన సొరంగాలు. ప్రతి వంకర గాడి చివరా ఒక గంటు వుంటుంది. ఆ గంటులో బెరడు పురుగు డింభకాలు వుంటాయి. అవి గుడ్లనుండి అప్పుడే బయటపడ్డ క్రిములయి అప్పుడు బెరడు పురుగులవుతాయి. బెరడు పురుగు ఫర్ చెట్టుకి అంటిపెట్టుకుని బతుకుతుంది. దానికి అంటిపెట్టుకుని బతుకుతుంది వడ్రంగిపిట్ట. దాని గట్టి ముక్కు చెట్టు బెరడుని సునాయాసంగా చీలుస్తుంది. దాని నాలుక యెంత పొడుగ్గా, మెలికలు తిరిగేటట్టు వుంటుందంటే అది ఆ వంకర గాడులగుండా అలా తడుముకుంటూ పోయి డింభకాలని తినేస్తుంది.

అంచేత యిప్పుడు మనకి ఒక గొలుసు తయారైంది: ఫర్ చెట్టు — బెరడు పురుగు — వడ్రంగిపిట్ట.

వడ్రంగిపిట్టని చెట్టుకీ అడివికీ బంధించే అనేక గొలుసుల్లో యిది ఒకటి.

చెట్టుమీద దానికి ఆహారం దొరుకుతుంది, బెరడు పురుగు మాత్రమే కాదు, మిగతా పురుగులూ వాటి డింభకాలూనూ.

శీతాకాలంలో వడ్రంగిపిట్ట పైన్ కాయల్లోంచి గింజల్ని అతినేర్పుగా లాగేస్తుంది. అది పట్టుదప్పి పోకుండా వుండటం కోసం కాయని కాండానికీ చెట్టుకొమ్మకీ మధ్య బిగిస్తుంది. చెట్టు కాండంలో తన కాపరం కోసం ఒక గూడుని దొలుస్తుంది. దాని నిబ్బరమైన తోక, పంజాలాంటి కాలివేళ్లూ అది కాండం పైకి యెక్కడానికీ, దిగడానికీ చక్కగా పని కొస్తాయి. అలాంటప్పుడు అది చెట్టుమీది కాపరాన్ని యెందుకేనా వదుల్తుందా?

వడ్రంగిపిట్టా, ఉడతా, అవి అడివికి బంధితులు, అడివిలో మకాం వుండేవి కావు.

# చేపలు ఒడ్డుకి యెలా వచ్చాయి

యీ మహా ప్రపంచంలో చిన్న అడివి లోకం ఒక భాగం మాత్రమే.

భూమ్మీద అడవులూ పచ్చిక మైదానాలూనే కాదు, పర్వతాలు, తండ్రాలు, సముద్రాలు, సరస్సులు కూడా వున్నాయి.

ప్రతి ఒక్క కొండమీదా ఒక సూక్ష్మ ప్రపంచాన్ని యింకో దాన్నుంచి విడదీసే అగోచర హద్దులు వున్నాయి. అగోచరమైన పరిమితులతోటి ప్రతి ఒక్క సముద్రమూ అంతఃప్రవాహ అంతస్తులతో విభజితమైపోయి వుంది.

మెరకగా వుండే సముద్ర తీరాల దగ్గర, కెరటాల ఆటుపోట్లకు గురయే చోట, శిలలమీద లెక్కలేనన్ని

ఆలిచిప్పల్లాంటివి వుంటాయి. అవి ఆ శిలలకి యెంత గట్టిగా అంటిపెట్టుకుపోయి వుంటాయంటే ప్రళయ భీకర తరంగాలు కూడా వాటిని ఒక్క పిసరు కదిలించలేవు.

అలా దిగువగా పోతే యెండలో మెరిసే నీళ్లల్లో ఆకుపచ్చగానూ, గోధుమవన్నెగానూ వుండే సముద్రపు నాచులో రంగురంగుల చేపలు అటూయిటూ దూసుకుపోతూ వుంటాయి, పారదర్శక మెడ్యుసా చేపలు యీదుతూ వుంటాయి, మెరిసిపోయే స్టార్‌ఫిష్ మట్టులో అలా జారుతూ వుంటాయి. అంతఃప్రవాహ శిలలమీద మొక్కల్లా స్థాణువుగా వుండిపోయే అనూహ్యమైన జంతువులుంటాయి. అవి ఆహారం కోసం వేటకెళ్లక్కర్లేదు. ఆహారం తనే వాటి నోటి దగ్గరకి అలా వచ్చేస్తుంది. రెండు మూతుల కూజాల్లా కనిపించే ఎర్రటి సాగర జీవులివి. తాము తాగే నీటితోబాటు లోపలికి పీల్చే సూక్ష్మ జీవాలనుంచే వాటికి పోషణ లభిస్తుంది. ప్రకాశవంతమైన వృక్షసదృశ జలజంతువులు పుష్ప దళాల్లాంటి తమ స్పర్శకాలతోటి తమకి దగ్గరగా యీదుకుంటూ వచ్చే చేపల్ని పట్టేస్తాయి.

సముద్రపు చీకటి అంతస్తులో, అట్టడుగున అదో వింత ప్రపంచం. అక్కడ పగలంటూ లేని నిశీధి, అక్కడ యెప్పుడూ మబ్బుగానే వుంటుంది. సముద్రపు అగాధాల్లో వెలుతురన్నది వుండదు. అంటే సముద్రపు నాచు వుండదు, యెందుకంటే సముద్రపు నాచుకి వెలుతురు కావాలి.

జంతు, వృక్ష జీవ అవశేషాలు పైనుంచి కిందికి వడపోత అయే చీకటి శ్మశానం సముద్ర అగాధం.

చిత్తడిగా వుండే బురదలో పొడుగాటి తంతువుల పదికాళ్ల పీతలు సంచరిస్తాయి. వెడల్పాటి నోళ్లున్న చేపలు చీకట్లో యీత్తాయి. కొన్నిటికి కళ్లే లేవు. టెలెస్కోపుల్లా పొడుచుకు వచ్చే కళుంటాయి కొన్నింటికి. ఒళ్లంతా నిప్పు లాంటి చుక్కలున్న చేపలున్నాయి. ప్రకాశవంతమైన దీపాల కిటికీలున్న చిన్న ఓడల్లా కనిపిస్తాయవి. యింకో రకం చేపలున్నాయి. వాటికి సొంత దీపస్తంభాలున్నాయి. వాటి తలపైన యెత్తుగా పొడుచుకు వచ్చే గొట్టంమీద అవి ప్రకాశిస్తాయి.

యీ వింత ప్రపంచానికీ మన ప్రపంచానికీ పోలిక వుందా!

కాని అలాగే తీరం వెంబడి పొడినేల, మెరగ్గా వుండే సముద్రపు భాగమూ ఎంత విభేదంగా వుంటాయి, అవి ఒక సన్నటి గీతతోటి, బీచ్ అనే సముద్ర తీరంతోటి, విడిపోయినా కూడా.

ఒక ప్రపంచపు నివాసులు యింకో ప్రపంచంలోకి మారగలరా? ఒక చేప సముద్రం వదిలిపెట్టి పొడినేలమీదకి రాగలదా?

అది అసాధ్యంగా కనిపిస్తుంది. చేప నీటిలో బతకడానికే అమరి వుంది. అది నేలమీద బతకాలంటే దానికి మొప్పల బదులుగా శ్వాసకోశం కావాలి, రెక్కల బదులుగా కాళ్లుండాలి. చేప తన జలజీవితం వదిలి పొడినేలమీద జీవితానికి రాగలిగింది, అది చేప కానప్పుడే.

కాని చేప చేప కాకుండా వుండగలదా?

మీరు ఈ ప్రశ్నని యే శాస్త్రజ్ఞుణ్ణైనా అడిగితే, కొన్ని లక్షల సంవత్సరాల క్రితం కొన్ని చేప జాతులు నిజంగా ఒడ్డుకు వచ్చాయనీ, చేపలుగా వుండకుండా పోయాయనీ మీకు చెబుతాడు. నీటినుంచి నేలకి యీ పరివర్తన జరగడానికి ఒకటి కాదు, రెండు కాదు కొన్ని లక్షల యేళ్లు పట్టింది.

యెండకాలంలో యెండి పోతూవుండే ఆస్ట్రేలియా నదుల్లో కొమ్ముచేప (hornfish) అనే జాతి ఒకటి వుంది. దాని గాలితిత్తి శ్వాసకోశాన్ని పోలివుంటుంది, సంవత్సరంలో పొడిగా వుండే కాలంలో, నీటిలోతు తగ్గి నదులన్నీ బురద

గుంటల్లాగా అయినప్పుడు మిగతా చేపలన్నీ చచ్చిపోతాయి, అవి కుళ్లిపోయి నీటిని కలుషితం చేస్తాయి. కాని మొప్పలతో బాటుగా శ్వాసంకోశం వుండబట్టీ, గాలి కావాల్సివస్తే అది తల నీటి పైకి పెడితే చాలు కాబట్టీ కొమ్ముచేప ఒక్కటే పొడి రోజుల్ని తట్టుకుని బతుకుతుంది.

అసలు నీళ్లు అవసరంలేని కొన్ని చేపల జాతులు ఆఫ్రికాలోనూ, దక్షిణ అమెరికాలోనూ వున్నాయి. వర్షాభావపు రోజుల్లో అవి బురదలో కూరుకుపోయి శ్వాసకోశంతో గాలి పీలుస్తూ వానాకాలం వచ్చేదాకా అక్కడ నిశ్చలంగా వుండి పోతాయి.

అంటే చేపలకి శ్వాసకోశాలు పెరిగివుండేవి కదా.

మరి కాళ్ల మాటేమిటి?

ఆఁ, కాళ్లూనూ. దానికి సజీవమైన ఆధారాలున్నాయి. ఉష్ణమండల ప్రాంతంలో బురదమీద గెంతేవి వున్నాయి. అవి తీరం వారే గెంతడమే కాదు, చెట్లు కూడా యెక్కుతాయి. వాటి జంట రెక్కలు వాటికి కాళ్లల్లా ఉపయోగపడతాయి.

చేపలు నీటిలోనుంచి బయటపడి నేలమీదకి రాగలవనే దానికి యీ వింత జీవాలన్నీ సజీవమైన దాఖలా. అది నిజంగా జరిగిందని మనం యెలా చెప్పగలం?

నశించిపోయిన జంతువుల యెముకలు మనకి ఆ కథ చెబుతాయి. ప్రాచీన నిక్షేపాలని తవ్వే పురాతత్వ శాస్త్రజ్ఞులకి అచ్చు చేపలాగానే వుండే జంతువు యెముకలు కనిపించాయి. అయినా అది అప్పటికే చేప లక్షణాల్లేకుండా పోయింది. అది కప్పలాగానో, ట్రైటన్ లాగానో ఉభయచరం. యీ జంతువుని స్టెగొసెఫాలస్ (stegocephalus) అనేవాళ్లు. దానికి రెక్కలకి బదులుగా అయిదు వేళ్లన్న కాళ్లుండేవి. అది మధ్యమధ్యన ఒడ్డుమీదకి వచ్చినప్పుడు నెమ్మదిగానేనా గానీ యీ కాళ్లతోటే నడిచేది.

సామాన్యంగా కనిపించే కప్పని యింకొంచెం పరకాయించి చూద్దాం. గుడ్డు పొదగ్గానే తోకకప్ప వస్తుంది. తోకకప్పకీ చేపకీ వున్న తేడా బహు సూక్ష్మం.

అందుచేత కొన్ని లక్షల సంవత్సరాల క్రితం సముద్రాన్నీ పొడినేలనీ వేరుచేసే హద్దుని కొన్ని జాతుల చేపలు దాటి వచ్చాయని తేలుతుంది. కాని ఆ క్రమంలో అవి మారేయి. ఉభయచరాలు చేపలనుంచే పుట్టుకొచ్చాయి. అవి మళ్లీ సరీసృపాలకు (reptiles) పూర్వులయ్యాయి. యీ సరీసృపాలు సస్తన జంతువులకీ, పక్షులకీ, మొత్తానికి పూర్తిగా జల మార్గం మర్చిపోయిన వాటితో సహా అనేకమైన వాటికీ ప్రాచీన పూర్వులన్న మాట.

# నిశ్శబ్ద సాక్షులు

లక్షలాది సంవత్సరాలుగా ప్రాణులు మారకుండా అలాగే లేవని చెప్పే నిశ్శబ్ద సాక్షులు జంతువుల శిలాస్థులు.

ఏమిటి వాటిని మారేటట్టు చేసింది?

చార్లెస్ డార్విన్ అనే ఇంగ్లీష్ శాస్త్రజ్ఞుడు తన పరిణామ సిద్ధాంతం ప్రతిపాదించేదాకా అదో రహస్యంగానే వుండింది. ఆయన ఆరంభించిన కర్తవ్యాన్ని వి. కొవలేవ్‌స్కీ, కె. తిమిర్యాజెవ్ అనే రష్యన్ శాస్త్రజ్ఞులు కొనసాగించారు. వాళ్ల

విస్తృతమైన అధ్యయనాలు పూర్తయ్యాక, మన తాతముత్తాతలకి అసలు అర్థం కాని విషయాలు మనకి వివరంగా తెలిసాయి.

ప్రతి ఒక్క జీవీ ప్రపంచంలో తను బతికే స్థలానికి, పరిసరానికి, వాతావరణానికి అనువుగా మారుతుంది. కాని ప్రపంచంలో యేదీ స్థిరం కాదు: ఉష్ణ శీతోష్ణస్థితి చల్లగా అవుతుంది, ఒకప్పుడు మైదానాలున్న చోట పర్వతాలు ప్రత్యక్షమవుతాయి, సముద్రం పోయి పొడినేల వస్తుంది, పైన్ అడవుల స్థానంలో పత్రభరిత వృక్షారణ్యం గోచరిస్తుంది.

తమ చుట్టూతా వుండే ప్రతీదీ మారిపోతే జీవకోటి యేమవుతుంది?

అవీ మారతాయి.

కాని యెలా మారాలో నిర్ణయించుకునేవి మాత్రం అవి కావు. ఏనుగు ఆకులూ, గడ్డి, పళ్లూ వుండే శాకాహారం నుంచి మాంసాహారానికి హఠాత్తుగా మారలేదు. "నాకు ఉక్కగా వుంది" అని చెప్పి తన బొచ్చుని ఎలుగుబంటి వొలిచేసుకోలేదు.

జీవకోటి యిష్టానుసారంగా మారదు. నూతన ఆహారం తిని, నూతన పరిస్థితుల్లో బతకాల్సివచ్చే అగత్యం వల్లనే అవి మారతాయి. ఆ జరిగే మార్పులేనా అన్ని వేళలా వాటి శ్రేయస్సుకీ కాదు, వాటి ఉపయోగానికీ కాదు.

నూతన పరిసరాల్లో వుండాల్సి వచ్చే జంతువులూ, మొక్కలూ తరచుగా బెంగపెట్టుకుని చచ్చిపోతాయి. యెందు కంటే తమ పూర్వుల్లాగా వాటి కవసరమైనవి వాటికి దక్కవు.

అవి ఆకలికి మాడిపోవచ్చు, గడ్డకట్టుకుపోవచ్చు, లేదా అలవి గాని వేడికో, దప్పికకో గురవవచ్చు. తమ శత్రువులకి సులభంగా యెర అయిపోవచ్చు. వాటి సంతతి యింకా అనారోగ్యంగా వుండి, నూతన పరిస్థితులకి తట్టుకుని బతకలేకపోవచ్చును. ఆఖరికి ఆ జాతి మొత్తం నూతన పరిస్థితుల్లో నిభాయించుకు రాలేక అంతరించిపోవచ్చును.

జీవకోటి తమకి హానికరం కాకుండా, అనుకూలంగా వుండేటట్టూ మార్పు చెందవచ్చును కూడా. అనుకూలమైన పరిస్థితుల్లో ఆ మార్పులు తర్వాతి తరాలకి సంక్రమిస్తాయి. ఆ మార్పులు పోగుపడి, సుదృఢమై, సంఘటితం అవుతాయి.

కొంత కాలానికి యీ వారసులు తమ పూర్వుల్ని యెంత మాత్రమూ పోలివుండరని కనిపిస్తుంది. వాటి స్వభావమే మారిపోయింది. తమ పూర్వులకి ప్రమాదభరితంగా వుండే పరిస్థితుల్లో అవి బతకగలుగుతున్నాయి. అవి నూతన పరిస్థితుల కనువుగా మారి, సర్దుకుపోగలుగుతున్నాయి. జరిగిందేమిటీ అంటే ప్రాకృతిక వరణం (natural selection): నూతన పరిస్థితులకి అనుకూలంగా మారలేని జీవులు నశించిపోయాయి, అనుకూలంగా మారగలిగేవి బతికి బట్టకట్టాయి.

తిమిర్యాజెవ్ యిచ్చిన ఉదాహరణ యిది: జెరూసలెం ఆర్టిచోక్ మొక్క నొక్కదాన్ని కొండల్లో పాతేరు. మైదానాల మీద వుండే ఆర్టిచోక్ మొక్కకి పొడుగాటి కాండం, దళసరి పత్రాలూ వుంటాయి. కొండలమీద నేలబారుగా పాకిన కొమ్మలున్న మరుగుజ్జు మొక్కగా అది మారిపోయింది.

ఆర్టిచోక్ నూతన పరిసరాల్లో వుండబట్టే యీ మార్పు జరిగింది. కొండల్లో వుండే నేల, శీతోష్ణస్థితి మైదానంమీద వుండే వాటికంటే చాలా తేడాగా వుంటాయి. ఆ మార్పు దాని మంచికే జరిగింది. శీతాకాలపు మంచునుంచీ, చలిగాడ్పులనుంచీ అది రక్షణ పొందడం సులభతరమైంది.

వాతావరణంలోని మార్పువల్ల జీవకోటిలో మార్పు రావడానికి సంబంధించిన ఉదాహరణలు చాలా వున్నాయి. చేపలు క్రమేపీ ఉభయచరాలుగా పరివర్తన చెందడం బట్టి దీన్ని రుజువు చెయ్యవచ్చు.

క్రమేపీ యెండిపోయి మెరకైన సముద్రాలలోనూ, సరస్సుల్లోనూ యిది మొదలైంది. నూతన జీవిత విధానానికి అనువుగా మారలేని చేప జాతులు నశించిపోతూ వుండేవి. బతికినవి నీళ్లు లేకుండా చాలా కాలం వుండగలగడం నేర్చుకున్నాయి. పొడిరోజుల్లో అవి బురదలో దాంకునేవి లేదా తమ రెక్కల్ని కాళ్లల్లాగా వాడుకుని దగ్గరి కుంటల్లోకి జారిపోయేవి.

పొడినేలమీద సహకారిగా వుండే శరీరపు ప్రతి చిన్న మార్పునీ ప్రకృతి వినియోగించుకుంది. యీ చేపల గాలితిత్తులు క్రమేపీ శ్వాసకోశాలుగా మారాయి. జంట రెక్కలు కాళ్లుగా మారాయి.

యీ రకంగా జలవాసులు క్రమేపీ నేలమీద జీవితానికి అలవాటు పడ్డాయి.

మారగలగడం అనేదే చేపల రెక్కల్నీ, గాలితిత్తినీ, శరీర నిర్మాణాన్నీ నూతన పరిసరాలకి మారేటట్టు చేసింది.

ఉపయోగపడే మార్పుల్నే వరణం నిలబెట్టింది. కీడుగా వుండేవి నిర్మూలనం అయిపోయాయి.

వంశపరంపరానుగత యీ అనుకూలమైన మార్పుల్ని తర్వాతి తరానికి సంక్రమింప చేసింది, వాటిని కూడదీసింది, సంఘటిత పరిచింది.

వి. కొవలేవ్‌స్కీ అధ్యయనం వెల్లడి చేసినట్టు అశ్వ చరిత్రను చూస్తే యీ విషయం యింకా తెలుస్తుంది.

దట్టమైన అడవులగుండా దారి చేసుకుని, కూలిన చెట్ల కాండాలమీదనుంచి లాఘవంగా గెంతుతూ ప్రాకులాడే చిన్న జంతువునుంచి గుర్రం పుట్టుకొచ్చిందంటే నమ్మడం కష్టమే. ఆ చిన్న జంతువుకి గుర్రానికి మల్లే గిట్టలుండేవి కావు, అయిదు వేళ్లకి గోళ్లున్న పంజాలాంటి చిన్న అవయవం వుండేది. అడవిలో ఎగుడుదిగుడుగా వుండే నేలమీద వూతంగా వుండడానికి ఆ గోళ్లు సహకరించేవి.

కాలగతిలో మైదానాలు యేర్పడుతూ మహారణ్యాలు పల్చబడ్డం మొదలెట్టాయి. అడివిలో వుండే మన గుర్రపు పూర్వులు యింకా యింకా తరుచుగా మైదానంమీదకి రావాల్సివచ్చేది. యేదేనా ప్రమాదం సంభవిస్తే అడివిలోకి మళ్లే దాంకోడానికి చోటు లేదు. శీఘ్రంగా పారిపోవడం ఒక్కటే తప్పించుకునే మార్గం. ప్రమాదంనుంచి తప్పించుకునే అడివిలోని యీ దాగుడు మూతల పద్ధతి ఆరుబయలు మైదానాల్లో, తరిమి పట్టుకునే ఆటగా మారి, చాలా అడివి జంతువులు యీ తరిమి పట్టుకోవడంలో నాశనమైపోయేవి. పొడుగ్గా, శీఘ్రంగా పరిగెత్తగల కాళ్లున్నవే క్రూర జంతువుల బారినుండి తప్పించుకుని పారిపోయి బతకగలిగేవి.

మళ్లీ ప్రకృతి తన వరణాన్ని సాగించింది. జంతువు వేగంగా పరిగెత్తగల ప్రతి మార్పునీ పట్టి పదిలంచేసి, దాని పలాయనానికి ఉపయోగంలేని ప్రతిదాన్నీ త్యజించేటట్టు చేసింది.

గుర్రపు పూర్వులకి సంబంధించి ప్రకృతి చేసిన యీ వరణంవల్ల శీఘ్రంగా పరిగెత్తే వాటికి చాలా కాలివేళ్లు అనవసరం అని తేలింది. గట్టిగా, బలంగా వున్నదైతే ఒకటేనా చాలు. కాలక్రమేణా మూడు వేళ్ల గుర్రాలూ, ఆఖరికి ఒక వేలి గుర్రమూ వచ్చాయి. యీవాళ మనకి తెలిసిన గుర్రానికి ఒకటే పొడుగాటి కాలి వేలు దిట్టమైనగిట్టతోటి వుంది.

గుర్రం అడివిలోని మొదటి వాసస్థలాన్ని వదిలిపెట్టినప్పుడు దాని అంగాలు మాత్రమే కాక, మొత్తం దాని శరీరమే మారిపోయింది. ఉదాహరణకి దాని మెడ. గుర్రపు కాళ్లు పొడుగు పెరిగి, దాని మెడ పొట్టిగానే

వుండివుంటే, కాల్రక్రమేణా గుర్రం కాలికింద వుండే గడ్డిని కూడా అందుకోలేకపోయి వుండేది. కాని అలా జరగలేదు. ఎందుకంటే ప్రకృతి పొట్టి కాళ్లున్న వాటిని తోసేసినట్టే, పొట్టి మెడ గుర్రాలని కూడా నిరాకరించింది.

గుర్రం పళ్లు మాటేమిటి? అవీ మారాయి. మైదానాల్లో గుర్రాలు ముతగ్గా, కరుగ్గా వుండే గడ్డిని తినాలి. దాన్ని గుర్రం ముందుగా దవడపళ్లతో రుబ్బాలి. అంచేత దాని పళ్లు మారాయి. యిప్పుడు గుర్రాలకి తిరగళ్లలాంటీ, కరకర అరగదీసే చట్రాల్లాంటీ పళ్లుంటాయి. అవి ఎండు గడ్డిని కూడా నమిలేస్తాయి.

గుర్రపు అంగాలూ, కాలివేళ్లూ, మెడా, పళ్లూ యిలా మారడానికి యాభై మిలియన్ సంవత్సరాలు పట్టింది. యీ క్రమంలో నాశనమైపోయిన జీవులెన్నో!

అయినా, దీనర్థం యేమిటంటే సముద్రాన్ని నేలనుంచీ, అడివిని మైదానంనుంచీ విడదీసే హద్దులు శాశ్వత మైనవి కావని. సముద్రాలు యింకిపోతాయి, లేదా నేలని ముంచెత్తేస్తాయి. మైదానం ఎడారిగా మారిపోతుంది. సముద్ర వాసులు పొడినేలమీదకి పాకి రావచ్చును. అరణ్యవాసులు మైదానాల్లో బతికేవాళ్లవచ్చు. కాని తన చిన్న ప్రపంచాన్ని వదులుకోవడం జంతువుకి యెంత కష్టం, తన పరిసరాలకి తనని కట్టిపడవేసే గొలుసుల్ని తెంచుకోవడం యెంత కష్టం! యీ శృంఖలాలని ఛేదించుకున్నా కూడా దానికి స్వేచ్ఛ లేదు, యెందుకంటే అది వూరికే ఒక అగోచరమైన బోనునుంచి యింకో అగోచరమైన బోనులోకి పోయిందంతే.

గుర్రం అడివినుంచి మైదానానికి రాగానే అది అడివిలో వుండే జంతువు కాకుండా మైదానాలమీద బతికే జంతువైంది అంతే. చేపజాతి ఒకటి నీళ్లని వదిలి పొడినేలమీదకి ఒకసారి వచ్చిందంటే అదింక మళ్లీ సముద్రానికి తిరిగిపోలేదు. ఎందుకంటే అలా చెయ్యడానికి అది మళ్లీ మారాలి. సముద్రంలోకి తిరిగివెళ్లిపోయిన భూచర జాతులకి జరిగింది సరిగ్గా యిదే. వాటి కాళ్లు మళ్లీ రెక్కలుగా మారిపోయాయి. ఉదాహరణకి తిమింగిలం వుంది. అది ''చేప లాగా'' యెంత అవాల్సివచ్చిందంటే దాని పుట్టుక తెలియని వాళ్లంతా దాన్ని చేప అనే అనుకుంటారు, అది నిజంగా సస్తన జంతువు అయినా.

## మానవుడు స్వేచ్ఛాయుతుడవుతున్నాడు

ప్రపంచంలో దగ్గరదగ్గర మిలియన్ జంతు జాతులున్నాయి. ప్రతి ఒక్కటీ తను అలవాటు పడ్డ తన చిన్న ప్రపంచంలో వుంటుంది.

ఒక జాతికి ''రావద్దు'' అనే అగోచర సంకేతం కనిపించిన చోట యింకొకటి ''స్వాగతం'' అనే అగోచర సంకేతాన్ని చూస్తుంది.

ధృవప్రాంతపు ఎలుగుబంటి ఉష్ణప్రాంతాల అడివిలోకి వస్తే యెలా వుంటుందో వూహించండి! అది వూపిరాడకుండా చచ్చిపోతుంది, యెందుకంటే దాని బొచ్చు తొడుగు విప్పడానికి లేదు. ఉష్ణప్రాంతాల్లో వుండే ఏనుగు లాంటిది ఆర్కిటిక్ మంచులో గడ్డకట్టి చచ్చిపోతుంది. యెందుకంటే దానికి చర్మం తప్ప యింకేమీ పైన లేదు.

ధృవప్రాంతపు ఎలుగుబంటీ, ఏనుగూ భూమ్మీద పొరుగున వుండే చోటు ఒకటే వుంది. అక్కడ ప్రపంచపు



ధృవ ప్రాంతపు ఎలుగుబంటీ, ఏనుగూ. యివి జూలో మాత్రమే పక్కపక్కన వుంటాయి

నలుదిక్కులనుండీ వచ్చిన జంతువులు వుంటాయి. యిక్కడ మైదానంలో వుండే జంతువులు అడివి జంతువులకి రెండు గజాల దూరంలో వుంటాయి, వాటి పక్కనే పర్వతాల్లో వుండేవీనీ.

ఆ స్థలం జూ.

జూలో దక్షిణ ఆఫ్రికాకి పక్కనే ఆస్ట్రేలియా, ఆస్ట్రేలియాకి పక్కనే ఉత్తర అమెరికా వుంటాయి. ఆ జంతువులు ప్రపంచపు అన్ని మూలలనుంచీ వచ్చాయి. కాని అవి వాటంతటఅవే రాలేదు. మానవుడు వాటిని ఒక చోట కలిపాడు.

వాటినన్నిటినీ సుఖంగా వుండేటట్టు చెయ్యడం యెంత కష్టమో వూహించండి! ప్రతి జంతువూ తన చిన్న ప్రపంచానికి అలవాటు పడిపోయింది. జూలో యించుమించు వాటి వాటి చిన్న ప్రపంచాల్లాంటి పరిస్థితుల్నే మానవుడు కల్పించాలి.

యిక్కడ కుంటలో సముద్రంలాంటి స్థితినీ, అక్కడో యెడారి లాంటి దాన్నీ కల్పించాలి.

ఆ జంతువులన్నింటికీ ఆహారం పెట్టాలి, అవి ఒక దాన్ని యింకోటి తినెయ్యకుండా చూడాలి. ధృవప్రాంతపు ఎలుగుబంటికి స్నానానికి చన్నీళ్లు కావాలి; కోతులకి వేడిగా ఉండాలి; సింహానికి ప్రతిరోజూ దాని వాటా పచ్చి మాంసం దానికి కావాలి; గద్దకి తన రెక్కలు చాచుకునే జాగా కావాలి.

మైదానాల్లో వుండే జంతువులని, అడివిలో వుండే వాటిని, కొండల్లో వుండే వాటిని, ఎడారుల్లోనూ సముద్రాల్లోనూ వుండే వాటిని కృత్రిమంగా ఒక చోట చేర్చడంవల్ల, అవి నశించి పోకుండా వుండేందుకు మానవుడు కృత్రిమ పరిసరాన్ని యేర్పాటు చెయ్యాల్సి వచ్చింది.

మరి మనిషి యెలాంటి జంతువు: మైదానాల్లో వుండే జంతువా? అడివిలో వుండే జంతువా? కొండల్లో వుండే జంతువా?

అడివిలో వుండే మనిషిని "అడివి మనిష"నీ, బాడవలో వుండే మనిషిని "బాడవ మనిష"నీ అనవచ్చా?

వుహుం, అనకూడదు.

అడివిలో వుండేవాడు మైదానాల్లోనూ వుండగలడు. బాడవలో వుండేవాడు పొడినేలమీదకి రావడానికి పరమా నంద భరితుడవుతాడు.

మానవుడు యెక్కడేనా జీవించగలడు. మానవుడు పోలేని చోటులంటూ భూమ్మీద దాదాపు లేవు, ''మనుషుల్లారా రాకండి!'' అని హెచ్చరించే అగోచర సంకేతాలూ యెక్కడా లేవు. ఆర్కిటిక్ పరిశోధకులు మంచుపలకలమీద వుంటారు. వాళ్ళు హఠాత్తుగా పరమ వేడిగా వుండే ఎడారిమీదకి పోవాల్సివస్తే యే కష్టమూ లేకుండానే పోతారు.

పచ్చికమైదానంనుంచి అడివిలోకి మారినా, అడివిలోనుంచి మైదానంమీదకి మారినా మనిషి కాళ్ళూ, చేతులూ, పళ్ళూ బదలాయించుకోనక్కర్లేదు. అతని శరీరంమీద బొచ్చు లేనంత మాత్రాన దక్షిణాన్నుంచి ఉత్తరానికి పోయినప్పుడు అతను నాశనం కాడు.

ఒక జంతువు బొచ్చు దాన్ని కాపాడినట్టే మానవుణ్ణీ బొచ్చు కోటూ, బూట్లూ చలినుంచి కాపాడతాయి.

మానవుడు గుర్రంకంటే వేగంగా పోవడం నేర్చుకున్నాడు, కాని దాని కోసమని అతను ఒక్క కాలి వేలు కూడా వదులుకోవాల్సిన అవసరం లేకపోయింది.

మానవుడు చేపకంటే యెక్కువ వేగంగా యీదడం నేర్చుకున్నాడు, కాని దాని కోసమని అతను తన కాళ్ళనీ, చేతుల్నీ రెక్కలకింద మార్చుకోవాల్సిన అవసరం లేకపోయింది.

సరీసృపాలకి పక్షులుగా మారడానికి యెన్నో కోట్ల సంవత్సరాలు పట్టింది. దానికి అవి చాలా యెక్కువ మూల్యం చెల్లించాయి, యేమంటే ఆ క్రమంలో వాటి ముందు పంజాలు పోయి, అవి రెక్కలయ్యాయి. మానవుడు ఒక వంద సంవత్సరాల లోపునే యెగరడం నేర్చుకున్నాడు, కాని ముందుగా తన చేతుల్ని పోగొట్టుకోవాల్సిన అవసరం లేకపోయింది.

జంతువుల్ని బందీలుగా చేసే అగోచరమైన హద్దుల్ని మానవుడు తను మారకుండానే అధిగమించడం నేర్చుకున్నాడు.

తను వూపిరి పీల్చడానికి గాలి కూడా వుండని యెత్తులకి మానవుడు వెళ్ళగలడు, అయినా భూమ్మీదకి సుఖంగా ఆరోగ్యంగా దిగిరాగలడు.

జంతువులూ, పక్షులూ పూర్తిగా ప్రకృతిమీద ఆధారపడివున్నవి. యేదేనా ఒక లెక్కని చెయ్యడం ఆ లెక్క నియమాలమీద ఆధారపడి వుంటుంది. ప్రకృతిలో కూడా అంతే. ప్రతి జంతువూ ప్రకృతి పరిష్కరించిన లెక్క. యీ లెక్క నియమాలు ప్రతి జంతువుకీ అవసరమైన జీవన పరిస్థితులు. దాని పరిష్కారం పంజాలు, కాళ్ళు, రెక్కలు, చేప రెక్కలు, ముక్కులు, గోళ్ళు, అలవాట్లు, లక్షణాలు సమకూరడం. ఆ జంతువు యెక్కడ యెలా బతికేదీ అంటే ఉప్పు నీళ్ళల్లోనా మంచి నీళ్ళల్లోనా లేదా నేలమీదా, తీరంలోనా, సముద్రంలోనా, సముద్రపు గర్భంలోనా, ఉపరితలంమీదా, ఉత్తరానా దక్షిణానా, పర్వతాల్లోనా లోయల్లోనా భూమిపైనా, బొరియల్లోనా, పచ్చిక మైదానాల్లోనా అడవుల్లోనా అనే దాని మీద జవాబు ఆధారపడివుంటుంది. మరో ముఖ్యమైన లక్షణం ఆ జంతువుకి యిరుగుపొరుగు యెవరు అనేది?

ఏ జంతువేనా గానీ పరిసర వాతావరణంమీదే పూర్తిగా ఆధారపడి వుంటుంది.

కాని మానవుడు తనకి అనుకూలమైన పరిసరాల్ని సృష్టించుకుంటాడు. మాటిమాటికీ అతను ప్రకృతి చేతిలోనుంచి దాని పుస్తకాన్ని లాగేసుకుని తన కిష్టం లేని నియమాలని కొట్టి పారేస్తాడు.

''ఎడారిలో చాలా తక్కువ నీరు వుంటుంది'' అంటుంది ప్రకృతి పుస్తకం. మనం లోతైన కాలవల్ని యెడారి గుండా తవ్వి దీన్ని కొట్టి పారేస్తున్నాం.

''ఉత్తర ప్రాంతంలో నేల చవిటి నేల'' అంటుంది ప్రకృతి పుస్తకం. మనం నేలని సారవంతం చేసి దీన్ని మార్చేస్తున్నాం. తృణధాన్యపు గడ్డినీ పప్పు గింజల శాకాల్నీ యెడతెగకుండా పాతి మనం నేలని సారవంతం చేస్తున్నాం.

''శీతాకాలంలో చలిగా వుంటుంది, రాత్రిళ్లు చీకటిగా వుంటుంది'' అంటుంది ప్రకృతి పుస్తకం.

కాని మానవుడు యీ మాటల్ని లక్ష్య పెట్టడు. శీతాకాలంలో తన యింటిని వెచ్చగా చేసుకుంటాడు, రాత్రిళ్లని ధగద్ధగాయమానంగా చేసుకుంటాడు.

మనం నిరంతరంగా మన పరిసర వాతావరణాన్ని మారుస్తూనే వున్నాం.

మనల్ని చుట్టిముట్టి వున్న అడవులు మొక్కల్ని నాటడంవల్లా, అడవుల్ని కొట్టెయ్యడంవల్లా వాటి అసలు స్వరూపాన్ని యెప్పుడో పోగొట్టుకున్నాయి.

మన పచ్చిక మైదానాలు పూర్వం వుండే మైదానాల్లాంటివి కావు. వాటిని మానవుడు సాగుచేశాడు.

మన మొక్కలు, రైధాన్యం, గోధుమ, ఆపిల్, భేరీ చెట్లు ఒకప్పుడు అడివి ప్రాంతంలో పెరిగిన తృణ ధాన్యాల్లాంటివి కానే కాదు.

ప్రకృతిలో మీకెక్కడేనా ''ఆపిల్ – భేరీ'' సంకర పళ్లు కనిపిస్తాయా? లేదా సగం తీపి చెర్రీ, సగం బర్డ్ చెర్రీ రకం పళ్లు కనిపిస్తాయా? రష్యన్ శాస్త్రజ్ఞుడు, తోటల పెంపకందారుడు ఇవాన్ మిచూరిన్ సృష్టించిన అనేక పళ్లల్లో యేదేనా కానీ మీకు కనిపిస్తాయా?

ఆయన ఉపదేశం అనుసరిస్తున్న శాస్త్రజ్ఞులు యివాళ ప్రకృతిలో మార్పుని, వంశపరంపరానుగతని, వరణాన్ని మానవుడికి ఉపయోగకరమైన రీతిలో నడిపించగలుగుతున్నారు.

గుర్రాలు, ఆవులు, గొర్రెలు లాంటి మచ్చికైన జంతువులు అడివిలో కనిపించవు. వాటిని మానవుడే పెంచి పోషించాడు.

మానవుడు అడవి జంతువులని కూడా తమ అలవాట్లని మార్చుకునేటట్లు చేశాడు. ఆహారం వెదుక్కుంటూ మానవ ఆవాసాలకీ, పొలాలకీ చేరువలో కొన్ని వుంటే, కొన్ని మానవుణ్నుంచి తప్పించుకు పారిపోవడానికి యెక్కడికో దూరంగా పోయాయి. మానవుడి ఆవిర్భానికి ముందు వాటి పూర్వులు అక్కడ యెప్పుడూ వుండి యెరగవు.

కాలక్రమంలో నిజమైన నిరావాస ప్రాంతాల్ని చూడాలంటే మానవుడు ప్రత్యేకం నిర్దేశించిన ప్రాంతాలకి పోవాల్సివస్తుంది. యెందుకంటే మానవుడు భూమి ఆకారాన్నే పూర్తిగా మార్చేసి వుంటాడు.

యీ నిర్దేశిత ప్రాంతాల హద్దుల్ని గీస్తూ మనం ప్రకృతితో ''చూడు యీ ప్రాంతంలో నువ్వే సర్వాధికారిణివి, కాని యీ హద్దు దాటింతర్వాత ప్రతీదీ మాదే'' అంటాం.

మానవుడే నిరంతరంగా ప్రకృతికి అధినాధుడవుతున్నాడు కదా మరి!

అలా అని పరిస్థితి యెప్పుడూ యిలాగే లేదు.

మన చరిత్ర పూర్వపు మానవులు భూమ్మీద వాసం చేసే మిగతా జంతువుల్లాగానే ప్రకృతికి బానిసలుగా వుండేవాళ్లు.

# మన పూర్వుల్ని కలుసుకుందాం

మన యీనాటి అడవులకీ తోపులకీ బదులుగా లక్షలాది సంవత్సరాల క్రితం వేరే చెట్లున్న వేరే అడవులు, జంతువులు, గరికలు వుండేవి.

ప్రాచీనకాలపు అడవుల్లో బర్చ్ చెట్లూ, వేప చెట్లూ, మాపిల్ చెట్లూ, మిర్టిల్ చెట్లకీ, లారెల్ చెట్లకీ, మాగ్నోలియా పొదలకీ పక్క పక్కనే పెరిగేవి. కాయల పొదల్ని ద్రాక్ష తీగలు అల్లుకుని వుండేవి, నేలబారు ఆకుల విల్లోకి యిరుగుపొరుగ్గా కర్పూరం స్వీట్‌గమ్ చెట్లు వుండేవి.

ఆకాశాన్నందుకునే బ్రహ్మాండమైన చెట్ల ముందు గొప్పగొప్ప ఓక్ చెట్లు మరుగుజ్జుల్లా వుండేవి.

ప్రస్తుతం వున్న అడవుల్ని మనం ఒక యింటితో పోలిస్తే ఆనాటి అడవులు ఆకాశ హర్మ్యాల్లాంటి వన్న మాట. ''ఆకాశ హర్మ్యాల'' చివరి అంతస్తులో కాంతివంతంగా గోలగోలగా వుండేది. బ్రహ్మాండమైన రంగురంగుల పువ్వుల్లో ధగధగమెరిసే రెక్కల పక్షులు అటూ యిటూ యెగురుతూ, వాటి కిలాకిలారవాలు అడివిలో ప్రతిధ్వనిస్తూ వుండేవి. కోతులు కొమ్మమీదనుంచి కొమ్మమీదకి గెంతుతూ వుండేవి.

అదుగో కోతుల మూక కొమ్మలమీద గెంతుకుంటూ పోతోంది, అవి యేదో వంతెన దాటుతున్నట్టుగా. చిన్న కోతి పిల్లలు నోళ్లల్లో పళ్లూ గింజలూ నములుతూ వుంటే తల్లులు వాటిని హత్తుకుని వుంటాయి. యింకొంచెం పెద్దవి తల్లుల కాళ్లు పట్టుకుని వుంటాయి. ఆ గుంపు ముసలి బొచ్చు నాయకుడు లాఘవంగా ఒక చెట్టుకాండం పైకి పాకితే మిగతా గుంపంతా అనుసరిస్తుంది.

అవి యే జాతి కోతులు? వాటిని మీరివాళ జూలో చూడలేరు.

మానవుడికీ, చింపాంజీ, గొరిల్లాలకీ, ఉమ్మడి పూర్వులు అయినవి పుట్టింది సరిగ్గా యీ కోతులనుంచే. మనం వీరికే మన పూర్వుల్ని కలుసుకున్నామంతే.

అవన్నీ అడివి చివరి అంతస్తులో వుండేవి. అవి అక్కణ్ణే చెట్టుమీదనుంచి చెట్టుమీదకి, నేలకి యెత్తులో, కొమ్మ మీదనుంచి కొమ్మమీదకి పోతూ అవేవో వంతెనలూ, బాల్కనీలూ, గాలరీలూ అయినట్టుగా ప్రయాణం చేసేవి.

అడివే వాటి యిల్లు. చెట్ల పంగల కొమ్మలమీద పెద్ద కుటీరాల్లాంటివి యేర్పాటు చేసుకుని అవి రాత్రిళ్లు విడిది చేసేవి.

అడివే వాటి దుర్గం. చివరి అంతస్తుల్లో అవి తమ పరమ శత్రువు అయిన కత్తుల్లాంటి కోరపళ్లున్న పెద్దపులి. దాని పదునైన పళ్ల బారినుంచి తప్పించుకుని వుండేవి.



కోరపళ్లున్న పెద్ద పులి

అడివే వాటి కొట్టుగది. ఆ చివరి అంతస్తుల్లో వాటి ఆహారపు నిలవలు, అవి తిని బతికే పళ్ళూ, గింజలూ వుండేవి.

అడివి ఆస్తరణకింద వుండాలంటే కొమ్మనుంచి కొమ్మకి వూగడం, చెట్ల కాండాల పైకీ కిందికీ యెగబాకడం, చెట్టునుంచి చెట్టుకి గెంతడం వాటికి తెలిసివుండాలి. అవి పళ్లని కోసుకోగలిగి వుండాలి, కాయల్ని కొరకగలిగి వుండాలి. వాటికి లాఘవమైన వేళ్ళూ, తీక్ష్ణమైన కళ్ళూ, దృఢమైన పళ్ళూ వుండాలి.

మన పూర్వుల్ని చాలా గొలుసులు అడివికి బంధించాయి. అడివికే కాదు, చిట్టచివరి అంతస్తులకి కూడా. మానవుడు యీ గొలుసుల్ని యెలా ఛేదించగలిగాడు? వన్య ప్రాణులు తమ బోనుని వదిలిపెట్టి తమ యిళ్ల హద్దులు దాటిపోయే ధైర్యం యెలా తెచ్చుకున్నాయి?

# ప్రకరణం రెండు

## మన కథానాయకుడి మామ్మా, రక్తబంధువులూ

పూర్వం రోజుల్లో రచయిత యెవడేనా ఒక మనిషి జీవిత సాహసాల గురించి తన తీరుబాటుగా వుండే కథని మొద లెట్టేటప్పుడు, మొదటి కొద్ది అధ్యాయాలనీ తన కథానాయకుడి కుటుంబం గురించీ, పూర్వుల గురించీ చెప్పే వివరణాత్మక వర్ణనకి కేటాయించేవాడు.

ఆ నాయకుడి మామ్మ చిన్న పిల్లగా వున్నప్పుడు యెలాంటి చక్కని గౌన్లు తొడుక్కున్నదీ, వాళ్ల అమ్మ పెళ్లికి ముందు రోజున యేం కలలు కన్నదీ మొదటి కొద్ది పేజీలూ చదివేటప్పటికే యెవరికేనా తెలిసిపోయేది. ప్రపంచంలో మన కథానాయకుడు ప్రత్యక్షమవడం, ఆయన పాలపళ్లూ, ముద్దమాటలూ, తప్పటడుగులూ, బాల్య క్రీడలూ వర్ణించడం అప్పుడు మొదలయేది. పది అధ్యాయాల తర్వాత బాల నాయకుడు వీధి బడిలో చేరతాడు. రెండో వాల్యూం పూర్తయేటప్పటికి ఆయన ప్రేమలో పడతాడు. ఎన్నో సాహసకృత్యాల తర్వాత మూడో వాల్యూంలో ఆయన తన ప్రేయసి పాణి గ్రహణం చేస్తాడు. యిక కథ విధిగా భరత వాక్యంతో ముగుస్తుంది. అందులో ముసలివాడైన నాయకుడు, ముగ్గుబుట్టలా తలనెరిసిన తన అర్ధాంగితో కలిసి తమ గులాబీ బుగ్గల మనవడు విద్దెలు చేస్తూ వుంటే మురిపెంగా చూస్తూ వుంటాడు.

మానవుడి జీవిత సాహస కృత్యాల గురించి మీకు చెబుదామనుకుంటున్నాం. పూర్వకాలపు ప్రసిద్ధ నవలా రచయితల ఒరవడిలోనే మన నాయకుడి సుదూర పూర్వుల గురించీ, అతని కుటుంబం, బంధువర్గం గురించీ భూమ్మీద అతని అవతరణ గురించీ, అతను యెలా నడవడం, మాట్లాడ్డం ఆలోచించడం నేర్చుకున్నదీ దాన్ని గురించీ, అతని పోరాటాల గురించీ, సుఖదుఃఖాల గురించీ, అతని జయాపజయాల గురించీ చెప్పుకుందాం. కాని కృత్యాదిలో మనం చాలా యిబ్బందులకి గురవుతాం.

మన నాయకుడి ''మామ్మ'', మన జాతి ఆవిర్భవించడానికి మూలం అయిన అదే మామ్మ – కోతిని గురించి యెలా వర్ణించగలం, ఆవిడ చచ్చిపోయి యెన్నో లక్షల సంవత్సరాలయితే? మన దగ్గర ఆవిడ చిత్ర పటమూ లేదు, యెందుకంటే కోతులు బొమ్మలు గియ్యలేవని యెవడికేనా తెలుసు. గత అధ్యాయంలో చెప్పినట్టు మన పూర్వులతోటి మన సమావేశం యేదేనా మ్యూజియంలో జరిగాల్సిందే. అక్కడేనా ఆవిడగారి రూపం యెలా వుండేదో చెప్పడం కష్టమే, యెందుకంటే మిగిలివున్నవల్లా యేదో కొన్ని యెముకలూ, కొన్ని పళ్లూ. అవి ఆఫ్రికా, ఆసియా, యూరప్‌లలోని అనేక ప్రాంతాల్లో దొరికాయి.

మన నాయకుడి ''రక్తబంధువుల'' గురించి తెలుసుకోవడానికి మనకి యెక్కువ అవకాశాలున్నాయి.

మానవుడు యెన్నడనగానో పురాతన ఉష్ణ ప్రాంత అరణ్యాలని వదిలిపెట్టి, అక్షరాలా నేలమీద కాలుమోపి స్థిరంగా నుంచుంటే, అతని సమీప బంధువులైన గొరిల్లా, చింపాంజీ, గిబ్బన్, ఒరాంగుటాంగ్ యింకా అడివి జంతువులుగానే



వానరునికీ నరునికీ మధ్య వున్న పోలికని మనుషులు యెప్పుడో గుర్తించారు. యీ పాత బొమ్మలో దీన్ని అతిశయోక్తిగా చూపించడం జరిగింది కూడా

వుండిపోయాయి. యిలాంటి బంధువర్గం గురించి చెప్పకోడానికి జనానికి యిష్టం వుండదు. కొంత మందైతే అసలు అవన్నీ తమ దూరపు బంధువులు కాదంటారు కూడా. మనిషికీ, చింపాంజీకీ ప్రాచీన కాలంలో మామ్మ ఒక్కతే అన్న మాట చెవిని పడ్డం కూడా పాపమని భావించేవాళ్లూ వున్నారు.

కాని సత్యందాగదు. కోతులకీ మానవుడికీ వున్న బంధుత్వాన్ని గురించి చాటే వాస్తవాలతోటి యీ పేజీలన్నీ నింపెయ్యొచ్చు. ఆ విషయంమీద దీర్ఘమైన, డొంక తిరుగుడు చర్చ యేమీ అక్కర్లేకుండానే, చింపాంజీలనీ, ఒరాం గుటాంగ్‌లనీ ఒక గంటసేపు పరీక్షగా చూసిన యెవళ్లైనా మనిషికీ యీ కోతులకీ వుండే కుటుంబ సామ్యాలని చూసి మురిసిపోతారు.

# మన బంధువులు రోజా, రాఫేల్

కొన్ని యేళ్ల క్రితం లెనిన్‌గ్రాడ్ దగ్గర కోల్తుషి (ప్రస్తుతం పావ్‌లొవొ) గ్రామంలో వున్న ప్రసిద్ధ రష్యన్ శాస్త్ర వేత్త ఇవాన్ పావ్‌లొవ్ ప్రయోగశాలకి రాఫేల్ రోజా అనే పేర్లున్న చింపాంజీలని తెచ్చారు.

మనుషులు తమ అడవి బంధువులపట్ల దయగా వుండరు, మామూలుగా వాటిని బోనుల్లోకి హఠాత్తుగా గెంటే

స్తారు. కాని యీ సారి ఆఫ్రికా అడవులనుంచి వచ్చిన యీ చూట్టాలకి చాలా ఆప్యాయమైన ఆదరణ లభించింది. వాటికి ఒక సొంత యిల్లు యిచ్చేశారు. అందులో ఒక పడక గది, భోజనాల గది, ఆటల గది, స్నానాల గది వున్నాయి. పడక గదిలో హాయిగా వుండే పడకలు, మేజాలు వున్నాయి. భోజనాల గదిలో బల్లమీద తెల్లటిగుడ్డ పరిచివుంటుంది. ఆహారం పెట్టే అల్మారాలోని అరలన్నీ పదార్థాలతో నిండుగా వుండేవి.

యింత హాయిగా వుండే యింట్లో కాపరం వుండేది కోతులని యెంత మాత్రమూ తెలిపే సూచనలు కూడా లేవు. భోజనం అస్తమానూ పళ్లేల్లోనే వడ్డించేవాళ్లు. తినడానికి చెంచాలుండేవి. రాత్రిళ్లు పక్కలు సర్దివేసేవాళ్లు. తలగడాలు మెత్తగా వుండేవి. పాపం అతిధులకి సంస్కారవంతమైన అలవాట్లు లేకపోవడంవల్ల పళ్లేల్లోని పళ్లని చప్పరించేవి, రాత్రిళ్లు తలగడమీద తల పెట్టడానికి బదులుగా ఒకొప్పుడు తలమీద తలగడ పెట్టుకునేవి.

అయినా రోజా, రాఫేల్‌లు కచ్చితంగా మనుషుల్లా ప్రవర్తించకపోయినా యించుమించు మనుషుల్లాగానే ప్రవర్తించేవి.

ఉదాహరణకి రోజా మామూలు యింటావిడ అంత బాగానూ ఆహారపదార్థాల అల్మారా తాళంతో తీసేది. ఆ తాళాలు సంరక్షకుడి దగ్గర వుండేవి. రోజా అతని దగ్గరికి వెనక్కాలే వెళ్లి అతన్నుంచి తాళాలు లాక్కునేది. ఒక్క ఉదుట్న అల్మారా దగ్గరికి వెళ్లేది. ఒక కుర్చీమీదకి యెక్కి అప్పుడు తాళంకప్పలో తాళం పెట్టేది. అద్దం అవతల నోరూరించే ఆప్రికాట్‌లపైన గుత్తులుగుత్తులుగా ద్రాక్షలుండేవి. ఒక్కసారి చెయ్యి అలా తిప్పితే తాళం వచ్చేది, రోజా ఓ ద్రాక్ష గుత్తిని చేత్తో పట్టుకునేది.

మనం రాఫేల్‌ని మరిచిపోకూడదు. పాఠాలప్పుడు చూడాలి రాఫేల్‌ని! దాని శిక్షణకి ఉపయోగించే వస్తువులు ఒక బాల్చీడు ఆప్రికాట్ పళ్లూ, రకరకాలు సైజులున్న యేడు దిమ్మలు. మామూలుగా పిల్లలు ఆడుకునే దిమ్మలు కావివి. ఆ దిమ్మలు చాలా పెద్దవి: అతిచిన్నది ఒక ముక్కాలి పీట సైజంటే, పెద్దది మూడు కాళ్ల కుర్చీ అంత వుండేది. ఆప్రికాట్ బాల్చీ కప్పుకి తగిలించి వుండేది. రాఫేల్ సమస్య యేమిటంటే ఆ పళ్లని అందుకుని తినాలి.

మొదట్లో రాఫేల్‌కి యీ సమస్య అంతుబట్టలేదు.

అడివిలో తన యింటిదగ్గరైతే తనక్కావలసిన పండు కోసం యెత్తుగా చెట్టు యెక్కవలసి వచ్చేది. కాని యిక్కడ పళ్లు కొమ్మమీద లేవు, గాలిలో వూగులాడుతున్నాయి. ఎక్కడానికున్నవల్లా యేడు దిమ్మలు. అతిపెద్ద దిమ్మ చివరి కంటా యెక్కినా కూడా ఆప్రికాట్‌లు అందవు.

ఆ పళ్లని అందుకోవడం కోసమని దిమ్మల్ని దొర్లిస్తూ వుంటే రాఫేల్‌కి ఒక వూహ తట్టింది. తను ఒక దిమ్మమీద యింకో దిమ్మ పెట్టి పళ్లకి యింకా దగ్గరగా రావచ్చు కదా. కొంచెం కొంచెంగా మొదట మూడు, తర్వాత నాలుగు, అప్పుడు అయిదు దిమ్మలు పేర్చి ఒక పిరమిడ్‌లా తయారు చేసింది. అదేం సులభం కాదు. యెందుకంటే యెలా పడితే అలా పేర్చడానికి అవి కుదరవు. ఒక క్రమం ప్రకారం అవి వుండాల్సిందే: మొదట అన్నిటికంటే పెద్దది, తర్వాత పెద్దది అప్పుడు చిన్నవీ వరసలో వుండాలి.

చిన్న వాటిమీద పెద్దవాటిని పెట్టి పేర్చే ప్రయత్నాలు రాఫేల్ చాలా సార్లు చేసింది. మొత్తం లాటంతా తిరగబడి పోయేటట్టు వూగిపోయేది.

రాఫేల్ పైన వుండగానే మొత్తం ఫళఫళ విరుచుకు పడిపోతుందేమో ననిపించేది. కాని అలా జరగలేదనుకోండి యెందుకంటే రాఫేల్ కోతి, అంటే వేగంగా, లాఘవంగా తప్పించుకోగలది.

భోజనం చేస్తున్న రాఫేల్





పని చేస్తున్న రాఫేల్



బొమ్మలు గీస్తున్న రాఫేల్

ఆఖరికి యిది పరిష్కారం అయింది. రాఫేల్ వాటి సైజుని బట్టి, అసలు వాటిమీద వున్న అంకెలు చదవగలిగి అలా చేసిందా అన్నంత బాగా, ఒకదానిమీద యింకోదాన్ని పేర్చింది.

ఆ బాల్చీ అందుకున్నాక వూగిసలాడే పిరమిడ్‌మీద కూర్చుని, కష్టపడి సంపాదించుకున్న ఆప్రికాట్‌లని తృప్తిగా తింది.

అలా మనుషుల్లాగా యే జంతువు చేసి వుండేది? ఒక కుక్క దిమ్మల పిరమిడ్ కట్టడం మనం వూహించగలమా? అయినా కుక్క చాలా తెలివిగల జంతువు.

రాఫేల్ పని చేసేటప్పుడు చూసిన వాళ్లంతా మనిషికీ ఆ కోతికీ వున్న పోలికని చూసి ఆశ్చర్యపోయారు. రాఫేల్ ఒక దిమ్మని తీసుకుని భుజంమీద మోస్తూ పిరమిడ్ దగ్గరకి తీసికెళ్లి, దాన్ని ఒక చేత్తో ఆపుతూ పైకెత్తేది. ఒక వేళ అది సప్పే సైజు కాకపోతే దాన్ని కింద పడేసి దానిమీద ఆలోచిస్తున్నట్టు కూలబడిపోయేది. కొన్ని క్షణాల తర్వాత తప్పు సవరించుకోడానికి మళ్లీ పని మొదలెట్టేది.

# చింపాంజీని మానవుడుగా మార్చగలమా?

కాని పరిస్థితి యిలా వున్నప్పుడు ఒక చింపాంజీకి మనిషిలాగా మాట్లాడ్డమూ, నడవడమూ, పని చెయ్యడమూ నేర్పలేమా?

ప్రఖ్యాత జంతు శిక్షకుడు వ్లదీమిర్ దూరొవ్ చాలా యేళ్లక్రితమే, అలా చెయ్యవచ్చని వూహించాడు. మీముస్ అనే తన పెంపుడు చింపాంజీకి శిక్షణ యిస్తూ చాలా నెలలు గడిపాడు. మీముస్ చాలా తెలివైన విద్యార్థి. ఒక చెంచాతో తినడం, చేతిగుడ్డని ఉపయోగించడం, కుర్చీపై కూర్చోడం, టేబిల్‌క్లాత్‌మీద ఒలకపొయ్యకుండా పులుసు తినడం, ఆఖరికి కొండమీదనుంచి యేటవాలుగా స్లెడ్జ్‌మీద జారడం కూడా నేర్చుకుంది.





చింపాంజీ మెదడుకంటే మనిషి మెదడు చాలా పెద్దది

కాని ఆ చింపాంజీ మానవుడు లాగా తయారయి వుండేది కాదు.

యిందులో ఆశ్చర్యకరమైందేమీ లేదు, యెందుకంటే మనిషి దారీ, కోతి దారీ లక్షలాది సంవత్సరాల క్రితమే వేర్పడిపోయాయి. మానవుడి ప్రాచీన కాలంలో పూర్వులు చెట్ల శిఖరాలనుంచి నేలమీదకి దిగివచ్చి నిటారుగా నడవడం నేర్చుకున్నారు. ఆ రకంగా పనిచెయ్యడానికి చేతులకి మార్గం యేర్పడింది. కాని చింపాంజీ పూర్వులు యెప్పటికీ చెట్లమీదే వుండిపోయారు, వృక్షాలమీద జీవితానికి అనువుగా యింకా మారిపోయారు కూడా.

అందుకనే చింపాంజీ రూపం మానవుడి లాగా నిర్మాణమైలేదు. దాని చేతులు తేడాగా వుంటాయి, కాళ్లు తేడాగా వుంటాయి, మెదడు తేడాగా వుంటుంది, నాలుక తేడాగా వుంటుంది.

చింపాంజీ చేతిని సరిగ్గా చూడండి. అది మానవుని చేతి లాగా వుండనే వుండదు. చింపాంజీ బొటనవేలు దాని చిటికిన వేలికంటే చిన్నగా వుంటుంది. మన వేళ్లకి లాగా దానికి బొటనవేలు ఒకే కోణంలోనూ వుండదు. మన వేళ్లలో కల్లా చాలా ముఖ్యమైంది బొటనవేలే, చెయ్యి అని పిలిచే అయిదుగురు పనివాళ్ల బృందంలో చాలా అవసరం అయింది. మిగిలిన నాలుగు వేళ్లల్లోనూ దేనితోనేనా బొటనవేలు పని చెయ్యగలదు. లేదా అన్నిటితోనూ కలిసి పనిచెయ్యగలదు. అందుకనే మనిషి చెయ్యి అన్ని రకాల పనిముట్లని అంత నేర్పుగా వాడగలదు.

ఒక చింపాంజీ చెట్టునుంచి పళ్లు కోసుకోవాలనుకుంటే అది తరచుగా చేతుల్తో కొమ్మల్ని పట్టుకుని కాలి వేళ్లతో పండుని కోస్తుంది. అది నేలమీద నడవాలనుకుంటే వంగిన చేతివేళ్లమీద ఆనుకుంటుంది. అంటే అది తరుచుగా చేతుల్ని కాళ్లల్లాగానూ, కాళ్లని చేతుల్లాగానూ వాడుతుందన్నమాట.

యిలా చేతుల్లోనూ కాళ్లల్లోనూ వుండే తేడాతో బాటుగా యింకో ముఖ్యమైన తేడా వుంది. ఆ విషయాన్ని చింపాంజీని మనుషుల్లాగా తయారు చెయ్యాలనుకునే జంతు శిక్షకులు తరుచుగా మర్చిపోతూ వుంటారు. చింపాంజీ మెదడు మానవుడి మెదడుకంటే చాలా చిన్నదనీ, అంత అభివృద్ధి చెందలేదనీ వాళ్లు మర్చిపోతారు.

ఇవాన్ పావ్‌లొవ్ మానవ మెదడుని గురించి చాలా సంవత్సరాలు అధ్యయనం చేశాడు. రోజా, రాఫేల్‌ల ప్రవర్తన మీద ఆయనకి ఆసక్తి కలిగింది. ఆయన యీ "కోతి యింటి"లో వాటిని సన్నిహితంగా పరిశీలిస్తూ చాలా గంటలు గడిపాడు. అవి శుద్ధ బడుద్ధాయిల్లాగా ప్రవర్తించాయి. అవి యేదో చేద్దామని మొదలుపెట్టేవి, అంతలోకీ యేమారి యింకో దాంట్లోకి పోయేవి.

ఆ రకంగా, రాఫేల్ పిరమిడ్ కట్టడంలో మునిగిపోయి, అదే ధ్యాసలో వున్నట్టు కనిపించేది. అంతట్లోకీ యేదో బంతిని చూసి కొయ్యదిమ్మల గురించి మొత్తం మరిచిపోయేది. తన పొడుగాటి బొచ్చు చేత్తోటి బంతిని యెగరెయ్యడం మొదలెట్టేది. ఓ క్షణం తర్వాత నేలమీద జారిపోయే యీగని చూసి, బంతిని గురించి మొత్తం మర్చిపోయేది.

యీ గందరగోళం అంతా చూసి ఒక సారి పావ్‌లొవ్ అన్నాడు:

"ఏం గందరగోళం, ఏం గందరగోళం!"

నిజమే, యీ కోతుల గందరగోళపు చర్యలు గందరగోళంగా పని చేసే వాటి మెదడు తాలూకు ప్రతిబింబాలు. మనిషిలాగా ఒక పద్ధతిగా, ఏకాగ్రతతో వుండవు వాటి మెదళ్లు చేసే పనులు. అయినా కూడా చింపాంజీ తెలివైందే. అది అడవిలోని జీవితానికీ, యెన్నో అదృశ్య శృంఖలాలు తనని బంధించి వేసే చిన్ని ప్రపంచానికీ బాగా అలవాటు పడింది.

రోజా, రాఫేల్ వుంటున్న యింటికి ఒక సారి ఒక కెమెరా మనిషి వచ్చాడు. వాటిని గురించిన సినిమా ఒకటి తీద్దామనుకున్నాడతను. దాని స్క్రిప్టు ప్రకారం ఆ కోతుల్ని కాసేపు బయట వదిలిపెట్టాలి. వాటిని అలా వదిలిపెట్టిన

తక్షణం అవి అతి దగ్గర్లో వున్న చెట్టు యెక్కేసి కొమ్మలమీదనుంచి వుయ్యాలా వూగడం మొదలుపెట్టాయి. హాయిగా వుండే యీ యింటిలో కంటే ఆ చెట్టుమీదే అవి యెక్కువ కులాసాగా వున్నాయి.

చింపాంజీ అడివి చివరి అంతస్తులో వుంటుంది. చెట్టుమీదే వాసం యేర్పాటు చేసుకుంటుంది. శత్రువుల బారి నుండి పారిపోవడానికి చెట్టు యెక్కేస్తుంది. దాని ఆహారమైన పళ్ళూ ఫలాలూ దానికి చెట్లమీదే దొరుకుతాయి.

అది చెట్లమీద జీవితానికి యెంత అలవాటు పడిపోయిందంటే లంబంగా వుండే చెట్టుని చదును నేలమీద నడిచేదానికంటే సునాయాసంగా అది యెక్కేస్తుంది. అడవుల్లేని చోట చింపాంజీలు మీకు కనిపించవు.

చింపాంజీలు తమ సహజ పరిసరాల్లో యెలా వుంటాయో చూసేందుకని ఒక శాస్త్రజ్ఞుడు ఆఫ్రికాలోని కమెరూన్స్‌కి వెళ్ళాడు.

ఆయన ఒక డజను చింపాంజీలని పట్టుకుని తన క్షేత్రం దగ్గర వున్న అడివిలో వాటిని వదిలిపెట్టాడు, అక్కడ వాటికి కొంచెం సౌకర్యంగా వుంటుందని. అవి పారిపోకుండా వుండడం కోసమని ఆయన మొదట ఒక అదృశ్య పంజరాన్ని తయారు చేయించాడు. రెండు చిన్న పనిముట్లతోటీ, ఒక గొడ్డలితోటీ, రంపంతోటీ ఆ అదృశ్య పంజరం తయారైంది.

మొదటగా చెట్లు కొట్టే వాళ్ళు అడవి మధ్యలో చెట్లని ద్వీపంలాగా వుండేటట్టు వుంచి దాని చుట్టూవున్న చిన్న ప్రాంతంలో వున్న చెట్లన్నింటినీ కొట్టేశారు. యీ చెట్ల ద్వీపంమీద ఆ శాస్త్రజ్ఞుడు ఆ కోతుల్ని స్వేచ్ఛగా వదిలేశాడు.

కోతులు అడివి వాసులు కాబట్టి ఆయన పథకం పారింది. అంటే అవి తమంతతాముగా అడివి వదిలిపెట్టిపోవు. కోతి ఆరుబయట మైదానంలో వుండలేదు, ధృవప్రాంతపు యెలుగుబంటి యెడారిలో వుండలేనట్టే.

చింపాంజీ అడివిని వదిలిపెట్టలేకపోతే దాని దూరపు బంధువు మానవుడు యెలా వదిలిపెట్టగలిగాడు?

## మన కథానాయకుడు నడక నేర్చుకుంటాడు

మన అరణ్యవాసి ముత్తాతముత్తాత బందిఖానాని ఛేదించుకుని, అడివి వదిలిపెట్టి పచ్చిక మైదానాల్లోకీ, చెట్లు లేని బయళ్లలోకీ కాపరం రావడానికి కొన్ని వేల యేళ్ళు పట్టింది. తనని అడివికి బంధించి వేసే గొలుసుల్ని తెంచుకోవాలంటే మొట్టమొదటగా నేలమీదకి దిగివచ్చి నడవడం నేర్చుకోవాలి.

యివాళ కూడా మన చంటి పిల్లలకి నడక రావాలంటే సులభం కాదు. నర్సరీ బడికి వెళ్లిన యెవరికేనాగానీ అక్కడ ''పాకేవాళ్ల'' ప్రత్యేక గ్రూపు వుండటం కనిపిస్తుంది. యీ పిల్లలు యింక వున్న చోట వుండరు, అలా అని కాలూ రాదు. యీ ''పాకే పిల్ల''లు ''నడిచే పిల్లల''వడానికి కొన్ని నెలలు పడుతుంది. వూరికే వూహించండి: వాళ్ళు దేన్నీ ఆనుకోకుండా, చేతులు నేలమీద మోపకుండా, నిబ్బరంగా వుండటం కోసం కుర్చీలనీ, బెంచీలనీ పట్టుకోకుండా నడవడం నేర్చుకోవాలి! సైకిల్ తొక్కడం నేర్చుకోవడం కంటే కూడా కష్టతరమైన పని యిది.

మన చంటి పిల్లలకే నడవడానికి కొన్ని నెలలు పడితే, మన పూర్వులకి యీ నేర్పు పట్టుబడడానికి కొన్ని వేల యేళ్ళు పట్టింది.

ఆ పూర్వపు రోజుల్లో వాళ్లు చెట్లు దిగి నేలమీదకి కొంచెం సేపు వచ్చేవాళ్లు. అస్తమానూ కణుపులమీద ఆనుకునేవి కాదేమో, కాని రెండు మూడు దూకుడు గెంతులు వేసేవి, చింపాంజీలు తరచుగా చేస్తున్నట్టు.

యేమైనా మూడు అడుగులంటే మూడే కాని యాభయ్యో, వందో కాదుకదా.

## మానవుడి కాళ్లు చేతులని పనికోసం విముక్తం చెయ్యడం

ఆనాటి మన అరణ్యవాసి పూర్వులు చెట్లమీద వుండేటప్పుడు కాళ్లకంటే భిన్నమైన పనులకి చేతులని ఉపయోగ పెట్టడం నేర్చుకున్నాయి. చేతులని పళ్లూ ఫలాలూ యేరుకోడానికీ, పంగ చీలిన కొమ్మల్లో వాసం యేర్పాటు చేసుకోడానికీ ఉపయోగపెట్టేవి.

ఒక కాయనో పండునో పట్టుకునే చెయ్యి కర్రనో, రాయినో కూడా పట్టుకోగలదు కదా. చేతిలో వున్న రాయిగానీ, కర్రగానీ దీర్ఘతరం దృఢతరం చేసిన చెయ్యి కిందే లెక్క.

గట్టిగా వుండే కాయని రాయి బద్దలు చేస్తుంది. నేలలో వుండే నోరూరించే దుంపని కర్ర తవ్వుతుంది.

అంచేత ఆదిమ మానవుడు యీ పనిముట్లని ఆహారం సంపాదించుకోవడం కోసం యెక్కువగా వాడేవాడు. కర్రతో తవ్వి దుంపలూ, గడ్డలూ యేరుకునేవాడు. రాళ్లతోటి చెట్టు కాండాలని పప్పచేసి లోపల వుండే పురుగుల్నీ, డింభకాలనీ తినేవాడు. కాని చేతుల్తో పని చెయ్యడానికి వున్న ఒక్క మార్గమూ యేమిటంటే వాటిని అదనపు పని నుంచి తొలగించడం — అంటే నడకనుంచి. చేతులకి పని యెక్కువయ్యేకొద్దీ నడక సమస్య కాళ్లకి సరిపోయింది.

ఆ రకంగా అతని చేతులు కాళ్లని నడిచేటట్టు చేశాయి, కాళ్లు చేతుల్ని పనిచెయ్యడం కోసం విముక్తి చేశాయి.

భూమ్మీద నూతన ప్రాణి ఆవిర్భవించింది. వెనక కాళ్లమీద నడిచేదీ, ముందువాటితో పని చేసేదీ.

పైకి ఆకారం మట్టుకి ఆ ప్రాణి యింకా జంతువు లాగానే వుండేది. కాని అది కర్రనో రాయినో తిప్పేటప్పుడు మీరు చూస్తే తక్షణం



మన కథానాయకుడు తన మొదటి పరికరాన్ని యెంచుకోవడం

యీా జంతువు మానవ వంశానికి చెందిందని అనేస్తారు. నిజం చెప్పాలంటే మానవుడే పనిముట్లని వాడగలగింది. జంతువులకి పనిముట్లు లేవు.

ఒక జెరోబానో, మోల్ జంతువో బొరియ తవ్వాయంటే ఆ పని చెయ్యడానికి వాటికి వున్నది పంజాలే కాని, పారలు యేమీ లేవు. ఒక చుంచు ఓ కొయ్యముక్కని కొరికినా, నమిలినా అది తన పళ్లతోటే అలా చేస్తుంది కాని కత్తి తోటి కాదు. వడ్రంగిపిట్ట చెట్టు బెరడుని చీల్చిందీ అంటే తన ముక్కుతో అలా చేస్తుంది కాని ఉలితో కాదు.

మన పూర్వులకి ఉలిలాంటి ముక్కులు గాని, పారల్లాంటి పంజాలుగాని, పదునైన కత్తిలాంటి పళ్లుగాని లేవు. అతి నిశితమైన పళ్లకంటే, అతి దృఢమైన ముక్కు కంటే కూడా మంచివి వాటికి వుండేవి. అవి చేతులు. రాళ్లని కొట్టడానికీ, కొయ్యని కొయ్యడానికీ ఉపయోగపడే పదార్థాన్ని భూమినుండి యెత్తడానికి చేతుల్ని వాడగలిగాయి.

## మన కథానాయకుడు భువికి దిగిరావడం

యీా సంఘటనలన్నీ జరుగుతూ వుండగా శీతోష్ణస్థితి క్రమంగా మారిపోతోంది. మన పూర్వులు వాసం చేసే అడవుల్లో రాత్రిళ్లు చల్లగా అవుతూ వుండేవి. శీతాకాలాలు చల్లగా అవుతూ వుండేవి. శీతోష్ణస్థితి వెచ్చగా వున్నా ఉష్ణమైందని చెప్పడానికి లేదు.

కొండలా పర్వతాలా ఉత్తర సానువుల్లో నిత్యహరిత యీాత, మాగ్నోలియా వృక్షసంతతి స్థానే ఓక్, వేప చెట్లు పెరుగుతున్నాయి.

లక్షలాది సంవత్సరాల క్రితం పెనువానలవల్ల నదుల్లో కొట్టుకు వచ్చిన ఓక్, వేప ఆకుల శిలాజ ముద్రల్ని మనుషులు ఒకో అప్పుడు నదీప్రాంతపు పొరల్లో చూస్తారు.

దక్షిణం వైపు సానువుల్లోనూ, ఖాళీ స్థలాల్లోనూ వున్న అత్తి చెట్లూ, ద్రాక్షతీగలూ చలిగాలుల బారినుండి తప్పించుకున్నాయి. ఉష్ణప్రాంతపు అడవుల సరిహద్దు యింకా యింకా దక్షిణం వైపు వెనక్కిపోయింది. యీా అడవుల్లో వుండే జంతువులైన యేనుగూ, కోర పళ్ల పెద్దపులీ యింకా దక్షిణాదికి పోయాయి.

ఒకప్పుడు చిట్టడివి గుబురులు వుండేచోట చెట్లు యెడం అయి విశాలమైన బీళ్లు యేర్పడ్డాయి. అక్కడ పెద్ద పెద్ద జింకలు, ఖడ్గమృగాలూ మేసేవి. కోతుల్లో కొన్ని అడవుల్లోకి పోయాయి, యితర జాతులు నశించిపోయాయి.

అడివిలో ద్రాక్షలు తగ్గిపోయాయి, అత్తిపళ్ల చెట్లు కరువైపోయాయి. అడివి యిప్పటికి పల్చబడిపోయింది కాబట్టే అడివిగుండా ప్రయాణం చెయ్యడం రానురాను కష్టమైపోతోంది. ఒక చెట్ల గుంపునుంచి యింకో చెట్ల గుంపుకి పోవాలంటే అరణ్యంలో వుండేవి నేలమీద ప్రయాణం చెయ్యాల్సి వచ్చేది. చెట్లమీద కాపరం చేసే దానికి అది సులభమైన పనేం కాదు. యెందుకంటే అది యే వేగవంతమైన మాంసాహారిజంతువుకో బలైపోవచ్చు.

కాని అవి చెయ్య గలిగిందేమీ లేకపోయింది. ఆకలి వాటిని చెట్లమీదనుంచి కిందకి దిగివచ్చేటట్టు ఒత్తిడి చేసింది. మన పూర్వులు యింకా యింకా తరుచుగా నేలమీదికి, ఆహారం కోసం వెదుక్కుంటూ దిగిరావాల్సి వచ్చింది.

తాము అలవాటు పడిపోయిన అరణ్య ప్రపంచంనుంచి యివతలికి వచ్చి తమ సుపరిచితమైన పంజరాన్ని వదిలి పెట్టినప్పుడు యేం జరిగింది?

అవి అడివి నియమాలని కాలదన్నాయి, ప్రతి జంతువునీ ప్రకృతిలో దాని స్థానానికి దాన్ని కట్టిపడవేసే శృంఖలాలని తెంచివేశాయి.

జంతువులూ పక్షులూ మారతాయని మనకి తెలుసు. ప్రకృతిలో యేదీ స్థిరం కాదు. కాని అది సులభమైందీ కాదు. వాడిగల గోళ్ళున్న చిన్న అడివి జంతువు యివాళ మనకి తెలిసిన గుర్రం కావడానికి లక్షల సంవత్సరాలు పట్టింది. ప్రతి పిల్లజంతువూ తల్లిదండ్రుల్లాగానే వుంటుంది. యేమాత్రం తేడాయే వుండదు. ముందు ఆకారంకంటే ఒక కొత్త ఆకారం పరిణామం చెందడానికి వేల తరాలు పడుతుంది. యీ నూతన తరం చాలా విభిన్నమైంది.

మరి మన పూర్వుల సంగతి యేమిటి?

అవి తమ అలవాట్లూ పద్ధతులూ మార్చుకుని వుండక పోయినట్లైతే కోతులతోబాటుగా దక్షిణాదికి పోయి వుండేవి. కాని అవి అప్పటికే కోతుల్లా వుండేవి కాదు, రాళ్ళతోటీ, కొయ్యతోటీ చేసిన పళ్ళూ గోళ్ళూ ఉపయోగపెట్టి ఆహారం సంపాదించుకోవడం వాటికి తెలుసు కాబట్టి. అడవుల్లో అప్పటికే తరిగిపోతూవున్న రసపూరిత ఫలాలు లేకుండా బతకడం అవి నేర్చుకున్నాయి. అడవులు పలచబడిపోతున్నాయన్న బెంగ వాటికి లేదు యెందుకంటే అవి నేలమీద నడవడం నేర్చుకున్నాయి, వాటికి ఆరుబయలు, చెట్లు లేని ప్రాంతాలంటే భయం పోయింది. శత్రువెవడేనా తమ దారిలో తగిల్తే మొత్తం వానర — నర మందంతా కొయ్య గదలతోటీ, రాళ్ళతోటీ తమ మందని రక్షించుకునేది.

వానర — నరులని గడ్డు రోజులు నాశనం చెయ్యనూ లేదు, దక్షిణాది అడవులకి పారిపోయేటట్టు చెయ్యనూ లేదు. అవి నరుడయేటట్టు, వేగవంతం చేసాయంతే.

మన సుదూర బంధువులైన కోతులకి యేమయింది?

దక్షిణాది అడవులతోబాటుగా అవీ వెనక్కి తగ్గాయి. శాశ్వతంగా అడవి వాసులుగా వుండిపోయాయి. వాస్తవానికి ఆ విషయానికి సంబంధించి వాటికి గత్యంతరం లేదు. అవి వానర — నరులకంటే అభివృద్ధి చెందడంలో వెనకబడిపోయాయి. పనిముట్లని ఉపయోగించడం నేర్చుకోలేదు. దానికి బదులుగా లాఘవమైనవి చెట్లెక్కడం, కొమ్మల మీద వూగడం యింతకు ముందుకంటే బాగా నేర్చుకున్నాయి.

చెట్లు యెక్కడంలో నేర్పులేక, చెట్ల శిఖరాలమీద వుండడానికి సులభంగా అలవాటు పడని కోతుల్లో పెద్దవీ దృఢమైనవీ మాత్రం బయటపడ్డాయి. కోతి యెంత వూతమైందీ, యెంత పెద్దదీ అయితే చెట్లమీద బతకడం అంతకష్టం అయింది దానికి. దాంతోటి యీ పెద్దకోతులు నేలమీదకి దిగిరావాల్సి వచ్చింది. గొరిల్లాలు యింకా యిప్పటికీ అడివి కింది అంతస్తులోనే వుంటాయి. వాటి ఆయుధాలు కర్రలూ కావు రాళ్ళూ కావు, వాటి బలిష్ఠమైన దవడలనుంచి పొడుచుకు వచ్చే కోరలే.

ఆ రకంగా శిలాజ మానవుడూ, అతని సుదూర బంధువులూ దారులు విడిపోయారు.

# మాయమైన లింకు

మానవుడు వెంటనే రెండు కాళ్లమీదా నడవడం నేర్చుకోలేదు. మొదట్లో అతను అస్థిరంగా వూగేవాడు.

మొదటి వానర — నరుడు యెలా వుండేవాడు?



బెంగావన్ నదీతీరంలో బయల్పడిన పిథెకాన్త్రపస్ అవశేషాలు

భూమ్మీద యెక్కడా వానర — నరుడు శేషించలేదు. కాని కొన్ని స్థలాల్లో అతని అస్థికలు దొరకవూ?

యీ యెముకలు దొరికితే మానవుడు వానరాలనుంచి వచ్చాడని చెప్పడానికి ఖాయమైన సాక్ష్యం దొరుకుతుంది. యెందుకంటే వానర — నరుడు వానరాలతో మొదలై యీనాటి ఆధునిక మానవుడితో అంతమయే గొలుసులో ఒక ముఖ్యమైన లింకు. యేమైనా ఆ ముఖ్యమైన లింకు ఆచూకీలేకుండా నదీతీరపు పొరల్లోనూ, మట్టి యిసకల పొరల్లోనూ పోయింది.

నేలలోపలికి తవ్వడం యెలాగో పురాతత్వ శాస్త్రజ్ఞులకి తెలుసు. తవ్వడానికి ముందుగానే వాళ్ళు యీ పోయిన లింకుని యెక్కడ వెదకాలో ఆ స్థలాన్ని నిర్ణయించాలి. యేదో ఒక దాని కోసం భూగోళమంతా వెదకడం సులభమైన పనేంకాదు. గడ్డి మేటిలో సూదికంటే కూడా బాగా శిలాజ మానవుడి అస్థికలు నేలలో కప్పడిపోయి వున్నాయి.

ఎర్నెస్ట్ హేక్కెల్ అనే జర్మన్ జీవశాస్త్రవేత్త వానర — నరుడి (లేదా శాస్త్రజ్ఞుల పరిభాషలో పిథెకాన్త్రపస్) యెముకలు దక్షిణ ఆసియాలో యెక్కణ్ణో దొరకవచ్చని 19వ శతాబ్దపు చివర్లో సూచించాడు. అవి యెక్కడ వుంటాయని తను అనుకున్నదీ ఆ చోటుని కూడా కచ్చితంగా పటంమీద చూపించాడు. ఆ చోటే సుందా ద్వీపాలు.

చాలా మంది ఆయనతో ఏకీభవించలేదు. కాని ఆయన చెప్పిందాన్ని మాత్రం మరిచిపోలేదు. ఒకతను యీ మాటల్ని యెంతగా విశ్వసించాడంటే తన ఉద్యోగం సద్యోగం వదులుకుని ఆ పిథెకాన్త్రపస్ అని పిలిచే దాని అవశేషాల కోసం సుందా ద్వీపాలకి ప్రయాణం కట్టాడు.

ఆయన డాక్టర్ యూజెన్ ద్యుబువా. అమ్‌స్టెర్‌డామ్ యూనివర్సిటీలో అనాటమీ లెక్చరర్.

యూనివర్సిటీలోని చాలా మంది ఆయన సహోద్యోగులూ, ప్రొఫెసర్లూ లాభం లేదని తల పంకించి, తలచెడిన వాడు తప్ప అలాంటి మృగతృష్ణలో నీళ్ల వెదికే పని చెయ్యడని ఏకాభిప్రాయానికి వచ్చారు. వాళ్లంతా చాలా మర్యాదస్తులు. వాళ్ల చేసే ప్రయాణమల్లా సద్దులేని అమ్‌స్టెర్‌డామ్ వీధుల్లో యూనివర్సిటీకి పోవడమూ, అక్కడినుంచి రావడమూ మాత్రమే.

తన సాహసోపేతమైన పథకాన్ని సాధించడానికి డా. ద్యుబువా యూనివర్సిటీలో తన పదవి వదిలేసి, సైన్యంలో చేరి సుమత్రా ద్వీపానికి బయల్దేరాడు. అక్కడ రెసిడెంట్ డాక్టరుగా వున్నాడు.

ఆ ద్వీపంమీద స్థిరపడ్డాక, ఆయన తన తీరిక సమయాన్నంతటినీ యీ పరిశోధనకి వినియోగించాడు. ఆయన దర్శకత్వంలో పనివాళ్లు తట్టల కొద్దీ మట్టి తవ్విపోశారు. ఒక నెల గడిచింది, యింకో నెల గడిచింది, యింకో నెలా గడిచింది. కాని పిథెకాన్త్రపస్ అస్థికలని పోలినవేవీ దొరకలేదు.

తను పోగొట్టుకున్న దేనికోసమేనా మనిషి వెదికేటప్పుడు, అది ఎక్కణ్నో వుందనేనా కనీసం అతనికి తెలుసు, గట్టిగా ప్రయత్నిస్తే దొరుకుతుందనీ తెలుసు. కాని ద్యుబువా పరిస్థితి అది కాదు. అలాంటి అవశేషాలు వున్నాయని అనుమానించాడంతే, ఖాయంగా తెలీదు. అయినా పట్టు విడవకుండా తన పనిని కొనసాగించాడు. ఒక యేడాది గడిచింది. యింకో యేడు. మూడేళ్లు అయాయి. కాని ఎక్కడా ఆ ''మాయమైన లింకు'' కనబడదే.

ఆయన స్థానంలో మరెవరేనా వుంటే మొత్తానికి ఓ దణ్ణం పారేసి అయింది చాలని చక్కాపోయివుండేవాళ్లు. కాని ద్యుబువా ''విఘ్నాయాస సంతప్తుడై పరిత్యజించే మధ్యముల'' కోవకి చెందినవాడు కాదు.



పిథెకాన్త్రపస్ యెముకలు



పిథెకాన్త్రపస్ బహుశా యిలా వుండి వుండచ్చు. నరుడ నలేం కాని వానరుడు మాత్రం కాదు

సుమాత్రాలో వానర — నరుని అవశేషాలు లభ్యంకావని రూఢి అయాక తన శోధనని జావాలో కొనసాగించ నిర్ణ యించుకున్నాడు.

అక్కడ ఆయనకి విజయం సిద్ధించింది.

జావాలోని ట్రినిల్ గ్రామం దగ్గర ద్యుబువాకి మానవ శిలాజం దొరికింది. ఆ అవశేషాల్లో ఒక తొడ యెముక, రెండు పళ్లు, పుర్రె పై భాగం, కింద దవడ యెముక ముక్క వున్నాయి. తర్వాత ఆ పరిసరాల్లోనే తొడ ఎముకల ముక్కలు లభ్యమయ్యాయి.

ఆ కపాలాన్ని ద్యుబువా పరిశీలించి ఆ మనిషి యెలా వుండేవాడా అని వూహించ నారంభించాడు. ఆ నర — వానరుడికి పల్లంగా చదునుగా వుండే నుదురు వుండేది. కళ్లపైన మందమైన యెముక గట్టు వుండేది. ముఖం మనిషి కంటే యెక్కువ కోతిని పోలివుండేది. పుర్రె పై భాగం సూక్ష్మంగా పరిశీలించిన ద్యుబువాకి పిథెకాన్త్రపస్ ఆన్త్రపోయిడ్ వానరాలన్నింటికంటే యెక్కువ తెలివైనదన్న నమ్మకం యేర్పడింది. అతని మెదడు మనిషికి అతిసన్నిహితంగా వున్న వానరాల మెదడుకంటే కూడా చాలా పెద్దది.

కపాలపు పై భాగమూ, రెండు పళ్లూ, తొడ యెముక పెద్ద విశేషమైనవి కాదు. కాని సూక్ష్మంగా పరిశీలించిన ద్యుబువాకి నర — వానరుడి జీవితాన్ని గురించి చాలా వాస్తవాలు పునర్నిర్మించే వీలు కలిగింది. ఆ రకంగా తొడ యెముక పరిశీలనమీద అతను దొడ్డి కాళ్లతో కష్టపడి నడిచేవాడని స్పష్టమైంది.

అడివిలోని ఖాళీ ప్రదేశం. శరీరం రెండితలై, మోకాళ్లు వంగిపోయి పొడుగాటి చేతులు నేలమీదకి వేల్లాడుతూ వుంటాయి. ఆ రకంగా నర — వానరుడు వికారంగా వూగుతూ నడుస్తున్నట్టూ, గుబురు కనుబొమల గట్టుకింద కళ్ళు నేల కేసే లగ్నమై, యేది దొరికితే దాన్ని తినడానికి సిద్ధంగా వున్నట్టూ ద్యుబువా వూహించుకున్నాడు.

అతను యింకెంత మాత్రమూ వానరం కాదు, అయినా అప్పటికింకా మనిషీ కాదు. యీ శిలాజ మానవ — వానరానికి ద్యుబువా పిథెకాన్త్రపస్ ఎరక్టస్ (pithecanthropus erectus) అని పేరు పెట్టాడు, మిగతా వానరాలతో పోలిస్తే అతను కచ్చితంగా నిటారుగా వుండేవాడు కాబట్టి.

ద్యుబువా గమ్యాన్ని చేరుకున్నాడని యెవళ్లకేనా అనిపిస్తుంది: అంతుచిక్కని పిథెకాన్త్రపస్ ఆఖరికి దొరికింది! కాని జరిగిందేమిటంటే ఆయన జీవితంలో పరమ గడ్డు రోజులూ, సంవత్సరాలూ వచ్చిపడ్డాయి. భూమి మందమైన పొరల గుండా తవ్వుకుపోవడం కంటే మానవ దురభిప్రాయాలని ఛేదించడం కష్టమైందని ఆయన గ్రహించాడు.

యూజెన్ ద్యుబువా ఆవిష్కరణకి అన్ని వేపులనుంచీ ఆగ్రహమూ, అపహాస్యమూ యెదురైంది. మానవుడూ, కోతులూ ఒకే పూర్వులనుండి వచ్చారనే విషయాన్ని చాలా మంది అంగీకరించలేకపోయారు. ద్యుబువాకి దొరికిన

పు(రె గిబ్బన్‌దనీ, తొడ యెముక మానవుడిదనీ చర్చీ, దాని అనుయాయులూ అన్నారు. జావా వానర – నరుణ్ణి కోతీ మానవుల కలగాపులగంగా చెయ్యడంతోటే ద్యుబువా శత్రువులు తృప్తి పడలేదు. ఆయన కనిపెట్టిన అస్థికల అవశేషాలు చాలా యిటీవలవి అనీ, ఆయన చెప్తున్నట్టుగా వేలాది, లక్షలాది సంవత్సరాల నాటివి కావనీ, కొన్ని యేళ్ళుగా మాత్రమే భూమిలో వున్నాయనీ రుజువు చెయ్య ప్రయత్నించారు. పిథెకాన్త్రపస్ ఎరక్టస్‌ని మళ్లీ పాతిపెట్టేసి, మట్టితో కప్పేసి, అసలు అలాంటి దేమీ యెన్నడూ లేనట్టే నటించాలని వాళ్లు సాధ్యమైనదల్లా చేశారు.

ద్యుబువా తన ఆవిష్కరణని ధైర్యంగా సమర్థించుకున్నాడు. విజ్ఞానశాస్త్రంలో దానికి గల ప్రాముఖ్యాన్ని గుర్తించిన వాళ్లంతా ఆయన పక్షాన చేరారు.

ఆ పుర్రె గిబ్బన్‌ది అయివుండదనీ, యెందుకంటే గిబ్బన్‌కి నుదుటి కోటరాలు (sinuses) లేవనీ, పిథెకాన్త్రపస్‌కి వున్నాయనీ తన ప్రత్యర్థులతో వాదిస్తూ ద్యుబువా రుజువు చేశాడు.

సంవత్సరాలు గడిచాయి, కాని పిథెకాన్త్రపస్ ఎరక్టస్‌కి మానవ వంశంలో ప్రవేశం లభించలేదు.

అప్పుడు జావా మానవుణ్ణి పోలిన నూతన నర – వానర అవశేషాలు శాస్త్రజ్ఞులకి తటస్థపడ్డాయి.

యిరవైయవ శతాబ్దపు తొలి రోజుల్లో ఒక యూరపియన్ శాస్త్రజ్ఞుడు చైనాలో ఒక చైనీస్ మందుల దుకాణంలోకి వెళ్లాడు. అక్కడి వింత వస్తువుల్లో మానవుణ్ణి పోలిన ఓషధి జిన్‌సెంగ్, అనేక రకాల కడియాలు, జంతువుల యెముకలు, దంతాలు వున్నాయి.

జంతువుల దంతాలలో ఒకటి మాత్రం కచ్చితంగా ఆ కోవకి చెందింది కాదు, మనకి తెలిసిన యే జంతువుదీ కాదు. కాని అది యేదో అస్పష్టంగా మానవ దంతాన్ని పోలి వుంది.

ఆ శాస్త్రజ్ఞుడు ఆ దంతాన్ని కొని యూరప్‌లోని మ్యూజియంకి పంపించాడు. దానికి ''చైనా దంతం'' అని జాగ్రత్తగా నామకరణం చేశారు.

యిరవై అయిదు సంవత్సరాల పైనే గడిచిపోయాయి. అప్పుడు అలాంటిదే సస్తనజాతి జీవి కింది దంతం ఒకటి పీకింగ్ దగ్గర షుకొటిన్ అనే ఒక గుహలో దొరికింది. అప్పుడు ఆ పళ్లు వుండే మనిషి బయటపడ్డాడు. అతన్ని సినాన్త్రపస్ అని పిలిచారు.




శిలాజ కపాలంనుంచి సినాన్త్రపస్ ఆకృతిని మనుష్యశాస్త్రవేత్తలు నిర్మించారు

పూర్తి అస్థిపంజరం అసలు దొరకలేదు. నూతన ఆవిష్కరణల్లో యాభై దంతాలు, మూడు పుర్రెలు, పది కొండు దవడ యెముకల ముక్కలు, తుంటి భాగపు ముక్క, వెన్నెముక, ఒక మణికట్టు, కంఠాస్థి, కాలి తునక వున్నాయి.

అలా అని గుహలో వుండే ఆ మనిషికి మూడు తలలూ ఒక్కగానొక్క కాలూ మాత్రమే వున్నాయని కాదుకదా. దీనికి సంబంధించి వింతైంది యేమీ లేదు. షూకొటిన్ గుహలో నర — వానర గుంపులు యెక్కువ వుండేవి. ఆదిమ కాలంనుంచీ గడిచిన వందల వేలాది సంవత్సరాల్లో చాలా అస్థికలు మాయమైపోయాయి. కాని గుహలో వుండేవాళ్ల ఆకృతిని ఊహించడానికి దొరికిన ముక్కలు చాలు. యే శాస్త్రజ్ఞుడికేనా ఒక వేలు దొరికితే మొత్తం శరీరాన్ని లాగేస్తాడు.

మన శిలాజ కథానాయకుడు యెలా వుండేవాడు?

ఆఁ, నిజం చెప్పాలంటే అందంగా వుండేవాడు కాదు.

హఠాత్తుగా అతను మీకు తగిలితే మీరు భయంతో నోరు వెళ్లబెడతారేమో. మరి శిలాజ మానవుడు. చదునైన నుదుటితోటీ, ముందుకు పొడుచుకు వచ్చిన ముఖంతోటీ, పొడుగాటి కేశమయమైన చేతుల్తోటీ యింకా చాలా మట్టుకి



పిథెకాన్త్రపస్ అవశేషాల కోసం వెదుకుతూ జావాలో పురాతత్వవేత్తలు తవ్వకాలు సాగించడం

కోతిలాగానే వుండేవాడు. సరే, అది కోతే అని మీరు నిశ్చయించుకున్నారో మీరు వెంఠనే మీ అభిప్రాయం మార్చుకోవాల్సిందే, యెందుకంటారేమో, యే కోతీ మనిషిలా నిటారుగా నడవదు, యే కోతి ముఖమూ మానవ ముఖాన్ని అంత దగ్గరసా పోలి వుండదు.

సినాంత్రపస్‌ని అతని గుహదాకా అనుసరిస్తే అన్ని సందేహాలూ నివృత్తి అవుతాయి.

నది ఒడ్డున వంగిన కాళ్లతోటి వూగుతూపోతున్నాడదిగో. ఉన్నట్టుండి కూర్చుంటాడు. ఒక పెద్దరాయిలో యేం కనిపించిందో. దాన్ని తీసుకుని, జాగ్రత్తగా పరిశీలించి దానితో యింకో రాతిని కొడతాడు. మళ్లీ నుంచుంటాడు, తనకి దొరికిందాన్ని మోసుకుంటూ భారంగా పోతాడు.

ఆఖరికి ఒడ్డున నిటపాటుగా వున్న స్థలానికి వస్తాడు. ఆ గుహ ద్వారం దగ్గర అతని తెగ పొగయింది. ఒళ్లంతా బొచ్చూ, గడ్డం వున్న ముసలి మనిషి ముందు మిగతా వాళ్లంతా గుమి కూడతారు. ఆ ముసలతను ఒక దుప్పి కళేబరాన్ని రాతి పనిముట్టుతో కోస్తూ వున్నాడు. స్త్రీలు పచ్చి మాంసాన్ని చేతుల్తోటి చీలుస్తున్నారు. పిల్లలు అటూ యిటూ పరిగెడుతున్నారు కొంచెం పెట్టండి, కొంచెం పెట్టండి అని బతిమాలుతూ. గుహలోలోపల మండే మంట నుంచి వెలుతురు వస్తోంది.

ఆఖరి సందేహాలు మాయమైపోయాయి: ప్రపంచంలో నిప్పు తయారు చేసుకోవడం గాని, రాళ్లతో పనిముట్లు తయారు చేసుకోవడం గాని యే కోతేనా చెయ్యగలదా?

కాని మీరు అడగవచ్చు: సినాంత్రపస్ నిప్పు తయారు చేసుకున్నాడనీ రాళ్లతో పనిముట్లు తయారు చేసుకున్నాడనీ మీకెలా తెలుసు?

షుకొటిన్ గుహే జవాబు యిచ్చింది. యీ శిలాజ మానవుడి అవశేషాల నిక్షేపాల్లోనే రెండు వేలకి పైగా ముతక రాతి పనిముట్లూ, మట్టితో కలిసిపోయిన బూడిద యిరవై మూడు అడుగుల పొర వున్నాయి. దీన్ని బట్టి సినాంత్రపస్‌లు ఆ గుహలో చాలా చాలా సంవత్సరాలు జీవించారనీ, వాళ్ల మంటలు అలా రాత్రీపగలూ మండుతూ వుండేవనీ అర్థం అవుతుంది.

వాళ్లకి నిప్పుచేసుకోవడం నిజంగా తెలియదు, తినే దుంపలూ, పనిముట్లకి రాళ్లూ పోగుచేసుకున్నట్టుగా నిప్పుని ''పోగు చేసుకునే'' వాళ్లు.

అడివిలో మంటలు మండుతాయి. అక్కడ నిప్పు దొరుకుతుంది. ఆనాటి నరుడు మండే కొరకంచు తీసుకుని, జాగ్రత్తగా దాన్ని తన ఆవాసం దగ్గరికి తీసుకుపోయేవాడు. వానా, గాలీ లేని గుహలో దాన్ని తన మహాసంపదగా భద్రపరచి కాపాడుకునేవాడు.

# ప్రకరణం మూడు

## మానవుడు నియమాలని అతిక్రమిస్తాడు

మన కథానాయకుడు కర్రలూ, రాళ్ళూ ఉపయోగించడం నేర్చుకున్నాడు. అది అతన్ని మరింత బలంగా, స్వేచ్ఛగా అయేటట్టు చేసింది. యిప్పుడు దగ్గర్లో పళ్ళూ ఫలాల చెట్లు వున్నాయా లేవా అనే బాధ అతనికి లేకపోయింది. ఆహారం కోసం వెదుకుతూ తన వాసస్థానంనుంచి యింకా యింకా దూరం పోయేవాడు, ఒక చిన్న అడవి లోకంనుంచి యింకో అడవి లోకంలోకి పోయేవాడు, యెక్కువ వ్యవధి ఆరుబయలు మైదానంలో గడిపేవాడు, అన్ని నియమాలూ అతిక్రమించేవాడు, అతను మామూలుగా తినడు అనుకునేవి తినేవాడు.

అంచేత మానవుడు మొదటినుంచీ ప్రకృతి నియమాలని అతిక్రమించడం మొదలెట్టాడు.

నిజమే, చెట్లమీద నివసించేవాడు చెట్ల శిఖరాలనుంచి దిగివచ్చి నేలమీద సంచరిండచం మొదలెట్టాడు. రెండు కాళ్లమీదా నడిచేటందుకు నిబ్బరంగా నిటారుగా అయాడు. అది చాలదన్నట్టు, ప్రకృతికి తెలియని మార్గాల్లో ఆహారం సంపాదిస్తూ అతనివి కావు అనుకునేవాటిని తినడం మొదలెట్టాడు.

ప్రపంచంలో అన్ని జంతువులకీ, మొక్కలకీ పరస్పరాధీనత వుంది, అవి ''పోషణ చక్రాల'' వల్ల కలిసిపోయి వున్నాయి. అడివిలో ఉడుతలు పైన్ కాయలు తింటాయి, అడివి పిల్లులు (martens) ఉడతల్ని తింటాయి. ఆ రకంగా ఒక గొలుసు యేర్పడింది: పైన్ కాయలు – ఉడతలు – అడివి పిల్లులు. కాని ఉడతలు పైన్ కాయల్ని మాత్రమే కాదు పుట్టగొడుగులనీ, యింకా మిగతా కాయలనీ కూడా తింటాయి. ఉడుతలని వేటాడే జంతువులు అడివి పిల్లులొక్కటే కాదు. యింకా వున్నాయి, పక్షుల్లాంటివి. పెద్ద డేగలు ఉడుతల్ని వేటాడతాయి. ఆ రకంగా యింకో గొలుసు యేర్పడుతుంది: పుట్టగొడుగులు, కాయలు – ఉడతలు – పెద్ద డేగలు. అడివిలో వుండేవన్నీ యిలాంటి గొలుసుల్లో లింకులే.

మన కథానాయకుడు తన అరణ్య ప్రపంచంలోని ''పోషణ చక్రంలో'' ఒక లింకు. అతను పళ్ళూ ఫలాలూ తినేవాడు, అతన్ని కోరల పెద్దపులి వెంటాడేది.

అప్పుడు హఠాత్తుగా మన నాయకుడు యీ గొలుసుల్ని ఛేదించడం మొదలుపెట్టాడు. అంతకు ముందు తను యెన్నడూ తిననివాటిని తినడం మొదలుపెట్టాడు. కొన్ని వందల వేల సంవత్సరాలుగా తన పూర్వుల్ని చంపేస్తూ వచ్చిన కోరల పెద్దపులికీ, మిగతా క్రూర మృగాలకీ బల్లైపోవడానికి నిరాకరించాడు.

అంత సాహసవంతుడుగా అతను యెలా అయాడు? రక్తపిపాసతో, వాడి దంతాల క్రూరమృగాలు కాసుకు కూర్చున్న నేలమీదకి దిగి వచ్చే సాహసం అతనికి యెలా వచ్చింది? తన కోసం యే పిల్లైనా కాసి పెట్టుకు కూర్చుంటే పక్షి యేదేనా కిందికి దిగి రావడం లాంటిదే అది.

మానవుడికి కొత్తగా దొరికిన సాహసం అతని చేతుల వల్ల వచ్చింది. తను చేతిలో పట్టుకున్న రాయీ, తను

దుంపలు తవ్వుకునేందుకు ఉపయోగించే కర్రా అతని ఆయుధాలు. మానవుడి మొదటి పనిముట్లే అతని మొదటి ఆయుధాలు అయ్యాయి.

అప్పుడేనా మళ్లీ మానవుడు ఒంటరిగా అడవిలో సంచరించలేదు.

తనమీద దాడి చేసిన యే జంతువుమీదకేనా సరే మానవ మంద అంతా లంఘించేది, దాన్ని తమ నూతన ఆయుధాలతో తరిమేసేది.

మనం నిప్పుని మర్చిపోకూడదు. తన నేస్తమైన నిప్పుతోటి మానవుడు అతి క్రూరమైన జంతువుని కూడా తరిమేశేవాడు.

# మానవుడి చేతులు వదిలిన జాడలో

చెట్టుమీదనుంచి నేలమీదకి, అడివిలోనుంచి నదీలోయల్లోకి — అదీ ఆదిమ మానవుడు తనని చెట్టుకే కట్టిపడవేసిన గొలుసుల్ని ఆఖరిగా తెంచుకునే యత్నంలో సాధించి, ప్రయాణం చేసింది.

అతను నదీ లోయల్లోకి పోయినట్టు మనకి యెలా తెలుసు?

మనల్ని అక్కడికి తీసుకెళ్లే జాడలు వున్నాయి.

కాని యీ జాడలు యెలా భద్రంగా వుండిపోయాయి?

అడుగుజాడలని పిలిచే మామూలు జాడలు కాదివి. మానవుడి చేతులు వదిలిపెట్టిన జాడలివి.

ఒక వంద సంవత్సరాల క్రితం ఫ్రాన్స్‌లోని సొమ నదీ లోయలో పనివాళ్లు యిసకకోసమూ, గులకరాళ్లకోసమూ తవ్వుతున్నారు.

చాలా చాలా కాలం కితం, సొమ కొత్తగా పుట్టి తన ప్రవాహగతి యేర్పరచుకుంటూ వున్నప్పుడు, అది చాలా ఉధృతంగా వుండి పెద్ద బండరాళ్లని దొర్లించేసుకుంటూ పోయేది. ఆ నది వాటిని తోసేస్తూ వుంటే అవి ఒక దాన్నొకటి కొట్టుకుంటూ, ఆ క్రమంలో గుండ్రంగా, నున్నగా, చిన్నవిగా తయారయేవి. తర్వాత దశలో, నది ప్రశాంతంగా, మంద గమనంగా తయారైనప్పుడు ఆ గులకరాళ్లని యిసక, మట్టిపొర కప్పేసాయి.

అడుగున వున్న గులకరాళ్లని తీయడం కోసమని యీ యిసకనీ, మట్టినీనే పనివాళ్లు తవ్వుతూ వున్నది.

హఠాత్తుగా వాళ్లకి వింత వస్తువులు కనిపించడం మొదలెట్టాయి. కొన్ని గులకరాళ్లు నున్నగా గుండ్రంగా లేవు. అవి సమంగా లేవు, రెండు వేపులా చెక్కినట్టు వున్నాయి. వాటిని ఆ రూపంలో యెవళ్లు చేసివుంటారు? నది మాత్రం కాదు, అది రాళ్లని గుండ్రంగా, నున్నగా మాత్రమే చేస్తుంది.

ఆ వింత వస్తువుల్ని దగ్గర్లోనే వుండే పురావస్తు పరిశోధకుడైన జాక్ బుషె డి పెర్త్ దృష్టికి తీసికెళ్లారు. బుషె డి పెర్త్ దగ్గర ఆయన సొమ లోయ నేలలో కనిపెట్టిన ఆసక్తికరమైన వస్తువులు చాలా వున్నాయి. అవి మామత్ (mammoth) దంతాలు, ఖడ్గమృగం కొమ్ములూ, గుహల్లో వుండే ఎలుగుబంట్ల పుర్రెలూనూ. యీ క్రూర జంతువులన్నీ కూడా, యివాళ ఆవులూ గొర్రెలూ లాగ సొమకి నీళ్లు తాగడానికి వచ్చేవి.

కాని ఆదిమ మానవుడెక్కడ? బుషె డి పెర్త్ తన దగ్గరున్న యెముకల్లో ఆ జాడ కనిపెట్టలేకపోయాడు.





యీ రాతి పనిముట్లని నరుని చేతులు మాత్రమే మలిచి వుండగలవు. బల్లెంమొన, గోకుడు పనిముట్టు, చేతిగొడ్డలి

అప్పుడు యిసకలో దొరికిన యీ వింత రాతి పనిముట్లని చూశాడు. ఎవళ్లు వాటిని రెండు వేపులా చెక్కి వుంటారు? అలా మానవులే చేసివుంటారని ఆయన నిర్ణయానికి వచ్చాడు.

అప్పుడు ఆ ఔత్సాహిక పురాతత్వ పరిశోధకుడు ఆ దొరికిన వాటిని మహోత్సాహంగా పరిశీలించాడు. అవి ఆనాటి మానవుడి శిలాజ అవశేషాలు కాదు నిజమే. కాని అవి అతను వదిలిన జాడలు, అతని పరిశ్రమ గుర్తులు. అందులో సందేహం లేదు: ఆ పని చేసింది నది కాదు, మనిషి.

తన ఆవిష్కరణల గురించి ఆయన ఒక పుస్తకం రాశాడు. ఆ పుస్తకపు సాహసవంతమైన పేరు: ''ఆదిమ మానవుడి పరిశ్రమ.''

అప్పుడు యుద్ధం మొదలైంది. ఆయనకి, తర్వాత ద్యుబువాకి లాగానే, అన్ని వేపులనుంచీ ముట్టడి వచ్చింది.

ఆ కాలపు మహాఘనులైన పురాతత్వవేత్తలంతా యీ స్థానిక పురాతత్వవేత్తకి విజ్ఞానశాస్త్రపు ముక్కూమొహం తెలీదనీ, యీ రాతి ''గొడ్డళ్లు'' నకిలీవనీ రుజువు చేయ ప్రయత్నించారు. ఆయన పుస్తకాన్ని బహిష్కరించాలనీ, మానవుడి సృష్టి గురించి చర్చి చేసే బోధనలని అవి సవాలు చేస్తున్నాయనీ అన్నారు.

ఆ యుద్ధం పదిహేనేళ్లు సాగింది.

బుషె డి పెర్త్ తల పండిపోయింది, ముసలాడు అయిపోయాడు. అయినా ఆయన తన భావాలకోసం, మానవ జాతి బ్రహ్మాండమైన ప్రాచీనతని రుజువు చెయ్యడం కోసం పోరాడాడు. తన మొదటి పుస్తకం వెలువడ్డాక, రెండో పుస్తకం, మూడో పుస్తకం రాశాడు.

సైన్యాలు ఉజ్జీగా లేవు. అయినా ఆయన నెగ్గాడు. సుప్రసిద్ధ బ్రిటిష్ భూగర్భ శాస్త్రవేత్తలైన ఛార్లెస్ లైయెల్, జోసెఫ్ ప్రెస్ట్‌విచ్ బహిరంగంగా బుషె డి పెర్త్ సిద్ధాంతాన్ని సమర్థించారు. వాళ్లిద్దరూ కూడా సొమ లోయనీ, తవ్విన స్థలాలనీ దర్శించారు. బుషె డి పెర్త్ పోగుచేసిన వాటిని చాలా కాలం పరిశీలించి, అధ్యయనం చేసాక ఆయన

కనిపెట్టిన పనిముట్లు నిజంగా ఆదిమ మానవుడివేననీ, అతను యిక యెంతమాత్రమూ ఫ్రాన్స్‌లో కనిపించకుండా అదృశ్యమైపోయిన మహా విచిత్రమైన ఏనుగుల, ఖడ్గమృగాలా సమకాలీనుడనీ ప్రకటించారు.

లైయెల్ రచన ''మానవుడి ప్రాచీనత'' (1863లో ప్రచురితం) అన్న పుస్తకం బుషె డి పెర్త్ శత్రువుల నోళ్ల మూయించింది. అప్పుడు వాళ్లు డి పెర్త్ దేన్నీ నిజంగా కనిపెట్టలేదనీ, పురాతన కాలపు పనిముట్లని కొన్ని చోట్ల యిదివరకే ఆవిష్కరించడం జరిగిందనీ అనడం మొదలెట్టారు.

దీనికి లైయెల్ చమత్కారవంతమైన సమాధానం యిచ్చాడు: విజ్ఞానశాస్త్రం ఒక ముఖ్యమైన ఆవిష్కరణ చేసినప్పుడల్లా దాన్ని మతవ్యతిరేకమైందని నాలుగు నోళ్ళూ అంటాయి. అవే నోళ్లు తర్వాత అదెప్పట్నుంచో అందరికీ తెలుసు అంటాయి, అని.

సొమ నదీ లోయలో బుషే డి పెర్త్ కనిపెట్టిన లాంటి రాతి పనిముట్లు యివాళ ప్రపంచంలో చాలా చోట్ల దొరికాయి. అవి మామూలుగా దొరికేది కంకర కోసమూ, గులకరాళ్లకోసమూ తవ్వే నదీ గర్భాల్లోని కోరీల్లోనే.

ఆ రకంగా ఆధునిక మానవుడి పార, అప్పుడే పని చెయ్యడం నేర్చుకునే శిలాజ మానవుడి తాలూకు పురాతన కాలపు పనిముట్లు తారస పడేట్టు చేస్తోంది.

అతి ప్రాచీనమైన రాతి పనిముట్టు యింకొక దాన్తో రెండు వేపులా చెక్కిన రాయి. దగ్గర్లోనే చెక్కినప్పుడు పడ్డ ముక్కలు సామాన్యంగా వుండేవి.

మనలని నదీ లోయల్లోకీ, యిసుక తిన్నెల్లోకి నడిపించిన మానవకరాల జాడలు యీ రాతి పనిముట్లు. అక్కడ ఆ నిక్షేపాల్లో, మిట్టల్లో తను రాతి గోళ్లనీ, పళ్లనీ చేసుకునే వస్తువుల కోసం వెదికేవాడు శిలాజ మానవుడు.

యీ శ్రమ మానవ శ్రమ. ఒక జంతువుగాని, పక్షిగాని తన ఆహారం కోసమూ, తను గూడుకట్టుకునే వస్తువుల కోసమూ వెదుకుతుంది. కాని అదనపు గోళ్లూ, పళ్లూ తను తయారు చేసుకోగలిగే వాటికోసం వెదకడానికి యెన్నడూ వెళ్లదు.

# సజీవమైన పార సజీవమైన పీపా

పక్షులకీ, జంతువులకీ, పురుగులకీ వుండే యిళ్లు నిర్మించుకునే సామర్థ్యం గురించి మీరు బహుశా విని, చదివో వుంటారు. వాటిల్లో మామూలు వడ్రంగం వాళ్లు, రాతికట్టడం మేస్త్రీలు, సాలెవాళ్లు, ఆఖరికి దర్జీ పనివాళ్లు కూడా వున్నాయి. బీవర్‌కి వున్న పదునైన పళ్లు చెట్లుకొట్టేవాడంత బాగా చెట్టుని పడగొట్టగలవు. ఆ పడిపోయిన చెట్ల కాండాలతోటీ, కొమ్మలతోటీ బీవర్ నిజమైన ఆనకట్టలు కడుతుంది. యీ ఆనకట్టలు నదిలో నీళు గట్ల మీద పొర్లిపోయేటట్టూ చేసి, బీవర్ల కిష్టమైన నిలవనీటి కుంటల్ని యేర్పడేటట్టు చేస్తాయి.

ఎండిపోయిన పైన్ చెట్ల ఆకులతో పుట్టలు పెట్టే గోధుమ రంగు చీమల మాట యేమిటి? ఒక పుల్ల ముక్కతోటి చీమల పుట్టని అలా తోస్తే అది యెంత జిత్తులమారి ఆకాశహర్మ్యాల నిర్మాతో తెలుస్తుంది.

మానవుడు వాటి పుట్టలనీ, ఆనకట్టలనీ నాశనం చెయ్యడం మానేస్తే చీమలూ, బెవర్లూ మానవుడితో అందుకునే రోజు యెప్పటికేనా వస్తుందా అనే ప్రశ్న వస్తుంది. యింకో పది లక్షల యేళ్ల తర్వాత చీమలకి తమ సొంత

చీమల వార్తాపత్రికలూ చీమల ఫాక్టరీల్లో పనీ, చీమల విమానాల్లో ఎగరడం, రేడియోలో చీమల సంగీతం వినడం వుంటాయా? వుండవు. ఎందుకంటే మనిషికీ చీమలకీ చాలా ముఖ్యమైన విభేదం వుంది.

ఏమిటా భేదం?

మనిషి చీమకంటే పెద్దగా వుండటమా?

కాదు.

చీమకి ఆరు కాళ్ళు వుంటే మనిషికి రెండే వుండటమా?

కాదు.

మనం మాట్లాడేది పూర్తిగా వేరే దాన్ని గురించి.

మానవుడు యెలా పనిచేస్తాడో వూహించండి. అతను తన చేతుల్నీ, పళ్లనీ అలానే వాడడు. అతను ఒక గొడ్డలినో, పారనో, సుత్తినో వాడతాడు. మీరు యెంత సేపు దీక్షగా చూసినా సరే ఒక చీమ గొడ్డలిగాని, చీమ సుత్తిగాని చీమలపుట్టలో కనిపించవు.



సజీవమైన పీపాలు వున్న గది



చతుష్పాత్త నిర్మాతలు ఓ ఆనకట్టని కట్టడం

చీమ దేన్నేనా కత్తిరించాల్సివస్తే, తలమీద వుండే సజీవమైన **కత్తెర్లని** వాడుతుంది. అది **యేదేనా గుంట తవ్వా**లనుకుంటే తనతో **కూడా** వుండే సజీవమైన పారలని వాడుతుంది. దాని ఆరు కాళ్లల్లోనూ నాలుగు ఆ పారలు. మొదటి రెండూ తవ్వుతాయి, వెనక్కాల రెండూ మట్టిని యెత్తిపోసేస్తాయి, అది పని చేసేటప్పుడు నడిమి రెండింటిమీదా ఆనుకుంటుంది.

చీమలకి సజీవమైన పీపాలు కూడా వున్నాయి. కొన్ని చీమల జాతులు తమ పుట్టల్లోని మొత్తం అంతస్తులన్నిటినీ సజీవమైన పీపాలతో నింపేస్తాయి. చీకటి నేలమాళిగల్లో వరసమీద వరసగా యీ పీపాలు అంతస్తు కప్పుమీదకి వస్తాయి. అవి నిశ్చలంగా వుంటాయి. అంతలోకీ హఠాత్తుగా ఒక పనివాడు చీమ నేలమాళిగలోకి వస్తుంది. అప్పుడు దాని స్పర్శ శృంగకాలు యీ పీపాని కొన్ని సార్లు తాకుతాయి వాటికి వూపిరివచ్చి, కదుల్తాయి.

దానికి తల, కడుపు, కాళ్లు వుంటాయి. వాస్తవానికి చీమ ఉబ్బిన పెద్ద పొట్టే దాన్ని పీపాలా కనిపించేటట్టు చేస్తుంది. దాని దవడలు తెరుచుకుంటాయి. ఒక తేనె బొట్టు నోట్లో పడుతుంది. ఫలహారం కోసం వచ్చిన పనివాడు చీమ ఆ తెనెబొట్టుని నాకేసి మళ్లీ పనిలోకి పోతుంది. చీమ పీపా మళ్లీ కప్పుకింద నిద్రలోకి జారిపోతుంది.

యివి చీమల ''సజీవ'' పరికరాలు. అవి మనకి లాంటి కృత్రిమమైవి కావు. అవి సహజమైన పరికరాలు, అవి యెప్పటికీ కూడా అలానే వుంటాయి.

బీవర్‌కుండే పరికరాలు కూడా దాని శరీరంలో అంతర్భాగమే. చెట్టుని కొట్టాలంటే దానికి గొడ్డలి లేదు. తన పళ్లని వాడుతుంది. చీమలూ బీవర్లూ తమ పరికారాలని తయారు చేసుకోవు. అవి వాటితోపాటే పుడతాయి.

లేకపోతే ఉదాహరణకి క్రాస్‌బిల్‌ని తీసుకోండి.

క్రాస్‌బిల్ భోజనానికి కూర్చుంటే చాకుగాని ఫోర్కుగాని వాడదు. దాని డైనింగ్ ఉపకరణాలు ఒక పట్టకారు.

దాని తోటి అది జాగ్రత్తగా పైన్ కాయల్ని యేరి ఒక గింజ తర్వాత యింకో గింజని తీసుకుంటుంది. యీ ఉపకరణాన్ని అది యెన్నడూ దాచదు, (నిద్రపోయేటప్పుడు కూడా). కారణం యేమీ లేదు, దాని ముక్కే దాని కత్తీ, ఫోర్క్సూ.

పైన్ కాయలు చీల్చడానికి దాని ముక్కు వక్కల్ని చీల్చే అడకత్తెరలాగా, సీసా బిరడా తీసే స్క్రూలాగా పనికొస్తుంది.

వున్న తేడా అల్లా యేమిటంటే మానవుడు అడకత్తెరని కనిపెడితే, క్రాస్‌బిల్‌కి స్వతహాగానే చాలా యేళ్ల అడివి కాపరం వల్లా, పైన్ కాయలనుంచి గింజలు యేరుకోవడంవల్లా అవి వచ్చేశాయి. చూడగానే అలాంటి పనిముట్లంటే యెవళ్లకేనా గానీ అసూయ పుడుతుంది: అవి పోవు, పొరపాటున యెక్కడా పెట్టం. కొంచెం నిదానంగా ఆలోచిస్తే యీ పరికరాలు అంత మంచివి కావని మీకు అనిపిస్తుంది. అవి యెప్పటికీ స్థిరంగా వుంటాయి, వాటిని మార్చడానికి లేదు.

వార్ధక్యంవల్ల మొద్దు బారిపోయిన పళ్లని దంతవైద్యుడి దగ్గరికి వెళ్లి పదును పెట్టించుకోలేదు బీవర్. కొంచెం కొత్తగా వుండి, యింకొంచెం మెరుగైన కాళ్లని వేగంగా, లోతుగా తవ్వడం కోసమని యే చీమా పురమాయించి తెప్పించుకోలేదు.

# చేతికి బదులుగా పారతో మానవుడు

మానవుడికి మిగతా జంతువుల్లాగానే, కొయ్య, ఇనుము ఉక్కు లేకుండా సజీవమైన పనిముట్లు మాత్రమే వున్నాయనుకుందాం.

అతను కొత్త పనిముట్లని కనిపెట్టలేదు, తనకి పుట్టుకతోనే వచ్చిన పాతవాటిని మార్చుకోలేడు. అతనికి పార కావాలంటే పారలాంటి చేత్తో పుట్టాలి. వూరికే మనమిదంతా వూహిస్తున్నామంతే యిది నిజంగా యెన్నటికీ జరగదు. కాని అలాంటి వింత జీవి పుట్టిందనే అనుకుందాం. అతను యెంత అద్భుతమైన తవ్వే వాడైనప్పటికీ యింకొకళ్ల వళ్లకీ తవ్వడం నేర్పలేడు, అతి చక్కటి దృష్టి వున్నవాడు యింకొకళ్లవళ్లకీ తన చూపుని బదులు యివ్వలేనట్టుగా.

అలాంటి జీవి తన పార — చేతిని అస్తమానూ కూడా మోసుకుపోతూ వుండాలి. అది యింకే పనికీ ఉపయోగ పడనూ పడదు. ఒకవేళ ఆ జీవి చచ్చిపోతే ఆ పార — చెయ్యి కూడా అంతమైనట్టే. పుట్టుకతోనే తవ్వేవాడు తన పారని భావి తరాలకి అందివ్వాలీ అంటే అతని మనవలు ఆ పార — చేతిని సంక్రమింపచేసుకున్నప్పుడే సాధ్యం.

యేమైనా యింకో కారణం కూడా వుంది. వాడకంలో వుండే దైతేనే, హానికరం కాకుండా వుంటేనే ఒక సజీవమైన పనిముట్టు భవిష్యత్తరాలకి జీవితంలో భాగం అవుతుంది.

నేలలో మోల్ లాగా మనుషులు వుంటే వాళ్లకి తప్పకుండా పార — చేతులు కావాలి.

నేలమీద బతికే వాళ్లకి అలాంటి చెయ్యి అనవసరమైన భాగం అవుతుంది.

ఒక సజీవమైన, సహజమైన పనిముట్టుని సృష్టించాలీ అంటే చాలా విషయాలని గమనంలోకి తీసుకోవాలి. అదృష్టవశాత్తూ మానవుడు తన అభివృద్ధిలో వేరే మార్గంలో వెళ్లాడు. ప్రకృతి తనకి పార — చెయ్యి యిచ్చేదాని కోసం మానవుడు ఆగలేదు. తనంతట తనే ఒకటి తయారు చేసుకున్నాడు. పారే కాదు, చాకు, గొడ్డలి, యింకా చాలా చాలా పనిముట్లని తయారు చేసుకున్నాడు.

తనకి పూర్వులనుంచి సంక్రమించిన పది చేతివేళ్లకీ, పది కాలి వేళ్లకీ, ముప్పై రెండు పళ్లకీ అతను వేలాది, అత్యంత భిన్నమైనవాటిని పొడుగూ, పొట్టీ, సన్నమూ మందమూ, పదునైనవీ మొద్దుగా వుండేవీ, చొచ్చుకుపోయేవీ, కత్తిరించేవీ, కొట్టేవీ అయిన వేళ్లనీ, కోరలనీ, దంతాలనీ, గోళ్లనీ, పిడికిళ్లనీ జతచేసుకున్నాడు.

మిగతా జంతు ప్రపంచంతోటి పందెంలో యిది అతన్ని యెంత వేగవంతం చేసిందంటే వాటికి అతనితో అందుకోవడం అసాధ్యం అయిపోయింది.

## శ్రమించే మానవుడు, శ్రమించే నది

శిలాజ మానవుడు మెల్లిగా మానవ పరిణామం చెందేటప్పుడు అతను తన శిలా నఖాలనీ, దంతాలనీ తయారు చేసుకోలేదు, మనం పుట్టగొడుగుల్నీ, బెర్రీలనీ యేరుకున్నట్టుగా యేరుకున్నాడు. నదుల మిట్ట ప్రాంతాల్లో సంచరిస్తూ ప్రకృతి ఆకురాతితో చెక్కి నునుపు పెట్టిన పదునైన రాళ్ల కోసం జాగ్రత్తగా వెదికేవాడు.

నది అడుగున పడివున్న రాళ్ల చుట్టూతా సుళ్లు తిరిగిన సుడిగుండాలున్న చోట, ఆ రాళ్ల గుంపుని ఒక దానితో యింకొక దాన్ని పెను రాపిడికి గురిచేసిన చోట యీ ''సహజ''మైన పనిముట్లు సామాన్యంగా కనిపిస్తాయి. ఉధృతంగా సుడిగుండంలో వుండిన నది తన ''శ్రమ'' ఫలితం యేమవుతుందా అని పట్టించుకుందా? అందుకనే ప్రకృతి చెక్కిన అనేక వందల రాళ్లల్లో కొద్ది మాత్రమే మానవుడికి యేమాత్రమో ఉపయోగపడ్డాయి.

కాలక్రమేణా మానవుడు తనకవసరమైన రాళ్లని చెక్కుకున్నాడు, తన మొదటి పనిముట్లని తయారుచేసుకోవడం మొదలుపెట్టాడు.

అప్పుడు జరిగింది మానవ చరిత్రలో చాలా సార్లు జరగవలసివుంది: మానవుడు తను కృత్రిమంగా తయారు చేసుకున్న దాన్ని, సహజ స్థానంలో వున్న యింకోదానికి బదులుగా వుంచాడు. ప్రకృతియొక్క బ్రహ్మాండమైన కార్ఖానా దిశల్లో ఒకదాంట్లో మానవుడు తన కర్మాగారం స్థాపించాడు. అక్కడ తను ప్రకృతిలో పొందలేని నూతన వస్తువుల్ని సృష్టించాడు.

యిదీ రాతి పనిముట్ల కథ, యిదీ వేలాది సంవత్సరాల తర్వాత వచ్చిన లోహపు పనిముట్ల కథ. దొరకడం కష్టంగా వుండే సహజ లోహం బదులుగా మానవుడు ముడిలోహంనుంచి కరిగించడం నేర్చుకున్నాడు. తనకి దొరికినదాన్నుంచి తను తయారు చేసుకోగలిగిందానికి అతను పురోగమించిన ప్రతిసారీ అతను స్వాతంత్ర్యం కేసి ఒక అడుగు ముందుకు వేశాడు, ప్రకృతి కఠోర నియమాలనుంచి స్వేచ్ఛ పొందడానికి ముందు అడుగువేశాడు.

మొదట్లో తన పనిముట్లని తయారు చేసుకోవడానికి అవసరమైన పరికరాలు తయారు చేసుకోలేకపోయాడు మానవుడు. తనకి దొరికిన వాటిని తన అవసరాలకి తగ్గట్టుగా రూపొందించుకోవడం మొదలెట్టాడు.

ఆ రకంగా అతను ఒక మంచి రాయిని సంపాదించి, మరొక రాతితో దాని అంచులు చెక్కి దాన్ని ఒక పరికరంగా తయారు చేసుకున్నాడు.

అది పదునైన మొనతోటి కొట్టే ఆయుధమనీ లేకపోతే చేతి గొడ్డలి అనీ పేరున్న బరువైన పరికరం అయేది. విరిగిపోయిన ముక్కలని కూడా కత్తెరలాంటి వాటినీ, గోకుడు పారలనీ, ఉలులనీ తయారు చెయ్యడానికి వాడేవారు.

భూగర్భంలో లోతులో దొరికిన అతిపురాతన పనిముట్లు యెంతో సహజమైన రాళ్లల్లాగా కనిపించేవి. అసలు వాటిని అలా యెవరు చేసారో చెప్పడం కష్టం: మానవుడా, నదా లేదా ఉష్ణంనుంచి శీతలానికి వానతోటీ నీటితోటీ కలిసి రాతిని పగలగొట్టి పిండి చేసే మారిన వాతావరణమా చెప్పలేం.

ఏమైనా యే సందేహాలూ కలగని పరికరాలున్నాయి. యివాళ మందమైన మట్టీ, యిసుకల పొరల్లో కప్పడిపోయిన ప్రాచీన నదీప్రాంతపు మిట్టల్లోనూ, గట్టుల్లోనూ, ఆదిమ మానవుని అసలైన కార్ఖానాలని శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. యీ తవ్వకాలలో, గొడ్డళ్లలాగా తయారు చెయ్యవలసి వున్న రాళ్లతోబాటుగా తయారైన చేతి గొడ్డళ్లు కూడా బయటపడ్డాయి.

రష్యాలోని దక్షిణ ప్రాంతాల్లోనూ, సుఖూమిదగ్గర యెత్తైన ప్రాంతాల్లోనూ, క్రైమియా కీక్ – కోబా గుహ లోనూ యీ చేతి గొడ్డళ్లు దొరికాయి.

ఒక చెకుముకిరాయి చేతి గొడ్డలిని పరిశీలించండి. దాన్ని యెక్కడ ముక్కలు చెక్కేసి, సూది అయిన అంచు వుండే టట్టుగా చెకుముకిరాతితో కొట్టిందీ మనకి తెలుస్తుంది. దాన్ని అరగదీసి నునుపు చేసినట్టుగా కూడా మనకి కనిపి స్తుంది.

ప్రకృతి అలాంటి పని యెన్నటికీ చెయ్యలేదు. దాన్ని మానవుడే చేసి వుండగలడు.

దీన్ని అర్థం చేసుకోవడం కష్టం కాదు: ప్రకృతిలో ప్రతీదీ ఒక పథకం లక్ష్యం లేకుండా అస్తవ్యస్తంగా జరుగు తుంది. నదిలోని సుడిగుండం ఒక పద్ధతీ పాడూ లేకుండా రాళ్లని కలిపి కొడుతోనే వుంటుంది. మానవుడు అదే పనిని చేస్తాడు కాని చైతన్యయుతంగా చేస్తాడు. తను చేసేదానికి అతనికి ఉద్దేశం వుంటుంది. తనకు దొరికిన రాతిని తన అవసరాలకి తగ్గట్టుగా మలచుకోవడం అనే తప్పటడుగులనుంచి, తన అవసరాలకి తగ్గట్టుగా ప్రకృతినే మార్చుకో వడమనేదానికి మానవుడు క్రమేపీ నడిచాడు.

యిది అతన్ని మిగతా జంతువుల కంటే ఒక మెట్టు యెక్కువలో వుంచింది. యిది అతనికి యింకా యెక్కువ స్వేచ్ఛని యిచ్చింది. యెందుకంటే ప్రకృతి తనకి పదునైన రాతిని యిచ్చేదాకా అతను ఆగాల్సిన పని లేకపోయింది.

యిప్పుడు అతను తన పనిముట్లని తనే చేసుకోగలుగుతున్నాడు.

# మానవ జీవిత చరిత్ర ప్రారంభం

ఒక వ్యక్తి జీవిత చరిత్ర అతను పుట్టిన తేదీతోటీ పుట్టిన స్థలంతోటీ మామూలుగా ప్రారంభమవుతుంది. ఉదా హరణకి:

''ఇవాన్ ఇవనోవ్, తమ్బోవ్ అనే నగరంలో నవంబరు 23, 1897 నాడు జన్మించాడు.''

యిదే సమాచారాన్ని యింకొంచెం ఆలంకారికమైన శైలిలో యిలా చెప్పవచ్చు:

''తన కుటుంబానికీ, సొంత నగరానికీ తర్వాత పేరు తెచ్చిన ఇవాన్ ఇవనోవ్, తమ్బోవ్ పరిసర ప్రాంతాల్లో ఒక చిన్న యింట్లో పుట్టినది 1897 నవంబరులో వానగా వున్న ఒక రోజున.''

మన మేమో మూడో ప్రకరణంలోకి వచ్చాం, అయినా మన కథానాయకుడు యెక్కడ యెప్పుడు పుట్టాడో చెప్పకో

లేదు. ఆ మాట కొస్తే అతని అసలు పేరు కూడా చెప్పలేదు. ఒక చోటనేమో ''వానర — నరుడ''న్నాం, యింకో చోట ''నర — వానరు''డన్నాం. అతను ''ఆదిమ'' మానవుడూ, ''శిలాజమానవుడూ'', యింకా ''మన అరణ్యావాసి పూర్వుడు'' కూడా.

పైకి గందరగోళంగా కనిపించే యీ పేర్లని వివరిద్దాం.

మీకు చెపుదామనే మాకు వున్నా మన కథానాయకుడి అసలు పేరు మీకు చెప్పలేం, అతనికి అన్ని పేర్లు వున్నాయి.

యే జీవిత చరిత్ర గ్రంథాన్ని తిరగేసినా మొదటినుంచి చివరదాకా కథానాయకుడి పేరు యెక్కడా మారకుండా వుండటం మీకు కనిపిస్తుంది. అతను మొదట చిన్నపిల్లాడు, తర్వాత కుర్రాడు, తర్వాత గడ్డాలూ మీసాలూ వచ్చిన యువకుడు, కాని అతని పేరు మాత్రం మొదటినుంచి చివరిదాకా అదే. అతని పేరు గనక ఇవాన్ అయితే ఆఖరి రోజుల దాకా అది ఇవానే.

కాని మన కథానాయకుడికి సంబంధించి పరిస్థితి చాలా చాలా క్లిష్టమైంది.

ఒక ప్రకరణంనుంచి యింకో ప్రకరణానికి తనే అంతగా మారిపోతున్నాడు కాబట్టి తదనుగుణంగా పేరు మార్చకుండా వుండటం మనకి తప్పదు.

మన పురాతన మానవరూపులందరిలోనూ అతి ప్రాచీనమైన ఆయన్ని గురించి బాగా కోతిలాగా కనిపించే అతన్ని గురించి, మనం మాట్లాడుకుంటూవుంటే, అతని పేరు పిథెకాన్త్రపస్, సినాన్త్రపస్, హీడెల్‌బర్గ్ మనిషి.

హీడెల్‌బర్గ్ మనిషిని గురించి మనకి దొరికిన ఆధారమల్లా జర్మనీలోని హీడెల్‌బర్గ్ నగరందగ్గర దొరికిన అతని దవడ ఎముక మాత్రమే.

ఏమైనా, ఆ దవడ ఎముక మనిషికి చెందిందే అనే రుజువు మాత్రం లభిస్తుంది: పళ్లు మానవుడి పళ్లు; కోర పళ్లు దిగువ పళ్లమీద నుంచి కోతులకి మాదిరిగా ముందుకు చొచ్చుకు రావు.

అయినా హీడెల్‌బర్గ్ మానవుడు యింకా నిజమైన మానవుడు కాదు. కోతిలాగా వెనక్కి వుండే చుబుకం అలా అనే దానికి ఆధారం.

పిథెకాన్త్రపస్, సినాన్త్రపస్, హీడెల్‌బర్గ్ మానవుడు!

అతని జీవితంలోని అదే కాలంలో, అతని అభివృద్ధిలోని అదే దశలో మన కథానాయకునికి మూడు పెద్ద పేర్లు.

కాని అతను మారకుండా వుండలేదు. అతను యింకా యింకా ఆధునిక మానవుడిగా మారుతున్నాడు. పసిబిడ్డ యువకుడూ, యువకుడు పెద్దవాడూ అయినట్టుగా, మన ఆదిమ మానవుడు నియాండర్తల్ మానవుడయాడు, నియాండర్తల్ మానవుడు క్రోమాన్యాన్ మానవుడయాడు.

చూశారా మన కథానాయకుడికి యింకా యెక్కువ పేర్లు వచ్చాయి!

అయినా అంత తొందరగా ముందుకు పోవద్దులెండి. యీ ప్రకరణంలో అతని పేర్లు ''పిథెకాన్త్రపస్, సినాన్త్రపస్, హీడెల్‌బర్గ్ మానవుడు.''

నదుల గట్లమీద, పనిముట్లుగా చేసుకోగలిగిన పరికరాల కోసం వెదుకుతూ తిరగడంలో అతని రోజులు గడిచాయి. అతను ఓపిగ్గా చెకుముకిరాళ్లను చెక్కుతూ వుండేవాడు. ముతకగ్గా, వికారంగా వుండే చేతి గొడ్డళ్లని చేసుకుంటూ వుండేవాడు. యీ నాటికీ నదీ నిక్షేపాల్లో కనపడేవి యివే.

అందుకనే అతని పేరు చెప్పడం అంత కష్టం.



మానవ పుర్రెని యెంతగానో పోలి వున్న చరిత్రాత్పూర్వపు కోతి పుర్రె తునకలు దక్షిణ ఆఫ్రికాలో కనిపించాయి. యీ చిత్రం ఆస్ట్రలోపిథికస్ ఆకృతిని పునర్ నిర్మిస్తోంది

అతను యెప్పుడు పుట్టాడో చెప్పడం యింకా యెక్కువ కష్టం.

వూరికే "మన కథానాయకుడు ఫలానా ఫలానా సంవత్సరంలో పుట్టాడు" అని చెప్పలేం. కారణం యేమిటంటే అతను ఒక్క సంవత్సరంలో మానవుడిగా అయిపోలేదు. నడవడం నేర్చుకోవడానికీ, ముతక పనిముట్లని తయారు చేసుకోవడానికీ అతనికి వేలవేల సంవత్సరాలు పట్టింది. అందుకనే మానవుడి వయస్సెంత అని యెవళ్ళేనా అడిగితే "సుమారు పదిలక్షల సంవత్సరాలు" అని మనం చెపుతాం.

మానవుడు యెక్కడ పుట్టాడు అనేది చెప్పడమూ కష్టాల్లోకల్లా కష్టమైంది.

మన కథానాయకుడి మామ్మ, మానవుడికీ, చింపాంజీ, గొరిల్లాలకీ ఉమ్మడిగా వున్న "శిలాజపు మామ్మ వానరం" అయిన మామ్మ యెక్కడ వుండిందీ కనిపెట్ట ప్రయత్నించాం. యీ వానరాన్ని శాస్త్రజ్ఞులు ద్రియొపిథెకస్ **(dryopithecus)** అని పిలిచారు. ఆవిడ ఆచూకీకోసం వెదుకుతూ వుంటే, చాలా మంది ద్రియొపిథెకస్‌లు వున్నట్టు బయటపడింది. కొన్ని జాడలు మధ్య యూరప్‌కీ, కొన్ని ఆఫ్రికాకీ, యింకొన్ని దక్షిణ ఆసియాకీ తీసికెళ్ళాయి.

దక్షిణ ఆఫ్రికాలో చాలా ఆసక్తికరమైనవి దొరికాయని తెలిసిన వాళ్ళు చెప్పారు. వెనకాల కాళ్ళమీద నిలబడి నడుస్తూ, అడివిలో కాకుండా బయలులో బతికిన వానరపు అవశేషాలు అక్కడ బయటపడ్డాయి.

పిథెకాంత్రపస్, సినాంత్రపస్ అవశేషాలు ఆసియాలో దొరికాయనీ, హీడెల్‌బర్గ్ దవడ యూరప్‌లో దొరికిందనీ అప్పుడు మనకి గుర్తుకొచ్చింది. అయితే మానవుడి జన్మస్థలం యేది? మానవుడు యే ఖండంలో పుట్టాడో చెప్పడం కష్టం, దేశం సంగతి సరేసరి.

రాతి పనిముట్లు దొరికిన ప్రతిచోటునీ పరిశీలిస్తూ వెదికితే మంచి దనిపించింది. మానవుడు నిజంగా మానవుడయింది తన పనిముట్లని చేసుకోవడం మొదలు పెట్టినప్పుడే కదా. యీ పని ముట్ల స్థావరాన్ని నిర్దేశించడం మానవుడి దర్శనం మొదటగా యెక్కడ అయిందో నిర్ధరించడానికి ఉపకరిస్తుంది.

ప్రపంచ పటం తీసుకుని యెక్కడెక్కడ చెకుముకిరాతి చేతి గొడ్డళ్ళు దొరికాయో ఆ చోట్లన్నిటినీ గుర్తుగా రాశాం. అలా రాస్తూ పోయేటప్పటి పటమంతా చుక్కలతో నిండిపోయింది. వాటిలో చాలా భాగం యూరప్‌లో వున్నాయి, కొన్ని ఆఫ్రికాలోనూ, ఆసియాలోనూ వున్నాయి.

దీనితో జవాబు తేటతెల్లమైంది: మానవుడు ఒకేసారి అనేక చోట్ల, ఒక్క చోటే కాకుండా, ఆవిర్భవించాడు.

అదీ బహుశా జరిగింది. మొత్తం మానవజాతి అంతా ఒక జత వానరాలనుంచి, ''ఆడమ్ వానరం'', ''ఈవ్ వానరం'' అనే జంటలాంటి వాటినుంచి, ఉద్భవించిందని ఒక్క క్షణం కూడా మనం వూహించలేం. ఏ ఒక్క ప్రాంతంలోని ఒక్క వానర సమూహపు చట్రంనుంచీ వానరుడినుంచీ నరుడి పరిణామం జరగలేదు. ఒక్కసారే యిది అనేక ప్రాంతాల్లో జరిగింది. రెండు కాళ్లమీదా నడవడం నేర్చుకుని, చేతుల్ని పనికి ఉపయోగించడం నేర్చుకున్న వానరాలు అన్ని చోట్లా వున్నాయి. అవి పనిచెయ్యడం మొదలెట్టగానే, ఒక కొత్త శక్తి ఆవిర్భవించింది. అది క్రమేపీ వాటిని మానవులకింద మార్చింది. ఆ శక్తే మానవ శ్రమ.

# మానవుడు కాలాన్ని ఆదా చెయ్యడం

ముడియినుమునీ బొగ్గునీ యెలా గనుల్లోనుంచి తవ్వితీస్తారో, నిప్పుని యెలా చేస్తారో ప్రతివాళ్లకీ తెలుసు.

కాని కాలాన్ని తయారు చెయ్యడం యెలా?

మానవుడు కాలాన్ని ఆదా చెయ్యడంద్వారా ''తయారు చెయ్యడం'' చాలా కాలం క్రితమే నేర్చుకున్నా యెవళ్లకీ దీని జవాబు తెలీదు.

అతను పనిముట్లు చేసుకోవడం మొదలుపెట్టినప్పుడు అతని జీవితం కొత్తదానితో నిండిపోయింది. అది నిజమైన మానవ వ్యాపకం — శ్రమ అనేది. కాని శ్రమ కాలాన్ని హరించేది. ఒక రాతి పనిముట్టుని చేసుకోవాలీ అంటే, మానవుడు ముందుగా మంచి రాతిని వెదుక్కోవాలి, దొరికిన ప్రతి రాయీ గొడ్డలి చేసుకోవడానికి పనికిరాదు కదా.

పనిముట్లకి పనికి వచ్చే శ్రేష్ఠమైన రాయి చెకుముకిరాయి. అది కఠినంగానూ ఘనంగానూ వుంటుంది. చెకుముకిరాళ్ల గుట్టలేం అడుగు పెట్టిన చోటల్లా దొరకవు, వాటి కోసం వెదుక్కోవాలి. మానవుడు చెకుముకిరాయి కోసం చాలా కాలం వెదకాల్సి వచ్చేది, తరుచుగా అతని ప్రయత్నం వృధా అయేది. దాంతోటి తనకి చేతనైనంత మేరకి ఘనత్వం తక్కువ వున్న చెకుముకినీ, యిసక రాయి, సున్నపు రాయీ లాంటి మెత్తటి పరికరాల్నీ కూడా ఉపయోగించుకోవాల్సి వచ్చేది.

అప్పుడు సరి అయిన రాయి దొరికేది. అయినా అదీ వూరికే రాయేగా. దాన్ని స్ట్రైకర్ అని పిలిచే యింకో రాతి పనిముట్టుతో చెక్కి ఒక రూపం వచ్చేటట్టు చెయ్యాలి. దానికీ వ్యవధిపడుతుంది. మానవుడి వేళ్లు యిప్పుడున్నంత చురుగ్గా నేర్పుగా అప్పుడుండేవి కాదు. అప్పట్లో అవి వూరికే పనిని నేర్చుకుంటున్నాయి. అందుకనే ముతక చేతిగొడ్డళ్లని చేసుకోడానికి అతనికి అంత వ్యవధి పట్టేది.

కాని యీ పని చేసే వ్యవధి యెక్కడిది అతనికి?

ఆదిమ మానవుడికి కాళీగా వుండే సమయం చాలా తక్కువ వుండేది. యీ వేళ అమిత వ్యాపకం వున్న మనిషికుండే దానికంటే తక్కువ కాళీ సమయం అతనికి వుండేది. పొద్దుటినుంచి రాత్రిదాకా అడివిలో మైదానాల్లో ఆహారం పోగుచేసుకోవడం కోసం, తనకీ తన పిల్లలకీ తిండి సంపాదించుకోవడం కోసం తిరగాల్సివచ్చేది. తిండానికి వీలైన ప్రతీదీ గుటకాయ స్వాహా అయేది. నిద్రకి మినహాయిస్తే మిగిలిన సమయమంతా తిండిని సంపాదించుకోడానికీ, తిండానికీ



రాతి పనిముట్టు. చేతిగొడ్డలి

సరిపోయేది. యెందుకంటే ఆదిమ మానవుడికి దొరికే ఆహారం పోషకంగా వుండేది కాదు, అలాంటిదేమో అతనికి బోలెడు అవసరం అయేది.

బెర్రీలూ, కాయలూ, నత్తలూ, ఎలకలూ, దుంపలూ, పురుగుడింభకాలూ యింకా అలాంటి టుప్‌టుప్ మనేవి అతని ఆహారం అయితే అతను యెంత తినాల్సి వుండేదో వూహించండి.

యిప్పుడు గడ్డిని, నాచునీ కొరుకుతూ, నములూ్త అడవుల్లో మేసూ్త వుండే లేళ్లమందలాగా మానవ మందలు ఒకచోటినుంచి యింకోచోటికి పోయాయి. కాని రోజంతా తిండి కోసమని వెదకడమూ, నమలడమూ చేస్తే మానవుడు యింక పనెప్పుడు చేస్తాడు?

అప్పుడు, పనికి అద్భుతమైన గుణం వుందని అతను కనిపెట్టాడు. అది అతని కాలాన్ని హరించడమే కాదు, అతనికి యెక్కువ కాలాన్ని మిగిల్చింది కూడా!

వేరే వాళ్లకి ఎనిమిది గంటలు పట్టే పనిని మీరు నాలుగ్గంటల్లో చేస్తే మీరు నాలుగ్గంటలని ఆదా చేసినట్లే కదా. మీరు చెయ్యగలిగిందానికి రెండింతలు వేగంగా మీ పనిని చెయ్యగల పనిముట్టుని మీరు తయారుచేసుకున్నారనుకోండి, మీరు సగం సమయాన్ని ఆదాచేసినట్టే.

ఆదిమ మానవుడు యీ ఆవిష్కరణ చేశాడు.

ఒక చెకుముకిరాయిని పదును చెయ్యడానికి అతనికి చాలా వ్యవధి పట్టేది. కాని ఆ పదునైన రాయి చెట్టు బెరడు కింది డింభకాలని సంపాదించడానికి పనికి వచ్చేది.

చెకుముకిరాత్తోటి ఒక కర్రని చెక్కడానికి చాలా వ్యవధి పట్టేది. కాని రుచికరమైన దుంపలు తవ్వుకోడానికీ, జంతువుల్ని చంపడానికీ యీ వాడిగా వుండే కర్రని వాడటం యింకా చాలా సులువుగా వుండేది.

ఆదిమ మానవుడు తనకీ తన పిల్లలకీ ఆహారం సంపాదించుకోవడమనే పనిని యిది సూక్ష్మం చేసింది, వేగవంతమయేట్టు చేసింది. పని చేసుకోడానికి యెక్కువ తీరికవచ్చింది. అతను తీరిక వ్యవధిలో తన పనిముట్లని, వాటిని యింకా వాడిగా, యింకా మెరుగ్గా వుండేట్టు అతను చేసుకున్నాడు. ప్రతి పనిముట్టూ యెక్కువ ఆహారం సంపాదించేది కాబట్టి, ఫలితార్థంలో యెక్కువ కాలాన్ని ఆదా చెయ్యడం అయేది.

వేట మానవుడికి చాలా తీరిక వ్యవధిని యిచ్చింది. మాంసం చాలా పోషకం కావడం ఒకటీ, అరగంట మాంసం తింటే రోజంతా ఆకలిలేకుండా సుష్టుగా వుండటం యింకొకటీ దీనికి కారణాలు. కాని మొదట్లో మనుషులకి చాలా తక్కువ మాంసం వుండేది. ఒక పెద్ద జంతువుని కర్రతోనో, రాయితోనో కొట్టడం కష్టమూనూ, ఎలకని మొత్తం గీసినా వచ్చే మాంసం తక్కువానూ.

మానవుడు యింకా నిజమైన వేటగాడు కాలేదు.

# మానవుడు ఆహారాన్ని పోగుజేసుకునేవాడు

మన రోజుల్లో ఆహారాన్ని పోగుజేసుకునేవాడుగా వుండటం సులభం. మీలో చాలా మంది అడవుల్లో బ్రెరీలూ, పుట్టగొడుగులూ యేరుకునే వుంటారు. గోధుమ రంగు పుట్టగొడుగు నాచునుంచి పొడుచుకురావడం గాని, ఎర్రటి పుట్టగొడుగుని గడ్డిలో చూడ్డంగాని యెంత తమాషాగా వుంటుంది! నాచులోకంటా లోతుగా పుట్టగొడుగు కాండంచుట్టూ మొదలంటా చెయ్యి పెట్టి దాన్ని జాగ్రత్తగా పీకడం యెంత తమాషాగా వుంటుంది!

కాని పుట్టగొడుగుల్నీ, కాయల్నీ యేరుకోవడమే మీ ప్రధానమైన వృత్తని కాసేపు వూహించుకోండి. మీకు అస్తమానూ మంచి తిండి దొరుకుతుందనుకుంటున్నారా? పుట్టగొడుగులని యేరడానికి వెళ్లారనుకోండి, ఒకో అప్పుడు బుట్ట పట్టనన్నిటిని, తట్టలోనుంచి ఒలికి పోయేటన్నిటిని మీరు యింటికి తెస్తారు. ఒకో అప్పుడు అడివి అంతా తిరిగినా అలసట తప్ప యేమీ మిగలక, బుట్టలో అడుగున యెక్కడో ఒక్క విరిగిపోయిన పుట్టగొడుగు తోటి మీరు యింటికి రావచ్చు.

మా పదేళ్ల వయసున్న స్నేహితురాలు పుట్టగొడుగులని యేరుకురావడానికి వెళ్లినప్పుడల్లా ''నేను వంద పుట్టగొడుగుల్ని తెస్తా'' అని గొప్పలు చెప్పేది.

కాని చాలా సార్లు ఆ పిల్ల ఉత్త చేతుల్తో యింటికి వచ్చేది. ఆ పిల్లకోసం యింటిదగ్గర వేరే తిండి యేదీ వుండకపోతే ఆకలికి మాడి చచ్చిపోయేదే.

యెన్నడో ఆ రోజుల్లో ఆహారం వెతికి పోగుచేసుకునే మానవుడికి జీవితం యింకా గడ్డుగా వుండేది. అతను ఆకలితో చచ్చిపోలేదూ అంటే యేది పడితే దాన్ని తినడానికి అతను బాధపడేవాడు కాకపోవడమూ, తిండికోసం వేటాడుతూ కాలం గడపడమూనే కారణం. చెట్లమీద కాపరం వుండే తన పూర్వుల కంటే బలంగానూ, స్వేచ్ఛగానూ వున్నా అతని పరిస్థితి దీనంగా వుండేది. వాస్తవానికి, అతను ఆకలికి సగం మాడి చచ్చిన జీవికంటే అధికుడేంకాదు.

యీలోపున ఒక భయంకరమైన విపత్తు భూమి స్వరూపాన్నే మార్చేస్తోంది.

# ప్రకరణం నాలుగు

## విపత్తు చేరువవుతున్నది

కారణాలేమిటో స్పష్టంగా తెలియవు కాని ఉత్తర ప్రాంత హిమం కదిలిపోయి దక్షిణం వైపుగా ప్రయాణించడం మొదలెట్టింది. మహా హిమనదాలు పర్వతాలనీ మైదానాలనీ ముంచెత్తేశాయి, కోనలని దున్నేశాయి, కొండల అంచుల్ని కత్తిరించేశాయి, శిఖరాల్ని విరిచేసి నలిపేశాయి, పగిలిన రాళ్ల గుట్టల్ని మోసుకుపోయాయి. హిమ సమూహాల్లో కరిగిన మంచు కల్లోల తరంగిణులు పుట్టడానికి కారణమైంది. అవి భూమిలో లోతైన కందకాలు తవ్వేశాయి. అక్కడ నదీ గర్భాలు యేర్పడ్డాయి.

దండయాత్ర చేసే ఒక మహా సైన్యంలాగా ఆ హిమం ఉత్తర దిశనుంచి పురోగమించింది. దారిలో పర్వత శిఖరాలనుంచీ, కొండ కనుమలనుంచీ హిమనదులు అందులో కలిశాయి.

సోవియట్ యూనియన్‌లోనూ, దాని యిరుగుపొరుగు దేశాల్లోనూ వున్న మైదానాల్లోని గండశిలల్లో హిమ ప్రవాహాల జాడలు మనకి కనిపిస్తాయి. కరేలియాలోని దట్టమైన పైన్ అడవుల్లో బ్రహ్మాండంగా నాచు కమ్మిన గండశిల హఠాత్తుగా తగులుతుంది. అది అక్కడికి యెలా వచ్చింది? హిమనది దాన్ని అక్కడ వదిలింది.

ఉత్తర ప్రాంతపు హిమనదులు దక్షిణంవైపు గతంలో కూడా ప్రవహించాయి. కాని అవి అంత లోపలి కంటా దక్షిణంవైపు చొచ్చుకుపోలేదు. రష్యాలో హిమనదులు వొల్గొగ్రాద్, ద్నెప్రొపెత్రోవ్‌స్క్ నగరాల దాకా పోయాయి. పశ్చిమ యూరప్‌లో జర్మనీలోని పర్వతమయ ప్రాంతాల దాకా పోయాయి, బ్రిటిష్ దీవుల్ని చాలా భాగం చుట్టేశాయి. ఉత్తర అమెరికాలో అవి మహా సరస్సుల్ని దాటిపోయాయి.

హిమనదాలు ముందుకి మెల్లిగా సాగాయి. ఆదిమ మానవుడు నివసించిన భూభాగానికి వాటి శీతశ్వాస తరవాత తగిలింది. ఏమైనా, సముద్ర జీవులే హిమపాతాన్ని మొదట అనుభవించాయి.

తీరప్రాంతాల్లో అప్పటికింకా వెచ్చగానే వుండింది. అడవులనిండా పొన్నపూలూ, మాగ్నోలియా పూలూ వుండేవి. మైదానాలమీద నిలువెత్తు గడ్డిలో మామత్‌లూ ఖడ్గమృగాలూ సంచరిస్తూ వుండేవి. కాని సముద్రాల్లోని నీరు యింకా చల్లగా అవుతుంది. సముద్రాల్లో నదులు ప్రవహించినట్టుగా ప్రవాహాలు ఉత్తర ప్రాంతపు హిమనదుల శైత్యాన్నీ, ఒకో అప్పుడు హిమ శకలాల్నీ కూడా మోసుకుని పోయేవి.

తీరప్రాంతపు మట్టిపొరలు ఉష్ణ సముద్రాలు శీత సముద్రాలైన కథని చెపుతాయి. నేలమీద ఉష్ణ ప్రియులైన జంతువులూ మొక్కలూ యింకా వుండే సమయంలో సముద్ర సంతతి మారడం మొదలెట్టింది. ఆనాడు యేర్పడిన మట్టిపొరని మనం అధ్యయనం చేస్తే చల్లని నీటిలోనే బతకగల మొలస్క్ (mollusks) పెంకులు మనకి కనిపిస్తాయి.

# అరణ్యాల యుద్ధం

హిమనదుల రాకడ స్పర్శ భూమికి తగిలింది.

అందులో వింత యేమీ లేదు తన అసలు స్థానంనుంచి ఆర్కిటిక్ కదిలిపోయి మెల్లిగా దక్షిణంవైపు పాకుతోంది! యిది ఉత్తర ప్రాంతపు తండ్రా, పైన్ అడవుల్ని అస్థిరం చేసి, వాటిని కూడా దక్షిణంవైపు గెంటేసింది.

తండ్రా తైగా (సూది ఆకుల చెట్ల అడవి) మీద బహిరంగ యుద్ధం ప్రకటించింది. తైగా వెనక్కి తగ్గాల్సి వచ్చి, పత్రభరిత అరణ్యాలని కమ్మడం ఆరంభించింది.

అరణ్యాల మహాయుద్ధం ఆరంభమైంది.

అరణ్యాలు కూడా ఒక దానితో ఒకటి యిప్పుడు యుద్ధంలోకి దిగుతాయి. ఉదాహరణకి ఫర్ చెట్లూ ఆస్ప చెట్లూ బద్ధశత్రువులు. ఆస్ప కేమో నీడపడదు, ఫర్ యేమో దాన్ని గురించి పట్టించుకోదు.

ఫర్ చెట్ల అడివిలో ఆస్ప్‌లు వుంటాయనుకోండి, అవి పిల్ల మొక్కలకంటే పెద్దగా వుండవు: దట్టంగా సూది ఆకులు పెరిగి నీడ వుండే ఫర్ చెట్లు వాటిని పెరగనియ్యవు. అడవులని కొట్టే వాళ్లు ఫర్ చెట్లని కొట్టేస్తే, ఆస్ప్‌లు మళ్లీ నవనవలాడుతూ జీవంతో తొణికిసలాడతాయి, చిగుళ్లు తొడుగుతాయి.

మళ్లీ అంతా మారడం మొదలెడుతుంది. నీడంటే యిష్టపడే నాచు మొక్కలు, ఫర్ చెట్ల మొదళ్ల దగ్గర పెరిగినవి, వాడిపోయి, చచ్చిపోతాయి. కొట్టడానికి అనువుకాకుండా చిన్నగా వుండిపోయిన ఫర్ చెట్లు ప్రభాత హిమానికి జబ్బు పడిపోతాయి. అవి వాటి తల్లులైన పెద్ద ఫర్ చెట్లున్నప్పుడు వాటి విశాలమైన ఛాయల్లో హాయిగా వుండేవి. కాని నిరాధారంగా ఒంటరిగా అయిపోగానే అవి చిక్కిపోయి, ఎదగడం మానేశాయి.

యిప్పుడు ఆస్ప్‌లు విజయం సాధించాయి. యిదివరలో శత్రు ఫర్ చెట్ల సూది ఆకుల్లోనుంచి దొంగ చాటుగా పడిన యెండ యిక్కడా అక్కడా పడితే దాన్నే దక్కించుకునేవి. ఫర్ చెట్లని కొట్టేశాక ఆస్ప్‌లే అడివికి రాజులైపోయాయి.

కొన్ని యేళ్లు గడిచేటప్పటికి ఒకనాడు శ్యామల ఫర్ అరణ్యం వున్నచోట తేజోవంతమైన ఆస్ప అడివి పెరిగిపోయింది.

కాని కాలం వేగమైంది. కాలం మహా నిర్మాణ కర్త. కొంచెం కొంచెంగా, అసలు గమనించకుండానే అరణ్య గృహాన్ని తిరిగి నిర్మిస్తుంది. ఆస్ప్‌లు యింకా యింకా నిటారుగా పెరుగుతాయి. దట్టంగా గుబురుగా వుండే వాటి శీర్షాలు యింకా యింకా దగ్గరగా పెరుగుతాయి. మొదట్లో సన్నగా జారిపోతూ వుండిన వాటి మొదళ్ల దగ్గర నీడ చిక్కగా, ముదురుగా తయారవుతుంది. ఫర్‌తోటి యుద్ధంలో ఆస్ప్‌లు నెగ్గాయి, కాని వాటి విజయంలోనే వాటి చేటు రాసి పెట్టి వుంది.

యే వ్యక్తీ తన నీడ వల్ల చనిపోడు. కాని చెట్లకి సంబంధించి తరుచుగా అలా జరుగుతుంది. కొమ్మలు విస్తరించుకున్న ఆస్ప్‌ల కింద చిన్న, కుంటుపడిన పిల్ల ఫర్ మొక్కలుండేవి. కాల క్రమేణా యీ పిల్ల శత్రువులు మళ్లీ జీవం పోసుకునేవి. రాలి పోయిన ఆస్ప ఆకుల దట్టమైన పసరం నేలని వెచ్చగా వుంచేది, త్వరలోనే నేల పిల్ల ఫర్‌ల గుబుర్లతో నిండిపోయేది. యిరవై యేళ్లల్లో ఫర్‌ల శిఖరాలు ఆస్ప శిఖరాల నందుకునేవి. అప్పటికి అడివిలో అన్నీ కలిసి వుండేది.

ఆస్ప్‌ల లేత ఆకుపచ్చ, ఫర్‌ల ముదురాకుపచ్చ శిఖరాల్తోటి తేడాగా గుర్తుగా వుండేది. ఫర్‌లు యింకా యింకా యెత్తు పెరిగేవి. కాల్రకమేణా వాటి మందమైన ఆకుపచ్చ సూది ఆకులు ఆస్ప్‌లమీద నీడని కమ్మేవి.

ఆస్ప్‌లకి అంతం ఆసన్నమైంది. అవి ఫర్ చెట్లనీడలో వాడిపోవడం మొదలెడుతున్నాయి. మళ్లీ ఫర్ చెట్లు అడివికి రాజులయ్యాయి. అవి పూర్వపు అధికారాన్ని తిరిగి సంపాదించుకున్నాయి.

మానవుడు తన గొడ్డలితోటి వాటి బతుకులతో జోక్యం కలగజేసుకునేటప్పటికి యీారకంగా అడవులు ఒకదానితో ఒకటి యుద్ధం చేసుకుంటున్నాయి.

కాని హిమయుగపు శీతం వాటి బతుకుల్తో జోక్యం చేసుకునేటప్పటికి అడవుల యుద్ధం యింకా తీవ్రం అయింది.

ఉష్ణప్రియులైన చెట్లని శీతం చంపేసి, ఉత్తర ప్రాంతపు అడవులకి మార్గం సిద్ధం చేసింది. పైన్ చెట్లూ, ఫర్ చెట్లూ, బర్చ్ చెట్లూ ఓక్‌లమీదా, వేపమీదా యుద్ధం ప్రకటించాయి. ఓక్‌లూ, వేపలూ వెనక్కి తగ్గాల్సి వచ్చింది. అలా చెయ్యడంలో అవి నిత్యహరితాలైన ఆఖరి పొన్నపూలనీ, మాగ్నోలియాలనీ, అత్తి చెట్లనీ ముంచేశాయి.

అతి గారం కుడిచిన, ఉష్ణప్రియులైన చెట్లు గాలులకీ చలికీ వెల్లడిగా వుండే మరుగులేని బయళ్లలో బతక లేకపోయాయి. దాంతోటి అవి విజేతలకి లొంగిపోయి చచ్చిపోయాయి.

వాటికి కాస్త నిలవనీడ దొరికిందల్లా పర్వతాల్లోనే. యింతట్లోకీ పర్వత శిఖరాలనుండి మిగిలిన హిమనదులు పర్వత తంగ్రడాలనీ, పర్వత ఫర్‌లనీ, వాటికి ముందు వున్న బర్చ్‌లనీ తమతో తీసుకువస్తూ కిందికి దిగిరావడం మొదలెట్టాయి.

యీ అరణ్యాల యుద్ధం చాలా వేల సంవత్సరాలు సాగింది. ఉష్ణప్రియులైన వృక్షాలు, ఓడిపోయిన సైన్యంలో కడపటివి, యింకా యింకా దక్షిణానికి వెనక్కిపోయాయి.

దండయాత్రీకులతోటి యుద్ధంలో అడవులు నాశనం అయిపోయినప్పుడు, అడవుల్లో వుండే జంతువుల గతి యేమ యింది?

యీ కాలంలో అయితే ఒక అడివి అగ్నికి ఆహుతి అయినా, దాన్ని కొట్టివెయ్యడం జరిగినా అందులో నివసిం చేవి కొన్ని చచ్చిపోతాయి, కొన్ని యెలాగో పారిపోతాయి. ఒక ఫర్ అడివిని కొట్టేస్తే అక్కడి స్థానిక జనాభా అయిన క్రాస్‌బిల్, కింగ్‌లెట్, తదితరమైనవి, అదృశ్యమైపోతాయి.

నీడగా వుండే ఫర్ అడివిలో, తమ పాత యిళ్లల్లో, మళ్లీ నూతన ఆస్ప్ అడివి మొదలవుతుంది. యితర పక్షులూ, యితర జంతువులూ తమ కొత్త యిళ్లల్లోకి మారిపోయాయి.

అలా చాలా యేళ్లకి మళ్లీ ఫర్ చెట్లు ఆస్ప్‌లని ఓడించినప్పుడు ఫర్ అడవి ఖాళీగా వుండదు: మళ్లీ దాంట్లోకి కింగ్‌లెట్లూ, క్రాస్‌బిల్లులూ, వాటి నేస్తాలూ చేరతాయి.

ఒక అడివి చస్తుంది, మళ్లీ పుడుతుంది; యేదో నానారకాల మొక్కలూ పోగయినట్టుగా కాదు, ఒక ఏకత వున్న సన్నిహితంగా అల్లుకున్న ప్రపంచంలాగా.

హిమయుగంలో జరిగింది కూడా అదే. ఉష్ణప్రాంతపు అడవులు అదృశ్యం అయినప్పుడు, వాటి జంతు సంతతి కూడా అదృశ్యం అయింది. మహాకాయం వున్న ఏనుగులూ, ఖడ్గమృగాలూ, హిప్పొపొటామస్‌లూ దక్షిణాదికి పోయాయి. మానవుడి గర్భశత్రువు అయిన కోరదంతాల పెద్దపులి ఆఖరికి చచ్చిపోయింది.

చాలా చాలా చిన్న జంతువులూ, పక్షులూ కూడా చనిపోయాయి లేకపోతే దక్షిణాదికి పారిపోయాయి.

ఒక గుహ గోడమీద చరిత్రాత్పూర్వపు కళాకారుడొకడు యీ మామత్ బొమ్మ గీశాడు



యింకోలా జరిగేందుకు లేదు. ప్రతి జంతువూ తన చిన్న ప్రపంచానికి, అడివికి పుస్తెముడి అయిపోయింది. అడివి ప్రపంచం కుప్పకూలిపోయినప్పుడు అక్కడ వాసం చేసేవి చాలా భాగం చనిపోయాయి.

చెట్లూ, పొదలూ, నిడుపాటి గడ్డీ వాడి పోయినప్పుడు, వాటి కింద దాంకుని, వాటివల్ల పోషణ పొందే జంతువులకి తిండిగాని, రక్షణగాని లేకుండా పోయాయి. యిలా గ్రాసభక్షణ చేస్తూ ప్రశాంతియుతంగా బతికే జంతువులు చచ్చిపోయినప్పుడు మాంసాహారులైన దుష్ట మృగాలు కూడా ఆకలికి మాడి చచ్చిపోయాయి.

''పోషక చక్రంలో'' చెట్టూ పట్టూలేనుకుపోయిన జంతువులూ, మొక్కలూ అన్నీ తమ అడివి చనిపోతూనే తామూ చనిపోయాయి.

అది, పూర్వం రోజుల్లో ఓడ మునిగిపోతూనే దాంతో బాటుగా తెడ్లువెయ్యడానికి వుండే బానిసలు కూడా మునిగి పోయినట్టుగా వుండేది. వాళ్లని గొలుసులతో తెడ్లకి కట్టేసేవాళ్లు!

ఏదో ఒక రకంగా బతకాలీ అంటే ఒక జంతువు దాని గొలుసుల్ని ఛేదించుకోవాలి. తను అలవాటు పడిందాని కంటే భిన్నమైన ఆహారం తినగలిగివుండాలి. తన గోళ్లనీ, దంతాలనీ మార్చుకోగలిగివుండాలి, పొడుగాటి బొచ్చును గాని, ఫర్‌ని గాని చలికి కాపుగా వుండేటట్టు పెంచుకోగలగాలి. వేరే మాటల్లో చెప్పాలంటే జంతువు మొత్తం మారిపోవాలి.

జంతువు మారడం యెంత కష్టమో మనకి తెలుసు. గుర్రం చరిత్రని గుర్తుకు తెచ్చుకోండి, యీనాడు మనకి తెలిసిన గుర్రంలాగా ఒకే గిట్ట రూపంలో వున్న ఒక కాలివాలు వున్నట్టు మారడానికి దానికి ఎన్ని లక్షల సంవత్సరాలు పట్టిందో.

ఒక దక్షిణాది జంతువుకి ఉత్తరాది అడివిలో బతకడం చాలా కష్టం.

అది చాలదన్నట్టుగా, ఉత్తరాది అడవుల్లో వుండే జడలు కట్టిన జంతువులు అడవులతోబాటుగా, దక్షిణాదికి వచ్చాయి: అవి ఉన్ని ఖడ్గమృగం, మామత్, గుహలో వుండే సింహం, గుహలో వుండే ఎలుగుబంటి. వీటన్నిటికీ కూడా ఉత్తరాది అడవే వాసం.

మందంగా, బొచ్చుతో వుండే వాటి చర్మాలు వాటికి పెద్ద నిధిలా వుండేవి. మామత్‌కీ, ఉన్ని ఖడ్గమృగానికీ చలంటే భయంలేదు. వాటికి దక్షిణాదిన వుండే బోడి ఏనుగులాగా, ఖడ్గమృగంలాగా, హిప్పొపొటమస్‌లాగా కాకుండా వెచ్చటి, బొచ్చు వున్న చర్మం వుండేది.

ఉత్తర ప్రాంతపు కొన్ని జంతువులకి చలిని తప్పించుకోడానికి యింకో భిన్నమైన దారి వుండేది: అవి గుహల్లో దాంకునేవి.

ఉత్తర ప్రాంతపు జంతువులకి నూతన అరణ్యంలో తిండి కోసం వెంపరలాడుతూ వెదుక్కోవాల్సిన అవసరం లేకపోయింది. కారణం యిది వాటి అడివే, వాటి ప్రపంచమే.

ఓడిపోయిన అడవుల్లోని జంతువులు ఉత్తర ప్రాంతపు నూతన అధినేతల్తోటి పోరాటంలోకి ప్రవేశించాల్సి వచ్చింది.

వాటిల్లో చాలా కొన్ని మాత్రమే గడ్డన పడ్డాయంటే మీరు ఆశ్చర్యపోతున్నారా?

మరి ఆదిమ మానవుడి సంగతి యేమిటి? అతని కేం జరిగింది?

ఆదిమ మానవుడు బతికి బయటపడ్డ వాటిల్లో వున్నాడు. మరి అతను కూడా నాశనం అయిపోయివుంటే మీరీ పుస్తకం చదువుతూ వుండరు కదా.

ఉష్ణ దేశాల్లో మనుషులు బతకడం కోసం చలితో పోరాటం చెయ్యాల్సి వచ్చేది కాదు, అక్కడి శీతోష్ణస్థితి కూడా చల్లబడినప్పటికీ.

తోసుకువచ్చే హిమనదాల మహాభీతిని అనుభవించిన మానవ ప్రాణులకి పరిస్థితులు యింకా అధ్వాన్నంగా వుండేవి.

ప్రతి యేడూ ఒక కొత్త శీతకట్టుని వాళ్ళు దర్శించేవాళ్ళు. అది భయంకరంగా వుండేది. వాళ్ళు వణికి గడ్డ కట్టుకు పోయేవాళ్ళు. తమనీ తమ పసికూనలనీ వెచ్చగా వుంచుకోవడం కోసమన్చెప్పి ఒకళ్ల కొకళ్లు దగ్గరసా ముడుచుకుపోయేవాళ్ళు.

ఆకలీ, భయంకరమైన మంచూ, క్రూర జంతువులూ వాళ్లని హతం చేసే బెదిరింపులుగా వుండేవి.

తమ చుట్టూతా జరిగేది వాళ్లకి అర్థమయే వుంటే యీ తొలి మానవులు ప్రపంచపు అంతం వచ్చిందని అనుకుని వుండేవాళ్లు.

# ప్రపంచపు అంతం

ప్రపంచపుటంతాన్ని గురించి చాలా సార్లు జోస్యం చెప్పారు.

మధ్యయుగాల్లో ఒక తోకచుక్క ఆకాశంలో జ్వాజ్వల్యమానంగా వుండే తన తోక జాడ గోచరింపచేస్తూ దూసుకు పోతే, జనం ప్రార్థన చేసి అనేవాళ్లు:

''మహా ప్రళయం జగంనిండా ప్రగల్భిస్తోంది.''

''కారు మృత్యువు'' అని పేరుమోసిన బుబోనిక్ ప్లేగు అంటువ్యాధి పట్టణాలనీ, గ్రామాలనీ మొత్తం వూడ్చి పెట్టేస్తే, శ్మశానాల ఆకలి తీరిస్తే, జనం అనే వాళ్లు:

''లయ కాలం సమీపించింది.''

కాని ప్రపంచం ఆఖరవలేదు.

ఆకాశంలో తోకచుక్క దర్శనం అవడం దుశ్శకునమే కాదని యివాళ మనకి తెలుసు. తోకచుక్క సూర్యుని

చుట్టూతా తన పరిభ్రమణంలో వుంటుంది. భూమ్మీద మూఢమానవులు తన గురించి యేమిటి అనుకున్నా దానికి అవగింజంత ఖాతరీ లేదు.

కరువుకాటకాలు, అంటువ్యాధులు, ఆఖరికి యుద్ధాలు అంటే కూడా ప్రపంచప్రళయం కాదని మనకి తెలుసు. ఆ ఉపద్రవానికి కారణం తెలుసుకోవడం అనేదే అసలు విషయం. మనకి కారణం తెలిస్తే ఆ విపత్తుని తప్పించవచ్చు.

యేమైనా, అమాయకులూ మూఢులూ మాత్రమే కాదు ప్రపంచప్రళయాన్ని గురించి జోస్యం చెప్పేవాళ్ళు. దీన్ని, మానవాళి అంతాన్ని కూడా జోస్యం చెప్పే శాస్త్రజ్ఞులు వున్నారు. వాళ్ళల్లో కొంతమంది అంటారు మానవాళి



గుహాకుడ్యంమీద గీసిన యీ ఖడ్గమృగ చిత్రం మనకి తెలిసిన ఖడ్గమృగం లాగా లేదు. దీనికి నిడుపాటి బొచ్చు ఆచ్ఛాదన వుంది

ఇంధనం కొరత వల్ల క్రమేపీ నశించిపోతుంది అని. బొగ్గు గనుల్లోని బొగ్గు తరిగిపోతోందనీ, అడవులు తగ్గిపోతున్నాయనీ, యిక రాబోయే కొద్ది శతాబ్దాలకీ సరిపడా చమురు నిక్షేపాలు వుండవనీ చెప్పి వాళ్ళు ఆ వాదనని రుజువు చెయ్యప్రయత్నిస్తారు. భూమ్మీద తగినంత ఇంధనం లేకపోతే ఫాక్టరీల్లో యంత్రాలు ఆగిపోతాయి, రైళ్ళు నడవవు, యిళ్ళల్లోనూ వీధుల్లోనూ దీపాలు వెలగవు. చాలా మంది జనం చలికీ ఆకలికీ తట్టుకోలేక చచ్చిపోతారు, యిక ఆ బతికే వాళ్ళేనా మళ్ళీ ఆటవిక అనాగరికులవుతారు అంటారు వాళ్ళు.

నిజంగా యిది భయంకరమైన భవిష్యత్తు!

కాని నిజంగా పరిస్థితులు యిలాగే వుంటాయా?

భూమిలో వుండే ఇంధన నిక్షేపాలు అక్షయమైనవి. కొత్త చమురు, బొగ్గు క్షేత్రాలని కనిపెడుతున్నారు, యింకా కనిపెట్టాల్సినవి యెన్నో వున్నాయి.

అడవుల్ని నరకడం మాత్రమే కాదు, కొత్తవాటిని యేటేటా నాటుతున్నారు కూడా.

సరేనండీ, ఒక వేళ ఇంధన నిక్షేపాలన్నీ ఒక నాటికి అయిపోయాయనుకుందాం. అయినా కూడా అది ప్రపంచప్రళయం అవుతుందా?

ఉహుం, కానేకాదు.

భూమ్మీద ఉష్ణానికీ, శక్తికీ ఇంధనం ఒకటే ఆధారం కాదు. ప్రధానమైన ఆధారం సూర్యుడు. ఇంధన నిక్షేపాలు నిండుకునేటప్పటికి సూర్యుడి శక్తినుంచి వీధుల్ని వెలిగించడం, రాత్రిళ్ళ యిళ్ళల్లో దీపాలు పెట్టడం, యంత్రాలనీ, రైళ్ళనీ నడపడం, ఆఖరికి వంట కూడా చెయ్యడం మన శాస్త్రజ్ఞులు కనిపెట్టేస్తారనే విషయం గురించి యీషణ్మాత్రం సందేహం మీకు వుండక్కర్లేదు. తొలి ప్రాయోగిక సూర్య – విద్యుత్ కేంద్రాలూ, సూర్య – కేంద్రపు వంట యిళ్ళూ యిప్పటికే వున్నాయి.

''అమ్మమ్మమ్మా, ఒక్క నిముషం ఆగండి'' అని భూమిని పాతి పెట్టాలనే తొందర వున్న వాళ్ళు అంటారు. ''యేం చెప్పినా సూర్యుడు కూడా కాలక్రమేణా చల్లబడిపోతాడు. కొన్ని నూతన నక్షత్రాలంత వేడిగా తేజోవంతంగా లేడు సూర్యుడు. వేలాది, లక్షలాది సంవత్సరాలు గడిచిపోతాయి, సూర్యుడి ఉష్ణోగ్రత తగ్గిపోతుంది, భూమి చల్ల బడిపోతుంది.

''మహా హిమనదులు భూమ్మీదనుంచి మానవుడి నీరసాకారాన్ని తుడిచిపెట్టేస్తాయి. ఉష్ణప్రాంతాల్లో ధృవ ప్రాంతపు యెలుగుబంట్లు సంచరిస్తాయి. మనుషులు యిక బతికి బట్టగట్టరు.''

అందులో సందేహంలేదు, ఒక నూతన హిమ యుగం మళ్ళీ మొదలైతే నిజంగా జీవితం చాలా భయంకరంగా వుంటుంది. అయినా ఆదిమ మానవుడు కూడా ఆ మంచునుంచి తప్పించుకుని బయటపడ్డాడు! భవిష్యత్తులో మానవులు (యివాళ కంటే శాస్త్రవిజ్ఞానం బాగా పెరిగే రోజున) మంచులో చచ్చిపోతారనే ఆలోచనే మనకి యెందుకు రావాలి?

వాళ్ళు తప్పకుండా చలిని జయిస్తారని మనం జోస్యం చెప్పచ్చు. సూర్యుడి శక్తికి పూరకంగా వుండేటట్టు వాళ్ళు అణుశక్తిని వాడతారు.

పదార్థపు న్యూక్లీలో వుండే అణుశక్తికి అంతేలేదు. ఉన్న సమస్యల్లా సురక్షితంగా దాన్ని యివతలికి తియ్యడమే.

ఏమైనప్పటికీ, అంత సుదూర భవిష్యత్తుని వదిలిపెట్టి, సుదూర గతానికి, ఆదిమ మానవుని దగ్గరకి మనం వెళ్ళడం మంచిది.

## నూతన ప్రపంచపు ఆరంభం

తన అడివి స్వస్థానానికి మానవుణ్ణి కట్టిపడవేసిన గొలుసుల్ని అతను తెంచుకోకపోయివున్నట్లయితే, అరణ్య ప్రపంచపు అంతమే మానవుడికీ అంతం అయివుండేది.

కాని ప్రపంచం అంతమవలేదు, అది మారుతోందంతే. పాత ప్రపంచం సమాప్తమవుతోంది, నూతన ప్రపంచం ఉదయిస్తోంది.

యీ నూతన, మారిన ప్రపంచంలో బతకాలంటే మానవుడూ మారాల్సివచ్చింది. అతను తినడానికి అలవాటు పడిన తిండి మృగ్యమైంది. అతను నూతనమైన, భిన్నమైన ఆహారాన్ని వెదుక్కోవాల్సి వచ్చింది. పైన్, ఫర్ కాయలు అతని పళ్ళకి చాలా గట్టివి, దక్షిణాది అడవుల్లో వుండే మెత్తటి, రసభరితమైన పళ్ళలాంటివి కాదు.

వెచ్చని రోజులు చలి తిరిగాయి. సూర్యుడు భూమిని మరిచిపోయినట్టైంది, ప్రజలు సూర్యుని ఉష్ణ, తేజో వంతమైన కాంతి లేకుండా బతకవలసివచ్చింది.

వాళ్లు యెంత వేగంగా వీలైతే అంత వేగంగా మారాల్సివచ్చింది!

సజీవులైన వాటన్నిటిలోకీ ఆదిమ మానవుడే వేగంగా మారగలిగిన శక్తి వున్నవాడు.

ఆ సమయానికే అతను మిగిలిన యే జంతువూ మారలేనంతగా మారడం నేర్చుకున్నాడు.

మానవుడి గర్భశత్రువు అయిన కోరపళ్ల పెద్దపులి వున్న పళంగా నిడుపాటి, వున్ని చర్మం పెంచుకోలేకపోయింది, కాని మానవుడు పెంచుకోగలిగాడు: అలా చెయ్యడానికి అతను ఒక ఎలుగుని చంపి దాని చర్మాన్ని ఒలుచుకోవలసి వచ్చిందంతే.

కోరపళ్ల పెద్దపులి నిప్పుని తయారు చేసుకోలేకపోయింది, కాని మానవుడు చేసుకోగలిగాడు. అతనికి నిప్పుని ఉపయోగించడం అప్పటికే తెలుసు.

ఆదిమ మానవుడు తనంతటతను మారగలగడానికీ, కొంతమేరకి ప్రకృతిని మార్చడానికీ చాలా పురోగమించాడు.

యిప్పటికి యెన్నో వేల యేళ్లు గడిచిపోయినా, చరిత్రాత్పూర్వపు మానవుడు ప్రకృతిలో దేన్ని మార్చిందీ, తనే యెలా మారిందీ మనం యింకా దర్శించగలం.

## రాతిపుటల పుస్తకం

మన కాలికింది భూమి బ్రహ్మాండమైన పుస్తకం లాంటిది.

భూమి పొర ప్రతి అంతరం, ప్రతి నిక్షేపపు దొంతర యీ పుస్తకంలోని ఒకో పుట.

యీ పుటలన్నిటికీ పైన వుండే పొరమీద మనం వుంటున్నాం. మొట్టమొదటివి సముద్రపు అగాధాల దిగువున వుంటాయి. అవి సముద్రపు అడుగున పాతాళంలో వుంటాయి, ఖండాల పునాదుల దగ్గర వుంటాయి.

ఆధునిక మానవుడు యీ పుటల్ని, యీ పుస్తకంలోని మొదటి ప్రకరణాల్ని యింకా అందుకోలేదు. మనమింకా అక్కడేం రాసి వున్నదీ వూహించగలమంతే.

పుటలు యెంత దగ్గరగా చివరివాటికి సన్నిహితంగా వుంటే చదవడం అంత తేలిక.

అగ్నిపర్వత లావాల వాగులతోటి మకిలి అయిపోయి, రూపు వికారమైపోయిన కొన్ని పుటలు భూమి ఉపరితలం మీద పర్వత హారాలు యెలా కమాను కట్టేవో మనకి తెలియజేస్తాయి.

సముద్రాల్ని చెలియలి కట్టమీదకి తోసేసి, మళ్లీ వెనక్కి గెంటేసి భూమి పైపొర యెలా ఉబికి, చప్పబడిందో కొన్ని పుటలు తెలియజేస్తాయి.

సముద్రపు గుల్లలంత తెల్లగా, వాటితోటే తయారైన పుటల దొంతర్లూ వున్నాయి, బొగ్గంత నల్లగా వుండే పుటలూ వున్నాయి.

అవి నిజంగా బొగ్గుతో తయారైనవే. వాటి నల్లని రాశి ఒకప్పుడు భూమ్మీద పెరిగిన బ్రహ్మాండమైన అడవుల కథని చెపుతుంది.

తర్వాత బొగ్గుగా మారిన గుబురులో ఒకనాడు బతికిన జంతువు అస్థిపంజరంది గాని, ఆకుది గాని ముద్ర, పుస్తకంలోని బొమ్మలాగా, యిక్కడా అక్కడా మనకి కనిపిస్తుంది.

ఆ రకంగా ఒక పుటనుంచి యింకోపుటకి పోతూ మనం భూమి చరిత్రని చదవగలం. ఆఖరి పుటల్లో మాత్రమే, పుస్తకం చివర్లో మాత్రమే మనం నూతన నాయకుణ్ణి — మానవుణ్ణి, సమీపిస్తాం. మొదటో యెవళ్లేనా గానీ అతను యీ బృహత్తర గ్రంథంలో ప్రధాన పాత్రధారి కాదని అనుకోవచ్చు, పురాతన కాలపు యేనుగుతోటీ, ఖడ్గమృగంతోటీ పోలిస్తే అతను అంత నలుసులాగా వుంటాడు కాబట్టి. మనం చదివే కొద్దీ మన నూతన నాయకుడు ధైర్యం పుంజుకుని, మొదటి వరసకి పురోగమించడం చూస్తాం.

మానవుడు యీ బృహత్తర గ్రంథపు ప్రధాన పాత్రధారే కాకుండా, వాటి రచయితల్లో ఒకడుగా వుండే కాలం కూడా వస్తుంది.

నది యెత్తైన గట్టు నిలువుకోత పటం చూడండి. హిమ యుగపు పొరల్లో స్పష్టంగా గీసిన నల్ల చార మనకి కనిపిస్తుంది.

యీ నల్ల చార బొగ్గువల్ల యేర్పడింది. యిసుక, మట్టి మధ్యలో వున్నట్టుండి బొగ్గు పొర యెలా వచ్చింది? ఏదన్నా అడివి ఆహుతైందా?

కాని అడివిలోని అగ్ని కలపని మాడిస్తే విశాలమైన పొర యేర్పడుతుంది, కాని బొగ్గు చార చాలా సన్నటిది. ఏదో విడిది మంటవల్ల అలాంటి చిన్న బొగ్గు పొర యేర్పడవచ్చంతే.

మానవుడు మాత్రమే విడిది మంట వేసుకోగలవాడు.



దీనికితోడు, విడిది మంటకి దగ్గర్లోనే మానవుడి చేతులు చేసిన యితర పని జాడలు మనకి కనిపిస్తాయి: రాతి పనిముట్లు, వేటలో చంపిన జంతువుల విరిగిపోయిన యెముకలు.

హిమ యుగం ప్రవేశించగానే మానవుణ్ణి రక్షించింది నిప్పూ, వేటానూ.

## మానవుడు అరణ్యాల్ని వదిలిపెడతాడు

కఠోరమైన ఉత్తర ప్రాంతపు అడవుల్లో ఆనాటి మానవుడికి యే ఆహారమూ లేకుండా పోయింది. దాంతోటి

బొగ్గు పొరల్లో ఫెర్న్ మొక్కల ముద్రణలు వున్నాయి

అతను వేటకోసం అడవుల్లో సంచరించడం మొదలెట్టాడు. అవి యెవళ్లో వచ్చి తమని అంది పుచ్చుకుంటారని ఒక చోట పడివుంటాయా? పరిగెత్తి పారిపోయేవి, దాంకుని ఎదురు తిరిగేవి.

ఉష్ణ దేశాల్లో కూడా మానవుడు యింకా యింకా యెక్కువగా తన ఆహారంలో మాంసం వుండేట్టు చేసుకో మొదలెట్టాడు.

మాంసం కడుపు నింపేది, ఎక్కువ శక్తినిచ్చేది, పని చేసుకోవడానికి యెక్కువ తీరికని యిచ్చేది. మానవుడి పెరిగే మెదడుకి మరింత పోషక ఆహారం అవసరం అయింది.

మానవుడి పనిముట్లు మెరుగయేకొద్దీ, అతనికి వేట ముఖ్యమైంది.

వేటలేకుండా ఉత్తరాన బతికి బట్టకట్టడం అసాధ్యం.

ఎలకల్లాంటి చిన్నాచితకా వాటితో మానవుడి ఆకలి తీరేది కాదు, యింకా పెద్ద వేట కావాల్సివచ్చేది. గాఢమైన మంచు మేటలు, కన్ను మిన్ను కనిపించని మంచు తుఫాన్లూ, పొగమంచులూ ఉత్తరారణ్యాల్లో వేటాడ్డం కష్టం కావించేవి. దాని ఫలితం యేమిటీ అంటే మానవుడు మాంసాన్ని నిలవ వుంచుకోవాల్సి రావడం.

ఆదిమ మానవుడు యెలాంటి జంతువుల్ని వేటాడేవాడు?

అప్పట్లో అడవుల్లో పెద్ద జంతువులు చాలా వుండేవి. బయళ్లలో లేళ్లు మేసేవి. అరణ్యంలో అడివి పందులు నేలని తవ్వేవి. మైదానాల్లో యింకా యెక్కువ పెద్ద జంతువులు వుండేవి. విశాలమైన ఆరుబయళ్లలో బొచ్చుపెరిగిన అడివి గుర్రాల మందలు మేస్తూ వుండేవి. అడివిదున్నలని పిలిచే మూపురాలు వున్న జంతువులు నేలని కంపింపజేస్తూ విపరీతమైన వేగంతో ఫెళఫెళార్భటులతో పరిగెత్తిపోయేవి. పొడవాటి జూలు వున్న విపరీత ఆకారపు మామత్‌లు కదిలే పర్వతాల్లా ఉరుములు ఉరిమినట్లు పోయేవి.

ఆదిమ మానవుడికి సంబంధించినంత వరకూ యిదంతా కదిలే, తప్పించుకుపోయే మాంసమే, తమని అనుసరించమని అతన్ని పురికొల్పుతూపోయే ఎరలే.

అంచేత, ఆహార సంపాదనలో, ఆనాటి మానవుడు తన స్వస్థలమైన అడవులని వదిలిపెట్టాడు.

మానవులు మైదానాల్లోకి యింకా యింకా విస్తారంగా చొచ్చుకుపోయారు. ఆహారాన్ని యేరుకునే మానవుడు యెన్నడూ బతికి యెరగని, యింతకు ముందెన్నడూ బతకని చోట్లలో విడిది మంటల జాడలూ, వేట విడిదుల స్థలాల జాడలూ, అడవులకి దూరంగా మనకి కనిపిస్తాయి.

## మాటను సరిగ్గా గ్రహించడం నేర్చుకోవాలి

ఆదిమ మానవుడి విడిది స్థలాల్లో వేటలో చంపిన జంతువుల ఎముకలు కనిపిస్తాయి. వాటిల్లో గుర్రాల పసుపు రంగు తిరిగిన పక్కటెముకలు, కొమ్ములు తిరిగిన ఎద్దుల పుర్రెలు, అడివి పందుల వంపులు తిరిగిన కోరలు వున్నాయి. ఒకో అప్పుడు ఎముకల పెద్దపెద్ద గుట్టలుండేవి. అంటే మానవుడు చాలా కాలందాకా ఒకే చోట వున్నాడన్న మాట.

అడివి దున్న, అడివి పంది, గుర్రం వీటి ఎముకల మధ్యలో ఒకొక్కప్పుడు మామత్ విపరీత కాయపు యెముకలు

కనిపించడం ఆసక్తికరమైంది. పెద్ద పుర్రెలు, పొడుగ్గా వంపులు తిరిగిన దంతాలు, ఇనప చక్రాలని పోలిన పళ్ళూ, శరీరంనుంచి ఛేదించిన బ్రహ్మాండమైన అంగాలూనూ అవి.

అలాంటి విపరీతమైన జంతువుని చంపడానికి ఖాయంగా చాలా శక్తీ సాహసమూ అవసరం! దాని శరీరాన్ని ఖండాలుగా చెయ్యడానికీ, వాటిని తాము మకాం వున్న చోటికి లాక్కుపోవడానికీ యింకా యెక్కువ శక్తి కావాలి. ఒకో కాలూ దగ్గర దగ్గర టన్ను బరువుండేది. పుర్రె యెంత పెద్దదంటే దాంట్లో మనిషి నుంచోవచ్చు.

ప్రత్యేకమైన రైఫిళ్లూ వగైరా ఆయుధాలున్న యీనాటి వేటగాళ్లే మామత్‌ని సులభంగా చంపలేరు. కాని ఆదిమ మానవుడికి రైఫిళ్లు లేవు. అతనికి వున్నదల్లా చెకుముకిరాతి చాకూ లేకపోతే రాతి కొన యీటె.

వేలాది సంవత్సరాల కాలంలో చెకుముకిరాతి పనిముట్లు మార్పుకి గురయి, యింకా మెరుగ్గా, అనేక రకాలుగా తయారయ్యాయి. ఆనాటి మానవుడు చెకుముకిరాతి చాకునో, బాణపు కొననో యీ విధంగా చేసేవాడు. మొదటగా రాతి పైపొరని చెక్కేవాడు. అప్పుడు బొడిపెలని చిదిమేసేవాడు, దాన్ని ముక్కల కింద విరగ్గొట్టేవాడు. ఆఖరికి యీ ముక్కల్ని తనకవసరమైన కోత పరికరంగా చేసుకునేవాడు.

చాకుని తయారు చెయ్యాల్సివస్తే చెకుముకిరాయి లాంటి 'ముడి పదార్థం' నప్పుదు. అలాంటిదాంతో చెయ్యాలంటే చాలా నేర్పు కావాలి. అందుకనే ఆదిమ మానవుడు వాడకం అయిపోయాక చెకుముకిరాతి పనిముట్టుని విసిరి



నిర్జన ద్వీపంమీద రాబిన్‌సన్ క్రూసో







చరిత్రాత్పూర్వపు కళాకారుడు గీసిన మామత్, అడివిదున్న, గుర్రం

అవతల పారెయ్యకుండా, దాన్ని అపురూపంగా దాచుకుని, యెప్పుడు అది మొద్దు బారిపోయినా దాన్ని పదును పెట్టుకుంటూ వుండేవాడు. మానవుడు తన పనిముట్లని ప్రాణప్రదంగా చూసుకునేవాడు, యెందుకంటే అతను తన శ్రమనీ, కాలాన్నీ మన్నించేడు కనక.

కాని తను యెంత ప్రయత్నించినా, రాయి రాయే కదా. మామత్ లాంటి జంతువుని యెదిరించాలంటే యీ మొన యెందుకు పనికొస్తుంది? ఒక యుద్ధ టాంకర్‌ని ఉక్కుకవచం కాపాడినట్టుగా దాని దళసరి చర్మం దాన్ని కాపాడేది.

అయినా ఆదిమ మానవుడు మామత్‌లని చంపాడు. అనేక విడిది స్థలాల్లో దొరికిన మామత్ పుర్రెలు, దంతాలూ దీనికి ఆధారం.

శిలాజ మానవుడు మామత్‌ని యెలా యెదిరించాడు? ''మానవుడు'' అంటే ''మనుషులు'' అని గ్రహించ గలిగిన వాళ్లకి యిది అర్థం అవుతుంది? ఒక మనిషి తనకి తానుగానే కాదు, తమ చేతులూ, బుర్రలూ కలిపి యెలా పనిముట్లు చెయ్యాలో, వేటాడాలో, నిప్పుచేసుకోవాలో, రక్షణలు కల్పించుకోవాలో, నేల దున్నాలో నేర్చుకున్న మనుషులందరూనూ. ఒక్క మానవుడే కాదు, అసంఖ్యాక మానవాళి పరిశ్రమద్వారా సంస్కృతి, శాస్త్రవిజ్ఞానం సృష్టి అయ్యాయి.

ఒక్క మానవుడే ఒంటరిగా వుంటే అడివి జంతువుగానే వుండేవాడు.

సమష్టి శ్రమ అనేదే పశువుని మానవుడిగా మార్చింది.

ప్రాచీన కాలపు వేటగాణ్ణి పట్టుసడలకుండా అభివృద్ధి సాధించేదాకా పనిచేస్తూవుండిన తొలినాటి రాబిన్‌సన్ క్రూసో మాదిరి చిత్రించే పుస్తకాలు వున్నాయి.

కాని ఆదిమ మానవుడు నిజంగా సన్యాసి అయివుంటే, మనుషులు గొప్ప మందల్లో కాకుండా కుటుంబాలుగా వుండివుంటే వాళ్లు మనుషులు అయివుండేవాళ్లు కారు, మానవ సంస్కృతిని నిర్మించి వుండేవాళ్లు కారు.

డేనియల్ డెఫో చిత్రించినట్టు రాబిన్‌సన్ క్రూసోకి భవిష్యత్తు లేదు. ఓడమీద తిరుగుబాటుని ప్రేరేపించిన నావికుని నిజజీవితంమీద ఆధారపడి డెఫో తన పుస్తకం రాశాడు. సముద్ర మధ్యంలో ఒక నిర్జనమైన చిన్న దీవిమీద అతన్ని అతని కర్మకి వదిలేస్తారు. చాలా సంవత్సరాల తర్వాత సముద్ర సాహసిక ప్రయాణీకులు కొంతమంది ఆ దీవిమీదకి వచ్చి పరమ ఆటవికంగా వున్న అతన్ని చూస్తారు. ఆ ముసలి నావికుడు మాట్లాడ్డం మర్చిపోయాడు, మనిషి కంటే యెక్కువగా అడివి జంతువులాగా వున్నాడు.

ఒంటరిగా వుండటం ఆధునిక మానవుడికే కష్టంగా ఉంటే ఆదిమ మానవుడి సంగతి చెప్పేదేముంది!

వాళ్లని మానవులలాగా వుంచిన విషయం యేమిటీ అంటే వాళ్లు కలిసి జీవించారు, కలిసి వేటాడుకున్నారు, కలిసి తమ పనిముట్లు తయారుచేసుకున్నారు.

ఒక మామత్‌ని వేటాడేటప్పుడు మానవ మంద అంతా పాల్గొనేది. ఒకటి కాదు డజన్ల కొద్దీ బల్లేలని దాని మీదకి విసిరేవారు. సహస్రపాద, సహస్ర హస్త ప్రాణి లాగా మానవ మంద మామత్‌ని వెంటాడేది. డజన్ల కొద్దీ చేతులే కాదు, డజన్ల కొద్దీ బుర్రలు కూడా కలిసి పనిచేసేవి.

మామత్ మానవుల కంటే ఆకారంలో పెద్దగా, బలంగా వున్నప్పటికీ మనుషులు యెక్కువ తెలివైనవాళ్లు.

మామత్ యెంత పెద్దదంటే ఒక మనిషిని అది అవలీలగా తొక్కి చంపేసేది. కాని ఆదిమ మానవుడు దాని బరువుని దానిమీదకే తిప్పేసి, నడుస్తూవుంటే భూమిని కంపింపచేసే ఆ విపరీతమైన జంతువుని ఓడించేవాడు.

వేటగాళ్లు మామత్‌ని చుట్టిముట్టినప్పుడు గడ్డిని అంటించేసేవాళ్లు. ఆ జంతువు మంటలకి భీతావహం యెత్తిపోయేది. దాని బొచ్చు కోటు పొగలు చిమ్ముతూ మంటల్లో చిక్కుకునేది, మంట తరుముతూ వుంటే అది ఒకటే పరుగు లంకించుకునేది. ఆ మంట దాన్ని తిన్నగా ఒక వూబిలోకి పడేసేది, సరిగ్గా వేటగాళ్లు యుక్తిగా పన్ని నట్టే. అక్కడ అది బండలోనూ బురదలోనూ టన్నులాది యిటుకల్లాగా దిగబడి పోయేది. ఆ వూబిలోనుంచి ఒక కాలు తర్వాత మరో కాలు తీసే ప్రయత్నంలో భేరే మోగినట్టు అరిచేది. అలా చేసే కొద్దీ అది యింకా వూబిలోకి కూరుకుపోయేది.

అప్పుడు వేటగాళ్లు దాన్ని చుట్టుముట్టి చంపేసేవాళ్లు.

మామత్‌ని బోనులో చిక్కించి చంపడం సులభమైన పని కాదు. దాన్ని విడిది స్థలానికి లాక్కెళ్లడం యింకా కష్టమయ్యేది. ఆ స్థలమూ మామూలుగా ఎత్తుగా, పొడిగా వుండే నది ఒడ్డున వుండేది. నదిలో తాగడానికి నీళ్లు వుండేవి, మిట్టల్లో వాళ్ల పనిముట్లన్నిటికీ మూలాధారమైన చెకుముకిరాయి దొరికేది.

అంచేత వూబినుంచి యెత్తైన నదిగట్టుకి వాళ్లు మామత్‌ని లాక్కుని వెళ్లాల్సి వచ్చేది.

యిక్కడ కూడా మళ్లీ రెండు చేతులు కాదు, డజన్ల కొద్దీ చేతులు పనిలో వుండేవి. ఆ మనుషులు మామత్ మాంసం గీకడానికీ, కొయ్యడానికీ, దాని దళసరి చర్మాన్ని కొయ్యడానికీ, బిగుతైన నరాలనీ కండరాలనీ కొయ్యడానికీ

వాడిగా వుండే రాతి పనిముట్లు వాడేవాళ్లు. అనుభవజ్ఞులైన పెద్ద వేటగాళ్లు తలనీ కాళ్లనీ వేర్పాటు చెయ్యడానికి యెక్కడ కొయ్యాలో కుర్రకారుకి నేర్పేవాళ్లు. ఆఖరికి ఆ కళేబరాన్ని ఖండఖండాలుగా చేసింతర్వాత తమ ప్రస్థానం మొదలెట్టే వాళ్లు.

తమ పని వేగంగా అవడానికి కేకలువేస్తూ, వాళ్లు గుంపుగా గుమిగూడి బొచ్చు వున్న పెద్ద కాలిని లాగుతూనో, పొడుగాటి తొండం వుండి నేలమీద వూగిసలాడే దాని తలని లాగుతూనో యింటి దారి పట్టేవాళ్లు.

అలిసిపోయి, చచ్చినంత పనయి వాళ్లు మకాం చేరేవాళ్లు. యింక చూడాలి అక్కడి సంబరం! మామత్ అంటే నిజమైన విందు, యెంత కాలంగానో తాము యెదురుచూస్తూ వున్న విందు, అని వాళ్లకి తెలుసు. మామత్ అంటే చాలా చాలా రోజులకి సరిపడా ఆహారపు నిల్వ అని వాళ్లకి తెలుసు.

## పోటీ అంతం

మిగతా జంతువులతోటి మానవుడి పోటీ అంతమైంది. అతనే అన్ని జంతువుల్లోకీ అతిపెద్దదాన్ని జయించి పందెంలో బద్దీ దాటేడు.

భూమిమీద మనుషుల సంఖ్య త్వరగా పెరగ నారంభించింది. ప్రతి వెయ్యి సంవత్సరాలకీ, ప్రతి వంద సంవత్స రాలకీ భూమ్మీద యింకా యింకా యెక్కువ జనాభా పెరిగి ఆఖరికి ప్రపంచ మంతటా మానవులే అయారు.

మానవాళికి జరిగింది మిగతా జంతువులకి ఎన్నటికీ జరిగి వుండదు.

ఉదాహరణకి కుందేళ్లు మానవులంత సంఖ్యలో వుండగలవా? ఉండలేవు. ఎందుకంటే కుందేళ్ల సంఖ్య పెరిగిందీ అంటే తోడేళ్ల సంఖ్య కూడా పెరుగుతుంది. మరి తోడేళ్లు కుందేళ్లని యెక్కువ సంఖ్యలో మిగల్చవు కదా!

కాబట్టి వన్య మృగాల సంఖ్య అదుపు లేకుండా పెరుగుతూ వుండదు. దానికి ఒక పరిమితి వుంది. దాన్ని దాటడం వాటికి చాలా కష్టం.

ప్రకృతి జంతువులకి వుంచిన హద్దుల్ని మానవుడు యెన్నడో దాటేశాడు. అతను పనిముట్లు చేసుకోవడం నేర్చు కున్నప్పుడే అంతకు ముందెన్నడూ తిని యెరగని ఆహారరకాలు తినడం మొదలెట్టాడు, ఆ రకంగా ప్రకృతిని తనకి సానుభూతిగా వుండేటట్టు చేసుకున్నాడు. ఒక మానవ మంద ఆహారాన్వేషణ చేసే తావుల్లో, రెండు మూడు మానవ మందలు వుండటం మొదలైంది.

పెద్ద జంతువులని వేటాడ్డం మొదలెట్టినప్పుడు, యెల్లల్ని యింకా యింకా విస్తృతం చేశాడు.

యిప్పుడు మానవుడు తిండానికి మొక్కలకోసం వెదుక్కుంటూ రోజంతా మెయ్యనవసరం లేదు, అడివి దున్నలూ, గుర్రాలూ, మామత్‌లూ మానవుడికి బదులుగా మేసేవి. యీ చతుష్పాత్తుల మందలు పచ్చిక మైదానాల్లో తిరిగి గుట్టలు గుట్టలు గడ్డిని మేసేవి. అవి రోజురోజుకీ టన్నులకొద్దీ తిన్న గడ్డిని పౌన్ల కొద్దీ మాంసంకింద మార్చేసుకుని బరువెక్కిపోయేవి. మానవుడు ఒక అడివి దున్ననో, మామత్‌నో చంపినప్పుడు యెన్నో యేళ్లుగా పోగైన శక్తికి అతను వారసుడయేవాడు.

అతనికి యీ శక్తి నిలవలు చాలా అవసరమయేవి, యెందుకంటే అతను తుఫానులోనూ, హిమపాతంలోనూ,

తీవ్రమైన చలిలోనూ వేటకి వెళ్లలేకపోయేవాడు. శీతకట్టులోనూ, వేసవిలోనూ హాయిగా వెచ్చగా వుండే రోజులు అయిపోయాయి.

ఏమైనా ఒక మార్పు యింకో మార్పుకి దారితీసింది.

మానవుడు నిలవలదగ్గరే వుండాలంటే అతను ఒకేచోట యెక్కువ కాలం గడపాలి, అంటే మకాం ఛిద్రం చేసుకోవడం అతనికి యింకా కష్టం. తనతో కూడా మామత్ కళేబరాన్ని మోసుకుపోలేడు కదా.

అతను స్థిరపడడానికి వేరే కారణాలు కూడా వున్నాయి. పూర్వం రోజుల్లో ప్రతి చెట్టూ అతనికి ఒక రాత్రికి స్థావరం అయిందే, అతన్ని వన్యమృగాలనుంచి కాపాడేది. యిప్పుడు యీ మృగాలంటే అంత భయమూ లేదు. కాని అతనికి కొత్త శత్రువు దాపురించింది, అది చలి.

చలినుంచీ, హిమపాతాల బారినుంచీ కాపాడుకోవాలంటే కొంచెం నమ్మకమైన స్థావరం చూడ్డం అవసరమైంది.

# మానవుడు తన ప్రపంచాన్ని నిర్మించుకుంటాడు

తన చుట్టూతా వుండే శీతల ప్రపంచం మధ్యలో మానవుడు తన చిన్న వెచ్చటి ప్రపంచాన్ని నిర్మించుకునే సమయం వచ్చింది. ఎక్కడో్నే గుహాముఖం దగ్గర్నో, కొండచివర అటకలా చొచ్చుకువచ్చిన చోటనో అతను జంతువుల చర్మాలతోటీ, కొమ్మలతోటీ చాందినీలా కట్టుకునేవాడు, వానా మంచూ, గాలీ తగలకుండా. తన చిన్న ప్రపంచం మధ్యలో రాత్రిళ్లు వెలుతురుగా వుండటానికీ, శీతాకాలంలో వెచ్చగా వుండడానికీ ఒక సూర్యుణ్ణి వెలిగించుకున్నాడు.

కొన్ని ఆదిమ కాలపు వేటగాళ్ల విడిదుల్లో డేరాల కర్రలకి తవ్విన గుంటల జాడలు యింకా వున్నాయి. కర్రల వలయపు మధ్యలో పొయ్యి చుట్టూతా ఒకనాడు వుండి మసిబారిపోయిన రాళ్లు వున్నాయి. ఆ పొయ్యే ఆనాటి మానవుని కృత్రిమ సూర్యుడు.

యీ కుటీరపు గోడలు యెనాడనగానో మట్టి పాలైపోయాయి కాని అవెక్కడ వుండిందీ మనకి కచ్చితంగా తెలుసు. ఆ చిన్ని ప్రపంచపు మొత్తం నేల అంతా దాన్ని నిర్మించిన మానవుల చరిత్రని చెపుతుంది.

చెకుముకిరాళ్ల చాకులు, చెకుముకిరాళ్ల ముక్కలు చెక్కలూ, విరిగిన జంతువు యెముకలు, బొగ్గు, పొయ్యిలోని బూడిద — యివన్నీ కూడా మీకు మానవుడు తాకని ప్రకృతిలో యెన్నడూ కనిపించని యిసక మట్టీ మిశ్రమంగా అయిపోయాయి.

ఏనాడో మాయమైన కుటీరపు అదృశ్య కుడ్యాల కవతలకి కొన్ని అడుగులు మనం వేస్తే మానవ పరిశ్రమని గుర్తుకు తెచ్చే ప్రతీదీ అదృశ్యమైపోతుంది. నేలలో కప్పడిపోయిన పనిముట్లుగాని, బొగ్గుగాని, పొయ్యిలోని బూడిదగాని, జంతువుల విరిగిన యెముకలుగాని యెంతమాత్రమూ లేవు.

మానవ హస్తాల క్రియాకలాపాల జాడలకోసం మనం నేలని తవ్వితే, కొన్ని వేలవేల యేళ్లుగా చల్లారిపోయిన పొయ్యిలోని బొగ్గుల్ని జల్లించి, చెకుముకిరాతి చాకులకోసం, దోకుడు పారలకోసం మనం పరిశీలిస్తే, మానవుడి మొదటి ప్రపంచపు అంతం మానవ జాతి అంతం కాదని మనకి స్పష్టంగా తెలుస్తుంది, యేమంటే మానవుడు తన సొంత చిన్న ప్రపంచాన్ని నిర్మించుకోగలిగాడు.

# ప్రకరణం అయిదు

## గతంలోకి మొదటి ప్రయాణం

అడవి దున్నలనీ, మామత్‌లనీ వేటాడేవాళ్ల విడిది స్థలాల దగ్గర దొరికిల పనిముట్లలో చాలా తరచుగా వుండే రెండు చెకిముకిరాళ్ల పరికరాలున్నాయి. రెండు వేపులనుంచీ చెక్కిన త్రికోణాకారంలో వున్నది ఒకటి, యింకొకటి పదును వున్న అంచుగల అర్ధ చక్రం.

యీ రెండింటికీ వాటివాటి ప్రత్యేకమైన ప్రయోజనం వుండివుంటుంది, లేకపోతే అవి ఆకారంలో అంత తేడాగా వుండవు.

వీటిల్లో ప్రతిదానికీ ఒక ప్రయోజనం వుందని మనం యెలా తెలుసుకోగలం?

ఆ పనిముట్ల ఆకారమే కొన్ని ఆధారాలనిస్తుంది.

యేమైనా మనం ఆనాటి మానవుడు తన పనిముట్లతో యెలా పనిచేసిందీ చూసేందుకు రాతియుగం కేసి వెళ్లుదాం.

''ఒక పదేళ్లు వెనక్కి వెడదాం'' అనేలాంటి వాక్యాలు మనకి తరుచుగా నవలల్లో తగుల్తాయి. అలాంటి పుస్తకాలు రాసేవాళ్లకి అది సులభమే, యెక్కడ పడితే అక్కడ యెప్పుడు పడితే అప్పుడు ఆ రచయిత వెనక్కిపోగలడు. తన పాత్రలని గురించి చిత్ర విచిత్రమైన కల్పనలు చెయ్యగలడు.

కాని మనది యదార్థగాథ. మన చిత్తం వచ్చినట్టు మనం కల్పించుకోడాని కిక్కడ వీల్లేదు. అదీగాక, మనం వెనక్కి వెడితే వేలవేల సంవత్సరాలు వెనక్కి వెళ్లాలి.

యేమైనా మనం రాతియుగం కేసి వెళ్లగలం.

భూమ్మీద యింకా రాతిపనిముట్లతో పనిచేసే మనుషులు వున్న స్థలాలున్నాయి. ఉదాహరణకి ఆస్ట్రేలియాలో. అందుకనే ఒక ప్రాంతానికి ప్రయాణం చేయడం అంటే కాలంలో ఆ నాటికి ప్రయాణం చెయ్యడమే. ఎప్పుడో పూర్వం మనుషులు యెలా బతికే వాళ్లో తెలుసుకోడానికి శాస్త్రజ్ఞులు చేసే పని అదే.

యీ ఆస్ట్రేలియన్ వేటగాళ్ల మకాంల దగ్గరకి మనం యెడారి బీటినేలల గుండా, చెదరి వున్న ముళ్లపొదల నిర్జన మైదానాల గుండా వెళ్లాలి. వాళ్ల గుడారాల దగ్గరికి వస్తాం. అవి చెట్టు పట్టతోటీ, కొమ్మలతోటీ, ఒక నది వొడ్డున చెట్ల గుబురుల్లో కట్టినవి.

ఆడవాళ్లూ, మగవాళ్లూ దీర్ఘంగా పనిలో మునిగిపోయి పక్కన నేలమీద బస్కీపీఠం వేసి కూర్చుని వుంటే పిల్లలు గుడారాల దగ్గర గంతులేస్తూ వున్నారు. గుబురుగా నెత్తిమీద జుట్టూ, పొడుగాటి గడ్డమూ వున్న ముసలాడు ఒకడు కంగారూ చర్మాన్ని వొలుస్తున్నాడు. అతను త్రికోణాకారంగా వున్న చెకుముకిరాతి కత్తిని ఉపయోగిస్తున్నాడు. అరె, అదే మనం తెలుసుకోవాలనుకుంటున్న చెకుముకిరాయి పనిముట్టు!

ఆస్ట్రేలియాలోని ఆదిమ తెగల వాళ్లు రాతియుగపు మనుషులు కారనుకోండి. వాళ్లని తమ పూర్వులనుంచి వేలాది సంవత్సరాల కాలం వేరుచేస్తోంది. ఆ రాతిపనిముట్లు గతకాలపు చిన్ని అవశేషాలు. కాని యీ అవశేషాలు మన చిక్కులెన్నిటినో పరిష్కరిస్తాయి. అలా పని చేస్తూ వున్న ఆ ఆస్ట్రేలియన్‌ని చూస్తే, ఆ చెకుముకిరాతి త్రికోణం ఒక మగమనిషి పనిముట్టనీ, వలలో చిక్కిన జంతువునో, గాయపడిన జంతువునో చీల్చడానికీ దాని చర్మం వొలవడానికీ వేటగాడు ఉపయోగించే పనిముట్టనీ మనం గమనిస్తాం.



యీ పనిముట్లని చెయ్యడానికి యెన్ని గంటలు ఓపిగ్గా పని చెయ్యాలో

యింకో పనిముట్టు వుంది, అర్ధ చక్రం, ఆ ఆదిమ పనిముట్టు యెలా వుంటుందో చూడాలంటే మనం యింకా ముందుకి, తాస్మానియా అనే ద్వీపానికి వెళ్లాలి. అది ఆస్ట్రేలియాకి దక్షిణాన వుంది. యీ మధ్య కాలంలో కూడా అక్కడ ఆడవాళ్లు యీ పనిముట్టుని గుడ్డలు కత్తిరించడానికీ, తోలు పట్టీలు కత్తిరించడానికీ, చర్మాలని గీకడానికీ వాడారు.

రాతియుగపు వేటగాళ్ల కాలంతో మొదలైన పనిముట్లలో శ్రమ విభజన అంటే మనుషుల్లో కూడా శ్రమ విభజన అన్న మాట.

కాలం గడిచే కొద్దీ యింకా యింకా యెక్కువ సంక్లిష్టమైన పనులు వచ్చాయి. వాటినన్నిటినీ నిర్వహించాలంటే కొందరేమో ఒక రకం పని చెయ్యాల్సి వచ్చింది, మిగతావాళ్లు వేరేవి చెయ్యాల్సి వచ్చింది. మగాళ్లు వేటకి పోతే ఆడ వాళ్లు పొయ్యిల దగ్గర వెచ్చగా చలికాగుతూ గోళ్లు గిల్లుకుంటూ కూర్చునే వాళ్లు కాదు. వాళ్లు కొత్త గుడారాలు



ఆస్ట్రేలియన్ వేటగాడు

కోట్టేవాళ్లు, జంతువుల చర్మానుంచి బట్టలు కత్తిరించేవాళ్లు, తిండానికి వీలైన కందమూలాల్ని యేరేవాళ్లు, ఆహారం నిల్వ చేసేవాళ్లు.

కాని యింకో శ్రమ విభజన వుండేది: వయసున్న పడుచువాళ్లకీ, వయసు మళ్లిన ముసలివాళ్లకీ మధ్యన.

## వెయ్యి సంవత్సరాల పాఠశాల

ప్రతి పనికీ ఒక సరైన పద్ధతి వుంది. దాన్ని యెలా చెయ్యాలా అన్న జ్ఞానం ఆకాశంనుంచేం వూడిపడదు. జ్ఞానం అనేది యితరులనుంచి సంపాదించింది.

ప్రతి వడ్రంగంవాడూ ఒక గొడ్డలినీ, ఒక రంపాన్నీ కొయ్య చిత్రికనీ కనిపెట్టి పని మొదలెట్టాల్సి వస్తే, వాటిని యెలా వాడాలో కనిపెట్టాల్సి వస్తే భూమ్మీద ఒక్క వడ్రంగంవాడు కూడా వుండడు.

మనలో ప్రతి ఒక్కళ్లమూ ప్రపంచమంతా చుట్టి, అమెరికాని మళ్లీ కానిపెట్టి, ఆఫ్రికాని పరిశోధించి, ఎవరెస్ట్ శిఖరాన్ని కొలిచి, వున్న సముద్రాల్నీ, అఖాతాల్నీ లెక్కపెట్టి భూగోళశాస్త్రాన్ని చదవాల్సివస్తే అంత పని చెయ్యడానికి మన ఆయుర్దాయం వెయ్యి యేళ్లైనా చాలదు.

మనం ముందుకు పోయే కొద్దీ యెక్కువ చదవాల్సివస్తుంది. ప్రతి నూతన తరమూ పాత తరంనుంచి యెప్పుడూ పెరుగుతూ వుండే జ్ఞానాన్ని, సమాచారాన్ని, నూతన ఆవిష్కరణలని పొందుతూనే వుంటుంది.

రెండు వందల యేళ్ల క్రితం పదహారేళ్ల కుర్రాళ్లు ప్రొఫెసర్లయిపోయేవాళ్లు. యివాళ పదహారేళ్ల ప్రొఫెసర్ మీకు కనిపిస్తాడా!

మనం ప్రాథమిక పాఠశాలలోనూ, సెకండరీ పాఠశాలలోనూ పదకొండేళ్లు చదువుతాం. భవిష్యత్తులో జనం యింతకంటే యెక్కువ చదవాల్సి రావచ్చు, యెందుకంటే ప్రతి సంవత్సరమూ ప్రతి విజ్ఞానశాస్త్ర రంగంలోనూ నూతన ఆవిష్కరణలు వస్తూనే వున్నాయి. శాస్త్రాల సంఖ్య కూడా పెరుగుతూనే వుంది. ఒకప్పుడు భౌతికశాస్త్రం ఒక్కటే వుండేది. యివాళ భూభౌతికశాస్త్రం, ఖగోళ భౌతికశాస్త్రం, కూడా వున్నాయి. పూర్వం రసాయనశాస్త్రం మాత్రమే వుండేది. యివాళ భూరసాయనశాస్త్రం, జీవ రసాయనశాస్త్రం వ్యవసాయ రసాయనశాస్త్రం వున్నాయి. నూతన జ్ఞానపు ఒత్తిడివల్ల శాస్త్రాలు పెరుగుతాయి, విడిపోతాయి, హెచ్చవుతాయి అవేవో సజీవ కణాలైనట్టుగా.

రాతియుగంలో విజ్ఞానశాస్త్రాలేమీ లేవు, అది సహజమే. మానవాళి అనుభవం పోగవడం మొదలయిందంతే. మానవుడి పరిశ్రమలు, యివాళ వున్నంత సంక్లిష్టమైనవి కావు. అందుకనే ఒకటి చదువుకి యెక్కువ కాలం పట్టేది కాదు. అయినా అతను కూడా నేర్చుకోవాల్సిన విషయాలు వుండేవి.

ఒక జంతువు జాడ కనిపెట్టి చంపి దాని చర్మం వొలిచే నేర్పూ, జ్ఞానమూ, ఒక గుడారం వేసుకునే నేర్పూ, జ్ఞానమూ, ఒక చెకుముకిరాతి కత్తిని చేసుకునే నేర్పు, జ్ఞానమూ అతనికి అవసరం.

నేర్పూ జ్ఞానమూ యెక్కణ్ణుంచి వస్తాయి?

మానవుడు సహజ నైపుణ్యాలతోటి, కర్ణుడి కవచ కుండలాల్లాగా, పుట్టలేదు. వాటిని అతను సంపాదించాడు. అతను జంతుప్రపంచాన్ని దాటివచ్చినప్పుడే అది జరిగింది.

ఒక జంతువు తన బొచ్చుకుండే రంగునీ, శరీరపు ఆకృతినీ తల్లిదండ్రులనుంచి సంక్రమింప చేసుకున్నట్టుగా, తన సజీవ పరికరాల్నీ, వాటిని ఉపయోగించే జ్ఞానాన్నీ సంక్రమింప చేసుకుంటుంది. గాడి యెలా చేసుకోవాలా అన్న దాన్ని పంది నేర్చుకోనక్కర్లేదు, ప్రత్యేకం ఆ ప్రయోజనమే వున్న ముట్టె దానికి పుట్టుక తోటే వస్తుంది. కొయ్యని యెలా నమలాలా అని బీవర్ నేర్చుకోనక్కర్లేదు, దాని పదునైన కత్తెర పళ్లు వున్నది ఆ ప్రయోజనం కోసమే. అందు కనే జంతువులకి కార్ఖానాలు గాని, పాఠశాలలు గాని లేవు.

అప్పుడే గుడ్డునుండి బయటపడ్డ పిల్లబాతు, దానికి యెవరూ నేర్పా పెట్టకపోయినా ఈగల్నీ, నీటి పురు గుల్నీ తక్షణం పట్టేస్తుంది. కోకిల సంతానం కన్నవారి పెంపకం, సంరక్షణ లేకుండా పరాయి కొంపల్లో పెరుగుతుంది. కాని ఆకురాలు కాలం రాగానే అవి ఉష్ణప్రాంతాలకి వలసపోతాయి, అలా చెయ్యాలని వాటికి యెవరూ చెప్పకపోయినా కూడా.

జంతువులు ఖాయంగా తమ తల్లిదండ్రులనుంచి చాలా యెక్కువ నేర్చుకుంటాయి. అయినా కానీ పాఠశాలని పోలినదేదీ వాటికి వుండే సమస్యే లేదు.

మానవులకి సంబంధించి అంతా వేరే కథ.

మనవుడు తన పనిముట్లని తనే తయారు చేసుకుంటాడు, తను వాటితో సహజంగా పుట్టలేదు గనక. అంటే అతను ఆ పనిముట్లని ఉపయోగించే తన నైపుణ్యాలని తల్లిదండ్రులనుంచి సంక్రమింపచేసుకోలేదు. కాని వాటిని గురించి పెద్దలనుంచీ, గురువులనుంచీ నేర్చుకుంటాడు.

మనుషులు పుట్టడం పుట్టడమే వ్యాకరణ జ్ఞానంతోటీ, లెక్కల జ్ఞానంతోటీ పుడితే బద్ధకస్తుడైన ప్రతి విద్యార్థికీ పరమ సంతోషంగా వుంటుంది. అప్పుడు యీ బళ్ళూ గిళ్ళూ అక్కర్లేదు. కాని దానివల్ల అతనికి పెద్ద లాభం వుండదు. బళ్లు లేకపోయినట్లైతే మనుషులు కొత్త వాటిని వేటినీ నేర్చుకోలేరు. మొత్తం మానవుడి నైపుణ్యాలూ, జ్ఞానమూ వేసినచోటే వుండే గొంగళీలా అక్కణ్ణే వుంటాయి, ఉదాహరణకి ఒక ఉడత నైపుణ్యాల్లాగా.

ప్రతి తరమూ మానవాళి అనుభవ భాండాగారానికి తన వంతుగా తను చేరవేస్తూనే వుంటుంది. యీ అనుభవం స్థిరంగా పెరుగుతూనే వుంటుంది. మానవాళి అజ్ఞేయమైన దాని యెల్లల్ని యింకా యింకా దూరం జరిపేస్తూనే వుంటుంది.

వెయ్యేళ్ల పాఠశాల, మానవ పరిశ్రమ పాఠశాల, మానవుణ్ణి యివాళ వున్నట్టుగా తయారు చేసింది. యీ పాఠ శాల అతనికి విజ్ఞానశాస్త్రాన్ని, ఇంజనీరింగ్‌ని, కళని ప్రసాదించింది. అది అతనికి తన సాంస్కృతిక వారసత్వాన్ని ప్రసా దించింది.

మానవుడు వెయ్యేళ్ల పాఠశాలలో మొదటి సారిగా రాతియుగంలో ప్రవేశించాడు. అనుభవజ్ఞులైన ముసలి వేటగాళ్లు యెలా ఒక జంతువు జాడల్ని బట్టి దాన్ని గుర్తించాలో, దాన్ని బెదిరించి పారిపోయేటట్టు చెయ్యకుండా యెలా సమీపించాలో అనే కష్టమైన వేట కళని గురించి యువకులకి చెప్పారు.

యివాళ రోజుల్లో వేటకుక్కూడా పెద్ద నైపుణ్యం అవసరం. అయినా యీ రోజుల్లో అప్పటి కంటే వేటాడ్డం సులభం, యేమంటే వేటగాడెవడూ తన ఆయుధాలని తను తయారు చేసుకోనక్కర్లేదు. రాతియుగంలో వేటగాళ్ల తమ గదలని, కత్తుల్ని, తమ యీటెలకి సూదికొనలని, తామే తయారు చేసుకోవాల్సి వచ్చేది. తెగలోని యువ వేట గాళ్లకి ముసలి వేటగాళ్లు నేర్పేది చాలా వుండేది.

ఆడవాళ్ల పనికి రకరకాల నైపుణ్యాలు అవసరమయేవి. పాపం ఆడవాళ్లు యిల్లాళ్లుగా యింటిపని చూసేవారు, యిల్లు కట్టేవాళ్లు, కొయ్యకోసేవాళ్లు, దర్జీపని చేసేవాళ్లు.

తమ దీర్ఘకాల జీవితపు అనుభవాన్ని, తమ తెగలోని యెదిగిన మొగపిల్లలకీ ఆడపిల్ల లకీ అందించే అనుభవజ్ఞులైన పురుషులూ, స్త్రీలూ ప్రతి మానవ తెగలోనూ వుండేవాళ్లు.

కాని నైపుణ్యాన్నీ, అనుభవాన్నీ అందించడం యెలా?

మిగతా వాళ్లకి మీకు తెలిసిందాన్ని చూపించడంద్వారానూ, వివరించడంద్వారాను అలా చెయ్యొచ్చు.

అలా చెయ్యాలంటే మనుషులకి భాష అవసరం.

తమ పిల్లలకి పుట్టుకతో వచ్చే పనిముట్లని వాటి పంజాలనీ, పళ్లనీ, యెలా వాడాలో నేర్పే అవసరం జంతువులకి లేదు. అందుకనే జంతువులకి యెలా మాట్లాడాలో తెలియక్కర్లేదు.

కాని ఆదిమ మానవుడికి అవసరం వుండింది.

మిగతా వాళ్లతో కలిసి చెయ్యాల్సిన పనులకి సంబంధించి అతనికి ఉమ్మడి భాష అవసరం అయేది. పాతతరం వాళ్ల అనుభవాన్నీ, నైపుణ్యాన్నీ యువతరానికి అందించేందుకు మనుషులకి మాటలు అవసరం అయ్యాయి.

రాతియుగపు మానవులు ఒకళ్లతో ఒకళ్లు యెలా మాట్లాడుకున్నారు?

# గతంలోకి యింకోసారి ప్రయాణం

గతంలోకి యింకోసారి ప్రయాణం చేద్దాం.

మీరు సుదూర ప్రాంతాలకి ప్రయాణం కడితే అసలు మీరు గుమ్మం కదలకుండా కూడా అలా చెయ్యొచ్చు.

మీరు కూచున్న గదిలోనుంచి కదలకుండా రేడియో తిప్పితే దేశంలోని యే ప్రాంతమైనా మీకు తగుల్తుంది. మీకు టెలివిజన్ వుంటే మాటలు వినడమే కాదు, యెన్నో మైళ్ల దూరంలో వున్న మనుషుల్ని కూడా చూడగలరు. రేడియో, టెలివిజన్ల పుణ్యమా అని మనం దూరాన్ని జయించాం.

కాని యెన్నో యెన్నో యేళ్లు దూరంలో వున్న వాళ్ల మాటల్ని యెలా వినగలం, ఆ మనుషుల్ని యెలా చూడ గలం?

రేడియో, టెలివిజన్ స్థలం హద్దులు లేకుండా చేసినట్టుగా కాలంగుండా మనం ప్రయాణం చెయ్యడానికి యేదైనా సాధనం వుందా?

ఆఁ, వుంది. అది సినిమా.

మనం తెరమీద మొత్తం ప్రపంచాన్ని చూడవచ్చు, యివాల్టి ప్రపంచాన్నే కాదు, నిన్నటి ప్రపంచాన్ని కూడా.

మొదటి ఆర్క్‌టిక్ పరిశోధక బృందపు వీరుల స్వాగతం కోసం జరిగిన ప్రదర్శన దృశ్యం యిదిగో. అదుగో అక్కడ ఒక్క పెద్ద బ్రహ్మాండమైన బెలూన్ గాలిలోకి, కొత్త భూ ఉపగ్రహంలాగా యెగురుతోంది.

యేమైనా సినిమా కెమేరాని కనిపెట్టిన కాలాని కంటే ముందునాటికి అది మనల్ని తీసుకెళ్లలేదు కదా. మరి సినిమా కెమేరాని కనిపెట్టింది యీ మధ్యనే.







గతానికి సాకులు: భూర్జ పత్రంమీద రోమన్ లిపి; అస్సీరియన్ కోణ అక్షరాలు వున్న మట్టి పలక; చరిత్రాత్పూర్వపు నరులు బండ రాతిమీద గీసిన బొమ్మ

మొదటి ''మాట్లాడే'' సినిమాలు (టాకీలు) 1927లో వచ్చాయి.

మనం కాలంలో వెనక్కి ప్రయాణం సాగిస్తూపోతూ ఒక ఓడ మీదనుంచి యింకో ఓడమీదకి మారాలి. అవీ పోనుపోను అధ్వాన్నంగా వుంటాయి: పొగ ఓడనుంచి తెరచాప ఓడ, తెరచాప ఓడనుంచి పడవ.

యిప్పుడు మనం మూక సినిమా తెరకేసి పోదాం. మనం గతాన్ని చూడగలం, కాని వినలేం.

అప్పుడు ధ్వని యంత్రం (phonograph) వస్తుంది. మనకి గొంతుక వినిపిస్తుంది, కాని యెవరు మాట్లాడుతున్నదీ మనం చూళ్లేం, అతను స్పష్టంగా మాట్లాడుతున్నప్పటికీ.

1895కి ముందు జరిగిన దాన్ని దేన్నీ యే సినిమా చూపించలేదు.

యే ధ్వని యంత్రమూ 1877కి ముందు నాటి మాటల్ని వినిపించలేదు, దాన్ని అప్పుడు కనిపెట్టారు కనక.

ఆ గొంతుకలు అదృశ్యమైపోయాయి. కాని అక్షరాల రూపంలో, అచ్చు పుస్తకాల వైవిధ్యం లేని, సమానాంతర పంక్తుల్లో అవి నిలిచి వున్నాయి.

పాతకాలపు ఫొటోగ్రాపులమీద, డగెరోటైప్స్* ఫోటోలమీద ఘనీభవించిన చిరునవ్వులూ, దృక్కులూ వుంటాయి.

కాని ఆ ఫొటోలు కూడా 1838కి ముందు లేవు. మనం గతంలోకి మన ప్రయాణం కొనసాగించే కొద్దీ గత కాలపు వేరే సాక్ష్యాధారాలమీద మనం ఆధారపడాల్సిందే, అవి కెమెరా అంత కచ్చితంగా గాని, వున్నదాన్ని వున్నట్టు గాని చూపించకపోయినప్పటికీ.

మనం గతాన్ని పునర్నిర్మించాలంటే ఆర్ట్ గాలరీలలోనూ, పురావస్తు భాండారాల్లోనూ, గ్రంథాలయాల్లోనూ భద్రంగా వున్న సాక్ష్యాలని పోల్చి చూడాల్సి వస్తుంది.

అప్పుడు రాజబాటలో మైలురాళ్లమీద అంకెల్లాగా వందలాది సంవత్సరాలు జారిపోతాయి.

మనం మళ్లీ 1440వ సంవత్సరంలో బండి మారాలి. ఆ నాటికి ముందు అచ్చు పుస్తకాలు లేవు. స్ఫుటమైన అచ్చు యంత్రపు అక్షరాలకి బదులుగా రాతగాడి లిపి వుండేది.

రాతగాడి గద్దయాక కలం పాతకాలపు తాటాకుమీద అలా గీకుతూ వుంటే అతని వెనక్కాలే అడుగులో అడుగేసుకుంటూ, అక్షరం అక్షరమే దాటుకుంటూ గతంలోకి పోదాం.

పాతకాలపు కాగితంనుంచి భూర్జరపత్రాలకీ, అక్కణ్ణుంచి రాతిదేవాలయాల గోడలమీద చెక్కడాలకీ మన ప్రయాణం సాగుతుంది.

గతకాలం వాళ్లు రాసిన రాత యింకా చిత్రంగా, అగమ్యగోచరంగా తయారవుతుంది.

ఆఖరికి ఆ రాతలూ అదృశ్యమైపోయి, గతకాలపు గొంతుధ్వనులు మూగపోతాయి.

అప్పుడేమిటి?

అప్పుడు మనం మానవుని జాడలకోసం భూమిలో వెదుకుతాం, మరిచిపోయిన శ్మశానపు దిబ్బల్ని తవ్వుతాం, పురాతన పనిముట్లని పరిశోధిస్తాం, పూర్వకాలపు ఆస్తరణలనీ, యెన్నడో ఆరిపోయిన పొయ్యిల్లోని బొగ్గు బూడిదల్నీ పరీక్షిస్తాం.

యీ ప్రాచీన అవశేషాలన్నీ మానవుడు యెలా బతికేవాడో, పనిచేసే వాడో చెబుతాయి.

కాని మానవుడు యెలా మాట్లాడేవాడో, ఆలోచించేవాడో అవి మనకి చెబుతాయా?

## మూగభాష

శాస్త్రజ్ఞులు తరచుగా యేదేనా గుహలోనో, లేదా ఆదిమ వేటగాళ్లు నివశించిన చోటుల్లోనో ఆనాటి మానవుణ్ణే చూశారు అంటే అతని అవశేషాలని చూశారు.

సిమ్ఫెరోపోల్ దగ్గర వున్న కీక్-కోబా గుహలో శిలాజ మానవుడి అవశేషాలని 1924లో సోవియట్ పురాతత్వ

---

* డగెరోటైప్స్ (dagerrotypes) — డగెరో ఆయన కనిపెట్టిన ఫోటోగ్రాపుల్ని యిలా పిలుస్తారు. — సం.

శాస్త్రజ్ఞులు కనిపెట్టారు. గుహ మధ్యలో తవ్విన దీర్ఘ చతురస్రపు గుంతలో పూడ్చిపెట్టిన అస్థిపంజరం వుంది. దగ్గర్లోనే, చుట్టూతా కొండలు కాపుగా వుండేచోట, ఒక జింక అవశేషాలూ, కొన్ని చెకుముకిరాతి పనిముట్లూ కూడా కనిపించాయి.

ఉజ్బెకిస్తాన్‌లోని తెషిక్-తాష్ గుహలో కూడా అలాంటి రాతియుగపు నివాసస్థానమే కనిపించింది.

అక్కడ కొండ ముఖద్వారంలోని ఒక చరియలో ఆదిమ మానవులు వుండేవాళ్లు. వాళ్లు చురుకైన వాళ్ళు, యెందుకంటే వాళ్ల ప్రధానమైన వేట కొండగొర్రె. దాన్ని పట్టుకోవడం చంపడం చాలా కష్టం.

అదే గుహలో రాతి పనిముట్లకీ, జంతువు అస్థికలకీ దగ్గర్లో ఒక యెనిమిదేళ్ల శిశువు పుర్రె, ఎముకలు దొరి కాయి.

పాత రాతియుగపు మానవుల శిలాజ అవశేషాలు రష్యాలోనేగాక చాలా యితర దేశాల్లో కూడా లభించాయి. నిజా నికి, అవి ఒక్క అమెరికాలో తప్ప మిగతా అన్ని ఖండాల్లోనూ కనిపించాయి.

అలాంటి ఆవిష్కరణల్లో మొదటిది రైన్ రాష్ట్రంలోని నియాండర్ లోయలో జరిగింది కాబట్టి పురా శాస్త్రజ్ఞులు ఆ కాలంనాటి మనిషికి నియాండర్తల్ మానవుడని పేరుపెట్టారు.

మనం మన కథానాయకుణ్ణి నియాండర్తల్ మానవుడు అందాం. మనం యింకో కొత్త పేరు యెందుకు పెట్టా మంటే అతని పూర్వుడైన పిథెకాన్త్రపస్ మానవుణ్ణుంచి మధ్యలో గడిచిపోయిన లక్షలాది సంవత్సరాలలో అతను చాలా మారిపోయాడు.

అతని వీపు నిటారుగా వుండేది. చేతులు యింకా లాఘవంగా వుండేవి, ముఖాకృతి యింకా యెక్కువ మానవ ఆకృతికి దగ్గరగా వుండేది.





ఎడమ వైపు చిత్రం: నియాండర్తల్ నరుడి ముఖం, కొన్ని లక్షల యేళ్ల తర్వాత పునర్ నిర్మించింది. కుడి వైపు చిత్రం: నియాండర్తల్ నరుడి పుర్రె

ఎవరేనా రచయిత తన కథా నాయకుణ్ణి గొప్ప కల్పనతోటీ, చాలా వివరంగానూ వర్ణిస్తాడు. ఉదాహరణకి అతను తన కథా నాయకుణ్ణి గురించి వర్ణిస్తూ, ''అతని ప్రకాశవంతమైన కళ్లు,'' ''అతని కొటారేసిన ముక్కు,'' ''అతని జుట్టు అమావాస్య నిశీథిలా నల్లగా వుంది'' అనే మాటలు రాస్తాడు. కాని అతని మెదడు గురించి రచయిత ఒక్క మాటంటే ఒక్క మాట కూడా చెప్పడు.

మన పరిస్థితి అలా కాదు. మన కథా నాయకుడి మెదడు పరిమాణం మనకి చాలా ముఖ్యం, అతని కళ్లల్లోని భావం కంటేనూ, అతని జుట్టు రంగు కంటేనూ కూడా అది మనకి చాలా చాలా ముఖ్యం.

నియాండర్తల్ మానవుని పుర్రెని జాగ్రత్తగా కొలతలు వేసాక తేలిందేమిటంటే అతని మెదడు పిథెకాన్త్రపస్ మానవుని మెదడుకంటే పెద్దది అని.

అంచేత, చెప్పవచ్చేదేమిటంటే వేలాది సంవత్సరాలు పడ్డ శ్రమ వృథాపోలేదు. ఆ సంవత్సరాల కాలం మనిషినే మార్చివేసింది. కాని మిగతా భాగాల కంటే చేతులూ, తలా యెక్కువ మారాయి, యెందుకంటే అతని చేతులు పని చెయ్యాల్సి వచ్చేది, అతని తల వాటిని నడిపించాల్సి వచ్చేది.

ఆదిమ మానవుడు రాతికి నూతన ఆకారం యిస్తూ రాతి గొడ్డలిని చెక్కుకుంటూ తననీ, తన వేళ్లనీ క్రమేపీ మార్చుకున్నాడు. అవి మరింత లాఘవంగా, నైపుణ్యంగా తయారయేయి. అతను తన మెదడుని మార్చుకున్నాడు, అది మరింత సంక్లిష్టంగా తయారైంది.

నియాండర్తల్ మానవునికేసి ఒకసారి చూస్తే అతను వానరం కాదని తెలుస్తుంది.

అయినా కానీ అతనికి వానరపు పోలికలు యెన్ని వున్నాయి!

అతని కురచ నుదురు కనుబొమలమీదకి పొడుచుకు వచ్చి వుంటుంది. అతని కోరపళ్లు ఒక దాని కోణంలో యింకోటి వుండి, నోటినుంచి యివతలికి పొడుచుకువచ్చాయి.

నియాండర్తల్ మానవుడి నుదురూ, గడ్డమూనే మనకీ అతనికీ పోలికలే లేనట్లు చేసేవి. అతని నదురు వెనక్కి పోయివుండేది. అతనికి గడ్డమనేదే లేదని చెప్పాలి.

దాదాపు నుదురు అనేదే లేని బుర్రలో వుండే మెదడుకి ఆధునిక మానవుడి మెదడులో వుండే కొన్ని విభాగాలు వుండవు. కింది దవడ గడ్డపు ఎెముక లేకపోవడంతోటి అది మానవ భాషకి యింకా అనుకూలం అవలేదు.

అలాంటి నుదురూ, గడ్డమూ వున్న మానవుడు ఆలోచించనూ లేడు, మనలా మాట్లాడనూ లేడు.

కాని ఆదిమ మానవుడు మాట్లాడాల్సి వచ్చింది. ఉమ్మడిగా చేసే పనికి భాష అవసరం అయింది, యేమంటే కొంత మంది కలిసి ఒకే పని చేసేటప్పుడు, వాళ్లు తము చేసే పని గురించి ఏకాభిప్రాయానికి రావాలి. మానవుడు తన నుదురు పెరిగేదాకానూ, దవడ యింకొంచెం ప్రస్ఫుట మయ్యేదాకా ఆగడానికి లేదు, అలా అయితే అతను వేల సంవత్సరాలు ఆగాల్సి వుండేది.

కాని యితరులకి తను అనుకున్నది యెలా చెప్పేవాడు?

తన చెప్పదలచుకున్న దాన్ని చెప్పడానికి, మొత్తం శరీరం అంతా ఉపయోగించి పాపం, శాయశక్తులా చెయ్య గలిగినంతా చేశాడు. అతనికి యింకా మాట్లాడ్డానికి వీలయే అవయవ నిర్మాణం లేకపోవడం వల్ల అతను తన చేతుల్నీ ముఖ కండరాలనీ, భుజాలనీ, కాళ్లనీ వాడేవాడు.

మీరెప్పుడైనా యేదేనా కుక్కతో మాట్లాడేరా? కుక్క యేదేనా తన యజమానికి చెప్పాల్సి వస్తే అతని కళ్లల్లోకి చూస్తుంది, ముక్కుతో అతన్ని పొడుస్తుంది, అతని ఒళ్లో పాదాలు పెడుతుంది, తోక ఆడిస్తుంది, ఉద్రేకంతోటి రక్కుతుంది, ఆవులిస్తుంది. దానికి మాటలు రావు కాబట్టి మొత్తం శరీరాన్ని, నఖశిఖ పర్యంతం, తలనుంచి తోక దాకా, తన సందేశం అందివ్వడానికి యాతనపెట్టి తంటాలు పడుతుంది.

ఆదిమ మానవుడికి కూడా మాటలు రావు. కాని అతని చేతులు అతని వూహల్ని అందించేవి. అతని చేతులకి పని వుండేది, కాని ఆ పనికీ భాష కావాలి కదా.

''నరుకు'' అనడానికి బదులుగా ఆదిమ మానవుడు గాలిలో నరికే భంగిమ చేసేవాడు; ''దాన్ని నాకియ్యి'' అనడానికి బదులుగా అతను తన చేతిని చాచే వాడు; ''యిలారా'' అనడానికి బదులుగా చేతుల్ని తన వేపుకి వూపేవాడు. చేతులకి సాయంగా గొంతుని వాడేవాడు: అరిచేవాడు, మూలిగేవాడు, గావు కేకపెట్టేవాడు. యిదంతా అవతలి వ్యక్తి దృష్టిని ఆకర్షించడానికీ, తన అభినయ భంగిమల్ని అతను గుర్తించేటట్టు చెయ్యడానికీ చేసేవాడు.

కాని మనకిదంతా యెలా తెలుసు?

నేలమీద విరిగిపడిపోయిన ప్రతి రాతి పనిముట్టు ముక్క గతకాలపు అంశని నిలుపుకున్నదే నిజమే. కాని అభినయ భంగిమల విరిగిన ముక్కలు మనకెక్కడ దొరుకుతాయి? యేనాడో మట్టిలో కలిసిపోయిన చేతుల అభినయ భంగిమల్ని మనం తిరిగి నిర్మించడం యెలాగ?

ఆ ఆదిమ మానవులు మన పూర్వులు అయి, ఆ రకంగా మనకి ఒక వారసత్వాన్ని సమకూర్చి వుండక పోయినట్లయితే అది అసంభవం అయివుండేది.

# మాట్లాడే చేతులు

ఆ మధ్యని ఒక ఎర్ర ఇండియన్ లెనిన్‌గ్రాడ్‌ని చూడ్డానికి వచ్చాడు. అతను నెమెపు తెగకి చెందిన వాడు (అంటే ఆభరణంకోసం కుట్టిన ముక్కు అని అర్థం). జేమ్స్ ఫెనిమోర్ కూపర్ యెంతగానో రాసిన ఎర్ర ఇండియన్ల కొమ్ము ఆయుధాలూ వగైరా ధరించిన బాపతులాంటివాడు కాడు లెండి అతను.

అతనికి జింకచర్మపు పాదరక్షలూ, యీకల పాగాలూ లేవు. అతను మామూలుగా అందరూ వేసుకునే సూటు వేసుకున్నాడు, ఇంగ్లీషూ, తన తెగభాషా కూడా ధారాళంగా మాట్లాడాడు.

యేమైనా యీ రెండు భాషలకీతోడు, ఎర్ర ఇండియన్లలో వేలాది సంవత్సరాలుగా నిలిచివున్న యింకో భాషని కూడా అతను మాట్లాడాడు.

అది ప్రపంచంలో కల్లా అతితేలికైన భాష. ఆ భాష నేర్చుకోవాలంటే మీరు క్రియా రూపాలు, విభక్తులు, చేదర్థకాలు, బాల, ప్రౌఢవ్యాకరణాల తలనొప్పి సూత్రాలు యేమీ నేర్చుకోనక్కర్లేదు. దాని సరియైన ఉచ్చారణ రెప్పపాటులో పట్టెయ్యొచ్చు, యేమంటే మీరు ఉచ్చరించాల్సింది యేమీ లేదు కాబట్టి!

ఆ పెద్ద మనిషి మాట్లాడిన మూడో భాష ధ్వనుల భాష కాదు, ''సంజ్ఞల'' భాష.

ఆ భాష నిఘంటువు బహుశా యిలా వుండి వుంటుంది:

# మూగ భాష నిఘంటువులో ఒక పేజీ

విల్లు — ఒక చెయ్యి వింటిని పట్టుకున్నట్టు, యింకో చెయ్యి తాడుని లాగినట్లు చెయ్యడం.

విగ్‌వామ్ (రెడ్ ఇండియన్ల డేరా) — రెండు చేతుల వేళ్లూ సంధించి కోణాకారంగా వుంచడం.

తెల్లవాడు —టోపీ అంచుని సూచిస్తున్నట్టు నుదుటికి అడ్డంగా గీత గీయడం.

తోడేలు — రెండు చెవుల్ని సూచిస్తున్నట్టు రెండు వేళ్ల చాచిన చెయ్యి.

కుందేలు — పైని మాదిరిగానే రెండు వేళ్ళు చాచిన చెయ్యి, కుందేలు గుండ్రటి మెడని సూచించేటట్టు వలయాకారపు కదలిక.

యీ భాషలోని ప్రతి మాటా ఆకాశంలో గీసిన బొమ్మలే.

అతి పురాతనమైన లిపి అక్షరాల మాటలతో కాకుండా బొమ్మలతో వున్నట్టే, బహుశా, అతి ప్రాచీనమైన అభినయాలు కూడా బొమ్మల మాటలు అయివుంటాయి.

యీనాటి ఎర్ర ఇండియన్ తెగల మూగ భాష ఆదిమ మానవుడి భాష కాదు. యీనాటి ఎర్ర ఇండియన్ తెగల భాషల్లో యే ఆదిమ ''భాష''లోనూ లేనన్ని ''మాటలు'' వున్నాయి. మరీ యిటీవలి కాలంనాటి ''బొమ్మల'' మాటల్లో కొన్ని యివి:

మోటారు బండి — రెండు చక్రాల్ని సూచించడానికి చేతులతోటి రెండు వలయాల్ని చూపించడం, గాలిలో స్టీరింగ్ చక్రం తిప్పుతున్నట్టు తిప్పడం.

రైలు — చక్రాలని చూపించడానికి చేతుల్తోటి వలయాలు, అప్పుడు రైలు ''జుక్, జుక్''మని పొగవదుల్తున్నట్టు ముందుకు చేతిని కదపడం.

యివి చాలా కొత్త గుర్తులు. కాని ఆదిమకాలం నాటినుండీ వుండే వుండిన అభినయ ముద్రలు మూగ భాష నిఘంటువులో వున్నాయి.

నిప్పు — మకాం మంటలోని పొగ పైకి పోతున్నట్టుగా చేతిని పైకి తరంగంలా లేపడం.

పని — గాలిలో సుయ్ మనిపించేటట్టు చేతిని కొట్టడం.

ఆదిమ మనవులు పనిని సూచించడానికి అలా గాలిలో చేసే వాళ్లేమో యెవళ్లకి తెలుసు. యింతా చేసి, మొదటి పనిముట్టు చేతిగొడ్డలే కదా!

# మనకీ వున్న మూగభాష

మనకిగా మనకీ ఒక మూగభాష వుంది.

''అవును'' అని అనాలనుకుంటే అస్తమానూ ఆ మాటని వాడం. వూరికే తల వూపుతాం.

''అదుగో అక్కడ'' అనాల్సి వస్తే, ఒకో అప్పుడు వేలితో చూపిస్తాం. మనకి ఒక ప్రత్యేకమైన, మాట్లాడే వేలు కూడా వుంది ''చూపుడు వేలు'' అని.

ఎవరికేనా వందనం చెయ్యాల్సి వస్తే వూరికే చేతులు జోడిస్తాం. మనం బుర్ర వూపుతాం, భుజాలు కదిలిస్తాం, భుజాల్ని ఎత్తుతాం, చేతుల్ని అటూ యిటూ చాస్తాం, కనుబొమలు ముడుస్తాం, పెదవి కొరుకుతాం, ఎవళ్ల కేసేనా చూపిస్తూ వేలు వూపుతాం, బల్లమీద ధనామని కొడతాం, నేలమీద కాలితో తన్నుతాం, గదని వూపినట్టు వూపుతాం, చేతుల్ని మెలిపెడతాం, చేతుల్ని గుండెలమీదకి హత్తుకుంటాం, చేతులు ముందుకి చాస్తాం, చెయ్యి అందిస్తాం, ముద్దులు వర్షిస్తాం.

యిదంతా సంభాషణే, కాని ఒక్క మాటని కూడా నోటితో అనడం లేదు.

''మాట్లాడని యీ భాష'', యీ మూగభాష, చనిపోదు. అవును మరి, దాని మంచి లక్షణాలు దానికి వున్నాయి. ఒకో అప్పుడు ఒక చిన్న అభినయం, పెద్ద ఉపన్యాసం కంటే ఎక్కువ భావాన్ని తెలియజేస్తుంది. ఒక మంచి నటుడు మాట్లాడకపోవచ్చు కాని అరగంటలో అతని కనుబొమలూ, కళ్లూ, పెదాలూ, కొన్ని వందల మాటలు చెప్పలేని భావాన్ని మనకి చెపుతాయి.

యేమైనా మీ సంభాషణలో మూగభాషని వాడడం మర్యాదకాదు.

మీరు మాటలతో సులభంగా చెప్పగలిగిందాన్ని చేతులూ కాళ్లూ ఉపయోగించి చెప్పడమెందుకు! మన మేమీ ఆదిమ మనుషులం కాదు కదా. కాలిని నేలమీద కొట్టడం, దేనికేసేనా చూపించడం, చేతులు వూపడం లాంటి అలవాట్లని మర్చిపోతే మంచిది.

అయినా ఒకో అప్పుడు మనం చెప్పదలచుకున్న దాన్ని చెప్పడానికి మూగభాషే పనికొస్తుంది.

రెండు ఓడలు జెండాల గుర్తులతోటి ''మాట్లాడుకోవడం'' మీరు యెప్పుడేనా చూశారా? హోరు గాలిలో, తరంగ ఘోషలో, ఒకో అప్పుడు తుపాకీ మోతల్లో కూడా తను చెప్పేది అవతలి వాళ్లు వినేటట్టు చెయ్యాలంటే యెవళ్ల కేనా అవసరమయేది గొంతుకకాదు. పొగమంచుని ఛేదించుకుని ధ్వనిని తీసుకుపోయే కొమ్ము పరికరం! యిలాంటి సంద ర్భాల్లో మన చెవులు మనకి అనుకూలంగా వుండవు, మనం కళ్లమీద ఆధారపడాల్సిందే.

బహుశా మీరు చాలా తరచుగా మూగభాషని వాడతారు. పాఠాలప్పుడు టీచర్‌గారి దృష్టిని ఆకర్షించా లనుకోండి, మీరు మీ చెయ్యి యెత్తుతారు. అది సరైందే. ముప్పై నలభై మంది పిల్లలు ఒకేసారి మాట్లాడ్డం వూహించండి!

అంచేత మూగభాషకి దాని మంచి లక్షణాలు దానికి వున్నాయి. అందుకనే అది అన్ని వేల సంవత్సరాలు బతికి బట్ట కట్టింది, దాని అవసరం యింకా వుంది.

వాక్కు మూగభాషమీద విజయం సాధించింది కాని యింకా పూర్తిగా కాదు. యిప్పుడు ఓడిపోయింది విజేతకి దాస్యం చేస్తోంది. అందుకని మూగభాష యింకా కొంతమందిలో పనివాళ్ల భాషగానూ, అణగిమణగి వుండేవాళ్ల భాష గానూ, తక్కువ తరగతి వాళ్లు అనుకొనే వాళ్లల్లోనూ మూగభాష వుంది.

అక్టోబరు మహా విప్లవానికి పూర్వం కాకసస్‌లోని ఆర్మీనియన్ గ్రామాల్లోని ఆడవాళ్లు భర్తతో తప్ప పరాయి మగవాడెవడితోటీ మాట్లాడేందుకు వీల్లేకుండా కట్టు వుండేది. వేరే యెవళ్లకేనా ఆమె యేదేనా చెప్పాల్సి వస్తే ఆమె మూగభాషనే వాడాల్సి వచ్చేది.

సిరియాలో, ఇరాన్‌లో ప్రపంచంలోని యింకా అనేక చోట్ల మూగభాషలు వుండేవి.

ఉదహరణకి ఇరాన్ షా రాజ(ప్రాసాదంలోని నౌకర్లు మూగభాషని మాత్రమే మాట్లాడాలి. తమ సమానస్థులతో మాట్లాడేటప్పుడే వాళ్లు మాటలని వాడవచ్చు. పాపం యీ దురదృష్టవంతులకి అక్షరాలా ''వాక్ స్వాతంత్ర్యం'' అనేది వుండేది కాదు.

అంచేత ప్రస్తుత కాలంలో కూడా యేనాడో గతించిన కాలపు అవశేషాలు మనకి కనిపిస్తాయి.

# మానవుడు ఆలోచించడం నేర్చుకుంటున్నాడు

అడివిలోని ప్రతి జంతువూ అన్ని వేపులనుంచీ వచ్చే వేలాది సంజ్ఞల్ని వింటుంది, పరిశీలిస్తుంది.

ఒక చెట్టు కొమ్మ ఫెళఫెళ విరుగుతుంది — అది శత్రువేమో — అంతే, ఆ జంతువు పారిపోడానికో, ఆత్మ రక్షణకో సిద్ధమవుతుంది.

ఉరుము ఉరుముతుంది, అడివి చీల్చుకుంటూ గాలి హోరుగా ఆకుల్ని దూసుకుపోతుంది — జంతువులు గూళ్లల్లోనో, బొరియల్లోనో రాబోయే తుఫాన్‌నుంచి రక్షించుకునేందుకు దాంకుంటాయి.

కుళ్లిపోతూన్న ఆకులతోటే, పుట్టగొడుగులతోటే కలిసిన చెమ్మనేలమీద ఎర తాలూకు వాసనలు సోకితే ఆ జంతువు ఆ వాసన జాడనే అనుసరించి తనకి ఆహారం కాబోయేదాన్ని మాటేస్తుంది.

ప్రతి గలగల, ప్రతి వాసనా, గడ్డిలోని ప్రతి జాడా, ప్రతి కేకా, ప్రతి కూతా యేదో అర్థం వున్నదే, తక్షణం అటువేపు దృష్టిని అపేక్షించేదే.

ఆదిమ మానవుడు కూడా బాహ్య ప్రపంచపు సంజ్ఞలు విన్నాడు. ఏమైనా అతను వెంబడే కొత్త సంజ్ఞల్ని కూడా అర్థం చేసుకోవడం నేర్చుకున్నాడు. అవి తన తెగవాళ్లు తనకి పంపిన సంకేతాలు.

ఉదాహరణకి, ఆనాటి వేటగాడు అడవిలో జింక జాడలు చూస్తే తన వెనక వున్న వేటగాళ్లకి సంజ్ఞ చేస్తూ చెయ్యి వూపే వాడు. వాళ్లు జంతువుని చూళ్లేదు, కాని అతని సంజ్ఞ వాళ్లను అప్రమత్తుల్ని చేస్తుంది. వాళ్లంతా తామే ఆ జింక నిడుపాటి కొమ్ముల్నీ, అది చెవులు ఆడించడాన్నీ చూసినట్టుగా బాణాలు యెక్కు పెట్టేస్తారు.

ఆ జంతువు జాడలే ఆ సంజ్ఞ.

ఆ జాడలని గురించి ఆ వేటగాడు చెయ్యి వూపడం అనేది సంజ్ఞకు సంబంధించిన సంజ్ఞ.

నేలమీద జాడని చూసినప్పుడు గాని, పొదల్లో పాక్కుంటూ పోయిన జంతువు చప్పుడు విన్నప్పుడు గాని, అలాంటివి తటస్థపడినప్పుడల్లా ఆ వేటగాడు మిగతా వేటగాళ్లకి ఆ సంజ్ఞల్ని గురించిన సంజ్ఞలు చేసేవాడు.

ఆరకంగా ప్రకృతి అతనికి యిచ్చిందానికి తోడుగా, భాష అనేది మానవుడికి సంజ్ఞల్ని గురించిన సంజ్ఞ అయింది, తన తెగలోని యితరులతో సంజ్ఞలు చేసుకునే సాధనం అయింది.

తన రచనల్లో ఒకదాంట్లో పావ్‌లొవ్ మానవ భాషని ''సంజ్ఞల్ని గురించిన సంజ్ఞ'' అన్నాడు.

మొట్టమొదట్లో యీ సంజ్ఞలు వూరికే ధ్వనులూ, హావభావాలూనూ. వాటిని కళ్లూ చెవులూ అందుకుని టెలిఫోన్ కేంద్రంలో మాదిరీ మెదడుకి పంపేవి. మెదడు యీ ''సంజ్ఞల్ని గురించిన సంజ్ఞని'' అందుకోగానే వెంటనే హుకుం జారీ చేసేది: చేతులూ, మీ బల్లెం గట్టిగా పట్టుకోండి; కళ్లూ పొదల్ని జాగ్రత్తగా చూస్తూ వుండండి; చెవులూ

ప్రతి గలగలనీ, ఆకుల కదలికనీ జాగ్రత్తగా వినండి, అని. ఆ జంతువు యింకా కంటికి కనిపించనంత దూరంలో, చెవికి ధ్వని సోకనంత దూరంలో వుండచ్చు కాని వేటగాడు సిద్ధమైపోయాడు.

సంజ్ఞలూ, సూచనలూ యెంత యెక్కువగా వుంటే అంత తరచుగా ''సంజ్ఞల్ని గురించిన సంజ్ఞలు'' మెదడుకి చేరేవి, కపాలపు నుదుటి భాగంలో వున్న కేంద్రానికి అంత యెక్కువ పని వుండేది; అంటే యేమిటి, కేంద్రం అలా విస్తరించుకుంటూనే వుండాలన్న మాట. మెదడులో యింకా యెక్కువ కణాలు వచ్చాయి, వాటి మధ్య పరస్పర సంబంధం యింకా సంక్లిష్టమయింది. మెదడే పెద్దదయింది.

నియాండర్తల్ మానవుడి మెదడు పిథెక్కాన్త్రపస్ మానవుడి మెదడు కంటే 400, 500 ఘన సెంటిమీటర్లు పెద్దది. మెదడు పెరిగే కొద్దీ ఆదిమ మానవుడు ఆలోచించడం నేర్చుకున్నాడు.

''సూర్యుడు'' అని అర్థమిచ్చే సంజ్ఞని అతను విన్నా, చూసినా, అది అర్ధరాత్రి అయినా సరే సూర్యుణ్ణి గురించి ఆలోచించేవాడు.

బల్లేన్ని తీసుకునిరా అనే సంజ్ఞ వస్తే, అది ఆక్షణంలో యెక్కడా కంటికి ఆనకపోయినా, దాన్ని గురించి ఆలోచించేవాడు.

సమష్టిగా చేసే పని మనిషికి మాట్లాడ్డం నేర్పింది, అతను మాట్లాడ్డం యెప్పుడు మొదలెట్టాడో, అప్పుడే ఆలోచించడమూ మొదలెట్టాడు.

మానవుడు ఆలోచనా శక్తిని యే దేవుడి కరుణా కటాక్ష లబ్ధంగానో పొందలేదు. దాన్ని అతను తన చేతులు చేసిన శ్రమద్వారా సంపాదించుకున్నాడు.

# నాలుకా, చెయ్యీ తమ స్థానాలని యెలా బదలాయించుకున్నాయి

చాలా కొద్ది పనిముట్లు వున్నప్పుడూ, మానవుడి అనుభవం యింకా చాలా పరిమితంగా వున్నప్పుడూ, ఒకడి నైపుణ్యాన్ని యింకొకడికి బోధించడానికి చాలా తేలికైన సంజ్ఞలు చాలు.

మానవ పరిశ్రమ సంక్లిష్టమయ్యే కొద్దీ, సంజ్ఞలూ సంక్లిష్టమయ్యాయి. ప్రతి వస్తువుకీ ఒక సంజ్ఞ వుండాలి. ఆ సంజ్ఞ దాన్ని నిర్దిష్టంగా వర్ణించాలి. అప్పుడూ బొమ్మల సంజ్ఞలు వచ్చాయి. మానవుడు గాలిలో జంతువులవీ, పనిముట్లవీ, చెట్లవీ, తదితర వస్తువులవీ బొమ్మలు గీసేవాడు.

ఉదాహరణకి అతను ముళ్లపందిని గురించి వర్ణించాలనుకోండి, అతను గాలిలో వూరికే ముళ్లపంది బొమ్మ గియ్యడమే కాదు, ఒక్క క్షణం పాటు తనే ముళ్లపంది అయినట్టు అభినయించేవాడు. ముళ్లపంది నేలని యెలా తవ్వుతుందో, తన పంజాలతోటి మట్టిని యెలా పక్కలకి తోడేస్తుందో, దాని ముళ్లు యెలా నిటారుగా అవుతాయో అతను యితరులకి చూపించేవాడు.

మూకాభినయంలో యిలా వర్ణించాలంటే ఆదిమ మానవుడికి, మన రోజుల్లో కళాకారుల్లాగా, నిశితమైన పరిశీలనా శక్తులు వుండాలి.



సంజ్ఞల భాషని వాడుతున్న ఎర్ర ఇండియన్ తెగ మనిషి

''నేను నీళ్లు తాగాను'' అని మీరు చెప్పినప్పుడు, అవతలి మనిషి మీ మాటల్ని బట్టి మీరు నీళ్లు గ్లాసుతో తాగారో, సీసాతో తాగారో, దోసిటితో తాగారో చెప్పలేడు.

సంజ్ఞల భాషతో తను చెప్పేదాన్ని అర్థమయేటట్టు చెయ్యడం మర్చిపోనివాడు దీన్నే యింకో విధంగా చెబుతాడు.

అతను దోసిలిని నోటిదగ్గర పెట్టి నీళ్లని చప్పరిస్తున్నట్టు కల్పిస్తాడు. అతన్ని చూసిన వాళ్లకి ఆ నీళ్లు యెంత మధురంగా, చల్లగా, హాయిగా వున్నదీ అర్థమవుతుంది.

మనం ''పట్టుకో'', ''వేటాడు'' అంటాం. ఆదిమ మానవుడు మొత్తం వేట దృశ్యమంతా అభినయించేవాడు.

సంజ్ఞల భాష ఒకో అప్పుడు చాలా భావస్ఫోరకంగా వుంటుంది, ఒకో అప్పుడు వుండదు.

అది భావస్ఫోరకంగా యెందుకు వుండేదంటే అది ఒక సంఘటననో, వస్తువునో కళ్లకి కట్టినట్టు చూపించేది. కాని అది చాలా పరిమితమైంది కూడా.

సంజ్ఞ భాషలో మీరు కుడి కన్నునో, ఎడమ కన్నునో చూపించవచ్చు, కానీ ఒట్టి ''కన్ను'' అనేదాన్ని చూపించడం చాలా కష్టం.

వస్తువుల్ని కచ్చితంగా వర్ణించడానికి సంజ్ఞలు పనికొస్తాయి, కాని అపరిమేయ భావానికి యేం సంజ్ఞలూ పనికి రావు.

సంజ్ఞా భాషకి యితర లోపాలు కూడా వున్నాయి.

మీరు రాత్రిళ్లు సంజ్ఞా భాషలో, యెంతగా చేతులు వూపినా గానీ చీకట్లో యెవళ్లకీ కనిపించదు కనక, యేమీ చెప్పలేరు. పట్టపగలేనా అస్తమానూ మనుషులు యీ భాషలో ఒకళ్లతో ఒకళ్లు యేం చెబుతున్నారో అర్థంచేసుకోలేరు.

పచ్చిక బీళ్లల్లో వుండేవాళ్లు సంజ్ఞలద్వారా మాట్లాడుకోగలరు. కాని అడవిలో వేటగాళ్లు ఒకళ్ల కొకళ్లకి దూరమైపోయి, మధ్యలో దట్టమైన పొదలు అడ్డం వుంటే? అది అసాధ్యం.

అప్పుడు మనుషులకి తమ భావాల్ని చెప్పడానికి ధ్వనులు అవసరం అయాయి.

మొట్టమొదట్లో ఆదిమ మానవుడి నాలుకా, గొంతూ స్వాధీనంలో వుండేవి కావు. ఒక ధ్వని యింకో ధ్వని లాగానే వుండేది. విడివిడి ధ్వనులు మూలుగు లాగానో, కేక లాగానో, అరుపు లాగానో కలిసిపోయేవి. తన నాలుకని స్పష్టంగా మాట్లాడేటట్టు చేసుకోడానికి మానవుడికి చాలా కాలం పట్టింది.

అన్ని సంజ్ఞల్లోకీ నాలిక కదలికలే అసలు కనిపించకుండా వుండేవి, కాని వాటికున్న సౌకర్యం యేమిటంటే వాటిని వినవచ్చు.

ఈల్ తెగలోని మనుషులు వూరికే ''నడవడం'' అనరు. వాళ్లు స్థిరంగా నడవడానికి ''జొడ్జెడ్జె'' అనీ, స్థూల కాయులు నడిచినట్టుగా నడవడానికి ''జొబొహొబొహొ'' అనీ, అటూయిటూ చూడకుండా పరిగెత్తడానికి ''జొబులా బులా'' అనీ, తడబడుతూ నడవడానికి ''జోపియాపియా'' అనీ, కొంచెం కుంటుతూ, తల ముందుకి వాలేసి నడవ డానికి ''జోగొవుగొవు'' అనీ అంటారు.

ఒక వ్యక్తి నడకలోని ప్రతి వివరాన్నీ వర్ణించే ధ్వనిలోని బొమ్మలే యీ ప్రతి ఒక్క వ్యక్తీకరణానూ. వీటిల్లో స్థిరమైన నడక, సన్నగా తూలిపోయేవాని నడక, నిబ్బరంగా మోకాళ్లు వంచకుండా నడిచేవాని నడక అన్నీ వున్నాయి.

ఎన్ని రకాల నడకలున్నాయో అన్ని రకాల వ్యక్తీకరణలున్నాయి.

యీ రకంగా చేష్టల భాష బదులు క్రమేపీ ధ్వని బొమ్మల భాష వచ్చింది.

యీ రకంగా మానవుడు సంజ్ఞలద్వారా, మాటలద్వారా మాట్లాడ్డం నేర్చుకున్నాడు.

# నది, దాని పుట్టుక

గతంలోకి మన ప్రయాణాలవల్ల మనం యేం చూశాం?

ఒక పరిశోధకుడు యేదేనా నది పుట్టుకని గురించి తెలుసుకోవడం కోసం నది యెగువకి అలా వెళ్లినట్టే, మనం కూడా మానవ అనుభవం అనే మహానది పుట్టుకకి కారణమైన చిన్న సెలయేటి దగ్గరకి వచ్చాం.

ఆ నదీ ప్రారంభం దగ్గర మానవ సమాజపు ఆరంభాన్నీ భాషా, ఆలోచనల ఆరంభాన్నీ కూడా మనం చూశాం.

ఒకదాని తర్వాత ఒకటిగా ఉపనదులు వచ్చి కలిసే కొద్దీ నది లోతు అయినట్టే, మానవ అనుభవం కూడా లోతుగా, విశాలంగా అవుతుంది, యేమంటే ఒకదాని తర్వాత ఒకటిగా వచ్చిపోయే తర్వాతి తరాలన్నీ తమ సంచిత అనుభవాన్ని అందిస్తూ వుంటాయి.

తరం తర్వాత తరం గతంలోకి కలిసిపోయింది. మనుషులూ, తెగలూ జాడ మిగల్చకుండా అదృశ్యమైపోయాయి, వూళ్లూ, పట్టణాలూ ''గతము గతంబె యెన్నటికి కన్నులకట్టదు'' అన్నట్టు మట్టి పాలైపోయాయి. కాలపురుషుని కశాఘాతానికి తట్టుకుని నిలబడగలదేదీ ప్రపంచంలో లేనట్టే కనిపించింది. కాని మానవాళి సంచితానుభవం నిలిచింది. అది కాలాన్ని జయించింది, మన భాషలో, నైపుణ్యాల్లో, విజ్ఞానశాస్త్రాల్లో జీవించి వుంది. భాషలో వున్న ప్రతి ఒక్క పదమూ, శ్రమలోని ప్రతి ఒక్క కదలికా, విజ్ఞాన శాస్త్రంలోని ప్రతి భావవా గడిచిపోయిన అన్ని తరాలవారి సంచి తాను భవమే.

నదికుండే యే ఒక్క ఉపనదీ పోకుండా వున్నట్టే, యీ అన్ని తరాలవాళ్ల శ్రమా కూడా వృధాపోలేదు. మనకి ముందు జీవించిన ప్రజలందరి శ్రమ, యిప్పుడు జీవిస్తున్న వాళ్ల శ్రమ మానవ అనుభవం అనే నదిలో కలుస్తున్నాయి.

మనం నదీ ప్రారంభం దగ్గరకి, మన ప్రయత్నాలు ఆరంభం దగ్గరికి చేరుకున్నాం. మానవుడు — పనిచేసేవాడు, మాట్లాడేవాడు, ఆలోచించేవాడు అయిన మానవుడు — యీ రకంగా రూపు తీసుకున్నాడు.

వానరాలనుంచి మనల్ని వేరుచేసే లక్షలాది సంవత్సరాల కాలంకేసి వెనక్కి తిరిగి చూసుకుంటే, ఎంగెల్స్ అన్న మాటలు గుర్తుకు తెచ్చుకోకుండా వుండలేం. శ్రమ అనేది మానవుణ్ణి సృష్టించిందని ఆయన అన్నాడు.

# ప్రకరణం ఆరు

## వదిలిపెట్టిన యిల్లు

మనుషులు యేదేనా యింటిని శాశ్వతంగా వదిలిపెట్టేసేటప్పుడు కూడా అక్కడ వాళ్లు వదిలేసిన కొన్ని వస్తువులు మిగిలే వుంటాయి. కాగితాల ముక్కలు, విరిగిపోయిన పింగాణీ సామానూ, పాత జాడీలు ఖాళీ గదుల్లో చిందర వందరగా పడివుంటాయి. చలి కాచుకునే పొయ్యి వంకరటింకరగా అయిపోయిన గిన్నెలతోటీ పెనాలతోటీ చిందర వందరగా వుంటుంది. కిటికీ తీనెమీద అడ్డకొయ్యమీద మట్టు వూడిపోయిన దీపం యీ గందరగోళాన్నంతనీ విచారంగా చూస్తూ వుంటుంది.

యీ శకలాల అవశేషాలతోటి ఆ కుటుంబం అక్కడెలా బతికిందో చెప్పడం కష్టమే. కాని పురాతత్వశాస్త్రవేత్తన్ని వేధించే సమస్య సరిగ్గా యిదే. అతనే అలాంటి యిళ్లల్లోకి ఆఖర్న ప్రవేశించేవాడు. ఏదేనా యిల్లంటూ దొరికితే అతను అదృష్టవంతుడే. కాని చిత్రమేమిటంటే అక్కడ కాపరం వుండే వాళ్లు ఆ యిల్లు వదిలిపెట్టి వెళ్లిపోయిన కొన్ని వేల సంవత్సరాలకి తర్వాత అతనక్కడకి వెడతాడు. ఒకో అప్పుడు అతనికి దొరికేవల్లా విరిగిపోయిన గోడలూ, పునాదిలో ముక్కలూనూ. యిక్కడ ప్రతి మట్టికుండా ఒక ఆవిష్కరణే, యే చిన్న పెంకుముక్క దొరికినా అదృష్టమే.

ఆ భాష అర్థం చేసుకోగల వాడికి ఒక పాత యిల్లు చెప్పే సంగతులు యెన్నో!

చిరిగిన బట్టలలా వున్న పాత రాళ్ల గోపురాలూ, నాచునిండిన గోడలూ యెన్ని సంఘటనలని చూశాయో, యెంత మంది జనాన్ని చూశాయో!

కాని మిగిలిన యిళ్లు, ప్రపంచంలో కల్లా అతి ప్రాచీనమైనవైనవి, ఆదిమ మానవుడి గుహలు, యింకా యెక్కువ చూశాయి.

అంతెందుకు, యాభై వేల యేళ్ల క్రితం జనం నివశించిన గుహలు వున్నాయి! అదృష్టవశాత్తూ పర్వతాలు యింకొంచెం గట్టి పిండాలు, కాబట్టి మనుషుల యిళ్లమాదిరీ కూలిపోవు గుహల గోడలు.

అలాంటి గుహల్లో ఒకటిదిగో. అందులో కాపరం వుండే వాళ్లు మారిపోతూనే వున్నారు. మొట్టమొదటి యజమాని భూగర్భ సెలయేరు. దాంతోబాటు మట్టీ, యిసక, గులకరాళ్లూ వచ్చాయి.

తర్వాత నీరు తీసేసింది. మనుషులు ఆ గుహలో కాపరం చేశారు. మట్టిలో దొరికిన ముతకరాతి పనిముట్లు వాళ్లని గురించి కొంచెం విషయం చెబుతాయి. ఆదిమ మానవులు యీ కత్తుల్ని జంతువుల కళేబరాల్ని కొయ్యడానికీ, వాటి యెముకలనుంచి మాంసాన్ని గీకడానికీ, మూలుగుల్ని తీసుకోవడానికి యెముకల్ని బద్దలుకొట్టడానికీ వాడేవాళ్లు. అంటే ఆ మనుషులు వేటగాళ్లన్న మాట.

చాలా యేళ్లు గడిచిపోయాయి. ఆ వేటగాళ్లు ఆ గుహని వదిలేశారు. కొత్త వాళ్లు ఆ వాటాలోకి ప్రవేశించారు. ఆ గుహగోడలు నున్నగా గచ్చు అయిపోయాయి. ఆ పని చేసింది గుహలో వున్న ఎలుగుబంటి. అది తన బొచ్చు చర్మాన్ని



యీ మనుషులు యిక యెంత మాత్రం గుహల్లో గాని కందకాలలో గాని వుండటం లేదు. వర్జీనియా ఎర్ర ఇండియన్ తెగవాళ్ల 16వ శతాబ్దపు శిబిరం

గరుకుగోడకి రాసుకొనేది. యిదిగో యిక్కడ వుంది యెలుగుబంటి, ఆహా. అంటే పెద్ద తలా, సన్నని ముట్టె వున్న దాని పుర్రె.

ఆ నిక్షేపాల యింకో పై పొరలో మానవ ఆవాసపు జాడలు యింకా కనిపిస్తాయి. అవి బొగ్గు, బూడిద, విరిగిన యెముకలు, చెకుముకిరాతివీ యెముకలవీ పనిముట్లు. మళ్లీ యింకో సారి మనుషులు గుహలో ఆవాసముండేందుకు వచ్చారు. మనం వాళ్లని చూడలేం కాని వాళ్లని గురించిన చాలా విషయాలు తెలుసుకోగలం. వూరికే వాళ్లు వదిలివెళ్లిన శిథిలాన్ని చూస్తే చాలు. అనుభవంలేని వాడెవడేనా అయితే అఁ, యివి చెకుముకిరాతి ముక్కలే కదా అంటాడు. కాని కొంచెం నిదానంగా చూస్తే రాబోయే కత్తి, ఆరెల స్థూల రేఖలు యిందులో కనిపిస్తాయి. ఒక పరికరానికి కత్తిలాగా కోసే పదునైన అంచు వుంది, యింకోదానికి సూదిగా వాడిగా ఆరెలాగా వుండే అగ్రం వుంది.

అవి ఆధునిక పరికరాల ప్రాచీనులు. అన్నిటికంటే అతి ప్రాచీనమైంది మన సుత్తి పూర్వుడు. అది గుండ్రంగా వుండే రాతి గొడ్డలి.

గుహలోని చెత్తకుప్ప అడుగుకంటా మనం తవ్వితే సుత్తికి దగ్గర్లోనే మనకి దాయ కనిపిస్తుంది.

సుత్తి రాతితో చేసింది.

దాయ ఎముకతో చేసింది.

యిది మనకి తెలిసిన దాయల్లాంటిది కానే కాదు, కాని అప్పచెప్పిన పని నమ్మకంగా చేసింది. దాన్నిండా గంట్లూ, గాట్లూనూ. యేమంటే యేదేనా పనిముట్టుని పదునుబెట్టినా తయారుచేసినా దెబ్బలన్నీ యిదే భరించింది.

యిక పరికరాలద్వారా మనకి తెలిసేదేమిటి?



రకరకాల పనిముట్లు వచ్చాయి. రెండు బాణంమొనలు, రంధ్రం చేసేది ఒకటి, వాడిగా చెక్కినది ఒకటి, ఎన్నింటికోవాడే గోకే పనిముట్లు







చెకుముకి రాతి పనిముట్లకి తోడుగా ఎముక పనిముట్లూ, జింక కొమ్ము పనిముట్లూ వచ్చాయి. జింకల కొమ్ములతో చేసిన బాకు, యీటె కొనలు యివి

ఆ గుహలో మొదట్లో కాపరం చేసిన వాళ్లకంటే యీ కొత్తవాళ్లు యెంతో అభివృద్ధి చెందిన వాళ్లు. గడిచి పోయిన వేలాది సంవత్సరాలలో మానవ పరిశ్రమలు చాలా వైవిధ్యపూరితంగా, సంక్లిష్టంగా తయారయాయి.

మొదట కాపరం వున్న వాళ్లు అదే వాడి పనిముట్టుని ప్రతి పనికీ వాడేవాళ్లు. యిప్పుడో! కొయ్యడానికి ఒకటి, తరగడానికి ఒకటి, గీకడానికి ఒకటి, చెక్కడానికి ఒకటి. చిన్న పదునైన అంచు వున్న పనిముట్టుని మాంసాన్ని కొయ్య డానికీ, చర్మాల్ని గీకడానికీ వాడేవాళ్లు. సూటిగా వుండే బాణం యీటె కొన.

మానవుడి కిప్పుడు పని యెక్కువ అయింది, చింతా యెక్కువైంది. కాలం మారింది. వాతావరణం చలిగా, కటువుగా తయారైంది. యిప్పుడు యెలుగుతోలు బట్టల్ని గురించీ, శీతాకాలపు తిండి నిల్వల గురించీ, బతకడానికి వెచ్చని చోటు గురించీ మానవునికి చింతపట్టుకుంది. యెన్నో భిన్నమైన పనులున్నాయి, వాటికి వేరువేరు పనిముట్లు కావాలి.

ఆరకంగా, మన పనిముట్లకీ పరికరాలకీ పూర్వుల్ని మన సుదూర పూర్వుని నివాసంలో మనం చూస్తాం. యేమైనా, కాలం మాయం చెయ్యకుండా మిగిల్చినవే మనకి దొరుకుతాయి. కాని కాలం మంచి సంరక్షకురాలు కాదు. గట్టిగా నిలబడే వాటినే కాలం జాగ్రత్త చేస్తుంది. యీ సందర్భంలో అది రాతితోటీ, యెముకతోటీ చేసిన వాటినే పదిల పరచింది. కొయ్యతోటీ, జంతు చర్మాలతోటీ తయారైన వాటినన్నిటినీ కాలం మింగేసింది. అందుకనే మనకి ఆరె కనిపిస్తుంది, కాని దాంతో కుట్టిన బట్టలు కనిపించవు. రాతి కొన కనిపిస్తుంది కాని కొయ్య యీటె కని పించదు.

మిగిలిన వస్తువుల ఆధారంబట్టి మాయమైపోయిన వాటి గురించి మనం వూహించాలి. యెన్నో వేల యేళ్లక్రితం మట్టి కలిసిపోయిన వస్తువుల్ని చేసుకుని దొరికిన ముక్కల్నిబట్టీ నీరసపు జాడల్నిబట్టీ పునర్నిర్మించుకోవాలి.

యేమైనా, మన పరిశోధన కొనసాగిద్దాం.

పురాతత్వశాస్త్రజ్ఞు డెవడేనా శిధిలాల్ని తవ్వేటప్పుడు మామూలుగా పైనుంచి మొదలెట్టి కిందికి దిగుతాడు. మొట్టమొదట పైన వుండే పొరని పరిశీలిస్తాడు, క్రమేపీ కిందికి వెడతాడు, భూగర్భంలోకి చరిత్రలోకి లోతుగా వెడతాడు. పురాతత్వశాస్త్రజ్ఞుడు పుస్తకం చివరినుంచి చదువుతాడు. చివర మొదలెట్టి మొదటి ప్రకరణాలకి వస్తాడు. కాని మనం మన కథని యింకోలా మొదలుపెట్టాం. మనం అట్టడుగు పొరలనుంచి, గుహ చరిత్ర మొదటి ప్రకరణంతోటి మొదలు పెట్టాం. అక్కణ్ణుంచి అలా పైపైకి ఆధునిక కాలానికి సమీపంగా చేరుతున్నాం.

తర్వాత ఆ గుహలో యేం జరిగింది?

యీ నిక్షేపాల పొరలనిబట్టి మనుషులు యెన్నో సార్లు ఆ గుహని వదిలిపెట్టినట్టూ, యెన్నో సార్లు తిరిగి వచ్చినట్టూ మనకి తెలుస్తుంది. గుహలో మనుషులెవరూ వుండనప్పుడు దుమ్ములగొండులూ ఎలుగుబంట్లూ అందులో వుండేవి. ధూళీ దుమ్మూ గుట్టలుగుట్టలుగా అందులో పేరుకుపోయేది. కప్పునుంచి రాతి పెళ్లలు విరిగిపడిపోతూ వుండేవి. చాలా యేళ్ల తర్వాత, యింకో కొత్త మానవ తెగ ఆ గుహని కనిపెడితే పూర్వపు వాసస్థుల గురించి వాళ్లకి చెప్పడానికి అక్కడ యేమీ వుండేది కాదు.

యేళ్లు, శతాబ్దాలు, యుగాలు గడిచిపోయాయి. ప్రజలు బయలులో యిళ్లు కట్టుకోవడం మొదలెట్టారు, యీ సహజ రక్షణ స్థావరాల్ని ఉపయోగించడం మానేశారు. ఆ గుహ ఆఖరికి పాడుపడిపోయింది. అడపాదడపా పర్వతపు పచ్చికబీళ్లలో గొర్రెల్ని మేపుకునే గొల్లవాళ్లు ఒకరోజో, అరరోజో అక్కడ కాలక్షేపంచేసే వాళ్లు, లేదా వానలో చిక్కుపడిపోయిన ప్రయాణీకులు అక్కడ తలదాచుకునే వాళ్లు.

చివరకు ఆ గుహ కట్టకడపటి ప్రకరణం మొదలైంది. మనుషులు ఆ గుహలోకి మళ్లీ వెళ్లారు. యీసారి వాళ్లు తలదాచుకోవడానికి కాదు, ఒకప్పుడు అక్కడ కాపరం వున్న వాళ్లని గురించి యావత్తూ తెలుసుకోడానికి వెళ్లారు.

చాలా తర్వాత వచ్చిన వీళ్లు ప్రాచీన రాతి పరికరాల్ని తవ్వి తియ్యడానికి ఆధునిక ఉక్కు పరికరాలతో దిగారు.

ఒక పొర తర్వాత యింకో పొరని అలా తవ్వుతూ పోయి, యీ పరిశోధకులు గుహ చరిత్రని మొదట్నుంచి చివరిదాకా చదివారు.

వాళ్లకి దొరికిన పనిముట్లనిబట్టి వాళ్లు మానవ అనుభవమూ, విభిన్న నైపుణ్యాలూ తరంనుంచి తరానికి యెలా పెరిగాయో చూడగలిగారు. ముతక పనిముట్లకి బదులు వేరేవి వచ్చాయి. రానురాను పనిముట్లు మెరుగయ్యాయి. ఆ రకంగా ముతక గొడ్డలి బదులు త్రికోణాకారపు కత్తుల్లాంటివీ, అర్ధచంద్రాకారపు గోకుడు పనిముట్లూ వచ్చాయి. తరవాత రకరకాల బాణాలు, గోకుడు పనిముట్లూ, బర్మాలూ, ఆరెలూ దొరికాయి. మంచి ఆకారం వున్న చెకుముకి రాత్తోటి వాటిని చేశారు. యింకా కొత్త ముడి సరుకు ఎముకలతోటీ, దుప్పి కొమ్ములతోటీ చేసిన పనిముట్లు చెకుముకిరాళ్ల పనిముట్లతో చేరిపోయాయి. ఎముకలతో పనిచేసేందుకూ, జంతువుల చర్మాలతో పని చేసేందుకూ, కొయ్యతో పనిచేసేందుకూ సంబంధించి ప్రత్యేకమైన పనిముట్లు వున్నాయి. ఆదిమ మానవుడు రాతితో చేసిన పనిముట్టుని ఎముకని కోసే కత్తిగా వాడేవాడు, జంతువుల చర్మాలకి గోకుడు పొరలాంటి దాన్ని వాడేవాడు. సముద్రపు గవ్వలకి రంధ్రాలు చెయ్యడానికి బర్మాలాంటి పరికరాన్ని వాడేవాడు. అతని కృత్రిమమైన గోళ్లూ, పళ్లూ కాలం గడిచే కొద్దీ యింకా యింకా వాడిగా, రకరకాలుగా అయాయి. అతను తన ఆహారమైన యెరని పట్టుకునే చెయ్యి పొడుగవుతోంది.

# పొడుగాటి చెయ్యి

మానవుడు ఒక కర్రకి రాతి కొన కట్టి యీటెని తయారు చేసుకున్నప్పుడే తన చేతిని పొడుగు చేసుకున్నాడన్న మాట.

యిది అతన్ని మరింత శక్తివంతునిగా, ధైర్యవంతునిగా చేసింది.

అంతకు ముందు అతనికి యేదేనా ఎలుగుబంటి తటస్థపడితే ఆ బొచ్చు జంతువుతో పోరాడే ధైర్యం లేక అతను పారిపోయేవాడు. చిన్న జంతువుని దేన్నేనా సరే పెద్ద కష్టం లేకుండా పట్టేసి చంపేసేవాడు, కాని ఎలుగుబంటిని మాత్రం యెదిరించే సాహసం అతనికి వుండేది కాదు. ఎలుగుబంటి పదునైన పంజాలనుంచి తప్పించుకునిపోవడం దుర్ఘటం అని అతనికి తెలుసు.

కాని ఆ పరిస్థితి అతనికి యీటె లేనప్పుడు. యీటె అతనికి ధైర్యాన్ని యిచ్చింది. అతను ఎలుగుబంటిని చూస్తే యిక యెంత మాత్రమూ భయపడి పారిపోయేవాడు కాదు, కాని ధైర్యంగా యెదిరించే వాడు. ఎలుగుబంటి వేటగాడిమీదకి యెగరడానికి వెనకకాళ్లమీద నిలబడి పైకి లేచేది. కాని దాని పంజాలు అతన్ని అందుకునేలోగానే, అతను వాడిగా వుండే యీటె కొనని దాని బొచ్చుకమ్మిన కడుపులో పొడిచేసే వాడు. యీటె ఎలుగుబంటి పంజాల కంటె పొడవైంది మరి.

గాయపడ్డ యెలుగు రౌద్రం అయిపోయి యింకా ముందుకు దూకేది, అది ముందుకి దూకిన కొద్దీ యీటె దాని కడుపులో యింకా లోతుకి పోయేది.

పాపం వేటగాడి యీటె విరిగిపోతే?

అప్పుడు ఎలుగుబంటి అతని మీదకి వురికి, రక్కి చంపేస్తుంది.

ఏమైనా ఎలుగుబంటికి యెప్పుడో గాని అలా పై చెయ్యి అయేది కాదు. ఆ రోజుల్లో మానవుడు ఒంటరిగా ఒక్కడూ యెన్నడూ వేటకి వెళ్లలేదన్న సంగతి మర్చిపోవద్దు. అతను భయంతో కేకవేశాడో మరు క్షణం మొత్తం మంద అంతా పరిగెత్తుకుని వచ్చేసేవాళ్లు. మనుషులు ఎలుగుబంటి చుట్టూ మూగేసి, రాతి కత్తులతో దాన్ని హతం చేసే వాళ్లు.

తను యెన్నడూ కలలో కూడా వూహించని ఆహారాన్ని ఆదిమ మానవుడికి యీటే తెచ్చిపెట్టింది. గుహాంతర్భాగాల్లో రాతి పలకలతో చేసిన కొట్టుగదులు పురాతత్వవేత్తలకి కనిపించాయి. రాతి పలకలని తపించి చూస్తే అడుగున యెలుగుబంటి ఎముకల పెద్ద గుట్టలు బయటపడ్డాయి. దీని అర్థం ఆ వేటగాళ్లు వేటలో నెగ్గుకొచ్చేవాళ్లనీ, వాళ్లకి నిలవ చేసుకోగలంత ఎలుగు మాంసంవుందనీ.

మానవుడు ఎలుగుబంటి లాంటి వికారమైన జంతువుల్ని వేటాడేటందుకు యీటే ఉత్తమమైన ఆయుధం. కాని అతను వేరే జంతువుల్నీ వేటాడవలసి వచ్చేది, ఎలుగుబంటికంటే వేగంగానూ, లాఘవంగానూ వుండే జంతువుల్ని వేటాడవలసి వచ్చేది.

మైదానాలమీద సంచరించేటప్పుడు, వాళ్లకి అడివి గుర్రాలూ, దున్నలూ తటస్థపడేవి. వాళ్లు ఆ మేతమేసే వాటికేసి పాక్కుంటూ వెళ్లేవాళ్లు, కాని చీమ చిటుక్కుమంటే అవి దౌడు తీసి పారిపోయేవి.

యీ జంతువుల్ని వేటాడ్డానికి ఆదిమ మానవుని చేతులు యింకా చిన్నవి. కాని ఆ వేటాడిన జంతువే అతనికి కొత్త, గట్టి పరికరాన్ని యిచ్చింది. అది యెముక.



చంపిన ఎలుగుబంటి. చరిత్రాత్పూర్వపు చిత్రకారుడు గీసిన బొమ్మ

ఎముకని తన రాతి కత్తితో చెక్కి సూటిగా వాడిగా వుండే యీటె కొనలా తయారు చేశాడు. అప్పుడు దాన్ని చిన్న కొయ్య బాణానికి కట్టేవాడు. యిప్పుడతనికి యింకో కొత్త ఆయుధం వచ్చింది. అది చిన్న యీటె. దౌడు తీసే గుర్రంమీదకి బరువైన యీటెని విసరడం వేటగాడికి కష్టం. కాని యీ తేలికైన దాన్ని విసరగలిగేవాడు, అది చాలా దూరం వెళ్లేది.

యిప్పుడు మనిషి చెయ్యి పొడుగు సాగింది. దూరం దూసుకుపోగల యీ చిన్న యీటె ఆయుధంతోటి అతను దౌడు తీసే గుర్రం కనుమరుగు కాకుండానే దాన్ని చంపగలిగే వాడు.

యేమైనా కదిలే దాన్ని గురిచూసి కొట్టడం కష్టం. దానికి నిశితమైన దృష్టీ, దృఢమైన చెయ్యీ అవసరం. వేటగాడు చిన్నతనంలోనే చిన్న యీటెని విసరడం నేర్చుకున్నాడు. అయినా ఓ వంద యీటెల్ని విసిరితే పదో పన్నెండో తగుల్తాయి.

శతాబ్దాలు గడిచిపోయాయి. వేల సంవత్సరాలు దాటి పోయాయి. అడివి గుర్రాల మందలూ, అడవిదున్నల మందలూ అరుదైపోతున్నాయి. అలా అవి నాశనమవడానికి కారణం కూడా ఆదిమ మానవుడే. పాపం, తరచుగా వేటగాళ్లు ఉత్త చేతులతోటి తిరిగి రావాల్సివచ్చేది. వాళ్లకి యింకా దూరం పోగల కొత్త ఆయుధం ఒకటి కావాల్సి వచ్చింది. ఆదిమ మానవుడు యింకొకదాన్ని కనిపెట్టాల్సివచ్చింది. అతని చేతిని యింకా సాగగలిగేటట్టు చేసేదాన్ని కనిపెట్టాల్సి వచ్చింది.

అతను కొత్త ఆయుధాన్ని కనిపెట్టాడు.

గట్టిగా వుండే లేత కొమ్మను కోసి, దాన్ని అర్ధ వలయంగా వంచి రెండు చివళ్లకీ తాడు కట్టాడు.

యిప్పుడు వేటగాడికి విల్లు వచ్చింది.

అతను వింటి తాటిని మెల్లిగా లాగేటప్పటికి అతని కండరాల సత్తువంతా అది లాక్కునేది.

అతను దాన్ని వదిలేటప్పటికి, ఆ శక్తి అంతా బాణానికి దఖలు పడేది. ఎరమీదకి దూసుకువచ్చే డేగలాగా, ఆ బాణం సర్‌మని పోయేది.

చిన్న యీటే బాణమూ అన్నదమ్ముల పోలికలున్నవే. కాని బాణం తన అన్నకంటే వేల సంవత్సరాలు చిన్నది.

ఆదిమ మానవుడికి బాణం తయారు చెయ్యడానికి వేలాది సంవత్సరాలు పట్టింది.

మొట్టమొదట్లో అతను బాణాన్ని కాకుండా, చిన్న యీటెని వింటినుంచి వదిలేవాడు. అందుకనే అతను తన విల్లుల్ని అంత దృఢమైనవిగా చెయ్యాల్సి వచ్చేది. కొన్నైతే అతనంత పొడుగూ వుండేవి.

ఆరకంగా మానవుడు తన నీరసమైన చిన్న చేతిని పొడుగ్గా బలమైందిగా చేసుకున్నాడు. లేడి కొమ్ములతోటో,



యిప్పుడు వేటగాడికి విల్లు, అమ్ములు వచ్చాయి (గుహలో గీసిన చిత్రం)

మామత్ కోరలతోటో అతను పదునైన బాణాలు చేసినప్పుడు, అతను ఆ జంతువుల ఆయుధాలైన కొమ్ములన్నీ, కోరలన్నీ, వాటిమీదకే ప్రయోగించాడు. అన్ని జంతువుల్లోకీ అతనే బలమైన వాడయేటట్టు చేసింది ఆ విద్య.

చిన్న యీటెని విసిరిన చెయ్యి, వింటి తాటిని లాగిన చెయ్యి యిక మామూలు చెయ్యి కానేకాదు, అది మహా శక్తి సంపన్నుడి చెయ్యి.

యిక ఆ యువశక్తి సంపన్నుడు వేటాడ్డం మొదలెడితే, పొంచి పొంచి కూర్చుని ఒకదాన్నీ అరదాన్నీ వేటాడే వాడు కాదు, మొత్తం మంద అంతటినీ వేటాడేవాడు.

హిమయుగాలు వెనక్కి మళ్లాక బాణాన్ని కనిపెట్టడం జరిగింది, కాని మనం మన నాయకుణ్ణి హిమయుగం మధ్యలో వదిలేశాం.

# సజీవ జలపాతం

ఫ్రాన్సులో సొల్యుత్రే అనే చోట నిట్రపాటి కొండ అంచు ఒకటుంది.

ఆ కొండ దిగువన పురాతత్వవేత్తలు బ్రహ్మాండమైన యెముకల గుట్ట నొకదాన్ని తవ్వారు. వాటిలో మామత్‌ల వీపు యెముకలూ, ప్రాచీన కాలపు ఎద్దుల కొమ్ములూ, గుహల్లో వుండే ఎలుగుబంట్ల పుర్రెలూ వున్నాయి.

కాని గుర్రం యెముకలున్నంత యెక్కువగా యే జంతువువీ లేవు. ఒకోచోట యీ యెముకల గుట్టలు మనుషుల కంటే యెత్తున్నాయి. శాస్త్రజ్ఞులు యీ యెముకల గుట్టల్ని వేర్పాటుచేసినప్పుడు వాటిలో కనీసం లక్ష గుర్రాల అవశేషాలున్నట్టు కనిపెట్టారు.

అంత బ్రహ్మాండమైన అశ్వశ్మశానం యెక్కణ్ణుంచి వచ్చి వుంటుంది?

యింకొంచెం నిశితంగా పరిశీలించిన మీదట, చాలా యెముకలు బద్దలైపోయీ, చిట్లిపోయీ, మాడిపోయీ వున్నట్టు కనిపించింది. ప్రాచీన కాలపు వంటవాళ్ల చేతిలో వాటి పని తీరిపోయాక ఆ యెముకలకి ఆ గతి పట్టిందని తేటతెల్లమైంది. యీ అసామాన్య అశ్వశ్మశానం వంటయింటి చెత్త తప్ప యింకేమీ కాదు.

అంత పెద్ద గుట్ట ఒక్క ఏడాదిలో పోగుపడ్డం జరగదు. అంచేత ప్రజలు యిక్కడ చాలా, చాలా సంవత్సరాలు జీవించి వుండాలి.



గుర్రాలు, జింకలు (ఎముకమీద గీసిన చిత్రం)

కాని కొండచరియ అడుగున ఆ కుప్ప యెందుకు వుంది? ఆదిమ మానవుడు తమ మకాంని యెక్కణ్ణో సమతలం మీద కాకుండా కొండ దిగువన యేర్పాటు చేసుకోవడం వూరికే యాదృచ్ఛికమేనా?

బహుశా జరిగింది యిదై వుండవచ్చును.

వేటగాళ్లు గుర్రాల మందని మైదానంమీద చూసినప్పుడు, నిలువెత్తు గడ్డిలో దాంకుంటూ, జాగ్రత్తగా పాకుతూ వుండి వుంటారు. ప్రతి వేటగాడి దగ్గరా కొన్ని చిన్న యీటెలు వున్నాయి. ముందున్న వాళ్లు వెనక వున్న వాళ్లకి గుర్రాలెక్కడున్నదీ, యెన్ని వున్నదీ, యెటు పోతున్నదీ సైగ చేసి వుంటారు.

అప్పుడు వేటగాళ్లు ఒకే వరసలోకి వచ్చి ఆ మందకి యింకా యింకా దగ్గరకి చేరివుంటారు. పచ్చికబీళ్లల్లో

నల్లటి మచ్చల్లాగా కనిపించిన ఆ గుర్రాలు యిప్పుడు బాగా స్పష్టంగా కనిపిస్తున్నాయి. వాటికి పెద్ద తలలూ, చలాకీ కాళ్ళూ, ఒంటి నిండా బొచ్చూ వున్నాయి.

ఆ మందకి భయం పట్టుకుంది. అవి శత్రువుని పసికట్టి పలాయనం చిత్తగించడానికి సిద్ధమయ్యాయి. కాని లాభం లేదు, అలస్యమైపోయింది. సత్యభామ నరకాసురుడిమీద బాణాలు వేసినట్టుగా చిన్న యీటెల వాన వాటి మీద కురిసింది.

ఆ చిన్న యీటెలు ఆ గుర్రాల చట్టలమీద, వీపులమీద, మెళ్ళమీద గుచ్చుకుపోయాయి. గుర్రాలకి మూడు వైపులనుంచీ చుట్టుముడుతున్న శత్రువులు. చుట్టూతా హఠాత్తుగా నేలలోంచి మొలిచినట్టున్న మూడు వైపుల సజీవమైన గోడలనుంచీ పారిపోవడానికి ఒక్కటే మార్గం వుంది. వేటగాళ్లనుంచి పారిపోతూ, పరమ వికటంగా సకిలిస్తూ, ఆ మంద ఆ ఖాళీ జాగాలోంచి మెరుములా దూసుకుపోయింది. ఆ మనుషులకి కావాల్సింది సరిగ్గా అదే. వాళ్లు ఆ గుర్రాల్ని యింకా యింకా యెత్తుకి, శిఖరం వేపుకి పోయేటట్టు తరిమారు. ఆ గుర్రాలు భయంలో పిచ్చెక్కిపోయి, యెటు పోతున్నాయో దిక్కుతోచక దౌడు తీస్తూనే వున్నాయి. రెపరెపలాడే జండాలా యెగిరే తోకలూ, చెమటలు కక్కే వీపులూ పెద్ద నదీ ప్రవాహంలా వున్నాయి. యీ ప్రవాహం కొండ చివరికి చేరింది. ఏముంది, హఠాత్తుగా వాటి ముందు కొండచరియ ప్రత్యక్షం. యింకో క్షణంలో ముందున్న గుర్రాలు అక్కడికి చేరిపోయాయి. ముందున్న ప్రమాదం గమనించి అవి వెర్రిగా బుసలు కొడుతూ వెనక్కి తిరిగాయి. కాని అప్పటికే అంతా అయిపోయింది. ముందున్నవి ఆగలేవు, యేమంటే వెనక వున్నవి ముందుకు తోసుకువస్తున్నాయి, వాటిని కొండ శిఖరంమీదనుంచి గెంటేస్తున్నాయి.

జలపాతం కొండ శిఖరంమీదనుంచి దూకినట్టుగా యీ సజీవ అశ్వ ప్రవాహం శిఖరంమీదనుంచి దూకి కింద కళేబరాల గుట్టగా, విరిగిన యెముకల గుట్టగా మారింది.

వేట పూర్తయింది.

కొండ దిగువన విడిది మంటలు జ్వాజ్వల్యమానంగా వెలిగాయి. మొత్తం మంద అంతటికీ చెందిన ఆ ఉమ్మడి ఆస్తిని వృద్ధులు భాగాలు చేశారు. కాని మంచి మంచి ఖండాలన్నీ సాహసోపేతులకీ, ఎక్కువ నైపుణ్యం కలవాళ్లకీనీ.

# కొత్త మనుషులు

మనం గడియారంలో గంటల ముల్లుకేసి చూస్తే అది కదులుతున్నట్టే అనిపించదు. ఒక గంటో, రెండు గంటలో గడిచేటప్పటికి అది కదిలిందని తెలుస్తుంది.

అదే జీవితానికీ వర్తిస్తుంది. మన పరిసరాల్లో గాని, ఆ మాటకొస్తే మనలోగాని జరిగే మార్పులని మనం తక్షణం గమనించం. చరిత్ర చిన్న ముల్లు కదలిక లేకుండా వుందని మనం అనుకుంటాం. కొన్ని యేళ్ల తర్వాతనే మనం చిన్న ముల్లు కదిలిందనీ, మనం కూడా మారిపోయామనీ, మనచుట్టూ వున్న ప్రతీదీ భిన్నంగా వుందనీ హఠాత్తుగా గుర్తిస్తాం.

మన డైరీలతోటీ, ఫోటోలతోటీ, వార్తాపత్రికలతోటీ, పుస్తకాలతోటీ కొత్తనీ పాతనీ మనం పోల్చవచ్చు. మనకి పోల్చడానికి వస్తువులు వున్నాయి. కాని మన ఆదిమ మానవులకి పాతదాన్నీ కొత్తదాన్నీ పోల్చడానికి యేమీ లేవు.



క్రోమాన్యాన్ నరుడి ఆత్మ చిత్రం (మామత్ ఎముకమీద చిత్రం)

జీవితం నిశ్చలంగా, మార్పులేకుండా వుందని వాళ్లు అనుకునే వాళ్లు. గడియారంమీద అంకెలు లేకుండా చిన్న ముల్లు కదలికని గుర్తించలేనట్టే పాతదాన్నీ కొత్తదాన్నీ పోల్చకుండా మార్పుని గుర్తించడం అసాధ్యం.

రాతి పనిముట్లని చెక్కే ప్రతివాడూ తనకా నైపుణ్యాన్ని నేర్పినవాడి కదలికన్నీ పద్ధతుల్నీ అనుకరించ ప్రయత్నించేవాడు.

యింటిని సర్దుకునేటప్పుడు ఆడవాళ్లు అచ్చం తమ మామ్మలు పెట్టినట్టే పొయ్యిని వుంచేవాళ్లు.

వేటగాళ్లు పూర్వాచార పద్ధతిలోనే జంతువుని వేటాడే వాళ్లు.

అయినా, ఎవరూ గమనించకుండానే, క్రమేపీ మానవులు తమ పనిముట్లనీ, తమ నివాసాల్నీ, తమ పని పద్ధతుల్నీ మార్చుకున్నారు.





క్రోమాన్యాన్ నరుడికీ యీనాటి మానవుడికీ ఆకారంలో పెద్ద తేడా లేదు. క్రైమియాలో దొరికిన పుర్రెలనుంచి రూపొందించిన చిత్రాలు

ప్రతి కొత్త పనిముట్టూ మొదట్లో పాతదానిలాగానే వుండేది. మొదటి చిన్న యీటె బల్లెంకంటే తేడాగా వుండేది కాదు. మొదటి బాణం అచ్చం చిన్న యీటెలాగానే వుండేది. కాని బాణానికీ, బల్లేనికీ మధ్య హస్తి మశకాంతర భిన్నత్వం వుండేది. విల్లుతోటీ బాణంతోటీ వేటాడ్డం బల్లెంతోటి వేటాడినట్టు వుండేదే కాదు.

మానవుడి పనిముట్లూ ఆయుధాలూ మారడమే కాదు — మానవుడు తనే మారుతున్నాడు. అనేక తవ్వక స్థలాల్లో దొరికిన అస్థిపంజరాలని బట్టి యీ విషయం తెలుస్తుంది. హిమయుగాంతంలో గుహని వదలిపెట్టినవాడితో గుహలో మొదట అడుగుపెట్టినవాణ్ణి పోలిస్తే వాళ్ళిద్దరూ విభిన్నమైన జీవులని మనకి అనిపిస్తుంది. మొదట గుహలో అడుగుపెట్టినవాడు నియాండర్తల్ నరుడు. అతని వీపు వంగి వుండేది, నిటారుగా వుండే నడక కంటే యెక్కువగా తడబడుతూ ముందుకుపోవడం వుండేది, అతనికి దాదాపు నుదురు అనేదే లేదు, గడ్డం సంగతి సరేసరి. కాని పొందికైన అవయవ నిర్మాణం వున్న క్రోమాన్యాన్ మానవుడు, ఆఖరున గుహ నివాసం వదిలినవాడు, ఆకారంలో మనకంటే తేడాగా వుండేవాడు కాదు.

# ''గృహ చరిత్ర'' పుస్తకంలోని మొదటి ప్రకరణం

మానవుడి జీవిత విధానం మారే కొద్దీ అతని నివాసమూ మారింది. అతని యింటి చరిత్రని మనం రాయాల్సివస్తే మనం గుహతో మొదలుపెట్టాలి. ప్రకృతి నిర్మించిన యీ నివాసం ఆదిమ మానవుడు నిర్మించుకున్నది కాదు, అతను కనిపెట్టింది.

కాని ప్రకృతి మంచి నిర్మాణం చెయ్యదు. కొండల్నీ, కొండ గుహల్నీ తయారు చేసినప్పుడు వాటిల్లో యెవరేనా వుంటారా వుండరా అన్న శ్రద్ధ దానికి లేదు. అందుకనే ఆదిమ మానవులు వాసం చెయ్యడానికి గుహకోసం వెదికేటప్పుడు వాళ్ళకి కావలసిన గుహ అరుదుగా లభ్యమయ్యేది. కప్పు యెత్తు తక్కువగానేనా వుండేది, గోడలు కూలిపోయేటట్టేనా వుండేవి, ముందుగుమ్మం పాకి లోపలకి పోయేదానికి కూడా కష్టమయేటంత చిన్నదిగానేనా వుండేది.








చరిత్రాత్పూర్వపు కళాకారులు తమ యిళ్ళని యిలా బొమ్మల్లో గీశారు

మొత్తం మంద మందంతా యింటిని చక్కబెట్టే పనిలో దూకేవాళ్లు. రాతి పనిముట్లతోటీ, కొయ్య బొంగుల తోటీ నేలంతా చదునుచేసి, గోడల్ని గీకి శుభ్రం చేసే వాళ్లు. ముందు గుమ్మానికి దగ్గర్లోనే ఒక పొయ్యిని తవ్వి దాన్ని రాళ్లతో చుట్టూ కట్టేవాళ్లు. నేలమీద చిన్న గోతులు తవ్వి తల్లులు శిశువులకీ, చిన్న పిల్లలకీ ''వుయ్యాలా తొట్టె''లు చేసేవాళ్లు. వాటిమీద పరుపులు లేవు. పొయ్యిలో మండే వెచ్చటి బొగ్గుల్ని పక్కన పెట్టేవాళ్లు.

గుహలో ఒక మూల యెలుగుబంటి మాంసానికీ, యితర వస్తువులకీ ఒక కొట్టుగదిని యేర్పాటు చేసేవాళ్లు. యీరకంగా ఆదిమ మానవులు ప్రకృతి నిర్మించిన గుహని తమ శ్రమద్వారా మార్చి మానవ వాసస్థానంగా చేసుకున్నారు.

కాలం గడిచేకొద్దీ వాళ్లు తమ నివాసాలకి సౌకర్యాలు సమకూర్చుకున్నారు.

కొండ అంచులనుంచి చొచ్చుకువచ్చిన సహజమైన అస్తరణ వాళ్లకి కనిపిస్తే దానికి గోడలు కట్టేవాళ్లు. నాలుగు గోడల ఆకారంలో యేదేనా కనిపిస్తే దానిపైన కప్పువేశేవాళ్లు.

దక్షిణ ఫ్రాన్స్‌లోని పర్వతాల్లో ప్రాచీన వాసస్థానం యింకా వుంది. అక్కడి స్థానికులు దానికి చిత్రమైన పేరుపెట్టారు. వాళ్లు దాన్ని ''దెయ్యాల పొయ్యి'' అంటారు. పెద్ద పెద్ద బండరాళ్లతో తయారైన ఆ కొంపలోని పొయ్యి దగ్గర దెయ్యం మాత్రమే చలి కాచుకుంటుందని వాళ్ల అభిప్రాయం. తమ పూర్వులని గురించిన జ్ఞానం వాళ్లకి యింకొంచెం యెక్కువ వుండివుంటే ఆ దెయ్యాల పొయ్యి మనుషుల హస్తాలు కట్టిందేనని గ్రహించి వుండేవాళ్లు.

యిక్కడ ఆదిమ మానవులకి కొండపైనుంచి పొడుచుకువచ్చిన కప్పు వున్న రెండు గోడలు కనిపించాయి. కొండ మీదనుంచి దొర్లిన రాళ్లతో అవి యేర్పడ్డాయి. వాళ్లు యింకో రెండు గోడల్ని కట్టి తాము చూసిన రెండు గోడలకీ కలిపేశారు. ఒకటి పెద్ద రాతి పలకలతో చేసింది, రెండవది కర్రలు పాతి వాటికి కొమ్మలు లోపలా బయటా అల్లి, జంతు చర్మాలతో కప్పింది. నాలుగో గోడ యెలా వుండేదో మనం వూహించాల్సిందే, యేమంటే అది కాల గర్భంలో కలిసి పోయింది.

గోడలు ఒక గొయ్యిని, అంటే నేలలో తవ్విన కంతని, చుట్టివుండేవి. ఆ గొయ్యి అడుగున పురాతత్వవేత్తలకి చెకుముకిరాతి ముక్కలూ, ఎముకలతోటీ, కొమ్ములతోటీ చేసిన పనిముట్లూ కనిపించాయి.

ఆ దెయ్యపు పొయ్యి సగం యిల్లూ, సగం గుహా. యిక్కడనుంచి అసలు యింటికి యెంతో దూరం లేదు. యేమంటే రెండు గోడల్ని కట్టడం ఆదిమ మానవుడు ఒకసారి నేర్చుకున్నాడో, నాలుగు గోడలని కట్టడం త్వరలోనే నేర్చుకున్నాడు.

ఆరకంగా మొదటి యిళ్లు గుహల్లో కాకుండా, కొండ అంచుల అస్తరణల్లో కాకుండా, ఆరుబయలు ప్రదేశాల్లో వెలిశాయి.

## ఆదిమ వేటగాళ్ల నివాసాలు

దోన్ నది దగ్గర వున్న గగారినో అనే గ్రామంలో 1925 ఆకురాలుకాలంలో అంతోనొవ్ అనే రైతు తన పెరట్లో మట్టి కోసం తవ్వుతున్నాడు. తన కొత్త షెడ్‌ని అలకడానికి అతనికి ఆ మట్టి కావాల్సి వచ్చింది.

కాని అతని పారకి నేలలో కప్పడిన యెముకలే తగుల్తున్నాయి.

సరిగ్గా ఆ సమయంలో ఆ వూరి బళ్లో పనిచేసే టీచరు వ్లదీమిరొవ్ అటు వెడుతున్నాడు. అంతోనొవ్ అతన్ని పిలిచి ఫిర్యాదు చేశాడు:

''యీా యెముకలన్నీ యేమిటండీ బాబూ! యెలా వచ్చాయో తెలీదు. తవ్వడానిక్కూడా వీలవడం లేదు. కొంచెం వుంటే నా పార విరిగిపోయేదే!''

అంతోనొవ్ యింకెవరితోనేనా చెప్పివుంటే ఆ మనిషి కాసేపు యేదో కబుర్లు చెప్పి తన దారిన వెళ్లిపోయి వుండే వాడు.

కాని ఆ టీచర్‌కి శాస్త్రవిజ్ఞానం అంటే శ్రద్ధ.

అతను పెరట్లోకి వచ్చి బాగా నున్నగా దళసరిగా వున్న పసుప్పచ్చ దంతపు ముక్కని పరిశీలించాడు.

అంత పెద్ద దంతం మామత్‌కి మాత్రమే వుంటుందనేది స్పష్టమే.

దోన్ నది ప్రాంతంలో మామత్! యిది నిజంగా ఆశ్చర్యకరమే.

ఆ టీచర్ యీ యెముకల గుట్టని ఒక లారీలో వేసుకుని దగ్గర్లోనే వున్న పట్టణానికి తీసుకుపోయాడు. అక్కడ ఒక చిన్న స్థానిక మ్యూజియం వుంది.

అలాంటి మ్యూజియమ్‌కి మీరు యెప్పుడేనా వెడితే వింత వింత వస్తువులన్నీ ఒక దాని పక్క ఒకటి పడివుండటం కనిపిస్తుంది. ఒక గదిలోనే పాలరాతి క్యుపిడ్ (గ్రీకుల మన్మధుడు) బొమ్మ, పక్కనే 17వ శతాబ్దపు జమీందారు గారి తైల వర్ణచిత్రం కనిపించవచ్చు.

యింకో గదిలో స్థానిక ఖనిజాలు, మొక్కలూ తోబాటుగా గద చేతితో పట్టుకున్న పిథెకాంత్రపస్ నరుడి కాగితపు గుజ్జు బొమ్మ వుంటుంది.

సరిగ్గా అలాంటి మ్యూజియమ్‌కే వ్లదీమిరొవ్ ఆ యెముకల్ని తీసుకువచ్చాడు.

ఆ మ్యూజియమ్ అధికారి మామత్ దంతాన్నీ, మిగతా యెముకల్నీ తన కేటలాగ్‌లో రాసుకుని ఆ ఖనిజాల పక్కనీ, పిథెకాంత్రపస్ నరుని పక్కనీ ప్రదర్శనకి పెట్టివుండచ్చు.

కాని అతను అంతటితో వూరుకోలేదు. అతను లెనిన్‌గ్రాడ్‌లోని మానవశరీరశాస్త్ర, మానవ జాతుల వర్ణనాశాస్త్ర మ్యూజియమ్‌కి ఒక ఉత్తరం రాశాడు. అక్కడ, నేవా నది ఒడ్డున ఒక పురాతన గృహంలో రష్యన్ శాస్త్రజ్ఞులూ, పరిశోధకులూ ప్రపంచపు అన్ని మూలలనుంచీ పోగుచేసి తెచ్చిన అద్భుత వస్తు సంచయం వుంటుంది.

త్వరలోనే జమ్యాతిన్ అనే పురాతత్వవేత్త ఆ టీచర్‌తో కలిసి తవ్వకం కొనసాగించడానికి లెనిన్‌గ్రాడ్‌నుంచి గగారినో గ్రామానికి వచ్చాడు.

మామూలుగా మన దేశంలో జరిగేదే యిది: ఒక టీచరో లైబ్రేరియనో పాతకాలపు సంస్కృతీ చిహ్నాల్ని చూడ్డం తటస్థిస్తే దాన్ని గురించి దగ్గర్లో వున్న మ్యూజియమ్‌కి రాసి తెలియచేస్తారు. నగరంనుంచి శాస్త్రజ్ఞులు పరిశోధన కొనసాగించడానికి వస్తారు.

గగారినోలో వాళ్లకి యేం కనిపించింది?

తవ్వకపు మొదటి రోజుల్లోనే వాళ్లకి రాతి గోకుడు పనిముట్లూ, కత్తులూ, యెముక ఆరె, రంధ్రం వున్న ధృవ ప్రాంతపు నక్క పన్నూ, పొయ్యిలోని బొగ్గుతో కలిసిపోయిన మామత్, మిగతా జంతువుల యెముకలూ కనిపించాయి.

అంతోనొవ్ షెడ్‌కి పూతపెట్టిన మట్టిలో కూడా అలాంటి దంతపు తునకలూ, రాతి పనిముట్లూ కనిపించాయి. అలా మట్టిలో కలిసిపోయిన ముక్కలు యెన్ని వున్నాయంటే, వాటిని యేరడం కాలహరణమని ఆ రైతు కుటుంబం భావించింది.

వాళ్లు నెలల కొద్దీ తవ్వుతూనే వున్నారు, కొత్త వస్తువులని కనిపెడుతూనే వున్నారు. వాళ్లకి దొరికిన వాటిల్లో పనిముట్లూ, నగలూ, చిన్న బొమ్మలూ, జంతువుల యెముకలూ వున్నాయి. ప్రతీ దాన్నీ జాగ్రత్తగా బుట్టల్లో పెట్టి లెనిన్‌గ్రాడ్‌కి తీసుకుపోయారు. అక్కడ అనేక రంగాల ప్రత్యేక నిపుణులు వాటిని పరిశీలించారు.

పనిముట్లకి యే రకం రాయి వాడిందీ ఖనిజ శాస్త్రవేత్తలు నిర్ణయించారు. నాశనమైన జీవుల గురించి అధ్యయనం చేసే శాస్త్రజ్ఞులు యీ ప్రాచీనకాలపు వేటగాళ్లు యే జంతువుల్ని వేటాడేరో కనిపెట్టడానికి యెముకల్ని పరిశోధించారు. నిపుణులైన పునఃస్థాపకులు కాలం చెరిపివేసిన యెముక బొమ్మలకి అసలు ఆకారం తేవడానికి ప్రయత్నించారు.

యీ లోపుగా పురాతత్వవేత్తలు, పురావస్తువుల తవ్వకపు అన్ని నియమాలనీ పాటిస్తూ, తవ్వకం కొనసాగించారు. త్వరలోనే యీ ప్రాచీనకాలపు వేటగాళ్ల నివాసాన్ని గురించిన దృశ్యం వాళ్లకి వచ్చింది.

ఆకారంలో అది గుండ్రటి గొయ్యిలాంటి భూగృహం. గోడలు బయట రాతి పలకలతోటీ, మామత్ దంతాలతోటీ, దవడ యెముకలతోటీ గట్టిచేసినవి. గోడలు బహుశా జంతు చర్మాలతో కప్పిన కొయ్య బొంగులతో చేసినవి. కట్టు బొంగులు పైన కలిసి కప్పుగా యేర్పడ్డాయి. బరువైన రాతి పలకల్నీ మామత్ యెముకల్నీ గోడల గట్టితనానికని యివతలికంటూ దొర్లించారు.

బయటినుంచి చూస్తే ఆ నివాసం పెద్ద గుడారంలా వుంటుంది.

గోడల దగ్గర మామత్ ఎముకతో చెక్కిన రెండు ఆడ బొమ్మలు కనిపించాయి. ఒకటి చాలా బొద్దుగా వుంది, రెండోది సన్నగా వుంది. వాటిని చెక్కినవాడు బహుశా జీవితంలో తటస్థపడిన వాళ్లనే చెక్కి వుంటాడు. ఆ స్త్రీల కేశాలంకరణ తీరుని చాలా సున్నితంగా చేశాడు.





థాంప్సన్ నది ప్రాంతంలో ఎర్ర ఇండియన్ తెగవాళ్ల శీతకట్టు ఆవాసాలు. యీ నిర్మాణం చరిత్రాత్పూర్వపు నివాసాన్ని పోలివుంది

యెముక పూసలతో చేసిన హారం



నేల మధ్యలో తవ్విన గుండ్రని గొయ్యి భోషాణం పెట్టెలా పనికొచ్చేది. అందులో ఎముక సూది, ధ్రువ ప్రాంతపు నక్క దంతాలతో చేసిన పూసలు, మామత్ తోక లాంటి విలువైన వస్తువులు కనిపించాయి.

ప్రాచీనకాలపు మానవులు ఆ సూదిని కుట్టుపనికి ఉపయోగించారు; ఆ పూసలు అలంకారం; కాని అంత పదిలంగా మామత్ తోకని యెందుకు దాచినట్టు?

ప్రాచీనకాలపు మానవులు భుజాలమీద జంతు చర్మాలు కప్పుకున్నట్టూ, వెనక్కాల తోక వేలాడుతూ వున్నట్టూ, వాళ్ళు యే జంతువు చర్మం కప్పుకున్నారో ఆ జంతువులా కనిపించేటట్టూ వుండే కొన్ని బొమ్మలు వున్నాయి. వాళ్ల వేషధారణ అలా యెందుకు వున్నట్టు? యీ విషయానికి తర్వాత వద్దాం. ప్రస్తుతానికి ఆదిమ మానవుడి నివాసం గురించి మనం యింకా యేం తెలుసుకోగలమో అనేదే విషయం.

గగారినోలో బయటపడిన విడిదుల్లాంటివే సోవియట్ యూనియన్‌లోని చాలా ప్రాంతాల్లో బయటపడ్డాయి. వొరోనెజ్ అనే పట్టణం దగ్గర ఒక గ్రామంలో యెన్ని యెముకలు దొరికాయంటే దానికి కోస్తెంకీ (ఎముకల గ్రామం) అనే పేరే వచ్చేసింది.

యీ యెముకలన్నీ ఆదిమ మానవుడు వేటాడిన మామత్‌లవీ, గుహల్లో వుండే సింహాలవీ, గుహల్లో వుండే యెలుగుబంట్లవీ, గుర్రాలవీనీ.

పి. యెఫిమేంకొ, ఎస్. జమ్యాతిన్ అనే యిద్దరు సోవియట్ పురాతత్వవేత్తలు కోస్తెంకీ నివాసస్థలాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేశారు.

ఆ వేటగాళ్లు గగారినోలో లాగా ఒక్క భూగర్భగృహంలో కాకుండా యెక్కువ వాటిలో వున్నట్టూ, అంతా కలిపే వేటాడినట్టూ వాళ్లు కనిపెట్టారు. చాలా బాగా చేసిన రాతి పనిముట్లూ, యెముకల పనిముట్లూ, అలాగే చెక్కిన దంతపు ఆడ బొమ్మలూ యిక్కడ దొరికాయి. వాటిల్లో ఒక బొమ్మ పచ్చబొట్టు పొడిపించుకుని, తోలు పైబట్ట తొడుక్కున్నట్టుంది. అంటే వాళ్లకి తోలుని శుభ్రం చెయ్యడం తెలుసన్నమాట.

యీ ప్రాచీనకాలపు వేటగాళ్ల నివాసాలు మన వాటిల్లా వుండేవే కాదు. బయటనుంచి చూస్తే కనిపించేదల్లా గుండ్రటి కొండలాగా వుండే కప్పు మాత్రమే. లోపలికి ప్రవేశించే మార్గం ''పొగ గొట్టమే.'' యెందుకంటే లోపలికి వున్న దారి అల్లా పొగ బయటికి పోయేందుకు వుండే కప్పుమీది రంధ్రం మాత్రమే.

మట్టి గోడల వారే బెంచీలకి బదులుగా మామత్ దవడ యెముకలున్నాయి. భూమాతే వాళ్ల మంచం కూడానూ. చదును చేసిన నలుచదరపు జాగామీద వాళ్లు పడుకునేవాళ్లు, కొంచెం యెత్తుగా వుండే మట్టి దిమ్మలు వాళ్లకి తలగడాల్లాగా వుండేవి.

యీా యెముకల బెంచీలూ, మట్టి మంచాలూ వున్న యింట్లో మేజాలు రాతితో చేసినవి.

పొయ్యిదగ్గర, బాగా వెలుతురుగా వుండే చోట, పనిచేసుకునే బెంచీ వుండేది. అది నునుపైన రాతి పలకతో తయారైంది. దాని పైన పురాతత్వ శాస్త్రజ్ఞులకి కొన్ని పనిముట్లు, చెకుముకిరాళ్లూ, యెముకలా ముక్కలూ, అసంపూర్తిగా వదిలేసిన వస్తువులూ దొరికాయి. యిదిగో మేజామీద ఓ గుప్పెడు యెముక పూసలు విసిరేసి వున్నాయి. కొన్ని పూసలు సాపు చేసి, రంధ్రాలు తొలిచినవి వున్నాయి. కొన్ని సగం సగం బాగు చేసినవి. ఆ పనివాడు కొన్ని యెముకలమీద చాలా చోట్ల గంట్లు పెట్టాడు గాని, వాటిని పూసలకింద చేసే వ్యవధి లేకపోయినట్లుంది. యేదో వాళ్లని పని వదిలేసి యిల్లు వదిలిపోయేటట్టు చేసి వుంటుంది. ఆ ప్రమాదం కూడా ముంచుకొచ్చేదే అయివుండాలి, లేకపోతే వాళ్లు అద్భుతమైన ఆ బాణాల్నీ, యెముక సూదుల్నీ, అనేకవాటికి ఉపయోగపడే రాతి కత్తుల్నీ వదిలేసి వెళ్లి వుండరు.



ఎముక సూదులు, వాటిని పదును పెట్టేరాయి

యీా పనిముట్లన్నిటినీ చెయ్యడం సులభం అయివుండదు. యీా నివాసంలో కనిపించిన ప్రతి ఒక్క వస్తువు తయారీకీ చాలా గంటల శ్రమ పట్టివుంటుంది. ఉదాహరణకి యిక్కడొక యెముక సూది వుంది. మానవ జాతి చరిత్రలో మొట్టమొదటి సూది. అది చాలా చిన్నదే, కాని దాన్ని తయారు చెయ్యడానికి చాలా నేర్పు కావాలి.

యింకో మకాంలో యెముక సూదులు తయారుచెయ్యడానికి అవసరమైన సరంజామా, యెముకలమీద గంట్లు సగంసగం చేసిన సూదులూ వున్న మొత్తం కార్ఖానాయే కనిపించింది. వాటిని యెలా వదిలారో అలానే వున్నాయి అన్నీనీ.

మన ఆధునిక ప్రపంచంలో యెముక సూదులకి ఉపయోగమే వుంటే ఉత్పత్తిని వాస్తవానికి రేపే ప్రారంభించవచ్చు.

కాని ఆ పని చెయ్యడానికి సమర్థుడైన పనివాడు మనకి దొరకడమే కష్టం.

యెముక సూదిని యీా రకంగా చేసేవాళ్లు: మొదటగా రాతి కత్తితోటి కుందేలు యెముకని సన్నగా చేసేవాళ్లు. అప్పుడు చెకుముకిరాతి ఆకురాయితోటి దానికి పదును పెట్టేవాళ్లు. అప్పుడు కొనదేలిన రాతితోటి దానికి రంధ్రం చేసేవాళ్లు. చివరికి ఆ సూదిని రాతి పలకమీద నునుపు చేసేవాళ్లు.

చూడండి, ఒక్క సూదిని చెయ్యాలంటే యెన్ని పనిముట్లు, యెంత వ్యవధి అవసరమయ్యేవో!

ప్రతి తెగకీ యెముక సూదులు చేసే నేర్పు వున్న పనివాళ్లు వుండే వాళ్లు కాదు. ఆ రోజుల్లో యెముక సూది పెద్ద సంపదకిందే లెక్క.

ప్రాచీనకాలపు వేటగాళ్ల మకాంకేసి ఓసారి చూద్దాం.

మంచుకప్పిన పచ్చిక మైదానంమీద మధ్యలో కొన్ని చిన్న గుట్టలు కనిపిస్తాయి. ప్రతి దాంట్లోంచీ పొగ చుట్టలు తిరుగుతూ వస్తోంది. ఓ గుట్ట దగ్గరికి వెళ్లి, పొగతో మన కళ్లు మండిపోతూవున్నా లక్ష్యపెట్టక ఆ గొట్టంగుండా లోపలికి దిగుదాం.

మనం ఒక మాయా కంబళీ కప్పుకుని యెవళ్లకీ కనిపించకుండా అదృశ్యంగా వున్నామనుకోండి. మనల్ని యెవళ్లూ చూడలేరు. లోపల పొగ, చీకటి, గందరగోళంగా వుంది. అక్కడ కనీసం పదిమంది పెద్దవాళ్లూ, చాలా మంది పిల్లలూ వున్నారు.

పొగతో మండిపోయే మన కళ్లు పొగకి అలవాటు పడగానే, మనకి ఆ మనుషుల ముఖాలూ, శరీరాలూ కనిపిస్తాయి. వాళ్లలో వానర ఛాయలే లేవు. వాళ్లంతా నిటారుగా, సౌష్టవంగా, దృఢంగా వున్నారు. వాళ్ల చెక్కిళ్లు యెత్తు, కళ్లు ఒకే వరసలో వున్నాయి. వాళ్ల నల్లని శరీరాలమీద యెర్రటి లత్తుకతోటి గీసిన బొమ్మలున్నాయి.

ఆడవాళ్లు యెముక సూదులతో జంతు చర్మాల బట్టలు కుడుతూ వృత్తాకారంగా కూర్చున్నారు. పాపం పిల్లలు ఆడుకునే వస్తువులేమీ లేక గుర్రం కాలితోటీ, జింక కొమ్ముతోటీ ఆడుకుంటున్నారు. పొయ్యివార, పనిచేసే బెంచీ దగ్గర, ఒక పనివాడు కాళ్లు మడంవేసి కూర్చున్నాడు. అతను చిన్న యీటె చెయ్యడానికని ఒక కర్రకి ఎముక బాణం బిగిస్తున్నాడు. అతనికి పక్కనే యింకో పనివాడు రాతి కత్తితోటి ఒక బొమ్మని చెక్కుతున్నాడు.

ఆ బొమ్మ యేమిటో దగ్గరికి పోయి చూద్దాం.

ఆ యెముక పలకమీద సున్నితమైన చెక్కుడుతో అతను గడ్డి మేస్తూ వున్న గుర్రాన్ని గీశాడు.

యెంతో ఓర్పుతోటీ, నేర్పుతోటీ గుర్రపు చక్కని కాళ్లనీ, వంగిన మెడనీ, చిన్న జూలునీ, పెద్ద తలనీ గీశాడు. ఆ గుర్రం ప్రాణంతో వున్నదిగానూ, కదలడానికి సిద్ధంగా వున్నట్టుగానూ కనిపిస్తోంది, ఆ కళాకారుడి మనోనేత్రం ముందు యెంతో వివరంగా ఆ గుర్రం ప్రత్యక్షమై వుంది.

యిదిగో బొమ్మ పూర్తయింది. కాని అతను ఆగలేదు, యింకా పని చేస్తూనే వున్నాడు. గుర్రం బొమ్మమీద అడ్డంగా సర్రన ఒక గీత చెక్కాడు. యింకో గీత చెక్కాడు. మళ్లీ యింకోటి ఆ జంతువు ఒంటిమీద వింతగా కనిపించే బొమ్మ తయారైంది. ఏమిటి అతను చేస్తున్నది? యీవాళ్టి యే కళాకారుడేనా మురిసి ముప్పందుం అయిపోయే అలాంటి బొమ్మని తగలబెట్టేస్తున్నాడేమిటి?



చిత్రకారుడు గుర్రాన్ని గీసాక దానిమీద అనేక గుడారాలని గీశాడు



మామత్. రెండు గుడారాలని దీనిపైన గీయడం జరిగింది

ఆ గీతలు యింకా యింకా క్లిష్టమై పోతున్నాయి. అరె, చిత్రం, గుర్రం బొమ్మమీద గుడారం బొమ్మ తయారయిందే! దాని తర్వాత ఆ కళాకారుడు యింకో గుడారం బొమ్మ గీశాడు, మళ్లీ యింకోటి. అరె, అది ఒక విడిది స్థావరం!

యీ వింత బొమ్మ ఉద్దేశ్యం యేమై వుంటుంది? అలా చెయ్యడం వూరికే కళాకారుడి సరదాయేనా?

కాదు, యిలాంటి వింత బొమ్మలు యెన్నో ఆదిమ వేటగాళ్ల గుహల్లో కనిపించాయి. ఒకటి మామత్ బొమ్మ. దానిమీద రెండు గుడారాలున్నాయి. అడివిదున్న బొమ్మమీద మూడు గుడారాలున్నాయి. యిదిగో పెద్ద చిత్రం. మధ్యలో సగం తినేసిన దున్న కళేబరం వుంది. తలా, కాళ్లూ, వెన్నెముకా, మనిషి చెయ్యి పడకుండా అలానే వుండి పోయాయి. పెద్ద, గడ్డం వున్న తల ముందరి రెండు కాళ్లకీ మధ్యలో వుంది. ఆ కళేబరాని కటూ యిటూ రెండు వరసల్లో మనుషులున్నారు.



ఎముకమీద గీసిన యీ చిత్రం దేన్ని సూచిస్తుందో?

యెముక బిళ్లలమీదా, రాతి పలకలమీదా, కొండ చరియలమీదా యిలాంటి జంతువులా, మనుషులా, గుడారాలా వింత బొమ్మలు చాలా వున్నాయి. కాని చాలా యెక్కువ భాగం గుహాకుడ్యాలమీద వున్నాయి.

మనం మన గుహని తవ్వేటప్పుడు మనకి గోడలమీద యే బొమ్మలూ కనిపించలేదు.

కాని యేదీ, మనం యింకా గుహ మొదట్లో, ఆ మనుషులు తినీ, నిద్రించీ పనిచేసే చోటే వున్నాం.

యిప్పుడు మనం వందలాది గజాలు విస్తరించుకున్న సొరంగాల గుండా వెళ్లి అన్ని మూలల్నీ, సందు గొందుల్నీ వెదుకుదాం.

## భూగర్భ కళాఖండాల ప్రదర్శనా స్థలం

మనం బాటరీలైట్లు తీసుకుని గుహని శోధిద్దాం. మనం జాగ్రత్తగా ప్రతి మలుపునీ, ప్రతి కూడలినీ గుర్తుపెట్టు కోవాలి, లేకపోతే దారి తప్పామే.

రాతి వసారా యిరుకై పోతోంది. పై కప్పునుంచి నీళ్లు కారుతున్నాయి. మనం దీపాలు పైకెత్తి గోడల్ని చూద్దాం.

అడవిదున్నని చిత్రించిన గుహలోని బొమ్మ







భూగర్భ సెలయేళ్లు గుహని మెరిసే స్ఫటికాలతో అలంకరించాయి. కాని యే మానవ హస్తమూ చేసిన పని కాదు.

గుహలో యింకా లోపలికి పోదాం. హఠాత్తుగా యెవళ్లో అరిచారు:

''చూడండి!''

గోడమీద అడివిదున్న పెద్ద బొమ్మ వుంది. నలుపు, ఎరుపూ రంగుల్తో గీసిన బొమ్మ అది. ఆ జంతువు ముంగాళ్ల మీద పడిపోయింది. దాని మూపురంలో యెన్నో చిన్న యీటెలు గుచ్చుకుపోయి వున్నాయి.

మౌనంగా ఆ బొమ్మ ముందు నుంచున్నాం, లక్షల సంవత్సరాల నాడు బతికిన కళాకారుడు గీసిన బొమ్మ అది.

యింకొంచెం ముందుకి పోతే యింకో బొమ్మ కనిపిస్తుంది. వింత జంతువు నృత్యం చేస్తున్నట్టుగా వుంది. అది జంతువులా కనిపించే మనిషేనా అయివుండాలి, లేదా మనిషిలా కనిపించే జంతువేనా అయివుండాలి. యీ వింత జంతువుకి గడ్డం



విల్లుపట్టుకున్న ఆ వింత ఆకారం యేమిటి: మనిషా, జంతువా?

వున్న తల, వంపులు తిరిగిన కొమ్ములు, గూని వీపు, కుచ్చుతోక వున్నాయి. చేతులూ, కాళ్లూ మనిషివి. అది విల్లుని పట్టుకుంది.

యింకొంచెం జాగ్రత్తగా చూస్తే అడివిదున్న చర్మం కప్పుకున్న మనిషి బొమ్మ అది తెలుతుంది.

యింకా ముందు యింకో బొమ్మ వుంది, ఆ తర్వాత యింకోటి, అటు తర్వాత యింకో బొమ్మ.

యేమిటీ వింత కళా ప్రదర్శన?

యివాళ్టి రోజుల్లో అయితే కళాకారులు మంచి వెలుతురుగా వుండే స్టూడియోలలో పనిచేస్తారు. గాలరీలలో ప్రదర్శనకి కూడా బాగా వెలుతురుగా వుండే యేర్పాటే చేస్తారు.

యీ ఆదిమ మానవులు తమ కళా ప్రదర్శనని చీకటి గుహలో ఎందుకు పెట్టుకున్నట్టు, మానవుల కంటబడ కుండా దూరంగా ఎందుకు వున్నట్టు?

ఆ కళాకారుడు యీ బొమ్మల్ని యితరుల కోసం గియ్యలేదనేది స్పష్టం.

అదే నిజమైతే అతను అసలు బొమ్మలనెందుకు గీసినట్టు? జంతువుల చర్మాల ముసుగుతో వున్న యీ వింత నృత్య చిత్రాలేమిటి?

# యీ యింద్రజాలం, దాని పరిష్కారం

''కొంతమంది వేటగాళ్లు నృత్యం చేస్తూ వుంటారు. ప్రతివాడి నెత్తిమీదా అడివిదున్న చర్మమో, కొమ్ములున్న అడివిదున్న ముసుగో వుంది. ప్రతివేటగాడి దగ్గరా విల్లో, బాణమో వున్నాయి. ఆ నృత్యం అడివిదున్న వేటని ప్రతి బింబించే నృత్యం. ఒక నాట్యకారుడు అలిసిపోతే, పడిపోతున్నట్టు నటిస్తాడు. అప్పుడు యింకో వేటగాడు మొద్దుబారిన బాణాన్ని అతనిమీదకి విసురుతాడు. ''అడివిదున్నకి'' గాయం తగిలింది. అతన్ని కాళ్లు పట్టుకుని ఆ బృందం మధ్య నుంచి అవతలకి లాగేస్తారు. మిగతావాళ్లు చాకులని తీసి అతనిమీదకి వెడతారు. అప్పుడు యింకో వేటగాడు మధ్య లోకి వస్తాడు, అతనూ అడివిదున్న ముసుగు వేషం వేసుకున్న వాడే. ఒకో అప్పుడు యీ నాట్యం ఒక్క క్షణం కూడా ఆక్కుండా రెండు, మూడు వారాలు సాగుతుంది.''

ఆదిమ వేటగాళ్ల నృత్యాన్ని కళ్లతో చూసిన ఆయన వర్ణించిన వర్ణన యిది. ఉత్తర అమెరికాలోని మైదానాల్లో, ప్రాచీన ఆచారాలు యింకా నిలుపుకున్న ఎర్ర యిండియన్ల తెగలు వున్నాయి. ఆయన దీన్ని అక్కడ చూశాడు.

ఆరకంగా ఒక పరిశోధకుడి డైరీలో, ఆదిమ మానవుడు గుహాకుడ్యంమీద చిత్రించిన వేట నృత్యాన్ని మనం అకస్మాత్తుగా చూస్తాం.

యీ మాయాన్విత చిత్రం యేమిటైందీ మనకి తెలుసు. యీ చిక్కు విడగొట్టా మనుకోగానే మనకి యింకోటి యెదురవుతోంది. కొన్ని వారాల పాటు సాగే నృత్యం యే తరహాదై వుంటుంది? ఆ యెర్ర యిండియన్లు అలిసిపడిపోయే దాకా వారాల తరబడి నృత్యం చెయ్యడం వూరికే వినోదం కోసమేనా లేక వాళ్లు అంతటి కళా ప్రియులా? అదీ గాకుండా వాళ్ల నృత్యం నృత్యం కంటే కూడా యెక్కువగా వ్రతంలాగా వుంది.

ఒక మాంత్రికుడు తన పొగగొట్టంనుంచి ఒక దిక్కు కేసి పొగ వదుల్తాడు. నాట్యం చేసే వాళ్లు ఉత్తుత్తి

జంతువుని వేటాడుతూ ఆ దిక్కు కేసి పోతారు. ఆ మాంత్రికుడు తన పొగతోటి ఆ నృత్యాన్ని నిర్వహిస్తాడు. నృత్యం చేసేవాళ్లని ఉత్తరానికో, దక్షిణానికో, తూర్పుకో, పడమరకో పంపుతాడు.

కాని ఒక మాంత్రికుడు నృత్యాన్ని నిర్వహిస్తున్నాడంటే అది నృత్యం కంటే యెక్కువగా మతపరమైన కర్మ అవుతుంది.

తమ వింత అభినయంద్వారా అడివిదున్నలమీద మంత్రం పెట్టి, ఆ మంత్ర మహత్తుతోటి వాటిని పచ్చిక బీళ్లనుంచి ఆకర్షించవచ్చని ఆ ఎర్ర యిండియన్లు నమ్మేవాళ్లు.

అదీ గుహాకుడ్యంమీద నృత్య చిత్రం! అతను వూరికే నృత్యం చెయ్యడమే కాదు, అతను మత కర్మని నిర్వహిస్తున్నాడు. భూగర్భంలో కంటాపోయి, మంట వెలుతుర్లో ఆ బొమ్మ గీసిన వాడు కళాకారుడు మాత్రమే కాదు, మంత్రగాడు కూడా.

జంతువు ముసుగులతో వేటగాళ్లనీ, గాయపడిన అడివిదున్ననీ గియ్యడంద్వారా వేట విజయవంతం కావాలనే కని కట్టుని కడుతూ అతను తన మంత్ర శక్తిని ఆచరిస్తున్నాడు.



“ఎలుగు బంటి విందు”ని జరుపుకుంటున్న గిల్యాక్ జనం. ఎలుగుబంటి ముట్టె దగ్గర పెద్ద చేప నైవేద్యాన్ని పెడతారు

ఆ వ్రత రూప నృత్యం వేటని సవ్యంగా వుండేటట్టు చేస్తుందని అతను దృఢంగా నమ్మాడు.

మనం యేదేనా కొత్త యిల్లు కట్టేటప్పుడు తాపీవాళ్లనీ, వడ్రంగంవాళ్లనీ అనుకరిస్తూ గంతులు వెయ్యం. మనకి వెర్రిమొర్రి వేషాలుగా కనిపించినవి ప్రాచీన కాలం వాళ్లకి నిజమైనవిగానే కనిపించేవి.

యిప్పుడు మనం ఒక చిక్కుని పరిష్కరించాం. ఆ గోడమీద నృత్యం చేసే మనిషి బొమ్మ యెందుకు గీశారో మనకి తెలిసింది.

కాని అంతే మాయగా వుండే వేరే బొమ్మలున్నాయి.

మనకీ కథంతా గుహలోని యెముక పలకమీదనే దొరికిందని మర్చిపోకండి. అడివిదున్న కళేబరం బొమ్మ అది. రెండు వరసల్లో మనుషులు దానికి అటూ యిటూ కూచున్నారు. అడివిదున్న తలా ముందు కాళ్లూ మాత్రం అస్పష్టంగా వుండిపోయాయి. దీని అర్థం యేమిటో?

దీనికి జవాబు కావాలంటే మనం ఉత్తర అమెరికాకి బదులుగా సుదూర ఉత్తర రష్యాకి పోవాలి.

సైబీరియాలో కొన్ని స్థలాలున్నాయి. అక్కడ వేటకెళ్లి యెలుగుబంటిని చంపిన వేటగాళ్లు ''యెలుగుబంటి విందు'' చేసుకొనేవాళ్లు. అది యిటీవలిదాకా, అంటే యాభై యేళ్ల క్రితం దాకా కూడా వుండేది. ఆ కళేబరాన్ని ఒక యింటికి తెచ్చి, ఘనమైన స్థానంలో వుంచేవాళ్లు. ఆ యెలుగుబంటి తలకాయని దాని ముందు పంజాల మధ్యన పెట్టే వాళ్లు. బెడ్డుతోటీ, బర్చ్ బెరడుతోటీ చేసిన కొన్ని జింక బొమ్మలు దాని తల దగ్గర పెట్టేవాళ్లు. అవి ఆ యెలుగు బంటికి నైవేద్యం అన్నమాట. బర్చ్ బెరడు ఉంగరాలతో ఆ యెలుగు తలని అలంకరించేవాళ్లు. దాని కళ్లమీద వెండి నాణేలని వుంచేవాళ్లు. అప్పుడు ఒకళ్ల తర్వాత ఒకళ్లుగా ప్రతి వేటగాడూ యెలుగుబంటి దగ్గరికి వెళ్లి దాని ముట్టెని ముద్దు పెట్టుకునేవాళ్లు.

కొన్ని రోజులు, లేకపోతే కొన్ని రాత్రిళ్లు, సాగే ఆ విందుకి అది నాందీ మాత్రమే. ప్రతి రాత్రీ వేటగాళ్లు ఆ కళేబరం చుట్టూ చేరి పాడి, ఆడేవాళ్లు. వాళ్లు బర్చ్ బెరడుతో గాని, కొయ్యతో గాని చేసిన ముసుగులు వేసుకుని, యెలుగు దగ్గరికి వచ్చి, దానికి వందనం చేసి, దాని వికారమైన నడకని అనుకరిస్తూ నృత్యం మొదలెట్టే వాళ్లు.

పాటా, ఆటా అయిపోయాక మాంసం తినడానికి కూర్చునేవాళ్లు. కాని ముందు పంజాలనీ, తలనీ మాత్రం యెన్నడూ ముట్టుకునే వాళ్లు కాదు.

యెముక పలకమీద బొమ్మకి అర్థం మనకిప్పుడు తెలిసింది. అది ''అడివిదున్న విందు''ని చిత్రించే బొమ్మ. ఆ బొమ్మలోని మనుషులు ఆ అడివిదున్నని చుట్టుముట్టి, తమకా మాంసం యిచ్చినందుకు దానికి కృతజ్ఞత చెబుతున్నారు. మళ్లీ సారికి కూడా తమకా అనుగ్రహం చూపించమని దాన్ని వేడుతున్నారు.

మనం ఎర్ర యిండియన్ల దగ్గరికి మళ్లీ వెడితే వాళ్లకీ యిలాంటి వేటగాళ్ల విందులున్నాయని మనకి తెలుస్తుంది.

క్విచుయాన్ తెగ వేటగాళ్లు తాము చంపిన జింకని దాని వెనక కాళ్లు తూర్పు ముఖంగా వుండేటట్టు పెడతారు. దాని తల దగ్గర ఓ గిన్నెలో అన్నం వుంచుతారు. ప్రతి వేటగాడూ ఒకళ్ల తర్వాత ఒకళ్లు ఆ జింక దగ్గరికి వచ్చి, కుడి చేత్తోటి తలనుండి తోక దాకా దాన్ని నిమిరి, తనని చంప నిచ్చినందుకు దానికి కృతజ్ఞత చెబుతారు.

''విశ్రాంతి తీసుకో, పెద్దన్నా'' అంటారు చచ్చిపోయిన జంతువుతోటి.

అప్పుడా మంత్రగాడు ఆ జింక కేసి తిరిగి అంటాడు:

''నువ్వు మాకు నీ కొమ్ములని యిచ్చావు. అందుకు నీకు మా కృతజ్ఞతలు.''

# ప్రకరణం ఏడు

## ఏమి అద్భుత మక్కడుందును...

ఇవాన్ యువరాజుని గురించీ, సౌందర్యరాశి వసిలీసా గురించీ, నిప్పు పిట్టని గురించీ, గూని గుర్రం గురించీ, మనుషులుగా మారే జంతువుల గురించీ, జంతువులుగా మారే మనుషుల గురించీ వున్న అద్భుత కథలు రష్యన్ పిల్లలందరికీ తెలుసు.

మనం అద్భుత కథల్ని నమ్మితే ప్రపంచం అంతా మాయా మాహిమల జీవులతోటి, మంచివీ చెడ్డవీ, కనిపించేవీ కనిపించనివీ అయిన వాటి తోటి నిండిపోయి వుంటుంది. నమ్మకం పుట్టేటట్టు చేసే యీ ప్రపంచంలో క్రూరులైన మంత్రగాళ్లనుంచీ, భయంకరమైన మంత్రగత్తెలనుంచీ బహుజాగ్రత్తగా వుండాలి.

మీరు మీ కళ్లని నమ్మలేరు యేమంటే పరమ వికారమైన బోదురుకప్ప సౌందర్యరాశి అయిన కన్యలా మారి పోతుంది, అతి సుందరాకార మూర్తి విషసర్పంగా మారిపోవచ్చు. యిక్కడ ప్రతిదానికీ దాని నియమాలు దానికి వున్నాయి: చనిపోయిన వాళ్ళు ప్రాణంతో లేచివస్తారు, తరిగేసిన తలలు మాట్లాడతాయి, నీళ్లల్లో మునిగిపోయిన కన్యలు బెస్తవాళ్లని నీళ్లల్లోకి దూకేటట్టు ఆశ గొల్పుతారు.

ప్రఖ్యాత రష్యన్ కవి అలెగ్జాండర్ పుష్కిన్ కవితల్లో ఒకదాంటో మనకి యీ పాదాలు కనిపిస్తాయి:

ఏమి అద్భుత మక్కడుందును,
గజ్జె కట్టును గాలి దెయ్యము,
మత్స్యకన్యలు వృక్షశాఖల
విశ్రమింతురుగా.

మనమా అద్భుత కథ చదువుతూ వుంటే దీన్ని నమ్ముతాం. కాని పుస్తకం మూసేసిన మరుక్షణం మనం వాస్తవ ప్రపంచంలోకి వస్తాం. యిక్కడ మంత్రగాళ్లూ లేరు, మంత్రకత్తెలూ లేరు. యిక్కడున్న ప్రతిదాన్నీ హేతు బద్ధంగా వివరించవచ్చు. అద్భుత కథ యెంత సమ్మోహకరంగా వున్నా సరే, అలాంటి ప్రపంచంలో వుండడానికి మనం నిజంగా యిష్టపడం. అక్కడ బుద్ధితో పనిలేదు, పుడితే అదృష్టవంతులుగా పుట్టాలి. తోడేలుగా మారిన వ్యక్తితోనో లేదా మంత్రకత్తెతోనో పోరాడి నిగ్రహించుకు రావాలంటే ఇవాన్ యువరాజు లాగా వుండాలన్న మాట.

మన ప్రాచీనకాలపు పూర్వులు ప్రపంచం సరిగ్గా యిలానే తయారై వుందని నమ్మేరు. వాళ్లకి మాయా ప్రపంచానికీ, తాము జీవించే వాస్తవ ప్రపంచానికీ మధ్య తేడా వుండేది కాదు. ప్రపంచంలో జరిగే ప్రతీదీ యీ భూమిని పాలించే మంచి శక్తులా, దుష్ట శక్తులా ప్రభావం వల్లనే జరిగేదని వాళ్ల భావన.

మనం యే రాతి మీదనుంచేనా జారిపడితే మన అజాగ్రత్తనీ, మననీ నిందించుకుంటాం గాని యెవర్నీ తప్పుపట్టం.

కాని ఆదిమ మానవుడు తనని నిందించుకునే వాడు కాదు, యేదో దుష్ట శక్తి ఆ రాయిని అక్కడ పెట్టిందని దాన్ని నిందించేవాడు.

యెవళ్లేనా కత్తిపోటుకి గురై చచ్చిపోతే, అతన్ని చంపపొడిచారని మనం అంటాం.

కాని ఆ కత్తి మంత్రం పెట్టింది కాబట్టి అతను చచ్చిపోయాడని ఆదిమ మానవుడు అనేవాడు.

యేమైనా, మీమీద ''దిష్టికళ్లు'' పడ్డం వల్లనే మీకు జబ్బు చేస్తుందనీ, మంగళవారం నాడు యే పనేనా మొదలుపెట్టడం శుభం కాదనీ, పిల్లి శకునం వస్తే మీకు కీడు సంభవిస్తుందనీ నమ్మేవాళ్లు యివాళా వున్నారు.

యీ జనం అమాయకులని మనం అనుకుంటాం. మన రోజుల్లో మూఢనమ్మకాలతో వుండడానికి వీల్లేదు, యేమంటే మంచీ, చెడూ శక్తులకి సంబంధించిన నమ్మకాలన్నీ అజ్ఞానంనుంచే పుడతాయి. అజ్ఞానం అనేది చీకటి మూలల్లో పుట్టే సాలెగూళ్ల లాంటిది.



న్యూ పొమెరానియాలో మంత్ర విహిత నృత్యం

యేమైనా, మంత్రగాళ్లల్లోనూ, దుష్ట శక్తుల్లోనూ నమ్మకం పెట్టుకున్న మన ప్రాచీనకాలపు మానవులని మనం అపహాస్యం చెయ్యం. ప్రకృతిని గురించిన కచ్చితమైన జవాబులు యిచ్చే జ్ఞానం వాళ్లకి తెలియదు కాబట్టి, ప్రకృతి ధర్మాలని వివరించే వాళ్ల పద్ధతి అదీ.

కొన్ని ఆదిమ ఆస్ట్రేలియన్ తెగలు యీ స్థాయిలోనే వుండిపోయాయి.

వాళ్లు రాతియుగపు మూఢనమ్మకాలనీ, దురభిప్రాయాలనీ యింకా నిలబెట్టుకుని వుండటంలో ఆశ్చర్యం యేం లేదు.

యిరవైయవ శతాబ్దపు ఆరంభంలో ఆఫ్రికా పరిశోధకుడు ఒకాయన చెప్పింది యిదీ: ''తీరం వెంబడే వున్న స్థానిక జనాభాకి కొత్తగా అమర్చిన తెరచాప పడవ కనిపించినా, మిగతా ఓడల కంటే యెక్కువ లోహపు పొగగొట్టాలున్న ఓడ కనిపించినా ఆవేశం వచ్చేస్తుంది. ఒక వానకోటుగాని, వింతగా కనిపించే టోపీగాని, వూగే కుర్చీగాని, లేకపోతే వాళ్లు అంతకు ముందు చూడని యే పరికరమేనాగానీ సరే వాళ్లకి అనుమానం రేకెత్తిస్తుంది.''

అలా వుండటానికి కారణం తాము అంతకు ముందు చూడని ప్రతి దాంట్లోనూ యేదో మంత్రమహిమ వుందనే వాళ్లు అనుకోవడమే.

అన్ని వస్తువులూ యేదో ఒకలా సంబంధం కలిగి వున్నాయని వాళ్లకి అనుభవం నేర్పింది. కాని అలా యెందుకు వున్నదీ వాళ్లకి తెలియకపోవడంవల్ల వాళ్లు కొన్ని వస్తువులు మిగతా వాటిమీద మంత్ర ప్రభావంతో వుంటాయని నమ్మేవాళ్లు.

''దిష్టి''ని తీసెయ్యాలీ అంటే తాయెత్తుని కట్టుకోవాలని వాళ్లు నమ్మారు. అది మొసలి పళ్లతో చేసిన హార మేనా కావచ్చు, యేనుగు తోకకుచ్చుతో చేసిన దండ కడియమేనా కావచ్చు. తాయెత్తు దాన్ని ధరించిన వాణ్ణి కష్టాల నుంచి కాపాడుతుంది.

యీనాటి ఆదిమ తెగల వాళ్ల లాగానే ఆనాటి మనుషులకీ ప్రపంచాన్ని గురించీ, ప్రకృతిని గురించీ యెక్కువ తెలియదు.

వాళ్లు బహుశా మాయలనీ, మంత్రాలనీ, మహిమలనీ నమ్మేవాళ్లు. దీనికి తగ్గ ఆధారాలు మనకి పురావస్తు తవ్వకాలలోనూ, మాయా గుహా చిత్రాల్లోనూ దొరికిన తాయెత్తుల్లో లభిస్తాయి.

## ప్రపంచాన్ని గురించి మన పూర్వులు యేమనుకున్నారు

ప్రపంచపు ధర్మాలు తెలుసుకోకుండా ప్రపంచంలో బతకడం మనిషికి కష్టం. అతను అజ్ఞాత శక్తుల చేతిలో దుర్బలుడుగా, నిస్సహాయుడుగా బాధపడేవాడు. ప్రతి వస్తువుకీ తాయెత్తు మహిమ వుందనీ, ప్రతి వ్యక్తీ మంత్రగాడు అయివుండవచ్చుననీ అనుకునే వాడు. ప్రతిచోటా చనిపోయిన ప్రేతాత్మలు కసిగా, నిలకడ లేకుండా తిరుగుతూ బతుకుతున్నవాళ్లమీదకి దూకడానికి సిద్ధంగా వున్నట్టు భావించుకునేవాడు. వేటలో చంపేసిన ప్రతి జంతువూ తిరిగివచ్చి చంపినవాడిమీద కసి తీర్చుకోవచ్చు. ఆ కష్టాల్ని దగ్గరకి రాకుండా చేసుకోవాలంటే అస్తమానూ ఆ శక్తుల్ని బతిమలాడి, బామాలి, వాటికి శాంతి కలగజెయ్యడం కోసం బలులూ వగైరాలు యివ్వాల్సివచ్చేది.

అజ్ఞానంనుంచి భయం పుడుతుంది.

మానవుడికి జ్ఞానం లేకపోబట్టి, అతను ప్రపంచానికి అధినాథుడు లాగా కాకుండా భయకంపితుడైన, నిర్భాగ్యుడైన అర్థిలాగా మాత్రమే వుండేవాడు.

యేమైనా తను ప్రకృతికి అధినాథుడనని భావించగలగే టంతటి సమయం అప్పటికి రాదు. అతను తన కంటే బలమైన జంతువులని చంపాడు, మామత్‌నే జయించాడు, కాని యెలా నిగ్రహించాలో తెలియని బ్రహ్మాండమైన ప్రకృతి శక్తులతో పోలిస్తే అతను చాలా దుర్బలుడే.

ఒక వేట నిరుపయోగమైపోయిందీ అంటే వారాల కొద్దీ ఆకలితో బాధపడాలన్న మాట. ఒక్క మంచుతుఫాను మొత్తం నివాసాన్ని అంతటినీ మంచుతో ముంచేస్తుంది.

మరి మానవుడికి పోరాడే శక్తిని యిచ్చి, అడుగడుగే ముందుకేసి ప్రకృతి శక్తులమీద ఆధిపత్యాన్ని సంపాదించే టట్లు చేసింది యేది?



వేటలో తమకి అదృష్టాన్ని యివ్వమని తమ పూర్వులని అడుగుతూ వున్న లాప్‌లేండర్స్ (17వ శతాబ్దపు చిత్రం)





మంత్ర దండాలు. ఎస్కిమో వేటగాళ్ల తాయెత్తులు

తను ఒంటరిగా లేడు అన్నదాంట్లోనే అతని బలం వుంది.

మొత్తం తెగంతా, గుంపంతా తమకి వ్యతిరేకంగా వుండే ప్రకృతి శక్తుల్ని యెదిరించారు. వాళ్లు కలిసి పని చేశారు, తమ ఉమ్మడి పరిశ్రమవల్ల జ్ఞానాన్నీ, అనుభవాన్నీ సంపాదించారు.

నిజమే, యీ విషయాన్ని వాళ్లు గురించకపోవచ్చును. లేకపోతే దాన్ని తమ పద్ధతిలో అర్థం చేసుకున్నా రనవచ్చు.

మానవ సమాజం అంటే వాళ్లకి తెలీదు. అయితే ఒకళ్లకొకళ్లు బంధితులమైపోయామనీ, ఒక తెగ మనుషులంటే వాస్తవానికి ఒకే మహత్తర, బహు ఆయుధ సంపన్నుడైన వ్యక్తి అనీ భావించారు.

వాళ్లని అలా బంధించింది యేది? రక్తబంధం. మనుషులు పెద్ద కుటుంబాలుగా వుండేవాళ్లు. పిల్లలు తమ తల్లులతో వుండేవాళ్లు. వాళ్లు పెద్దవాళ్లై మళ్లీ తమకీ సంతానం కలిగాక కూడా వాళ్లు తమ అన్నదమ్ములతోటే, అప్పచెల్లెళ్లతోటే, మేనత్త మేనమామలతోటే, అమ్మలతోటే, అమ్మమ్మలతోటే వుండేవాళ్లు.

ఆరకంగా కుటుంబం పెరిగింది.

ప్రాచీన వేటగాడి ఆదిమ సమాజం అతని సొంత కుటుంబమే, ఒకే పూర్వునినుంచి వర్ధిల్లిన తెగ. తమకి గల ప్రతి దానికీ తాము పూర్వులకి రుణపడివున్నామని వాళ్లు భావించేవాళ్లు. పూర్వులు వాళ్లకి వేటాడ్డం నేర్పారు, పనిముట్లు చేసుకోవడం నేర్పారు, తమ నివాస స్థానాలని యిచ్చారు, నిప్పుని వాడుకోనిచ్చారు.

వేటాడటం, శ్రమించడం అంటే పూర్వుల కోరికని తీర్చడం. పూర్వుల అభీష్టాన్ని శిరసా వహించిన వాడికి కష్టాలనుంచీ ప్రమాదాలనుంచీ రక్షణ వుంటుంది. వాళ్ల పూర్వులు వాళ్ల నిత్య జీవితాల్లో అదృశ్య భాగస్వాములు, వాళ్లు వేటకెళ్లిన ప్రతిసారీ వాళ్లని అనుసరించే శక్తులు, వాళ్ల నివాసాల్లో వాళ్లూ సర్వదా ప్రత్యక్షమయే వుంటారు. యీ శక్తులు సర్వమూ చూడగలవు, సర్వజ్ఞులు. చెడుచేసిన వాళ్లని శిక్షించగలవు, మంచి చేసిన వాళ్లకి ప్రతిఫలం యివ్వగలవు.

ఆరకంగా అందరికీ లాభించే ఉమ్మడి శ్రమని చెయ్యడం వంశపూర్వులైనవాళ్ల యిష్టాన్ని తీర్చడం, వాళ్లకి విధేయంగా వుండటం తప్ప మరేమీ కాదని ఆదిమ మానవుడి మనసులో యేర్పడింది.

యేమైనా యివాళ మనకి తెలిసినట్టుగా ఆదిమ మానవుడికి తన శ్రమ ప్రాముఖ్యం తెలియదు.

ఆదిమ మానవుడు అడివిదున్నని చంపి ఆ మాంసంతోటి తన కుటుంబాన్ని పోషించుకుని జీవించాడని మనం



బల్లేలు గుచ్చుకున్న అడవిదున్న, మంత్ర విహిత గుహాచిత్రం

అనుకుంటాం. కాని అడివిదున్న తనని పోషించిందని అతను భావించేవాడు. పురాతన కాలపు వారసత్వం అయినట్టు యివాళ కూడా మనం ఆవుని కామధేనువు అనీ, భూమిని ''భూమాత'' అనీ అంటాం. పాలు పితుక్కోమంటావా అని ఆవు అనుమతి అడగం. కాని ఆవు పాలు ''యిస్తుంది'' అంటాం.

ఆదిమ మానవుడి ''దాత'' జంతువు — అది అడివిదున్న కానివ్వండి, మామత్ కానివ్వండి, జింక కానివ్వండి. ఆ మానవుడు తను జంతువుని చంపానని అనుకునేవాడు కాదు, అది తన మాంసాన్నీ, చర్మాన్నీ తనకిగా తనే యిచ్చిందని నమ్మేవాడు. ఒక జంతువుని దాని యిష్టానికి వ్యతిరేకంగా చంపగలగడం వుండదని ఎర్ర యిండియన్లు నమ్మేవాళ్లు. ఒక అడివిదున్నని చంపితే, అది మనుషులకోసం బలైపోవాలని అనుకుంది కాబట్టేననీ, అది వాళ్ళ తనని చంపెయ్యాలని కోరుకుంది కాబట్టేననీ వాళ్లు విశ్వసించేవాళ్లు.

అడివిదున్న తెగకి దాతా, రక్షకురాలునూ. అదే సమయంలో తమ ఉమ్మడి పూర్వుడు తెగ సంరక్షకుడని వాళ్లు భావించేవాళ్లు.

అంచేత ఆదిమ మానవుల మనసుల్లో (వాళ్లకి తమ నివసించే ప్రపంచాన్ని గురించి యింకా స్పష్టమైన అవగాహన లేదు) తమ పూర్వుడైన రక్షకుడూ, తెగకి ఆహారం యిచ్చే జంతు — రక్షకుడూ కలిసిపోయారు.

''మేము అడివిదున్న సంతానం'' అనేవాళ్లు వేటగాళ్లు. అడివిదున్న నిజంగా తమ పూర్వుడని వాళ్లు విశ్వసించే



యీ ఎర్ర ఇండియన్ తెగల తలలమీద వున్న బొమ్మలు వాళ్ల చిహ్నాలు

వాళ్లు. ఆదిమ మానవుడు అడివిదున్న బొమ్మ గీసి, దానిమీద మూడు గుడారాలని గీసినప్పుడు దాని అర్థం ''అడివి దున్న సంతానపు మకాం'' అని.

తన రోజువారీ శ్రమలో మానవుడు జంతువులతో సంబంధం కలిగి వుండేవాడు. రక్తసంబంధం కాని దాన్ని అతను అర్థం చేసుకోలేకపోయేవాడు. యే సంబంధమేనా సరే యేదో ఒకటి ఉమ్మడి రక్త సంబంధం వుందనే అర్థం. అతను యేదేనా జంతువుని చంపినప్పుడు దాన్ని తన అగ్రజుని కింద భావించి క్షమాపణ కోరేవాడు. తమ నృత్యాల్లోనూ, మంత్ర కర్మల్లోనూ ఆ జంతు సోదరుని అనుకరించేవాడు. దాన్ని చర్మం ధరించి దానిని అనుకరించేవాడు.

మానవుడికి తనని యింకా ''నేను'' అని పిలుచుకోవడం తెలీదు. అతను యింకా తను తెగలో భాగమనీ, దాని పరికరమనీ భావించేవాడు. ప్రతి తెగకీ దాని పేరు వుండేది, అది దాని వంశాచార లాంఛనం. ఒక తెగ పేరు ''అడివి దున్న,'' యింకోదాని పేరు ''ఎలుగుబంటి,'' మరో దాని పేరు ''జింక.'' తెగలోని మనుషులు ఒకళ్లకోసం ఒకళ్లు తమ జీవితాలని అర్పించేవాళ్లు. తమ తెగ ఆచారాలని వంశలాంఛనపు యిచ్ఛ కింద పరిగణించేవాళ్లు. అది శాసనమే.

## మన పూర్వులతో సంభాషణ

మళ్లీ ఆదిమ మానవుడి గుహలోకి వెళ్లి అతనితో చలిమంట పక్కన కూర్చుందాం. అతని విశ్వాసాల గురించీ, ఆచారాల గురించీ అతనితో మాట్లాడదాం.

ఆ గుహలోని చిత్రాల గురించీ, అలంకారంగా వున్న యెముక తాయెత్తుల గురించీ, మనం సరిగా అర్థం చేసుకున్నామో లేదో, మన వూహలు ఒప్పో తప్పో అతన్నే చెప్పనివ్వండి. వాటిని అతను ముఖ్యంగా మన కోసమే వదిలి పెట్టినట్టుంది.

కాని గుహ యజమానిని మాట్లాడేటట్టు చెయ్యడం యెలాగ?

పొయ్యిమీది నివురుని వేలాది సంవత్సరాల క్రితమే గాలి తుడిచిపెట్టేసింది. యీ పొయ్యి పక్కన కూర్చుని చెకుముకిరాతి పనిముట్లనీ, ఎముక పనిముట్లనీ చేసి, జంతువుల చర్మాలతోటి తమ బట్టలు కుట్టుకున్న వాళ్ల అస్థికలు యేనాడో మట్టిలో కలిసిపోయాయి. పురాతత్వవేత్తలకి యెప్పుడో గాని యెండిపోయి, పసుపు తిరిగిన శిలాజ మానవుడి పుర్రెలు నేలలో దొరకవు.

పుర్రెని మాట్లాడేటట్లు చెయ్యగలమా?

పనిముట్ల ముక్కల్నీ, విరిగిన భాగాల్నీ కనిపెట్టడానికి, యీ పనిముట్లతోటి ఆదిమ మానవుడు యెలా పని చేసిందీ తెలుసుకోడానికి మనం గుహని తవ్వాం.

కాని ఆనాటి మానవుని మాటల ముక్కలు యెక్కడ దొరుకుతాయి?

వాటి కోసం యీనాటి మన భాషల్లోనే మనం వెదకాలి.

మనకి యీమాదిరి తవ్వకానికి పార అక్కర్లేదు. మనం నేలని తవ్వడం లేదు, నిఘంటువుని తవ్వుతున్నాం. ప్రతి భాషా, ప్రతి పదజాలమూ, గత కాలపు విలువైన తునకల్ని పదిలపరచింది. అది వుండాల్సినట్టే వుంది. యింతకీ మనకి భాష రూపంలో సంక్రమించింది వందల వేల తరాల అనుభవమే కదా.

భాషని గురించి తెలుసుకోవడం కంటేనూ, అధ్యయనం చెయ్యడం కంటేనూ సులభమైంది యేమి వుంటుం దని మీరు అనవచ్చు. మీ బల్లదగ్గర కూర్చుని నిఘంటువులోని పేజీలు తిరగెయ్యడమే చెయ్యాల్సిందల్లా అనీ అనవచ్చు.

కాని అది అంత సులభం కాదు.

పరిశోధకులు ప్రాచీన పదాలకోసం వెదకడంలో భూమి అంతా తిరుగుతారు, ఏటవాలు కొండలు యెక్కుతారు, సముద్రాలు దాటుతారు. ఒకో అప్పుడు యెక్కణ్నో కొండ గోడల వెనక తమ చిన్న జనావాసం నిర్మించుకున్న ప్రజలు మిగతా భాషల్లో యేనాడో అంతరించిన పదాలని నిలుపుకోవచ్చు.

మానవాళి దీర్ఘ యాత్రలో ప్రతి భాషా ఒక చలివేందిర. ఆస్ట్రేలియాలో, ఆఫ్రికాలో, అమెరికాలో వున్న వేటగాళ్ల తెగల భాషలు యేనాడో వదిలిపెట్టిన విడిది ప్రాంతాలు. అప్పుడు పరిశోధకులు సముద్రం దాటి పోలినే షియాకి వెడతారు, మనం మర్చిపోయిన పదబంధాల కోసం, ప్రాచీన పదాల కోసం.

మాటల కోసం తమ యెడతెగని శోధనలో వాళ్లు దక్షిణాది యెడారుల్లోకంటా పోతారు, ఉత్తరాది తండ్రాల్లో కంటా పోతారు.

సొంత ఆస్తి అనేది లేని కాలంనుంచీ వున్న మాటలని, ''నాది'' అనే మాట అర్థం తెలియని రోజులనుంచీ, అంటే ఉదాహరణకి ''నా యిల్లు'', ''నా కుక్క'' మొదలైన మాటలు తెలియని నాటినుంచీ వున్న పదాలని సోవియట్ యూనియన్ దూర ఉత్తర ప్రాంతపు ప్రజలు వాడతారు.

ప్రాచీన భాష అవశేషాలు మనం కనిపెట్టదలచుకుంటే, పురాతత్వవేత్తలు ప్రాచీన నివాస స్థానాల అవశేషాలనీ, పనిముట్ల అవశేషాలనీ తవ్వి తీసినట్టుగా, మనం కూడా యిలాంటి భాషలనే తవ్వి తియ్యాలి.

ప్రతి వాళ్లూ నిఘంటు పురాతత్వవేత్తలు కాలేరు.

దానికి ప్రత్యేకమైన శిక్షణా, జ్ఞానమూ కావాలి. యేమంటే పాత మాటలు మ్యూజియంలో మాదిరీ ప్రదర్శ నలో వుండవు. శతాబ్దాల కాలంలో మాటలు యెన్నో సార్లు అర్థం మార్చుకున్నాయి. అవి ఒక భాషనుంచి యింకో భాషకి ప్రయాణం చేశాయి, కలిసిపోయాయి, ఉపసర్గలూ వగైరాలని మార్చుకున్నాయి. ఒకో అప్పుడు పూర్వ పదపు ధాతువు తప్ప మరేం మిగలకపోవచ్చు, కాలిపోయిన చెట్టు వేళ్లలాగా. ఆ ధాతువుని బట్టే ఆ పదం యెక్కణ్నుంచి వచ్చిందీ మనం గుర్తించగలం.

వేల సంవత్సరాల కాలంలో పదాలే కాదు వాటి అర్థాలు కూడా మారిపోయాయి. ఒకో అప్పుడు ఒక పదానికి దానికి పూర్వం వున్న అర్థానికి పూర్తి భిన్నమైన అర్థం రావచ్చు.

అలా యింకా జరుగుతూనే వుంది. ఒక కొత్తదాన్ని దేన్నేనా కనిపెట్టినప్పుడు, దానికోసం అస్తమానూ మనం కొత్త పదాన్ని కనిపెట్టం. కొంచెం పరకాయించి చూసి యేదో మాటని పట్టుకుని ఆ కొత్త వస్తువు ముఖానికి పట్టీ తగిలించినట్టు తగిలించేస్తాం.

యివాళ మనం రైలు ''బండి'' యెక్కుతాం, దీన్ని యే గుర్రమూ, ఎద్దులూ లాగకపోయినా. ''చెంబు'' అర్థం అలాంటి పాత్రలన్నిటికీ విస్తరించింది, అది రాగితో (చెన్) చేసిందే కాకపోయినా.

''నేడు మనం వాడే కలాలు కూడా పాతకాలాల్లో వాడే కలాల వంటివికావు. ఆ పేరు మిగిలింది.... ''కలమ్'' కలమ అనే సంస్కృత పదంనుంచి వచ్చింది. గడ్డిపోచ, రెల్లు, కాకి వెదురు అని దాని అర్థాలు. పూర్వం మనం రెల్లు

కలాలను చాకులతో చెక్కుకుని, కొనచీల్చి రాసుకునే వాళ్లం. యిప్పుడు ఆ కలములు కాకి వెదురుపోయి, క్రరకలాలు, ఇనపకలాలు, సెల్యులోజ్ కలాలు వచ్చాయి. అయినా కలం పేరు మామూలుగానే వుంది.''*

యివన్నీకూడా భాష పైపొరలో యీ మధ్య జరిగిన మార్పులు అయితే వాటి పూర్వపు అర్థం యేమిటైందీ మనం తెలుసుకోగలం.

కాని లోతుకి పోయే కొద్దీ మన పని కష్టం అవుతుంది. పదానికి వుండే విస్మృత, ప్రాచీన అర్థాన్ని కనిపెట్ట గలగడానికి మంచి భాషా పాండిత్యం కావాలి.

సింహానికి ''పెద్ద కుక్క'' అనే అర్థం వచ్చే పదమున్న భాషలున్నాయి. అలాగే నక్కకి ''చిన్న కుక్క'' అనీ. అలా యెందుకు వుందంటే ''సింహం,'' ''నక్క'' అనే వాటికి పదాలు యేర్పడక పూర్వమెప్పుడో ''కుక్క'' అనే పదం వుంది.

# ప్రాచీన భాషలోని తునకలు

యుకాగీర్ల భాషలో ''మనిషి లేడి చంపు'' (అలా అని ముక్కస్య ముక్క తర్జుమా) అని ఒక పదం వుందని సోవియట్ అకడెమీషియన్ ఐ. మెశ్చనీనొవ్ రాశాడు. యీ పదం పలకడం మాట అటుంచి దీని భావమేమిటో గ్రహించడం యింకా కష్టం.

ఎవరు ఎవర్ని చంపారు? మనిషి లేడిని చంపాడా, లేడి మనిషిని చంపిందా, లేక మనిషీ లేడీ కలిసి యింకొకళ్ల నెవళ్లనేనా చంపారా, అదీ యిదీ కాక మరొకరెవళ్లో యీ ద్వయాన్ని మట్టుపెట్టారా?

కాని యుకాగీర్‌కి యీ మాట అర్థమవుతుంది. ''మనిషి ఒక లేడిని చంపాడు'' అని చెప్పదలచుకున్నప్పుడు యీ పదాన్ని అతను వాడతాడు.

అలాంటి వింత పదం యెలా వచ్చి వుంటుంది?

మానవుడు తనకి సంబంధించి చెప్పుకునేటప్పుడు ''నేను'' అని యింకా అననప్పుడు, తనే శ్రమించి, వేటాడి, లేడిని చంపానని అతను గ్రహించనప్పుడు, వాడింది యీ పదం. లేడిని చంపింది తను కాదనీ, మొత్తం తన తెగ అనీ, యింకా చెబితే తన తెగా కాదనీ, యేదో తెలియని, అజ్ఞాత శక్తి ప్రతిదాన్నీ పాలించేది అనీ అతను నమ్మాడు. ఆ సుదూర గతంలో మానవుడు యింకా ప్రపంచంలో దుర్బలుడుగానే నిస్సహాయుడై వుండేవాడు, యేమంటే ప్రకృతి అతని అధీనంలో లేదు.

ఒక రోజున యే అజ్ఞాత శక్తి వరం వల్లనో ''మనిషి లేడి చంపు'' విజయవంతమైంది; ఆ మర్నాడు వేట నిరుపయోగమైంది, అందరూ ఉత్త చేతులతో వెనక్కి వచ్చారు. యీ పదం ''మనిషి లేడి చంపు''లో బాధ్యుడైన ఒక్క వ్యక్తి లేడు. ప్రాచీన కాలంలో వేటగాళ్లు బాధ్యత వున్న జీవి యెవరో తనో, లేడో యెలా అర్థం చేసుకోగలడు? తనకి తన అజ్ఞాత రక్షకుడు – తనకీ లేడికీ ఉమ్మడి పూర్వుడెవరో, ఆ లేడిని యిచ్చాడని అతను నమ్మేవాడు కాదూ మరి?

---

* ''మనలిపి పుట్టు పూర్వోత్తరాలు'' (తిరుమల రామచంద్ర). – అను.



''మనిషి లేడి చంపు'' (చరిత్రాత్పూర్వపు చిత్రం)

మన తవ్వకాలలో మనం మానవ భాష మొదటి పొరలనుంచి తర్వాతి వాటికి సాగితే, మానవుడు తనకిగా తనని అదృశ్య శక్తుల చేతిలో పనిముట్టుగా భావించే నాటి భాషావశేషాల దగ్గరికి చేరుకుంటాం.

చుక్చిస్ భాషలో ఒక పదబంధం వుంది: ''మనిషి గుండా మాంసం యిచ్చు తన కుక్క.''

యేమన్నా అర్థమైందా? గందరగోళంగా వుంది. యే నాడో నిక్షిప్తం అయిన భాష పొరనుంచి, మనం యివాళ ఆలోచన చేసే పద్ధతి మనుషులకు తెలియనప్పుడు వున్నటువంటి పొర నుంచి, యీ పదబంధాన్ని తవ్వి తీశాం.

''మనిషి తన కుక్కకు కొంత మాంసం పెడుతున్నాడు'' అనడానికి వాళ్లు పై విధంగా అనేవాళ్లు.

అప్పుడు మనిషి గుండా మాంసం యెవళ్లు యిస్తున్నారు?

మానవుణ్ణి కీలుబొమ్మలాగా ఆడించే అదృశ్య శక్తి.

''నేను కొంకిసూదులతో అల్లుతున్నాను'' అనడానికి బదులుగా డకోటా ఎర్ర యిండియన్లు ''నాచేత అల్లబడు'' అంటారు. అంటే ఆ వ్యక్తే అల్లిక కొంకిసూది అయినట్టు, అల్లడానికి కొంకెసూదిని వాడే వాడు కాకుండా.

ప్రాచీన భాషావశేషాలు అన్ని యూరపియన్ భాషల్లోనూ కనిపిస్తాయి.

ఆరకంగా ''చలిగా వుంది'' అనడానికి ఫ్రెంచిలో ''ఇల్ ఫెయిత్ ఫ్రాయి'' (il fait froid) అంటారు. మాటకి మాట అనువాదం చేస్తే ''అతను చలి చేస్తున్నాడు'' అని అర్థం వస్తుంది.

అదుగో, మళ్లీ ప్రపంచాన్ని పాలించే ఆ అదృశ్య ''అతను.''

మనకి యే అదృశ్య శక్తుల్లోనూ నమ్మకం లేకపోవచ్చు కాని యీ శక్తుల్లో నమ్మకం వున్న మన పూర్వుల భాషల అవశేషాలని మన భాష నిలబెడుతోంది.

ఆరకంగా భాషను శోధిస్తూ మనం మన పూర్వుల మాటలనే కాదు వాళ్ల ఆలోచనలని కూడా చూస్తాం. ఆదిమ మానవుడు ఒక వింత మాయా ప్రపంచంలో జీవించాడు. అక్కడ అతను శ్రమించి, వేటాడలేదు. ఎవరో అతన్ని ''శ్రమించేటట్టు చేసి'', లేడిని ''చంపేటట్టు చేసి'' అలా అతన్ని ఉపయోగపెట్టారు. అక్కడ ప్రతీదీ ''తెలియని యే తీవ్ర శక్తి'' యిచ్చానుసారమో జరిగేది.

కాలం గడిచింది. మానవుడు శక్తివంతుడయ్యేకొద్దీ ప్రపంచాన్ని గురించీ, అందులో తన స్థానాన్ని గురించీ

ముక్కులోనుంచి ఉరుములు మెరుములు వస్తున్న వింత పక్షి (డకోటా ఎర్ర ఇండియన్ తెగల చిత్రం)



బాగా అర్థం చేసుకోవడం మొదలెట్టాడు. ''నేను'' అనే మాట వచ్చింది. దాంతోబాటు క్రియని నిర్వర్తించి, పోరాడి, వస్తువులూ ప్రకృతీ తన యిచ్ఛని నెరవేర్చేటట్టు చేసే వ్యక్తి వచ్చాడు.

మనం యిప్పుడిక ''మనిషి లేడి చంపు'' అనం. ''ఆ మనిషి ఆ లేడిని చంపాడు'' అంటాం. కాని గతకాలపు ఛాయ అప్పుడప్పుడు భాషలో తారాడుతుంది. ''అది నాఖర్మ'' ''అది నాపాలబడింది,'' ''అది దురదృష్టం'' లాంటి మాటలని మనం అంటం లేదూ?

యేది దాన్ని దురదృష్టం అయేటట్టు చేస్తుంది?

కర్మ!

కాని కర్మ అనేదే ఆ అజ్ఞాత శక్తి, ఆదిమ మానవుణ్ణి అంతగా భయకంపితుణ్ణి చేసింది.

మన భాషలో ''కర్మ'' అనే మాట యింకా వుంది. కాని ఆ పదం భవిష్యత్తులో మాయమై పోతుందని ఖాయంగా చెప్పచ్చు.

రైతు నమ్మకంతోటే పొలం దున్నుతాడు. పంట బాగా వుండటం కాని, చెడి పోవడం కాని తనమీదే ఆధార పడివుందని అతనికి తెలుసు. పొలం దున్నే యంత్రాలూ, ఎరువులూ వగైరాలన్నీ అతనికి సహాయపడేవి.

నావికుడు ధైర్యంగా సముద్ర ప్రయాణం మొదలెడతాడు. మిట్టలుంటే, తుఫాను రాబోతూవుంటే ప్రత్యేక మైన పరికరాలు అతన్ని ముందే హెచ్చరిస్తాయి.

''అది కర్మ'', ''అది అలా రాసిపెట్టివుంది'' అనే మాటలు అరుదయి పోతాయి.

అజ్ఞానమే భయానికి ఆస్కారం. విజ్ఞానం ధైర్యాన్ని యిస్తుంది, ప్రకృతిమీద మానవుణ్ణి అధినాథుడుగా చేస్తుంది.



మహత్తర భూతం గౌరవర్థం మంత్ర సంజ్ఞల్లో రాసిన పాట

# ప్రకరణం ఎనిమిది

## హిమనదులు మాయమవుతాయి

ప్రతి యేడూ మంచు కరగడం మొదలుపెట్టగానే, యెక్కడపడితే అక్కడ హఠాత్తుగా ఉరవళ్లు పరవళ్లు తొక్కే సెలయేళ్లు, వంకలు, వాగులు ప్రత్యక్షమవుతాయి. అడవుల్లో, పొలాల్లో, వూళ్లల్లో రోడ్లవార, రోడ్డు పక్క గుంటల్లో యెక్కడ చూసినా అవే.

యెంత గదమాయించినా యింట్లో వుండని పిల్లల్లాగా అవి గడ్డకట్టిన మకిలి మంచుకిందనుంచి భళ్లున తలుపులు తెరుచుకున్నట్టు వస్తూనే వుంటాయి. రాళ్ల గుట్టలమీదనుంచి, రోడ్లకడ్డంపడి, ''పదండి ముందుకు'' అనుకుంటూ, గాలిని తమ గలగలలతో నింపేస్తూ ప్రవహిస్తాయి.

ఎండ పడే యేటవాలు ప్రదేశాలనుంచీ, ఆరుబయలు స్థలాలనుంచీ మంచు వెనక్కి తగ్గి చరియల్లోనూ, కుంటల్లోనూ, గోడవార చీకటి మూలల్లోనూ, మే నెలదాకా సూర్యుడి తప్త కిరణాలనుంచి దాంకుంటుంది.

ప్రకృతి హఠాత్తుగా మారిపోయినట్టు వుంటుంది. బోసిపోయిన కొండల్ని పచ్చగా చెయ్యడానికీ, బోసిగా వున్న చెట్ల కొమ్మలమీద ఆకుల్ని చిగురింపజెయ్యడానికీ సూర్యుడికి కొద్ది రోజులు చాలు.

శీతాకాలంలో పేరుకుని పరుచుకున్న మంచు దుప్పటి కరగనారంభించాక యిలా ప్రతి వసంత రుతువులోనూ జరుగుతుంది.

కాని ప్రపంచాన్ని అంతటినీ తెల్లని పాగా చుట్టినట్టు కమ్మిన ఆ బ్రహ్మాండమైన మంచు పొర కరగనారంభించాక ఆ రోజుల్లో యేం జరిగింది?

అప్పుడు చిన్న సెలయేళ్లకీ, వాగులకీ బదులుగా బ్రహ్మాండమైన, గంభీరమైన నదులు మంచు అడుగునుంచి యెగ జిమ్ముకుంటూ వచ్చాయి. వాటిల్లో చాలా నదులు యిప్పటిదాకా యింకా దారిలో తటస్థపడే సెలయేళ్లనీ, వాగులనీ కలుపుకుని సముద్రంలో కలుస్తూనే వున్నాయి.

యిదీ ప్రకృతికి కలిగిన అత్యద్భుత జాగృతి, ఉత్తరాది బ్రహ్మాండమైన బోసి అడవులని చిగురింపచేసిన మహత్తర వసంతం.

కాని వసంతం ఒక్కసారే పూర్తిగా అడుగుపెట్టదు. ఒకో అప్పుడు మే నెలలో చక్కగా యెండ కాసిన తర్వాత హఠాత్తుగా చలి ముంచుకురావచ్చును. మర్నాడు ఉదయం లేచి చూసే సరికి యిళ్ల కప్పులన్నీ మంచుతో కమ్ముకుపోయి కనిపిస్తాయి. చుట్టూ అంతా తెల్లని మంచు. వసంతం రానే లేదా యేమిటి? అలాగే ఆ ప్రాచీనకాలపు వసంతం కూడా ఒక్క సారే శీతాన్ని తొలగించుకుని రాలేదు. హిమనదులు మెల్లిగా వెనక్కి తగ్గాయి, బలవంతంగా వెనక్కి గెంటినట్టు. వీలైన చోట్లల్లా అవి శతాబ్దాల తరబడి చూరు పట్టుకుని వేలాడేయి.

ఒకో అప్పుడు, కొంచెం వెనక్కి తగ్గి, హిమనదులు మళ్లీ శక్తి పుంజుకుంటున్నట్టు ఆగి, ముందుకు సాగాయి.

వాటితో బాటు తంద్రా దక్షిణాదికి పోయింది. తనతో బాటుగా తన యెడబాయని నేస్తమైన ధ్రువపు జింకని తీసుకు వచ్చింది.

నాచు, పాకుడు మొక్కలు గడ్డిని ముంచేస్తూ మైదానాలమీద పాకాయి. అడివిదున్నలూ, గుర్రాలూ పచ్చిక నేలల దక్షిణాదికి వెళ్లిపోయాయి.

వేడికీ చలికీ మధ్య పోరాటం చాలా కాలం సాగింది, ఆఖరికి వేడి నెగ్గింది.

కరిగే మంచునుంచి మహా నదులు ఉరకలెత్తాయి. భూమిని కప్పిన మంచు పాగా కుంచించుకుపోయి ఉడిగింది. మంచు హద్దులు కూడా ఉత్తరాదికి పోయాయి. వాటితో పాటు తంద్రాలూ పోయాయి. ఒకప్పుడు నాచూ, పాకుడూ, యెడం యెడంగా వున్న గరికలూ, వంగిపోయిన చిన్న పైన్ మొక్కలూ వున్న స్థానంలో అయిదడుగుల అగవ వున్న పైన్ చెట్ల బ్రహ్మాండమైన అడవులు పెరిగాయి.

అంత కాలమూ రోజులు యింకా యింకా వెచ్చగా అవుతూనే వున్నాయి.

ఆస్పిలా, బర్చిలా శోభాయమానమైన హరిత శీర్షాలు యింకా యింకా తరుచుగా ముదురు నీలపు పైన్ గుంపుల్లో నుంచి చీల్చుకుని వస్తూనే వున్నాయి.

ఉత్తరం వైపున వాటి ననుసరించి వెడల్పాటి ఆకుల ఓక్ చెట్లూ, బర్చి చెట్లూ మహా సైన్యం వుంది.

''పైన్ చెట్ల యుగం'' యిప్పుడు ''ఓక్ చెట్ల యుగం'' అయింది. ఒక అడవి యిల్లు యింకో యింటికి దారి యిచ్చింది.

ప్రతి అడవి యింటికీ తన నివాసస్థులు వుంటారు.

చిగురుతొడిగే అడవులు ఉత్తరాదికి కదలగానే, పొదలూ పుట్టగొడుగులూ, బెర్రీలూ వాటితోపాటే వెళ్లాయి. అలాగే అడివిలోని ఆహారాన్ని తినే జంతువులూ వెళ్లాయి. వాటిలో అడివి పందులూ, కణుజులూ, అడివి దున్నలూ, రాజసంపుట్టిపడే కొమ్ములున్న యెర్ర జింకలూ వున్నాయి. తీపి పదార్థాలంటే యిష్టపడే గోధుమ రంగు యెలుగు బంటి అడవిలో దొరికే తేనెకోసం పొదల్లో దూసుకుపోయేది. కుందేళ్ల జాడలని గాలించేస్తూ తోడేళ్లు రాలిన ఆకుల మీద పరిగెత్తి పోయేవి. గుండ్రటి మొహం, చిన్న పంజాలు వున్న బీవర్లు అడవి సెలయేళ్లకి అడ్డంగా ఆనకట్టలు కట్టేవి. పక్షిసమూహాల కిలకిలా రావాలతో అడివి నిండిపోయింది. అడవి సరస్సులమీదనుంచి హంసలవీ, బాతులవీ అరుపులు వినవచ్చేవి.

## మంచుకి బందీలు

ప్రకృతిలో యిలాంటి అద్భుతమైన మార్పులు జరుగుతూవుంటే మానవుడు పక్కలనుంచుని చూస్తూ వుంటాడా. ఒక నాటకంలోని సీనరీ లాగా, అతని చుట్టూ వున్న ప్రతీదీ మారిపోతోంది. కాని నాటకంలోలా కాకుండా ప్రతి రంగానికీ కొన్ని వేల సంవత్సరాలు పట్టింది, నాటక ప్రదర్శనా రంగస్థలం కొన్ని లక్షల చదరపు కిలోమీటర్లు ఆవరించుకుంది.

యీ ప్రపంచ వ్యాప్త దృశ్యంలో మానవుడు ప్రేక్షకుడు కాదు, తనూ ఒక నటుడే.

పూర్వరంగం మారిన ప్రతిసారీ, మానవుడు కూడా బతికి బయటపడ్డానికి తన జీవిత విధానాన్ని మార్చుకోవాల్సి వచ్చేది.

తండ్రలు దక్షిణాదికి పాకినప్పుడు, వాటితోబాటు ధ్రువపు జింక కూడా వచ్చింది, ఆ జంతువులు దానికి కట్టి వెయ్యబడ్డ బందీలైనట్టు. యీ అదృశ్య శృంఖలపు ఒక అంచున ధ్రువపు జింక వుంటే, తండ్రాలోని నాచూ, పాకుడూ యింకో పక్కన వుండేవి.

ధ్రువపు జింక నాచునీ, పాకుడునీ మేసి, తండ్రాలో తిరుగుతూ వుంటే, ధ్రువపు జింకని వేటాడుతూ మానవుడూ దాన్ని అనుసరించేవాడు.

పచ్చికమైదానాల్లో మానవుడు అడివి దున్ననీ, గుర్రాన్నీ వేటాడేవాడు. తండ్రాల్లో ధ్రువపు జింకని వేటాడ వలసి వచ్చింది.

ధ్రువపు జింకని కాక మరి దేన్ని తండ్రాల్లో వేటాడగలడు?

మామత్‌లన్నీ నశించిపోయాయి. ఆదిమ మానవుడు వేల సంఖ్యలో వాటిని మట్టుపెట్టాడు, తన నివాసాల దగ్గర పర్వతాల్లా మామత్ ఎముకల్ని పోగుపెట్టాడు. తన ఆహారం కోసం గుర్రాల మందల్ని చంపాడు. పచ్చటి గడ్డి స్థానంలో పాడి పాకుడు రాగానే ఆ మిగిలిన గుర్రాలు దక్షిణాదికి దూరంగా వెళ్లిపోయాయి.

అంచేత ఆదిమ మానవుడికి తండ్రాలో ఆహారంగా మిగిలింది ఒక్క ధ్రువపు జింక. అతను దుప్పి మాంసం తినేవాడు, దుప్పి తోలు కప్పుకునే వాడు, దాని కొమ్ములతోటి బల్లేలూ, యీటెలూ తయారుచేసుకునేవాడు. అందు కనే అతను తన జీవిత విధానాన్నంతటికీ ధ్రువపు జింకకి అనుగుణంగా మార్చుకోవాల్సి వచ్చింది.

ధ్రువపు జింక మందలు యెక్కడికి వెడితే అక్కడికి అతనూ వెళ్లాడు. తెగ యెక్కడేనా విడిది చేస్తే, ఆడ వాళ్లు గబగబా గుడారాలు వేసి తోళ్లతో వాటిని కప్పేవాళ్లు. ఒకే చోట యెక్కువ కాలం వుండరని వాళ్లకి తెలుసు. దోమలు తరిమేస్తే ధ్రువపు జింక మందలు కొత్త పచ్చిక బీళ్లని అన్వేషించేటట్టు పోయేవి. అప్పుడు విడిది చాలించి వాటి వెనక్కాలే పోవడం తప్ప మనుషులకి గత్యంతరం లేకపోయింది. ఆడవాళ్లు గుడారాల్ని తీసేసి వీపున తగిలించుకునే వాళ్లు. వాళ్లు అలిసిపోయి నీరసంగా తండ్రాగుండా కాళ్లీడ్చుకుంటూ పోయేవాళ్లు, మగవాళ్లు బల్లేలూ, యీటెలూ తప్ప యింకేమీ మొయ్యకుండా హుషారుగా పోతూ వుంటే. యింటి వ్యవహారాల గురించి మధన పడ్డం మొగవాడి పని కాదు.

అప్పుడు తండ్రా ఉత్తరం వేపుకి వెనక్కి తగ్గింది. దాంతో బాటు ధ్రువపు జింక పోయింది. తండ్రా స్థానంలో చొరబారి పోలేని కారడవులు పెరిగాయి. మరి ప్రాచీనకాలపు తెగల గతి యేమిటి?



తండ్రాలో జింకలే మనిషికి యేకైక ఆధారం అయాయి

ధ్రువపు జింకను అనుసరిస్తూ, కొంతమంది వేటగాళ్ల గుంపులు ఆర్కిటిక్ కేసి ఉత్తరంగా పోయాయి. అదే సుఖమైన పని, యేమంటే అప్పటికే వాళ్లు ఉత్తర ప్రాంతపు వాతావరణానికి అలవాటు పడ్డారు. హిమయుగపు క్రూర శీతం కొన్ని వేల వేల సంవత్సరాలు వుండింది. యీ కాలంలో ఆ మానవుడు జంతువుల వెచ్చని బొచ్చు చర్మాల బట్టలు ధరించి చలిని యెదిరించడం నేర్చాడు. బయట యెంత చలిగా వుంటే సారంగ నివాసపు పొయ్యి అంత కాంతిగా వెలిగేది.

వెనక దిగబడి వుండిపోవడంకంటే ఆర్కిటిక్‌కి వలసపోవడం సులభం. యే మాత్రం యెదిరించకుండా లొంగిపోవడమనే మార్గం యెల్లవేళలా ఉత్తమమైన మార్గం కాదు. తంద్రాతోబాటుగా ఉత్తరానికి పోయిన మానవులు కడకి తప్పిపోయారు, యేమంటే వాళ్లకు హిమయుగం దీర్ఘకాలం కొనసాగింది. గ్రీన్‌లాండ్‌లో వుండే ఎస్కిమోలు ప్రకృతితో అవిరామ యుద్ధం చేస్తూ, క్రూరమైన నిర్దాక్షిణ్యమైన ప్రకృతితో అలా పోరాడుతూ యింకా మంచులోనూ, హిమంలోనూ జీవిస్తున్నారు.

వెనక్కాల వుండిపోయిన తెగల అదృష్టం వేరేలా వుండింది. మొదట్లో, పుట్టుకొచ్చే అడవుల మధ్య వాళ్ల జీవితం, యింకా యెక్కువ కష్టంగా వుండింది. కాని క్రమేణా వాళ్లు తమ పూర్వులు యెన్నో వేల సంవత్సరాలు బందీలుగా వున్న మంచు ఖైదునుంచి తప్పించుకోగలిగారు.

## మానవుడు అడవులతో పోరాడటం

తంద్రాల బదులుగా పెరిగిన అడవులు యీనాటి మన అడవుల్లా వుండేవే కాదు. వేలాది కిలోమీటర్ల విస్తీర్ణంతో తిన్నగా నదులదాకానో, సరస్సులదాకానో, ఒకో చోట సముద్రందాకానో పెరిగిన మహా వృక్షాలా, పొదలా అభేద్యమైన గట్టి గోడ అది.

యీ వింత నూతన ప్రపంచంలో ఆదిమ మానవుడికి జీవితం సుఖప్రదంగా వుండేది కాదు.

అడివి తన చిక్కటి పంజాలతో అతన్ని నులిమేసేది, గాలి పీల్చుకునే యెడం యిచ్చేది కాదు. కొమ్మల్ని కొట్టేస్తూ చిన్న చిన్న మళ్లని శుభ్రం చేస్తూ నిత్యమూ అతను అడివితో యుద్ధం చెయ్యాల్సి వచ్చేది.

తంద్రాలో గాని, పచ్చికమైదానంలో గాని నివాస స్థావరానికి చక్కని జాగా యిబ్బంది వుండేది కాదు. యెటు చూసినా కావలసినంత స్థలం. కాని అడివిలో ఆరుబయలు స్థలం కావాలంటే ప్రకృతినుంచి బలవంతాన లాక్కోవాల్సి వచ్చేది.

యిక్కడ ప్రతి అంగుళం జాగాలోనూ చెట్లూ, దట్టమైన పొదలూనూ. మనిషి శత్రు దుర్గాన్ని ముట్టడించినట్టుగా అడివిని ముట్టడించాల్సి వచ్చేది.

మరి ఆయుధాలు లేకుండా యెవళ్లూ పోరాడలేరు.

చెట్లని కొట్టాలీ అంటే అతనికి కొత్త గొడ్డలి కావాలి.

దాంతోటి అతను బరువైన త్రికోణపు రాతిని పొడుగాటి కొయ్యకి బిగించాడు.

అంతకుముందు వడ్రంగిపిట్ట మాత్రమే చెట్లని ముక్కుతో పొడుస్తూ వుండే చోట నూతన ధ్వనులు అడివిలో

గింగుర్లెత్తాయి. యీ నూతన ధ్వనులు పిట్టల్నీ, జంతువుల్నీ భయపెట్టాయి. తొలి చెట్లని నరికే తొలి గొడ్డళ్ల చప్పుళ్లు అవి.

వాడిగా వుండే రాయి చెట్ల కాండాలల్లో లోతుగా దిగేది. ఆ గాడినుంచి చిక్కటి ద్రవం వూరేది. చెట్టు నేలకి, కొట్టేవాడి కాళ్లదగ్గరికి ఫెళఫెళా విరుచుకుపడిపోతూ వుంటే హాహాకారాలు చేసేది.

రోజుల తరబడి మనుషులు పట్టుదల వదలకుండా ఓపిగ్గా చెట్లని కొట్టేస్తూ, అడవి ప్రపంచంలో తమకి జాగా చేసుకున్నారు.

అలా ఖాళీ యేర్పాటు చేసుకున్నాక, ఆ మొదళ్లనీ, పొదలనీ తగలబెట్టేసేవాళ్లు.



రాతి గొడ్డలి చెక్క పిడి

పిడి కోసం రంధ్రం చేసిన రాతి గొడ్డలి

యీ రకంగా వాళ్లు అడవి శత్రువుని జయించారు. యేమైనా వాళ్లు ఓడిపోయిన శత్రువుని ఒంటరిగా వదల్లేదు.

కొమ్మల్ని కొట్టేశాక, వాళ్లు చెట్టు చివరని సూటిగా చేసి, దాన్ని రాతి సుత్తితో గట్టిగా కొట్టి నేలలోకి దిగేసేవాళ్లు. దాని పక్కనే యింకో స్తంభాన్నీ దిగేసేవాళ్లు. అలా మూడోదీ, నాలుగోదీ వరసగా వేసుకుంటూ పోయేవాళ్లు. వాళ్లకి ఒక గోడ యేర్పడేది. కొమ్మల్ని అల్లి దాన్ని గట్టి చేసేవాళ్లు. కొంత కాలానికి అడివి మధ్యలో చిన్న అడివిలా కనిపించే దుంగల గది యేర్పడేది. చెట్ల కొమ్మలు అల్లి బిల్లిగా గోడలా అల్లుకుపోయిన చెట్ల బోదెలు యిక్కడ వున్నాయి. కాని ఆ బోదెలు యెటువేపూ పెరగలేవు. అవి మనిషి పాతినట్టే అలా వుండిపోయేవి.

అదిమ మానవుడికి అడివి ప్రపంచంలో తన ఉనికి యేర్పాటు చేసుకోవడం కష్టం అయింది, ఆహారం సంపాదించుకోవడం యింకా కష్టమైంది.

ఆరుబయలు మైదానాల్లో మందలుగా వుండే జంతువుల్ని అతను వేటాడేవాడు. ఎక్కణ్ణో దూరంనుంచే మందని చూడ్డం సులభం. చిన్న గుట్టమీదనుంచి కిలోమీటర్ల దూరం దృష్టి సాగుతుంది కాబట్టి.

కాని అడవిలో అలా కాదు. అడివి గృహం నిండా జీవులే అయినా ఒక్కటీ కనిపించేవి కావు. అన్ని అంతస్తులూ వాటి అరుపులతోటీ, కేకలతోటీ నిండిపోయి వుండేవి, కాని వాటిని పట్టడం మహా కష్టమయ్యేది.

యేదో కింద గలగలలాడేది, లేదా పైన యెగిరిపోయేది, కింది ఆకుల్ని అటూ యిటూ కదిలిస్తూ.

యీ అరుపుల మధ్యా కేకల మధ్యా వాసనల మధ్యా తేడా చూడ్డం యెలాగ, సముజ్జ్వలమైన కాండాల మధ్యలో జంతువుల గుర్తుల్ని పట్టడం యెలాగ?

ప్రతి అడవి జంతువుకీ, పక్షికీ దాని రక్షకవర్ణం వుండేది. పక్షి యీకలు చెట్టు కాండాల చుక్కల్లా వుండేవి. అసలే అడివిలో సగం చీకటిగా వుండేది. జంతువుల ఎరుపు గోధుమ రంగు బొచ్చు పండిపోయిన చెట్ల ఆకుల్లాగానే వుండేది.

జంతువు జాడపట్టడం కష్టంగా వుండేది. కాని ఒక సారి అంటూ అది దగ్గర పడితే, తన ఆయుధాన్ని దాని మీదకి విసరడానికి వేటగాడికి ఒకే అవకాశం వుండేది. అతని గురి మహా నిక్కచ్చిగా వుండాలి, లేదా జంతువు పొదల్లోకి మాయమైపోతుంది.

అప్పుడూ ఆదిమ వేటగాడు తన చిన్న యీటెకి బదులు శీఘ్రంగా పోయే, గురితప్పని బాణాన్ని పెట్టుకోవాల్సి వచ్చింది.

చేతిలో విల్లు పట్టుకుని, భుజాన్ని అంబుల పొది వేలాడేసుకుని అతను అడవి పందుల్ని వేటాడుతూ, బాడవల్లోని బాతుల్ని బుట్టలో వేసుకుంటూ అడివిలో పోయేవాడు.

# మానవుడి నాలుగు కాళ్ల నేస్తం

ప్రతి వేటగాడికీ నమ్మకమైన నేస్తం వుండేది. అతని నేస్తానికి నాలుగు పంజాలూ, పొడుగాటి, వంపు తిరిగిన చెవులూ, నల్లని, జిజ్ఞాసాత్మక నాసికా వుండేవి.

వేటకెళ్లినప్పుడు యీ నాలుగు కాళ్ల నేస్తం తన యజమానికి వేట దొరికేటందుకు సాయపడేది. భోజనాల దగ్గర తన యజమాని పక్కన ''నా వాటా యేదీ?'' అన్నట్టు చూస్తూ కూర్చునేది.

మానవుడు విల్లంబులతో వేటాడే ఆ సుదూర గతంలోనే కుక్కని మచ్చిక చేసుకున్నాడు కాబట్టి యీ చతుష్పాత్త మిత్రం వేల సంవత్సరాలుగా మానవుడికి సాయపడుతూనే వుంది.

యెనిసేయ్ నదీ ప్రాంతంలోని అఫోన్‌తొవా పర్వతం దగ్గర తవ్వేటప్పుడు సోవియట్ పురాతత్వవేత్తలు తవ్వకాలు సాగించారు. అక్కడ ఆదిమ కాలపు వేట మకాం దగ్గర కుక్క యెముకలు కనిపించాయి. ఆ యెముకలు తోడేలు యెముకల్లా వున్నాయి. ముట్టె మాత్రం తోడేలు ముట్టెకంటే చాలా చిన్నది.

ఆ నాటి కుక్క బహుశా నివాసాన్ని కాపలా కాసేది, అతనికి వేటలో సాయపడేది. తొలి వనవాసాల్లో వంటింటి బూడిద కుప్పలున్నాయి. వాటిల్లో శాస్త్రజ్ఞులకి కుక్క పళ్ల గంటులున్న జంతువుల యెముకలు దొరికాయి. అంచేత ఆ నాడు కూడా భోజనాలప్పుడు కుక్క మనిషి పక్కన ఒక యెముకని యిమ్మని ప్రాధేయ పడుతూ కూర్చునే దన్నమాట.

కుక్క తనకి ఉపయోగ పడే వుండాలి. లేకపోతే ఆకాలంలో కూడా మనిషి వూరికే కూచోపెట్టి కుక్కని మేపడు కదా.

ఆదిమ మానవుడు కుక్కని చిన్న పిల్లప్పుడే తనతో తీసికెళ్లి తనకి సహాయంగా వుండేటట్టూ, అడవిలో జంతువుని పసికట్టేటట్టూ దానికి తర్ఫీదు యిచ్చేవాడు.

మంచి సహాయకారిని యెన్నుకోవడంలో అతను పొరపాటు పడలేదు. అతను అడివి పంది జాడలు గుర్తించే లోపుగానే, జింక అడుగుల చప్పుడు వినే లోపుగానే అతని కుక్క సావధానం అయిపోయి, ఆ వాసన పట్టేందుకు ముక్కుని యెత్తేది.

పొదలు యేం వాసన వేస్తున్నాయి? అక్కడ యే జంతువు నడిచింది? రెండు మూడు సార్లు అఘ్రాణిస్తే చాలు అది జాడ పట్టేసేది. యిక ఆ కుక్క మరి దేన్నీ చూసేది కాదు, వినేది కాదు. అది ఒకే ధ్యాసలో తదేకంగా మునిగి పోయేది. జంతువు జాడ పట్టడం యెలా అనే దృష్టిలోనే వుండిపోయేది. చప్పుడు కాకుండా, వేగంగా అడివిలో పరిగెత్తేది. దాని యజమాని దాన్ని అనుసరించాలంతే.



కుక్కలు లాగే స్లెడ్జి (కొర్యాక్ చిత్రం)

మనిషి కుక్కని మచ్చిక చేసుకున్నాక యింకా బలవంతుడయ్యాడు. తన నాసికకంటే యింకా నిశితమైన కుక్క నాసికని తన సేవకి వినియోగపడేటట్టు చేసుకున్నాడు.

యేమైనా మనిషి కుక్క నాసిక కంటే యెక్కువగానే దాన్ని తన సేవలో పెట్టుకున్నాడు. దాని నాలుగు కాళ్లనీ కూడా తీసుకున్నాడు. తన బండికి గుర్రాన్ని కట్టడానికి చాలా ముందే అతను తన కుటుంబాన్నీ, సామానునీ లాగడానికి కుక్కని వాడుకున్నాడు.

సైబీరియాలోని ఒక ఆదిమకాలపు వేట మకాంలో జీను, కళ్లెం, ముస్తీబు వగైరా సామాను కుక్క అవశేషాల పక్కనే కనిపించాయి.

అంటే కుక్కలు మనిషికి వేటలో సాయపడ్డమే కాదు, అతన్ని మోసేవి కూడానూ.

యీ రకంగా మానవుడి అత్యుత్తమ నేస్తం అయిన కుక్కతోటి మన పరిచయం అయింది.

పర్వతాల్లో ప్రయాణీకుల్ని కాపాడి, గాయపడ్డ వాళ్లని యుద్ధరంగంనుంచి తీసుకుపోయి, యింటికి కాపలాకాసి, దేశపు సరిహద్దుల్ని పహారాకాసిన యీ తెలివైన జంతువుని గురించి యెన్ని నిజమైన కథలు పుట్టాయి! కుక్కలు యింటి దగ్గర, వేటలో, యుద్ధంలో, పరిశోధనాశాలల్లో మన విశ్వాసపాత్రమైన సేవకులు.

శాస్త్ర ప్రయోజనాల కోసం, మానవాళి మంచి కోసం, యే శాస్త్రజ్ఞుడేనా కుక్కని ఆపరేషన్ బల్లమీద వుంచితే, అది విశ్వాసపాత్రంగా అతని కళ్లల్లోకి చూస్తుంది, తన యజమాని కోసం తన జీవితాన్ని అర్పించ సిద్ధపడుతున్నట్టు.

లెనిన్‌గ్రాడ్ దగ్గర పావ్‌లొవ్ పట్టణంలో, శాస్త్రజ్ఞులు మెదడు పనిచేసే పద్ధతిని అధ్యయనం చేసే పరిశోధనాల యిపు భవనం దగ్గర ఒక స్మారకచిహ్నం వుంది.

మన విశ్వాసపాత్రమైన చతుష్పాత్త మిత్రుని గౌరవార్థం నిర్మించిన స్మృతిచిహ్నం అది.

# మనిషి నదితో పోరాటం చేస్తాడు

ప్రాచీనకాలంనాటి జనం అంతా గుబురుల్లోనే నివాసాలని యేర్పాటు చేసుకోలేదు. దట్టమైన అడవులని వదలి నదీ తీరాల్లోనూ సరస్సుల దగ్గరా స్థిరపడ్డవాళ్ళూ వున్నారు.

నీటికీ అడవికీ మధ్యన వున్న తీరపు నేలమీద దుంగలతో తమ యిళ్ళని కట్టుకున్నారు.

నది గట్టుమీద అడివిలోకంటే యెక్కువ జాగా వుంది, కాని బతకటం మాత్రం అంతే కష్టమైంది.

నది పొరుగు ఉధృతమైంది. వసంత రుతువులో వరదలతో పొంగి, గట్టుని ముంచేసి, మంచు ముక్కలతోటీ, మునిగిన చెట్టు మొదళ్లతోటీ మనిషి కట్టుకున్న యిళ్లని కూడా స్వాహా చేసేసేది. మనుషులు వరదనుంచి పారిపోయి, చెట్లు యెక్కేసి వరద తీసేదాకా అక్కడే వుండేవాళ్లు. నది ఉధృతం తగ్గి, నీరు తీసాక మళ్లీ శిధిలమైన తమ పుట్టల్ని కట్టుకునేవాళ్లు.

మొట్టమొదట్లో ప్రతి వరదా వాళ్లకి తెలియకుండా హఠాత్తుగా ముంచేసేది, కాని నదీ ప్రవాహ గతిని అర్థం చేసుకున్నాక వరదని వాళ్లు తప్పించుకోగలిగే వాళ్లు.

కొన్ని చెట్లని కొట్టేసి, ఆ కాండాలని తెప్పలాగా కట్టేవాళ్లు, ఆ తెప్పని నది ఒడ్డున వుంచేవాళ్లు. అప్పుడు దీనిమీద మళ్లీ యింకో వరస దుంగలు వేసే వాళ్లు. ఆ రకంగా వరసమీద వరస వేసుకుని ఒక యెత్తు అరుగులాగా చేసేవాళ్లు. అప్పుడు తమ యిళ్లని దానిమీద కట్టేవాళ్లు. యిప్పుడు వాళ్లకి వరద అంటే భయం లేదు, యేమంటే ఉరవళ్లు తొక్కి నది గట్టు దాటి పొంగినా వాళ్ల గుమ్మం యెత్తుకి కూడా వచ్చేది కాదు.

ఆ విజయం బ్రహ్మాండమైందే, యేమంటే పల్లపు గట్టుని వాళ్లు యెత్తు గట్టుగా మార్చారు! యీ దుంగల అరుగే యివాళ నదుల ప్రవాహాలని అడ్డడానికి మనం కట్టే ఆనకట్టలకీ, కరకట్టలకీ మూలం.

నదులతో పోరాడుతూ ఆదిమ మానవుడు చాలా సమయం వ్యయం చేశాడు.

యింతకీ అసలతను నదీ తీరంలో యెందుకు



మత్స్యకారులు (చైనా చిత్రం)

స్థిరపడాల్సి వచ్చింది, నీటి చేరువలో యెందుకు వుండాల్సి వచ్చింది?

ఓపిగ్గా తను గాలం బెండ్ను చూస్తూ, నది ఒడ్డున రోజులు గడిపే చేపలు పట్టే వాళ్లని అడగండి.

ఆదిమ మానవుడికి నది కల్పించిన పెద్ద ఆకర్షణ అక్కడి చేపలు.

వేటగాడు చేపలు పట్టేవాడుగా కూడా యెలా అయాడు? వేటకంటే చేపల్ని పట్టడానికి వేరే సాధనాలు కావాల్సి వచ్చాయి, తన యెరని పట్టడానికి వేరే పద్ధతులు కావాల్సి వచ్చాయి.

సంఘటనల గొలుసులో యెక్కడేనా ఖాళీ యేర్పడితే ఆ లుప్తమైన వాటి కోసం మనం వెతుకుతాం.

వేటగాడు చేపలు పట్టేవాడుగా ఒక్క సారే అయిపోలేదు. కాబట్టి చేపల్ని పట్టడానికి ముందు, చేపల్ని వేటాడే వాడు.

యిదీ వాస్తవంగా జరిగింది. చేపలు పట్టే తొలి పరికరం చేప బల్లెం, వేటకి ఉపయోగించే బల్లెం లాగానే వుండే యీటె.

ఆదిమ మానవుడు మొలలోతు నీళ్లల్లో అడుగేస్తూ, రాళ్ల వెనకాల దాంకున్న చేపల్ని యీటెతో పొడిచేవాడు. ఆ తర్వాత వేరే పద్ధతులద్వారా చేపల్ని పట్ట నేర్చాడు. వలలతోటి పిట్టల్ని పట్టడం అప్పటికే అతను నేర్చుకున్నాడు. ఆ వలలని నదిమీద విసిరే ప్రయత్నం చేశాడు. ఆవిధంగా కాలక్రమేణా మనుషులు చేపల్ని పట్టడానికి వలల్ని ఉపయోగించ మొదలెట్టారు.

చేపల్ని పట్టే బల్లేలనీ, యీటెలనీ, వలలకి వుండే బరువు రాళ్లనీ, యెముకలతో చేసిన చేపలకొక్కేలనీ పురాతత్వవేత్తలు కనిపెట్టారు.

# చేపల్ని జంతువుల్ని వేటాడే వాళ్ల యిల్లు

అమూ-దర్యా నది ఆరల్ సముద్రంలో కలిసే చోట క్జిల్-కుమ్ యేడారి యిసుక దిబ్బల్లో, సోవియట్ పురాతత్వ వేత్తలు ప్రాచీనకాలంలో చేపలు పడుతూ, జంతువుల్ని వేటాడే మానవుల మకాంని కనిపెట్టారు.

యిసుక దిబ్బ పైభాగంలో, యిసుకా మట్టీ పొరకింద, బాగా చెక్కిన రాతి పనిముట్లూ, మట్టి కుండల పెంకులూ, చెత్త కుప్పలూ కనిపించాయి. వంటయింటి చెత్తలో అడివి పందివీ, జింకవీ, దుప్పివీ యెముకలు చాలా వున్నాయి. కాని ఆ కుప్పల్లో చాలా భాగం మట్టగిడసలా, బొమ్మిడాయిలా యెముకలతో యేర్పడినవే. అక్కడ నివసించిన వాళ్ల ఆహారంలో చేప ప్రధానమైంది అయినట్లుంది.

కాలిపోయిన నివాసపు జాడలు కూడా వున్నాయి. అక్కడ మిగిలిందల్లా బూడిదతోటీ, బొగ్గుతోటీ నిండిన గుంటలూ, కాలిన రెల్లు ముక్కలూ, వృత్తం మధ్యలో కలుసుకునే నల్లని బొగ్గు చారలూనూ. యీ నివాసం మధ్యలో అడుగున అరుణవర్ణపు యిసక పొరపైన నిర్మలినమైన తెల్లని బూడిద మందమైన పొర వుంది.

యీ నడిమి పొయ్యి చుట్టూతా నల్లని మురికీ బూడిదా, వంటింటి చెత్తా వున్న మిగిలిన పొయ్యిలున్నాయి.

అదీ ఆ మకాం దగ్గర దొరికిందల్లా. దానికి అసలు ఆకారం యిచ్చి, రూపం యేర్పాటుచేసి, కాలగా మిగిలిన యీ అవశేషాలనుంచి అక్కడి జనుల జీవితాన్ని వర్ణించాల్సిన పని శాస్త్రజ్ఞులది.

పురాతత్వశాస్త్రం యెక్కువ తెలియని వాళ్లు యీ సమస్యని పరిష్కరించలేరు. కాని యీ పురాతత్వవేత్తలు కప్పుకి ఆధారంగా వున్న కర్ర స్తంభాలు వున్న చోటుల్లోనే యీ బొగ్గూ బూడిద కుంటలూ వున్నట్టు కనిపెట్టారు. శిలగా మారిన రెల్లుని బట్టి కప్పుని రెల్లుతో కప్పినట్టు గుర్తించారు. మధ్యలో కలిసిన నల్లని చారికలు అగ్ని ప్రమాదంలో నేలకూలిన యింటి స్తంభాల గుర్తులు.

మధ్య పొయ్యిలో వంట యెప్పుడూ చేసి వుండరు, యేమంటే వంట చేస్తే బూడిద అంత నిర్మలినంగా వుండదు. అక్కడి బూడిద పొర చాలా మందంగా వుంది, ఆ పొయ్యి అలా రాత్రీ పగలూ మండుతూనే వుండేదేమో. అఖండాగ్ని హోత్రం అనేది పూర్వాచారం.

ఓ అగ్ని ప్రమాదమే యీ జ్వాలని ఆర్పి వుంటుంది.

యింట్లోని ఆడవాళ్లు స్తంభాల దగ్గరున్న మిగతా పొయ్యిల్లో వంట చేసుకుని వుంటారు, అందుకనే అక్కడ బూడిద అంత మకిలిగా, నేల అంతా యెముకలతో నిండి వుంది.

అక్కడ చాలా పొయ్యిలున్నాయి. అంటే చాలా మంది ఆడవాళ్లు వున్నారన్నమాట. యీ ఆడవాళ్లూ, వాళ్ల భర్తలూ, వాళ్ల పిల్లలూ అంతా కలిసి రక్తసంబంధంమీద యేర్పడ్డ సమాజం అవుతారు.

యీ సమాజం వందకిపైగా వున్న సభ్యులతోటి పెద్దదే. అందుకనే ఆ నివాసం అంత పెద్దదిగా వుంది. యేమైనా, అది కోసుగా లేచిన కప్పుతోటి, వృత్తంగా వుండే గుడారం లాంటి పూర్వ నివాసం లాగానే వుండేది.

రెండు స్తంభాల వరసల మధ్యనుంచి పొడుగ్గా వుండే దారి గుమ్మంనుండి మధ్య పొయ్యి దగ్గరికి వెడుతుంది. దారికి కుడి వైపున వంట పొయ్యిలున్నాయి, యెడం వేపున ఖాళీ.

యింట్లో ఖాళీ జాగా యెందుకు?

మధ్య ఆసియాకి దూరంగా వున్న అండమాన్ ద్వీపాల ఉమ్మడి నివాసాల్లో మనకి దీని సమాధానం దొరుకుతుంది. ఆ ద్వీపపు ప్రజలు ఆ ఖాళీ జాగాని మంత్ర కర్మలకీ, క్రతువులకీ వినియోగించేవాళ్లు.

దారికి యెడం వేపున కూడా గోడవారనే, పురాతత్వవేత్తలు చిన్న పొయ్యిల జాడలని చూశారు. బహుశా ఆ సమాజంలోని పెళ్లికాని వాళ్లు వుండి వుండే చోటయి వుంటుంది అది.

ఆరకంగా పురాతత్వవేత్తలు ఆదిమ మత్స్యకారులు నివసించిన యింటిని తమ మనో నేత్రంతో నిర్మించారు.

యేమైనా వాళ్లు తమ చేపల్ని యెలా పట్టేవాళ్లు, వాళ్లకి పడవలుండేవా లేవా అనేదేదీ యీ అవశేషాలని బట్టి తెలియలేదు.

రష్యాలో లాదొగా సరస్సు దగ్గర అలాంటి తెడ్లు పడవ దొరికింది.

# అన్ని ఓడలకీ తాత లాంటిది

అరవై యేళ్ల క్రితం లాదొగా సరస్సుకి దగ్గర్లో మనుషులు ఒక కాలవ తవ్వుతున్నారు. వాళ్లు నేలనీ యిసకనీ తవ్వేటప్పటికి వాళ్లకి మనిషి పుర్రెలూ, రాతి పనిముట్లూ దొరికాయి.

పురాతత్వవేత్తలు దీన్ని గురించి తెలుసుకున్నారు. ఒక మ్యూజియంలో ప్రదర్శనా అల్మారా అయినట్టుగా ఆ బాడవ

నుంచి రకరకాల వస్తువుల్ని వాళ్ళు తియ్యడం మొదలుపెట్టారు. వాళ్ళు ఒక రాతి చేతి గొడ్డలినీ, రాతి సుత్తినీ, చేప గాలాన్నీ, బాణాన్నీ, ఎగుడుదిగుడుగా కోసిన అంచున్న యీటెనీ, సీలు అనే సముద్రజంతువు పోలికలు వున్న యెముక తాయెత్తునీ తీశారు. యీ రాతి పని ముట్లనీ, యెముక పని ముట్లనీ అన్నిటినీ తవ్వాక వాళ్ళకి పెద్ద నిధి దొరికింది: పెట్టింది పెట్టినట్టున్న చిన్న పడవ. అది యెంత పదిలంగా వుందంటే అందులో మనిషి కూర్చుని నీళ్ళల్లో తోసుకు పోవచ్చును.

అది మన యీనాటి పడవల్లాగా లేనే లేదు. మన బోట్లకీ, ఆవిరి ఓడలకీ, డీజెల్ ఓడలకీ తాత అయిన యీ పడవ పెద్ద ఓకు చెట్టు కాండాన్ని దొలిచి చేసింది.

తవ్విన గాడి లాంటి ఆ జాగాలోకి చూస్తే రాతి గొడ్డలి ఓక్ కాండాన్ని యెలా దొలిచిందీ మీకు తెలుస్తుంది.

ఆ కొయ్యని నిలువునా గొడ్డలి దొలిచిన పద్ధతి చూస్తే ఫరవాలేదు అనిపిస్తుంది. పైభాగం నున్నగానే వుంది. కాని పడవ ముందు భాగంలోనూ, వెనక భాగంలోనూ గొడ్డలి అడ్డం చెక్కాల్సి వచ్చినప్పుడు నిజంగా అది నీరసం తెప్పించే పనే. యిక్కడ ఆ కొయ్యని అన్ని వేపులనుంచీ చెక్కారు. అన్ని చోట్లా బొడిపెలూ, గుంతలూ వున్నాయి, ఆ ఓక్ని రాతి పళ్ళు కొరికినట్టు. కొయ్యలో సుళ్ళూ, మెలికలూ వున్న చోట గొడ్డలిససేమిరా మాట విన్లేదు. కొయ్య తోటి గొడ్డలి పోరాటం పూర్తయాక అగ్ని దేవుడు సహాయం చేశాడు.

వెనక భాగమంతా మాడిపోయి నల్లటి బొగ్గు పెచ్చుతోటి కప్పడిపోయింది.

పడవ లోపలి భాగాన్ని తవ్విన రాతి గొడ్డలి దగ్గర్లోనే శాస్త్రజ్ఞులకి కనిపించింది. కోసే అంచు నున్నగా, పదునుగా వుంది. నేలలో కూరుకుపోయి, దగ్గర్లోనే ఒక పదునుపెట్టే రాయి వుంది. అంటే రాతి పనిముట్లని వూరికే చెక్కి తయారుచెయ్యడమే కాకుండా, వాటిని నునుపు చేసి పదును పెట్టే వారన్నమాట.

మొద్దు గొడ్డలి గట్టిగా వుండే ఓక్ని కొయ్యగలదా మరి?

ఓక్ దుంగని పడవలాగా తయారుచెయ్యాలంటే మనిషికి చాలా సమయమూ, శ్రమా అవసరమయ్యేవి. యెలాగైతేనేం ఆ పని పూర్తయింది. ఆ చిన్న పడవని నీళ్ళల్లోకి తీసికెళ్ళారు. మత్స్యకారులు యీటెలనీ, గాలాల్నీ, చేపబల్లేల్నీ, రకరకాల వలలనీ తీసుకుని సరస్సుమీద ప్రయాణం కట్టారు.

సరస్సు చాలా పెద్దది. అందులో బోలెడు చేపలున్నాయి. కాని మనుషులు తీరందాటి లోపలికంటా పోయే సాహసం చెయ్యలేదు.

యేమంటే నీరు తెలియని కొత్త ప్రపంచం. అది యెలా వుంటుందో వాళ్ళకెలా తెలుసు, తర్వాత అది యేం చేస్తుందో వాళ్ళెలా వూహించారు? ఒక రోజున అది ప్రశాంతంగా ఉరవడి లేకుండా వుంటుంది. మర్నాడు ఉత్తుంగ తరంగ ఘోషతో యెగిరిపడుతూ వుంటుంది.



జింక కొమ్ము బల్లేలు



చరిత్రాత్పూర్వపు దోనె మన పడవల తాత

యే తుఫానూ పడగొట్టలేని పెద్ద ఓక్, కొయ్య ముక్కలాగా అలలమీద తేలుతూ, నాట్యం చేసేది.

భయంకంపితులైన జనం ఒడ్డుమీద వరసలు తీరి నుంచునేవాళ్లు. అక్కడ కాళ్ల కింద స్థిరమైన నేల వుంది, దానిమీద నడవడానికి వాళ్ల కాళ్లు అలవాటు పడ్డాయి. భూమి కుదిపేది కాదు, వాళ్ల కోసం యెత్తు యెగిరేది కాదు, వాళ్లని యిటూ అటూ వూపేది కాదు.

అంచేత ఆదిమ మానవుడు తనని పెంచి పోషించిన భూమాత హృదయానికి హత్తుకుపోయేవాడు.

ఎక్కణ్ణో ఆకాశపుటంచులదాకా విస్తరించుకున్న జలోపరితలపు ప్రమాదాలలో చేపల్ని పట్టడం కోసం పోవడం కంటే చేపలే ఒడ్డుకు రావడం కోసం మత్స్యకారులు నిరీక్షించేవాళ్లు.

క్రమేపీ వాళ్లు ధైర్యం పుంజుకుని దూరం పోవడానికి సాహసం చేశారు.

యెక్కడ నీళ్లు మొదలైతే అక్కడే మానవుడి ప్రపంచం అంతమైన కాలం వుండేది. ప్రతి నది గట్టూ కనిపించని గోడలాగా, ''హద్దు మీరరాదు'' అన్న హెచ్చరికతో వుండేది.

కాని మానవుడు అదృశ్యమైన ఈ గోడని భేదించాడు. అతను యింకా యీ నూతన ప్రపంచపు హద్దులకి దగ్గరనే, జల ప్రపంచపు హద్దుల దగ్గర్నే వుండేవాడు. కాని యే నూతన సాహసకృత్యమేనా అతి కష్టమైందే. అతను ఒడ్డు నుంచి పూర్తిగా ఛేదించుకుని పోయే రోజు వస్తుంది.

అతను దుర్బలమైన చిన్న పడవలో కాక సముద్రాలమీద, ఆకాశపుటంచుల్లోని నూతన తీరాలకీ, తన లాంటి వాళ్లే వున్న నూతన దేశాలకీ తనని తీసుకుపోయే ఓడమీద వెడతాడు.



కొయ్య పిడితో వున్న రాతి గొడ్డలి

# మొదటి వృత్తిపనివాళ్లు

కొత్తగా గొడ్డలినీ, చ్రితికనీ, సుత్తినీ, బరమానీ వాడటం నేర్చుకున్న యువ పనివాళ్లలారా, మీ కోసమే యిది.

ఉక్కు పనివాళ్లుగా, రసాయనశాస్త్రజ్ఞులుగా, యంత్రాలనీ విమానాలనీ రూపకల్పన చేసే వాళ్లుగా, యిళ్ల, ఓడల నిర్మాతలుగా భవిష్యత్తులో తయారవబోయే వాళ్లూ, యిది మీ కోసమే!

మీ పనిముట్లనీ, శ్రమనీ ప్రేమించే మీ కోసమే యీ పుస్తకం.

మీరు లొంగదీసుకోవాల్సిన కొయ్యకీ, లోహానికీ మీ పనిముట్లుకీ మధ్యన వుండే పోరాటం యెంత కష్టమైందో, మీ పని పూర్తిచేసాక మీకెంత ఆనందం కలుగుతుందో మీకు తెలుసు.

ఒక కొయ్య ముక్కని తీసుకోగానే, మీ మనో నేత్రంతో మీరు చెయ్యాల్సిన వస్తువుని మీరు దర్శిస్తారు. యిక్కడ ఓ తుంటని రంపంతో కొయ్యాలి. అక్కడ ఓ రంధ్రం చెయ్యాలి, యింకో చోట చిన్న ముక్కని కొయ్యాలి. కాని కొయ్య వూరుకుంటుందా? అది యెదురు తిరుగుతుంది, తన శక్తినంతటినీ కూడ గట్టుకుని రంపానికీ వాటికీ తల నొప్పి తెప్పిస్తుంది.

ఒక పనిముట్టు తర్వాత యింకో పనిముట్టు యుద్ధరంగంలోకి దూకుతుంది. చాకు లాభంలేకపోతే గొడ్డలి వస్తుంది. గొడ్డలీ నీరసపడిపోతే, డజన్ల కొద్దీ పళ్లున్న రంపం యుద్ధం కొనసాగిస్తుంది.

కొంచెం సేపటికి మీరు కోరుకున్న వస్తువుని కప్పేసి, దాచేసిన అదనపు కొయ్య అంతా రద్దుగా, ముక్కలుగా, రంపపు పొడిగా వూడిపోతుంది.

అమ్మయ్య, మీరు సాధించారు. కాని యిది మీ ఒక్కరి విజయమే కాదు. యెన్నో శతాబ్దాలుగా మీరీ నాడుపయోగించే పనిముట్లని కనిపెట్టి, మెరుగుపెట్టిన పనివాళ్లందరి విజయమూనూ. యీ పనిముట్లని తయారుచెయ్యడానికీ, వాటిని కొత్త కొత్త పద్ధతులలో ఉపయోగపెట్టడానికీ శ్రమించిన పనివాళ్లందరి విజయమూనూ అది.

యీ పుస్తకంలోని మొదటి గొడ్డళ్లనీ, చాకులనీ, సుత్తులనీ తయారుచేసిన తొలి పనివాళ్లని గురించి మీకు తెలిసింది.

వాళ్లు పనిచేస్తూ వుండడం మీరు చూశారు. మీ పని కష్టమైనట్లే వాళ్ల పనీ కష్టమైందే, కాని పూర్తయేటప్పటికి వాళ్లకీ ఆనందం కలిగేది.

యీ తొలి వండ్రంగం పనివాళ్లు, దున్నేవాళ్లు, తాపీ వాళ్లు జంతు చర్మాలని బట్టలుగా ధరించినవాళ్లు. వాళ్ల పనిముట్లు బరువుగా ముతగ్గా వుండేవి. యివాళ మనం ఒక విగ్రహాన్ని చెయ్యడం కంటే కూడా ఒక మట్టి కుండని చెయ్యడం వాళ్లకి ఆనాడు కష్టంగా వుండేది.

కాని యీ తొలి వడ్రంగులూ, దున్నేవాళ్లు, కుండలు చేసే వాళ్లూ, తమ నిత్య శ్రమతోటి భూమి స్వరూపాన్నే మార్చేస్తున్న నిర్మాతలా, రసాయనశాస్త్రజ్ఞులా, ఉక్కు పనివాళ్లా మహా సైన్యానికి మూల పురుషులు.

ఉదాహరణకి ప్రాచీన కాలపు కుండలు చేసే వాళ్లని తీసుకోండి. ముందరగా, ప్రకృతిలో దొరకని కొత్త పదార్థాన్ని చేసినవాళ్లు వాళ్లే. అంతకుముందు ప్రాచీనకాలపు పనివాడు ఒక రాతి గొడ్డలినో, యెముక యీటెనో తయారు చేసుకున్నప్పుడు అతను పదార్థాన్ని తయారుచేసుకో నక్కర్లేకపోయింది, వూరికే వున్న దాని ఆకారాన్ని మార్చాడంతే.



రాతిలో రంధ్రాలు చెయ్యడానికి చరిత్రాత్పూర్వపు పరికరం

కాని యిది అంతకు ముందెన్నడూ జరగనిది. మానవుడు మట్టితోటి ఒక పాత్రని తయారుచేసి, దాన్ని మంటలో పెట్టి కాల్చాడు. నిప్పు ఆ పదార్థానికుండే స్వభావాన్నే మార్చేసి దాన్ని గుర్తుపట్ట లేకుండా చేసేసింది.

అంతకుముందు తడిసినప్పుడల్లా మట్టి బురదగా అయిపోయేది. కాని నిప్పులో కాల్చేటప్పటికి దానికి నీటి భయం పోయింది. దాని ఆకారం మారకుండా, దాన్ని మెత్తగా చెయ్యకుండా దాంట్లో నీళ్లని పొయ్యవచ్చు.

ఆనాటి మానవుడు మట్టిని కొత్త పదార్థంగా చెయ్యడానికి నిప్పుని వాడాడు. అది రెండు విధాలైన విజయం: మట్టినీ లొంగదీసుకున్నాడు, నిప్పునీ లొంగదీసుకున్నాడు. నిప్పు అంతకుముందు కూడా అతనికి సాయపడిందన్నది నిజమే. అతన్ని చలి బారినుంచి కాపాడింది, అడవి జంతువులని తరిమేసింది. అడవుల్ని మైదానాలుగా మార్చరడంలో తోడ్పడింది. అతను గొడ్డలితో దేన్నైనా దొలచాల్సి వచ్చినప్పుడు సాయపడింది. యిప్పుడు మనుషులకి నిప్పు చెయ్యడం తెలిసింది. యెప్పుడు రెండు కర్రలని రాపిడి చేస్తే నిప్పు వినయవిధేయలతో ప్రత్యక్షమయ్యేది.

తర్వాత మనిషి ఒక వస్తువుని యింకో దానిగా మార్చే కష్టమైన పనిని నిప్పుకి అప్పజెప్పాడు.

నిప్పుకి గల అద్భుతమైన లక్షణాలని గ్రహించగానే, మానవుడు దాన్ని మట్టిని కాల్చడానికీ, వంట చెయ్యడానికీ, రొట్టె కాల్చడానికీ, రాగిని కరిగించడానికీ వాడాడు.

యివాళ ఒక పదార్థాన్ని యింకో పదార్థంగా మార్చేందుకు నిప్పుని వాడకుండా వుండే ఒక్క ఫాక్టరీ కూడా ప్రపంచంలో లేదు.

ముడి పదార్థంనుంచి ఇనుముని, యిసకనుంచి గాజుని, కొయ్యనుంచి కాగితాన్ని రాబట్టడానికి మనకి నిప్పు సాయం

చేస్తుంది. ఉక్కు మిల్లుల్లో మండే మంటని ఉక్కు పనివాళ్లా, రసాయనిక శాస్త్రజ్ఞులా సైన్యం అదుపుచేస్తుంది. యీ కొలిమిలన్నిటికీ మూలం, ప్రాచీనకాలపు కుమ్మరి పని చేసేవాడు తన చిన్ని మూత వున్న వికారపు మొదటి కుండని కాల్చిన పొయ్యిలో వుంది.

## విత్తనమే సాక్షి

ఒక ప్రాచీనకాలపు మకాంలో యెన్నో యితర వస్తువుల మధ్యలో కొన్ని మట్టి కుండల పెంకులు పురాతత్వ వేత్తలకి దొరికాయి.

పైనుంచి చూస్తే ఆ పెంకులు చాలా నిరాడంబరంగా అల్లిన గీతలతో అలంకరించినట్టు వున్నాయి. యీ అలంకారపు నమునా, ఆనాటి కుమ్మరివాళ్లు తమ కుండలని యెలా తయారుచేసుకున్నారో కాల్చారో తెలుసుకునే దానికి ఆధారం అందిస్తుందని శాస్త్రజ్ఞులు విశ్వసించారు.

అల్లిన బుట్టనొకదాన్ని లోపల భాగంలో మట్టి పొరతో కప్పేసేవాళ్లు. అప్పుడా బుట్టని నిప్పులో పెట్టేవాళ్లు. కుండని లోపల అలా వుంచేసి రెల్లు కాడలు కాలిపోయేవి. యీ రెల్లుతో అల్లిన నమూనా కుండ పైభాగంమీద అచ్చు పడేది.

ఆ తర్వాత అల్లిన బుట్టలు లేకుండా మట్టి కుండల్ని కాల్చగలగడం నేర్చుకున్నారు. అయినా కుమ్మరి పని చేసేవాళ్లు పచ్చి కుండలనే అడ్డబద్దలతో అలంకరించేవాళ్లు. తమ మామ్మలూ, తాతమ్మలూ చేసిన కుండల్లా వుండక పోతే తమ కుండలో వంట బాగా వుండదని వాళ్లనుకునేవాళ్లు.

ఆ రోజుల్లో తెలియని యే అదృశ్య శక్తో, గుణమో ప్రతి వస్తువులోనూ దాగి వుండేదని పనివాళ్లు అనుకునే వాళ్లు. అసలు కుండకి వుండే నిజమైన శక్తి అంతా అలంకారంలోనే వుందేమో యెవరు చెప్పగలరు! వాళ్లు గనుక అలంకారాన్ని మారిస్తే యిక శాశ్వతంగా దుఃఖించాల్సి వుంటుంది. యేమో ఆ మార్పు దురదృష్టాన్ని, కష్ట కాలాన్ని, కరువుని తీసుకురావచ్చు. ఒకో అప్పుడు కుండకి దిష్టి తగలకుండా కుమ్మరివాడు దానిమీద ఒక కుక్క బొమ్మని గీసే వాడు.



పింగాణీ పాత్రలమీద నమూనాలు

కుక్క మనిషికి నమ్మిన బంటు. అతను వేటకెడితే అతనితో వెళ్లేది. అతని యిల్లు కాపాడేది.

కుండమీద కుక్క బొమ్మని గీసి అతను అనుకునేవాడు: కుక్క కాపలా కాస్తుంది, అది కుండనీ, దాంట్లో వుండే ప్రతిదాన్నీ కాపాలా కాయుగాక.

అడ్డబద్దలతో అలంకృతమైన మట్టి కుండలు చాలా చోట్ల దొరికాయి. ఫ్రాన్స్‌లోని కంపినీ అనే చోట దొరికిన ఒకటి చాలా ప్రసిద్ధి పొందింది. పురాతత్వవేత్తలు దాన్ని పరీక్షిస్తూ వుంటే దానిమీద ఒక బార్లీ గింజ ముద్ర వాళ్లకి కనిపించింది.

వాళ్లు మహోత్సాహంతో దాన్ని పరీక్షించారు. అది వూరికే ఒక గింజ మాత్రమే కాదు, ఆదిమ మానవుడి జీవితంలో జరిగిన బ్రహ్మాండమైన మార్పులకి అది సూక్ష్మరూప సాక్షి.

గింజ అంటూ వుంటే వ్యవసాయం వుండాలి. అందుకనే వాళ్లకి గింజల్ని పిండి చేసే సాధనాలు, రాతి తొళ్లికలు కనిపించాయి.

మత్స్యకారులుగానూ, వేటగాళ్లుగానూ అయిన ఆ మనుషులు సేద్యగాళ్లు కూడా అయారు. యీ మార్పు యెలా వచ్చింది?

తెగలోని వాళ్లందరూ మత్స్యకారులూ, వేటగాళ్లూ కారు. మగాళ్లు వేటకి పోయినప్పుడు ఆడవాళ్లూ, పిల్లలూ బుట్టలలోనూ,కుండలలోనూ తినడానికి వీలైన ప్రతిదాన్నీ పోగుచేసుకుంటూ తిరిగేవాళ్లు. సముద్రం ఒడ్డున ఆలిచిప్పల్ని యేరుకునేవాళ్లు. అడివిలో పుట్టగొడుగుల్నీ, బెర్రీలనీ, గింజలనీ యేరుకునేవాళ్లు. ఒక్క కాయని కూడా తినేదానికి జంకేవాళ్లు కాదు. ఆ కాయల్ని పిండి కొట్టి వాటితో అట్లలాంటి వాటిని చేసుకునే వాళ్లు. అందుకనే చాలా భాషల్లో ''అకారన్'' అనే పదం ''రొట్టె'' అనే దాని అర్థంలో వుండిపోయింది.

ఒక తేనె తుట్టె తగిలిందీ ఆ నాటి తెగకి పట్టపగ్గాలుండేవి కాదు.

ఒక కొండ చరియమీద కనిపించిన బొమ్మలో ఒక ఆడమనిషి తేనెని తీస్తున్నట్టు వుంది. ఆమె ఒక చెట్టుమీద వుంది. ఒక చెయ్యి లోపలికి వుంది, యింకో చెయ్యి కుండని పట్టుకుంది. తేనెటీగలు రేగిపోయి ఆమె చుట్టూతా మూగి రొద చేస్తున్నాయి. కాని ఆమె వాటిని ఖాతరు చెయ్యకుండా తేనె తుట్టెల్ని పడుతూనే వుంది.

ఆడవాళ్లూ, పిల్లలూ బుట్టలనిండా బెర్రీ, తేనె, అడివి యాపిల్ పళ్లు, భేరీ పళ్లు పోగేసుకుని తిరిగి వచ్చేవాళ్లు.

యిప్పుడు విందు చేసుకునే సమయం అన్నమాట! కాని ఆడవాళ్లు తమ ఆహార పదార్థాల నిలవలని వాడెయ్యడానికి ఆత్రపడేవాళ్లు కాదు. వాళ్లు పిల్లల్ని అవతలకి పొమ్మని తరిమేసి తాము జాగ్రత్త చెయ్య



కుంభకారులు తమ కుండలమీద యెప్పుడూ అవే నమూనాలు గీసేవాళ్లు



రాతి కల్వంలో యీ మాదిరిగా ధాన్యం పిండి చేసేవాళ్లు



యీ రాతి కల్వంలో చరిత్రాత్పూర్వపు ఆడవాళ్లు ధాన్యాన్ని పిండి చేసేవాళ్లు

గలిగిన వాటినన్నిటినీ కుండల్లోనూ, గిన్నెల్లోనూ, పీపాల్లోనూ జాగ్రత్త చేసేవాళ్లు. యీ నిలవలు అవస రానికి ఉపయోగపడేవి, యెందుకంటే వేట అస్తమానూ నమ్మకంగా వుండేది కాదు.

ఆరకంగా ఉష్ణ వాతావరణం వాళ్లని మరోసారి ఆహారాన్ని పోగుజేసుకునే వాళ్లనిగా చేసింది. ఇది ఒక వెనకడుగుగా అనిపిస్తుంది. కాని వాస్తవానికి అదొక ముందడుగు. యెందుకంటే నేలదున్నడానికీ, ఆహారం పోగుజేసుకోడానికీ మధ్యన వుండే హద్దుని దాటి వచ్చింతర్వాత వాళ్లు సేద్యానికి మళ్లారు.

ఆడవాళ్లు పళ్లూ, బెర్రీలతోపాటు అడవిలో దొరికే బార్లీ, గోధుమ లాంటి ధాన్యాలనీ తీసుకొచ్చే వాళ్లు. వాళ్లు కుండల్లోనూ బుట్టల్లోనూ ఆ ధాన్యాన్ని దాచేసేవాళ్లు. కాని గింజలు ఒలికిపోవడం మామూలు కాబట్టి, ఆ ఒలికిపోయినవి మొలకలెత్తేవి.

మొదట్లో తాము పోగుచేసిన ధాన్యాన్ని ఒలకబోసి యాదృచ్ఛికంగా మనుషులు గింజల్ని నాటారు. ఆ తర్వాత కావాల్సికి నాటడంకోసం గింజల్ని చల్లేవాళ్లు.

భూమిలో పాతి పెట్టి, పునరుజ్జీవితమైన ధాన్యం గురించి కథలనీ, కల్పలనీ చాలా దేశాల ప్రజలు యీ నాటికీ చెప్పుకుంటారు.

ప్రాచీన కాలంలో ఆడవాళ్లు తమ తొల్లికలతోటి నేలని తవ్వి, గింజల్ని ఆ నేలలో పాతినప్పుడు ఒక అదృశ్య దేవతని తాము పాతిపెడుతున్నామనీ అది ధాన్యపు బంగారు కంకుల రూపంలో తిరిగివస్తుందనీ నమ్మేవాళ్లు. ఆకురాలు కాలంలో, కోత సమయమప్పుడు, భూగర్భంనుంచి దేవత వచ్చినప్పుడు మహోత్సాహంతో పొంగిపోయేవాళ్లు.

కోత అయాక చివరి కంకుల్ని నేలమీద వుంచి వాళ్ళు ఆడుతూ పాడుతూ సంబరం చేసుకునేవాళ్లు. అది వూరికే నృత్యం చెయ్యడం మాత్రమే కాదు. మరణించి, తర్వాత తిరిగి పునర్జన్మ యెత్తి తమదగ్గరికి వచ్చినందుకు ధాన్యాన్ని కీర్తిస్తూ ఆడవాళ్లు పాటలు పాడేవాళ్లు. తమ పట్ల సర్వదా అలాంటి దయతో వుండమని భూమాతని వేడుకునే వాళ్లు.

## కొత్తదాంట్లో పాతది

అక్టోబరు సోషలిస్టు మహా విప్లవానికి ముందు, యీ శతాబ్ది ఆరంభంలో, ప్రతి ఆకురాలుకాలంలోనూ కోత అయ్యాక ఆడవాళ్లు ''కోతపండగ'' జరుపుకునే ప్రాంతాలు రష్యాలో వుండేవి.

ఆఖరి ధాన్యపు మోపుని తీసుకుని, దాన్ని శీర్షం దగ్గర జేబు రుమాలుతో చుట్టి, దానికి చొక్కా తొడిగే వాళ్లు. అప్పుడు ఒకళ్ల చేతులు ఒకళ్లు పట్టుకుని, వృత్తాకారంగా నుంచుని దానిచుట్టూ చేరి పాడేవాళ్లు:

మా పొలములో నేడు
కోత జరిగిందీ
దేవ, నీ చలవ.
ఒక పొలములో పంట
చేతి కొచ్చిందీ,
యింకోటి నాగేటి
చాళ్లతో వుంది,
దేవ, నీ చలవ.

యీ ప్రార్థనా గీతపు రాగం వింతగా, వైవిధ్యం లేకుండా వుండేది. సాయంత్రం వేళల్లో షికారు పోయే పల్లెటూరి అమ్మాయిలూ, అబ్బాయిలూ పాడుకునే హుషారైన పాటల్లా వుండేది కాదు.

''కోత'' అనేది పురాతన అనుష్ఠాన ఆచారం. తొలి సేద్యగాళ్లనుంచి అనేక యుగాలుగా సంక్రమించింది. అలాంటి ఆచారాలు యెన్నో ఆట పాటల రూపంలో మనకి సంక్రమించాయి.

పిల్లలు చేతులు కలిపి, పాడతారు:

జొన్న విత్తులని చల్లాం మేము
జొన్న విత్తులూ, జొన్న విత్తులూ
జొన్న విత్తులని చల్లాం మేము
అవును, నిజంగా చల్లాము.

యీ ఆటలోని పాట పాత కాలంలోని ఆచారం కూడానూ. వేల సంవత్సరాల కాలం గడిచాక అందులో వుండే మహిమ గుణం పోయింది. మిగిలిందల్లా తమాషా!

రావి చెట్టు సంగతో? అదీ ఒకప్పుడు పవిత్రమైన చెట్టుగా వుండేది. తమ మహిమాన్వితమైన చర్యలన్నీ నిద్రించే అడవుల్నీ, పొలాల్నీ జీవకళ వుట్టిపడేటట్టు చేస్తాయనీ, శీతాకాలం తర్వాత మళ్లీ వసంతాన్ని తెస్తాయనీ నమ్ముతూ జనం దాని చుట్టూతా నాట్యం చేసేవాళ్లు.

సంవత్సరాదినాడు చెట్టుమీద నగల్ని వేలాడదియ్యడం అంటే యిష్టపడే పిల్లలు రావి చెట్టు పవిత్ర మైందని చెబితే నవ్వుతారు. శీతాకాలం మధ్యలో, యెన్నో నెలల బడి తర్వాత వచ్చే సెలవు రోజుకీ, పండుగకీ అది ప్రతీక అంతే.

చాలా ప్రాచీన ఆచారాలూ, మంత్ర మహిమలూ ప్రయోజనం పోగొట్టుకున్నా పిల్లల ఆటల్లోనూ పాటల్లోనూ నిలిచి వున్నాయి.

వానా, వానా వెళ్లిపో
మళ్లీ యింకో రోజు రా!

పిల్లలు యీ పాటని పాడుతున్నారంటే వానని ఆపడానికీ, మేఘాలని చెదరగొట్టడానికీ కాదు. తమ పాటలోని మాటలకి వాన బెదరదని వాళ్లకి తెలుసు. వూరికే సరదా కోసమని వాళ్లు యీ పాటని పాడుకుంటారు.

ఒకనాడు పూర్తి భిన్నమైన ప్రయోజనంతో వుండే పాటలని, పెద్దవాళ్లు కూడా పాడుతూ వుంటారు, ఆటల్ని ఆడతారు.

ఆరకంగా హుషారైన ఆటల్లో ప్రాచీన విశ్వాసాలూ, మంత్ర కర్మకాండలూ నిలిచి వున్నాయి.

కాని అవి ఆటల్లో కంటే యెక్కువగా వేరేచోట పదిలంగా వున్నాయి.

ఈస్టర్ పండగని చర్చిల్లో జరుపుకునేటప్పుడు పాడే ప్రార్థనా గీతాల్లోని మాటలు ప్రాచీన మంత్రగీతాలని ప్రతిబింస్తాయి.

ప్రాచీనకాలపు సేద్యగాళ్ల పాటల్లో లాగానే, యీ ప్రార్థనలు కూడా మరణాన్నీ, పునరుజ్జీవనాన్నీ గురించి గానం చేస్తాయి.

బయటి ప్రపంచానికి ఆటలుగా పాటలుగా యేనాడో మారిపోయినవెన్నో చర్చికి మాత్రం పవిత్రమైన క్రతువులుగా వుండిపోయాయి.

ప్రాచీన కాలంనుంచి మనకి చాలా మూఢనమ్మకాలూ, దురభిప్రాయాలూ సంక్రమించాయి.

దారిలో గుర్రపునాడా దొరికితే తమకి అదృష్టం కలిసి వస్తుందనీ, యెడమ భుజంమీదనుంచీ నెలవంకని చూస్తే దురదృష్టం సంభవించినట్టేననీ నమ్మేవాళ్లు సుమారుగానే వున్నా రివాళ కూడా.

విప్లవాత్పూర్వపు రోజుల్లో తమ గ్రామంలోని ఆడవాళ్లు కోళ్లగూళ్లమీద ''కోడి దేవుడి'' రాయిని వేలాడ దీసేవాళ్లని ఉగ్లిచ్ పట్టణం దగ్గర సమష్టిక్షేత్రపు మహిళ ఒకావిడ చెప్పింది.

మధ్యలో కన్నం వున్న రాయి ''కోడి దేవుడు''. కోళ్ళు గుడ్లు బాగా పెట్టడం కోసం దాన్ని కోళ్ల గూళ్లమీద వేలాడదీసే వాళ్లు.

మూఢనమ్మకాలు యీ విధంగా శతాబ్దాల తరబడి నిలుస్తాయి. ఆ రాతి ''కోడి దేవుడు'' రాతి యుగంనాటి అవశేషం, అయినా యిరవైయవ శతాబ్ది ఆరంభంలో కూడా వుంది.

## అద్భుతమైన గాదె

ఆడవాళ్లు తమ తొల్లికలతోటి నేలని తవ్వుతూవుంటే మగవాళ్లు గోళ్లుగిల్లుకుంటూ కూర్చునేవాళ్లు కాదు. వాళ్లు రోజంతా వేటలో గడిపి, బాగా పొద్దు పోయాక సాయంత్రాలప్పుడు తాము సంపాదించిన జంతువుల బరువు మోస్తూ తిరిగివచ్చేవాళ్లు.

తమ అన్నలూ, తండ్రులూ వేటనుంచి తిరిగిరావడం చూస్తూనే పిల్లలు వాళ్లకి యెదురు వెళ్లేవాళ్లు. వాళ్ల వేట కాయో, పండో అని తెలుసుకోడానికి ఆత్రపడేవాళ్లు. వంపు తిరిగిన కోరలు నోట్లోనుంచి ముందుకు చొచ్చుకుని వచ్చి, రక్తసిక్తమైన అడవిపంది తలనో, వంపులు తిరిగిన జింక కొమ్ములన్నో ఆసక్తిగా చూసేవాళ్లు. కాని వేటగాళ్లు చిన్నగా వుండే బెదిరిపోయే గొర్రె పిల్లల్నో, కొమ్ములేని నిస్సహాయమైన దూడల్నో — సజీవంగా తీసుకొచ్చినప్పుడు ఆ పిల్లలు మరీ మురిసిపోయేవాళ్లు.

ఆ వేటగాళ్లు తమ చతుష్పాద బందీలని వెంటనే చంపేవాళ్లు కాదు. వాటిని ఒక బందెల దొడ్డిలో పెట్టి బాగా బలిసేటట్టు మేపేవాళ్లు. యింటి దాపుల్లో లేగదూళ్లు గంతులేస్తూ, గొర్రె పిల్లలు అరుస్తూ వుంటే వేటగాళ్లకి హాయిగా వుండేది. యీసారి వేటనుంచి ఉట్టి చేతుల్తో వచ్చినా పస్తులుండక్కర్లేదని వాళ్లకి తెలుసు. వాళ్లకి నిలవ చేసిన ఆహారం తమ పెరట్లోనే వుంది. యీ నిలవలు పెరిగి, రెండింతలు, మూడింతలు అవుతాయి.

మొదట్లో మనుషులు పశువుల్ని మాంసం కోసమూ, చర్మాల కోసమూ సెట్టుకునేవాళ్లు. పశువుల పెంపకంలో వున్న పెద్ద లాభం వాళ్లకి తెలియదు. యీ జంతువుల్ని తమ ఆహారంగానే వాళ్లు పరిగణించారు, వాటిని అవసరమైనప్పుడు చంపుతూ వుండేవాళ్లు. ఒక ఆవునో, గొర్రెనో చంపకుండా వుంచడమే యెక్కువ లాభమని వాళ్లకి తెలియదు.

ఆవుని చంపితే ఒక్కసారే స్వాహా అయిపోతుంది. దాన్ని వుంచితే యెన్నో యేళ్లు దాని పాలు తాగవచ్చు. చంపకుండా వుంచిన ఆవునుంచి యెక్కువ మాంసం వస్తుంది, ఆవు ప్రతియేడూ దూళ్లని యీనుతుంది కదా.

గొర్రెం విషయం కూడా అంతే. చచ్చిపోయిన గొర్రె చర్మం ఒలవడం సమస్యే కాదు. ఒక గొర్రెతోలు యేమంత ఉపయోగం కాదు. గొర్రెని అలా వుంచేసి, దాని వున్నిని కత్తిరించుకుంటే లాభం, యేమంటే వున్ని మళ్లీ పెరుగుతుంది. ఆరకంగా ఒక గొర్రెనుంచి పది వున్ని కోట్లని పొందవచ్చు.

ఆ చతుష్పాత్త బందీలని సజీవంగా అలానే వుంచేసి వాటినుంచి కప్పం తీసుకోవడమే మెరుగు.

మానవుడు ఆవునీ, గొర్రెనీ, గుర్రాన్నీ మచ్చిక చేసుకున్నాక తన యిష్టానుసారం వాటిని పెంచడం మొదలు పెట్టాడు. వాటికి మేతా, రక్షణా వుండేటట్టు చూశాడు. దానికి బదులుగా ఆవు యింకా యెక్కువ పాలు యివ్వాల్సి వచ్చేది. అది తన దూళ్లకే కాకుండా, తన యజమానికీ పాలని సరఫరా చెయ్యాల్సి వచ్చింది. కాలక్రమేణా గుర్రం బరువులు మోయడానికి అలవాటుపడింది. గొర్రెకిప్పుడు తనకీ, తన యజమానికీ సరిపడా వున్ని వుంది.

మంచి పాలిచ్చే ఆవుల్నీ, బలమైన గుర్రాల్నీ, యెక్కువ నిడుపాటి వున్ని వున్న గొర్రెల్ని మనుషులు ప్రత్యేకం పెంచేవాళ్లు మందలు వృద్ధిపొందడానికి. యీ రకంగా మచ్చిక అయిన జంతువులు తయారయాయి.

మనుషులకిదంతా ఒక్కసారే పట్టుబడలేదు. వేటగాడు పశుపోషకుడు అవడానికి కొన్ని శతాబ్దాలు పట్టింది.

ఆఖరికి యేం జరిగింది?

మనుషులు అద్భుతమైన గాదెని కనిపెట్టారు. తమకి లభ్యమైన ధాన్యాన్ని నేలలో పాతేవాళ్లు. వాళ్లు పాతిన ప్రతిగింజకీ నేల యిబ్బడి ముబ్బడిగా బదులు యిచ్చేది.

తాము పట్టుకున్న జంతువుల్ని వాళ్లు చంపేవాళ్లు కాదు. అలా వాళ్లు వదిలిపెట్టినవి రెండింతలు, మూడింతలు అయేవి.

మానవుడు యింకొంచెం స్వేచ్ఛాయుతుడయాడు. ప్రకృతిమీద తక్కువ ఆధారపడ్డట్టు భావించాడు. అంతకు పూర్వం తనకు జంతువు దొరుకుతుంది, దాన్ని చంపగలను అనే నమ్మకం నూటికి నూరుపాళ్లూ వుండేది కాదు. తగినన్ని గింజలు దొరుకుతాయి అనే ధైర్యం వుండేది కాదు. అదృశ్యప్రకృతి శక్తులతనికి ఆహారాన్నివ్వవచ్చు, యివ్వకపోవచ్చు. యిప్పుడు మానవుడు ప్రకృతికి సహాయం చేశాడు: తన తిండి గింజల్ని తనే పండించుకుంటున్నాడు, తన ఆవుల్నీ గొర్రెల్నీ తనే పెంచుకుంటున్నాడు. ఆడవాళ్లు యింక అడవిలో దొరికే నివ్వరి ధాన్యంకోసం వెదుక్కుంటూ పోనక్కర్లేదు. వేటగాళ్లు రోజుల తరబడి అడవిలో జంతువుల కోసం పొంచివుండక్కర్లేదు.

యిప్పుడు ధాన్యపు కంకులు గుమ్మంలోనే పెరుగుతున్నాయి. ఆవులూ, గొర్రెలూ కళ్ల ముందరే మేస్తున్నాయి.

మానవుడు అద్భుతమైన గాదెని కనిపెట్టాడు. యింకా కచ్చితంగా చెప్పాలంటే అతను దాన్ని కనిపెట్టలేదు, తన స్వయం కృషితోటి, శ్రమతోటి సృష్టించుకున్నాడు.

తన పొలాలకీ, పచ్చిక బీళ్లకీ నేల అవసరమైంది. అడవినుంచి నేలని రాబట్టాలి, విత్తనాలని నాటడానికి ముందుగా నేలని దున్నాలి. యెంత కష్టమైన పని!

మానవుడు సునాయాసంగా తన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను పొందలేదు. వేలవేల ఆటంకాలని ఛేదించుకుంటూ పోవాల్సి వచ్చింది. అతని నూతన పరిశ్రమలో, దాని కష్టసుఖాలు దానికి వున్నాయి. ఎండతాపం



చతుష్పాద బందీలు (గుహా కుడ్యంమీద గీసిన బొమ్మ)



ప్రాచీన సంప్రదాయం ప్రకారం తమ దేవుళ్లని జంతువులా, పక్షులా ముఖాలతోటి ఈజిప్ట్ వాసులు చిత్రించేవాళ్ళు

పంటని ధ్వంసం చేసెయ్యవచ్చు. బీళ్లలోని పచ్చిక యెండిపోవచ్చు. కుంభవృష్టి పంటని కుళ్లిపోయేటట్టు చెయ్యవచ్చు.

ఆదిమ మానవుడు అడివిదున్ననో, యెలుగునో మాంసం యిమ్మని అర్థించేవాడు. ఆనాటి సేద్యగాడు నేలనీ, ఆకాశాన్నీ, సూర్యుణ్ణీ వాననీ తనకి మంచి పంట నిమ్మని అర్థించేవాడు.

మనుషులు కొత్త దేవుళ్లని సృష్టించారు. యీ దేవుళ్లు కూడా పాత వాళ్లల్లాగానే వుండేవాళ్లు. సంప్రదాయం ప్రకారం వాళ్ల ఆకారాలు జంతువుల్లాగానో, లేకపోతే జంతువుల తలల్తో వున్న మనుషుల్లాగానో వుండేవి. కాని యీ జంతువులకి కొత్త పేర్లూ, కొత్త లక్ష్యాలూ వుండేవి.

ఒకళ్లకేమో ఆకాశం అనీ, యింకొకళ్లకి సూర్యుడనీ, మరొకళ్లకి భూమి అనీ పేర్లు. వెలుతురూ చీకటీ, వానా కరువూ వీటి పనులు.

మన మానవుడు మహాశక్తి సంపన్నుడై చాలా పెద్దవాడయాడు, కాని అతనికి యింకా తన శక్తి తనకే తెలియదు. తన నిత్య ఆహారం యింకా యే దేవుడి వరప్రసాద లబ్ధమోననీ, తన సొంత శ్రమ ఫలితం కాదనీ అనుకునేవాడు.

# ప్రకరణం తొమ్మిది

## కాలపు ముళ్లు ముందుకు నడుస్తాయి

మనం కాల చక్రాన్ని కొన్ని వేల సంవత్సరాలు ముందుకి తిప్పుదాం. అప్పుడు ఆధునిక యుగంనుంచి మనల్ని యాభై శతాబ్దాలే వేరుచేసి వుంచుతాయి.

యాభై శతాబ్దాలు! యెవళ్ల జీవితాన్ని గురించేనా కాని, ఒక దేశ ప్రజల చరిత్రని గురించి గాని చెప్పుకునేటప్పుడు యిది చాలా యెక్కువ కాలమే. కాని మనం యే ఒక్క మానవుడి గురించీ మాట్లాడుకోవడం లేదు, మానవాళి గురించి మాట్లాడుకుంటున్నాం.

మానవజాతికి దగ్గర దగ్గర పదిలక్షల సంవత్సరాల వయసు. అందుకనే యాభై శతాబ్దాలు ఒక లెక్కలోకి వచ్చే కాలం కాదు.

అంచేత కాల చక్రాన్ని ముందుకు తిప్పాం. భూమి సూర్యుని చుట్టూతా కొన్ని వేల పరిభ్రమణాలు చేసింది. యీ కాలంలో ప్రపంచంలో యేం జరిగింది? అది పై భాగంలో బోసిగా అయిందని చెప్పడానికి ఒక సారి చూస్తే చాలు.

భూమిమీద తెల్లటి మంచు పాగా చుట్టూ ఒకప్పుడు దట్టమైన అడవులు పెరిగాయి. యిప్పుడు అడవులు పలచనై పోయి, పచ్చిక బీళ్ల విస్తారమైన ప్రాంతాలు లోతుగా నాటుకున్నాయి. యిక్కడా అక్కడా చక్కని బయళ్లు వచ్చి పొదలు వెనక్కి తగ్గాయి. నదులదగ్గరా, సరస్సులదగ్గరా అడవులు వెనక్కిపోయి, రెల్లుకీ పొదలకీ జాగా వచ్చింది.

అదిగో ఆ కొండదగ్గరి నది వంపులో యేమిటది? యేటవాలు ప్రాంతంమీద విసిరేసిన పసుప్పచ్చని రుమాలులా వుంది.

మానవ హస్తాలు మార్చేసిన భూఖండం అది. ఆడవాళ్లు బంగారుకంకుల మధ్య నడుములు వంచి వంగారు. వాళ్లు ధాన్యాన్ని కోస్తూ వుంటే వాళ్ల కొడవళ్లు గబగబా కదులుతున్నాయి.

సుత్తిని వేల సంవత్సరాల క్రితమే చూశాం. కాని కొడవలిని చూడ్డం యిదే మొదటి సారి. యిది మనకి తెలిసిన కొడవళ్లలా లేనే లేదు. దీన్ని చెకుముకి రాతితోటీ, కొయ్యతోటీ చేశారు. కొయ్య చట్రంలో రాతి కత్తెరలని బిగించారు.

మనకి తటస్థపడిన పొలం ప్రపంచంలో మొట్టమొదటి వాటిల్లో ఒకటి. మచ్చికగాని ప్రకృతిలో అలాంటి పసుప్పచ్చ రుమాళ్లు యింకా చాలా తక్కువ వున్నాయి.

అన్ని వేపులనుంచీ కలుపు మొక్కలు ధాన్యాన్ని నులిమేస్తున్నాయి, యేమంటే కలుపు మొక్కల్ని యేరెయ్యడం మనుషులకి యింకా తెలియదు. అయినా కంకులే కడకి నెగ్గు కొస్తున్నాయి. పసుప్పచ్చ కంకులు బంగారు సముద్రంలా భూమిని కప్పేసే రోజు వస్తుంది.

నదికి పక్కన పచ్చిక బీటిలో తెల్లని, నల్లని, చుక్కచుక్కల ఆకారాలు దూరంగా వున్నాయి. అవి కదులుతున్నాయి. ఒకో అప్పుడు విడిపోతూ, మళ్లీ కలుస్తూ వున్నాయి.

కొన్ని ఆకారాలు మిగతా వాటికంటే పెద్దవి.

ఆఁ, అవి ఆవులనీ, గొర్రెలనీ, మేకలనీ మందలు. మానవ ప్రయత్నం వల్ల పెరిగి, మారిన జంతువులు యింకా చాలా తక్కువ వున్నాయి. కాని మచ్చిక కాని తమ బంధువుల కంటే త్వరితంగా వృద్ధి పొందుతాయి, యేమంటే అడివిలో వుండేవి తమని తామే కాపాడు కోవాలి కదా.

రెండు మూడు వేల సంవత్సరాలల్లో మచ్చికైన ఆవులకంటేనూ, ఎద్దుల కంటేనూ మచ్చిక కాని ఆవులు తక్కువ వుంటాయి.

పొలాలూ, మందలూ వుంటే దగ్గర్లోనే స్థిర నివాసాలూ వుండాలి.

యిదిగో యిక్కడ నది యెత్తైన గట్టుమీద వుంది అది. యిది గతంలోని వేట మకాం కాదు. కర్రలతోటీ, కొమ్మలతోటీ కట్టుకున్న యిళ్లు కావివి. వాటికి బదులుగా అసలైన కొయ్యతో, కురుమాళ్లు తీర్చిన కప్పులతో వున్న యిళ్లు అవి. గోడలన్నీ మట్టితో అలికినవి. సింహద్వారం దగ్గరనుంచి ఒక దంతె చొచ్చుకుపోతూ వుంది. దానిమీద ఎద్దు తల బొమ్మ వుంది. ఆ యింటిని కాపాడే దేవుడన్న మాట అది. మొత్తం ఆ గ్రామం చుట్టూ యెత్తు కంచే, మట్టిగోడా వున్నాయి.

గాలి పొగవాసనతోటీ, యెరువు వాసనతోటీ, అప్పుడే పితికిన పాల వాసనతోటీ నిండిపోయింది.

పిల్లలు యిళ్ల దగ్గర ఆడుకుంటున్నారు.

పందిపిల్లలూ ఆడపందులూ దాపుల్లోని పొరదలో బుర్లుతున్నాయి. తలుపు తెరిచేవుంది, మీకు పొయ్యిలోని మంట కనిపిస్తుంది. ఓ ముసలావిడ పల్చని రొట్టెలు చేస్తోంది. వేడి నిప్పులమీద పచ్చి పిండిని పెట్టి, రొట్టెల్ని మట్టి కుండతో కప్పుతోంది. యిదే ఆమె రొట్టెలు కాల్చేపొయ్యి. ఆమె పక్క నున్న బల్లమీద చెక్కిన కొయ్య గిన్నెలూ, కప్పులూ వున్నాయి.

కాసేపు గ్రామాన్ని వదిలిపెట్టి నదిలోకి వద్దాం. గట్టుకి దగ్గర్లోనే గుంటల్లో ఒక పడవ నీరునిండి వూగుతోంది. ఆ నది పుట్టుక స్థానమైన సరస్సు దగ్గరికి వెడితే మనకి యింకో గ్రామం తగుల్తుంది. అది యిలాగ వుండనే వుండదు. యీ గ్రామం ద్వీపం లాగా వుంటుంది.

మొదట నదీ గర్భంలోకి గుంజల్ని దిగేశారు. వాటిమీద దుంగల్ని బిగించి, దానిమీద చదునైన చెక్కని పరిచారు. పొడుగాటి వూగే వంతెనలు యీ కొయ్య ద్వీపాన్నీ ఒడ్డునీ కలుపుతాయి. దగ్గర్లోనే వలలూ, చేపలు పట్టే సామాన్లూ ఆరబెట్టి వున్నాయి. ఆ సరస్సు నిండా చేపలు వుండి వుండాలి. కాని యీ గ్రామవాసులు చేపలు పట్టే వాళ్లు మాత్రమే కాదు. యిళ్ల మధ్యలో అక్కడక్కడ కోసుదేలిన కప్పులున్న వృత్తాకారపు ధాన్యపు గాదెలున్నాయి. ఆ గాదెలని అల్లిన కొమ్మలతో చేశారు. వాటికి పక్కనే ఆవుల కొట్టాలున్నాయి.

యీ ప్రాచీన నివాసం మన భావనలో వాస్తవంగా వున్నట్టు కనిపించినా అది యేనాడనగానో మట్టిపాలైంది. పూర్వపు యిళ్ల కప్పులమీద నీళ్లు పారుతున్నాయి. సరస్సు అడుగున వున్న యీ యిళ్ల అవశేషాలు మనకి యెలా కని పిస్తాయి? అది అసాధ్యంగా కనిపిస్తుంది. కాని ఒకో అప్పుడు సరస్సు పాయలు చీలి, శతాబ్దాలుగా తను దాచుకున్న రహస్యాల్ని మనకి వెల్లడి చేస్తుంది.

## సరస్సు కథ

1853వ సంవత్సరంలో స్విట్జర్‌లేండ్‌లో మహా కరువు సంభవించింది. లోయల్లోని నదులు యెండిపోయాయి, సరస్సులోని నీళ్లు తగ్గిపోయి అడుగు మట్టి భాగాలు కనిపించాయి. జూరిచ్ సరస్సు దగ్గరున్న ఒబెర్‌మెయిలెన్ పట్టణం లోని మనుషులు దీన్ని ఆసరా చేసుకుని సరస్సుల్లోని భూభాగాన్ని ఉపయోగపెట్టుకుందా మనుకున్నారు.

అంటే నీరు తీసేసి బయటపడ్డ నేల వారే కరకట్ట కట్టాలన్న మాట. అప్పుడు మిగిలిన సరస్సు నీటికీ, యీ నేలూ విభాగం అయి వుంటాయి.

పని మొదలైంది. యిదివరలో నీలంగా వుండే నీళ్లల్లో అదివారాలప్పుడు జనం తెడ్లు వేసుకుని పడవలని నడిపే చోట పొట్టిగా వుండే లాగుడు బళ్లల్లో నిండా మట్టితోలు కొచ్చే బళ్లవాళ్ల అరుపులు వినవచ్చాయి. అనుకో కుండా యెండిపోయిన నది గర్భంనుంచే వాళ్లు కరకట్టకి మట్టిని తవ్వారు. యింతలో హఠాత్తుగా ఒక పారకి చివికిన గుంజ తగిలింది. దానికి దగ్గర్లోనే మరొకటీ, యింకొకటీ గుంజ తగిలాయి. మనుషులెవరో యింతకుముందే యిక్కడ పనిచేసి వుండాలి. పారతో వచ్చే మట్టిలో ప్రతిసారీ రాతి గొడ్డళ్లూ, చేపలు పట్టే కొక్కేలూ, మట్టి కుండల పెంకులూ వస్తూనే వున్నాయి. వెంటనే పురాతత్వవేత్తలు రంగంమీదకి వచ్చారు. వాళ్లు ప్రతి గుంజనీ సరస్సు అడుగున దొరికిన ప్రతి వస్తువునీ పరీక్షించి ఒకనాడు జూరిచ్ సరస్సు ఒడ్డున వున్న గుంజలమీద గ్రామాన్ని కాగితంమీద పునర్‌నిర్మించారు.

గుంజలమీద కొయ్య పలకల్ని పెట్టి దానిమీద కట్టిన యిలాంటి గ్రామాలు మాస్కో దగ్గరి క్ల్యాజ్మా నది ప్రాంతం



న్యూ గినీలో కొయ్య గుంజలమీద కట్టిన యిళ్లు యింకా కనిపిస్తాయి



ఒకప్పుడు జూరిక్ సరస్సులో వున్న గ్రామానికి పురాతత్వవేత్తలు నిర్మించిన నమూనా చిత్రం

లోనూ, మూరొం దగ్గర వెలెత్మా నదీ ప్రాంతంలోనూ రష్యాలో కూడా కనిపించాయి. అక్కడ దొరికిన అనేక వస్తువుల్లో చేప యెముకలూ, యీటెలూ, చేపలు పట్టే కొక్కేలూ వున్నాయి.

స్విట్జర్‌లేండ్‌లోని న్యూషచెల్ సరస్సుని పురాతత్వవేత్తలు 20 శతాబ్దపు మొదట్లో అధ్యయనం చేశారు. నదీ గర్భంలోని మట్టి నమూనాలని తీసుకుని అది కొన్ని పొరలతో తయారై వుందని కనిపెట్టారు.

బూరెలో పూర్ణాన్నీ, పైపిండినీ వేరుచేసినట్టుగా ఒక పొరనీ యింకో పొరనీ వేరుచెయ్యడం సులభమే. అడుగు పొరలో యిసక వుంది. దానిపైన మానవ నివాసపు అవశేషాలూ, సాధనాలూ, పనిముట్లూ కలిసిపోయిన వండ్రుమట్టి పొర వుంది. అప్పుడు మళ్లీ యింకో యిసక పొర. యీ పద్ధతిగా అనేక పొరలున్నాయి. ఒక చోట రెండు యిసక పొరల మధ్య దళసరి బొగ్గు పొర వుంది.

యీ పొరలన్నీ యెలా యేర్పడ్డాయి?

నీళ్లే అయితే యిసకని తెస్తాయి. యీ బొగ్గు ఎక్కడినుంచి వచ్చింది?

నిప్పునుంచి మాత్రమే బొగ్గు రాగలదు.

యీ పారలన్నిటినీ జాగ్రత్తగా అధ్యయనం చేశాక పురాతత్వవేత్తలు సరస్సు చరిత్ర గురించి తెలుసుకున్నారు. పూర్వం యెప్పుడో మనుషులు ఆ నది దగ్గరికి వచ్చి తీరం వెంబడే స్థిర నివాసం యేర్పాటు చేసుకున్నారు. ఆ తర్వాత యెప్పుడో సరస్సు పొంగి తీరాన్ని వరదలో ముంచి వుంటుంది.

మనుషులు వరదలో మునిగిపోయిన గ్రామాన్ని వదిలిపెట్టారు. ఆ కట్టడాలు నీటికి చివికి కూలిపోయాయి. ఒకసారి పిచికలు గూళ్లు కట్టుకున్న వాసాల పైన చిన్న చేపలు చేరాయి. ఒక నాడు సింహద్వారం అయిన చోట వాడి పళ్లున్న చేపలు మెల్లిగా యీదుకుంటూ పోయాయి. పొయ్యివారే వున్న బల్లకింద గాజురొయ్యలు గోళ్లతో గీకాయి. తర్వాత కొద్ది కాలానికే ఆ శిథిలాలు వండ్రుమట్టి పొరకింద కప్పడిపోయాయి, వాటిమీద యిసకమేట వేసింది.

కాలక్రమేణా సరస్సు మారింది. సరస్సు గర్భాన్ని వెల్లడి చేస్తూ ఒడ్డునుంచి నీళ్లు లోపలికి తీసాయి. ఒకప్పుడు గ్రామం నిలిచిన యిసక మేట కూడా పైకి తేలింది. కాని గ్రామపు జాడలెక్కడా లేవు, యేమంటే యెక్కణ్నో యిసుకలో ఆ అవశేషాలు కూరుకుపోయాయి.



చరిత్రాత్పూర్వపు కొయ్య గుంజల గ్రామం స్థానంలో స్కాట్‌లేండ్‌లో బయల్పడింది యిదీ

యిప్పుడు మనుషులు మళ్లీ ఒడ్డుకి వచ్చారు. గొడ్డళ్ల చప్పుడు మోగింది. పసుప్పచ్చని యిసకలో చెక్కల రద్దు చెదిరిపడింది. ఒకదాని తర్వాత ఒకటిగా నీటి దగ్గర కొత్త యిళ్లు లేచాయి.

విజయలక్ష్మి ఒక్కొక్కసారి ఒక్కొకళ్లని వరిస్తూ వుంటే సరస్సుకీ, మనిషికీ యుద్ధం కొనసాగింది. మనుషులు కొత్త యిళ్లని కట్టడం, సరస్సు వాటిని ముంచెత్తెయ్యడం.

ఆఖరికి ప్రజలకీ పోరువల్ల విసుగొచ్చింది. మునపటి లాగా అంచున కాకుండా, నీటి మీదే యిళ్లని కట్టుకోవాలని నిర్ణయించుకున్నారు. పొడుగాటి గుంజల్ని సరస్సు అడుగున పాతారు. చెక్కపలక పగుళ్ల మధ్యనుంచి యెక్కణ్ణో అడుగున ఉరవళ్లు తొక్కే నీరు కనిపించింది. కాని యిప్పుడది వాళ్లకి తలనొప్పి తెప్పించలేదు. అది యెంత యెత్తు లేచినా చెక్కపలకని తాకలేదు.

కాని సరస్సుమీద వున్న వాళ్లకి యింకో శత్రువు దాపురించింది. అది అగ్ని.

ప్రాచీనకాలపు గుహా నివాసులకి నిప్పంటే భయంలేదు. యేమంటే గుహలోని రాతి గోడలు యెలా అయినా కాలవు.

కాని కొత్త కొయ్య యిళ్లని కట్టగానే అగ్ని ప్రమాదాలు సంభవించాయి. యెన్నో వేల యేళ్లు విధేయంగా మానవుడికి సేవ చేసిన భయంకర అరుణ రాక్షసి తన జ్వాలా దంతాల్ని పట పట కొరికింది.

న్యూషాచెల్ సరస్సు అడుగున భూగర్భంలో కనిపించిన దళసరి బొగ్గుపొర పురాతన కాలపు అగ్ని ప్రమాద స్థలమే.

ఎంత దారుణ విపత్తు అది! పిల్లల్ని గుండెల కదుముకుని అగ్ని ప్రమాదంనుంచి బయటపడ్డానికి మనుషులు నీళ్లల్లోకి దూకారు. కొట్టాల్లో ఆవులు అంబారవాలు చేస్తున్నాయి, కాని వాటిని వదిలిపెట్టే వ్యవధిలేదు. నాలుగు వేపులకీ అగ్ని జ్వాలలు చిమ్ముతూ మొత్తం కొయ్య గ్రామం అంతా పెద్ద భోగిమంటలా మండిపోయింది.

ఆ అగ్ని ప్రమాదం నిజంగా ఘోరమైన విపత్తే.

ఆ గ్రామస్థుల యిళ్లని ధ్వంసం చేసిన ఆ అగ్ని ప్రమాదమే మ్యూజియంల కోసం అమూల్యమైన వస్తువుల్ని భద్రపర్చింది. అవి కొయ్యపాత్రలూ, చేపలు పట్టే వలలూ, ఆ మాటకొస్తే ధాన్యపు గింజలూ మొక్కల కాండాలూ కూడా వాటిలో వున్నాయి.

అతి సులభంగా మాడిమసైపోయే యీ వస్తువులు యే మాయవల్ల భద్రంగా వుంచి వున్నాయి?

జరిగింది యిదీ.

నిప్పంటుకున్న అనేక వస్తువులు నీళ్లల్లో పడిపోయాయి. నీరు వాటిని కాపాడింది, నిప్పని ఆర్పేసింది. అవి చెక్కు చెదరకుండా నీటి అడుక్కు పోయాయి. అక్కడ యింకో ప్రమాదం వుంది: నీళ్లలో అవి చివికి పోవచ్చు. వాటిని యీ సారి కూడా కాపాడింది యేమిటై వుంటుందంటే, అవి నిప్పులో మసి బారిపోయివుండటం. దళసరి మసి పొర వాటిని చివికిపోకుండా భద్రపరచింది.

నిప్పు, నీరూ విడివిడిగా దాడిచేసి వుంటే యీ వస్తువులన్నీ నాశనం అయిపోయి వుండేవి. కాని అవి చెట్టాపట్టాలు వేసుకుని దాడి చెయ్యడంవల్ల వేల సంవత్సరాల క్రితం నేసిన నారబట్టలాంటి సున్నితమైంది కూడా యీనాటికీ భద్రంగా వుండగలిగింది.

# మొదటి వస్త్రం

మొదటి వస్త్రం చేత్తో అల్లినది.

యివాళ్టికి కూడా ఎస్కిమోలు బట్ట నెయ్యడానికి మగ్గాలని వాడరు. చేత్తోటే అల్లుతారు. నిలువు పోగుల్ని (పడుగు) ఒక చట్రానికి బిగిస్తారు. అడ్డం పోగుల్ని (పేక) ఆసుని వాడకుండా చేత్తోటే వాటి మధ్యలోనుంచి అల్లుతారు.

యీ చిన్న కొయ్య చట్రానికీ యీనాటి మగ్గానికీ పోలిక లేదు. అయినా యీనాటి మగ్గానికి మూలం యీ కొయ్య చట్రంలో వుంది.



కొయ్య కొంపల శిథిలాల్లో దొరికిన అల్లిన వస్త్రం

సరస్సు అడుగున దొరికిన మసిబారిన నల్లని గుడ్డ పీలిక మానవుడి జీవితంలోని అతి ముఖ్యమైన సంఘటనని తెలియజేస్తుంది. జంతు చర్మాన్నే యెప్పుడూ కప్పుకున్న మానవుడు తన పొలంలో విత్తనాలు చల్లి కోసుకున్న నారనుంచి తనకి నార ఆచ్ఛాదనాన్ని తయారుచేసుకున్నాడు.

బట్టని కనిపెట్టక పూర్వం వేలాది సంవత్సరాల క్రితమే పుట్టిన సూదికి యిన్నాళ్ళకి సరియైన ఉపయోగం వచ్చింది. గుడ్డ ముక్కల్ని ఒకటిగా కుట్టింది, జంతు చర్మాల్ని కాదు.

చక్కని నీలం పువ్వుల నార పొలం యింట్లో ఆడవాళ్ళకి మరింత పని కల్పించింది.

కోత పనితోటి వాళ్ల చేతులు సలుపు పెట్టాయి, కాని నార పీకే అదును వచ్చింది. వాళ్ళు మొదలుతో సహా మొక్కని పీకాల్సివచ్చింది. అప్పుడు దాన్ని యెండ బెట్టి, తడిపి, మళ్లీ యెండబెట్టేవాళ్ళు. కాని అంతటితో అయిందా, లేదు. ఎండిన నారని చితక్కొట్టి, శుభ్రం చేసి, దువ్వాల్సి వచ్చేది. యిప్పుడు యీ శుభ్రం చేసి, దువ్వి తేలిగ్గా వున్న నార, వడకడానికి తయారైందన్నమాట. అప్పుడు కదుళ్లతోటి వడికి, దాన్ని దారం లాగా చేసేవాళ్ళు. దారంలాగా అయింతర్వాతనే దాన్ని అల్లే వాళ్ళు.

బట్టని తయారుచెయ్యడానికి చాలా వ్యవధి పట్టేది. అయితేనేం, పడ్డ కష్టానికి ప్రతిఫలంగా ఆడవాళ్లకి చక్కని రుమాళ్ళు, పైబట్టలు, రంగురంగుల కుచ్చిళ్లూ అంచులూ వున్న గౌన్లూ దక్కాయి.



తొలి మగ్గాలు బహుశా యీ బ్రెజిలియన్ ఎర్ర ఇండియన్ మగ్గంలా వుండేవి

# మొదటి గని పనివాళ్లూ, ఉక్కు పనివాళ్లూ

యివాళ యే యింట్లోనేనా సరే కృత్రిమ పదార్థాలతో తయారైన వస్తువులూ, ప్రకృతిలో లభించని పదార్థాలతో చేసిన వస్తువులూ వున్నాయి.

ప్రకృతిలో యిటికలు గాని, పింగాణీ గాని లేవు. ఉక్కు గాని, కాగితం గాని లేవు. పింగాణీనీ, ఉక్కునీ తయారు చెయ్యాలంటే మానవుడు ప్రకృతిలో వుండే పదార్థాలని తీసుకుని వాటిని గుర్తుపట్టలేనట్టుగా మార్చెయ్యాలి. ఉక్కుకీ ముడి యినుముకీ పోలిక వుందా? చక్కని పల్చని పింగాణీ కప్పుని చూసి, అది ముతక మట్టితో తయారైందని వూహించగలమా?

కాంక్రీటూ, సెల్లోఫేన్, ప్లాస్టిక్కులు, కృత్రిమ సిల్కు, కృత్రిమ రబ్బరు లాంటి వాటి మాట యేమిటి? కొండల్లో యెక్కడేనా మీకు కాంక్రీటు పోతపోసిన దిమ్మలు కనిపిస్తాయా? కొయ్యనుంచి సిల్కుని తయారుచేసే పట్టుపురుగులు యెక్కడ వున్నాయి?

పదార్థాన్ని లొంగదీసుకుని మానవుడు యింకా యింకా యెక్కువ ప్రకృతి రహస్యాల్ని ఆవిష్కరించుకున్నాడు. ఒక రాతిని యింకో రాతితో పదును పెట్టడంతో అతను ఆరంభించాడు. యివాళ అతను కంటికి కనిపించని సూక్ష్మాతి సూక్ష్మమైన రేణువుల్ని, అణువుల్నీ లోబరుచుకున్నాడు.

యీ క్రమం యెప్పుడో మొదలైంది. పదార్థ శాస్త్రం, రసాయనిక శాస్త్రం, రూపొందక పూర్వమే యిది జరిగింది. తనేం చేస్తున్నదీ తనకే తెలియకుండా, తడుములాడుతూ, మానవుడు పదార్థాన్ని మార్చడం నేర్చుకున్నాడు.

మొట్టమొదట కుండలు చేసిన వాళ్లు తమ మట్టి కుండల్ని కాల్చినప్పుడే తమకి తెలియకుండా పదార్థాన్ని లొంగ దీసుకున్నారు. అది సులభమైన పని కాదు. ఒక రాతిని మలచగలిగినట్టుగా పదార్థపు అతి చిన్న అణువుని కూడా మీ చేతులతోటి మార్చడం కాని, కొత్త రూపం యివ్వడం గాని మీరు చెయ్యలేరు. యిక్కడ తమ చేతులతో బాటు వేరే శక్తి, పదార్థాన్ని మార్చగలిగే శక్తి వాళ్లకి అవసరం అయింది.

అగ్నిని సాధించినప్పుడే మానవుడికి యీ శక్తి లభించింది. నిప్పు మట్టిని కాల్చింది, పిండిని రొట్టె చేసింది. నిప్పు రాగిని కరిగించింది.

సరస్సుల గర్భాల్లో మనకి రాతి పనిముట్లతోబాటు మొదటి రాగి పనిముట్లు కూడా దొరుకుతాయి.

వందల వేల సంవత్సరాలబాటు రాతితోటి తన పనిముట్లని చేసుకున్న మానవుడు, హఠాత్తుగా వాటిని లోహం తోటి యెలా చేసుకోగలిగాడు? తన కవసరమైన లోహం అతనికి యెక్కడ లభ్యమైంది?

మనం పొలాల్లోనూ, అడవుల్లోనూ అలా పోతూ వుంటే మెరిసిపోయే రాగి ముద్దలు మనకేం కనిపించవు. సహజమైన రాగి యీ రోజుల్లో చాలా అరుదు. కాని అస్తమానూ అలా వుండేది కాదు. వేల సంవత్సరాల క్రితం భూమిమీద యిప్పటికంటే యెక్కువ రాగి వుండేది. అది కాలికిందే వుండేది, కాని దాన్ని గురించి మనుషులు పట్టించుకోలేదు. యేమంటే పనిముట్లని చేసుకోడానికి వాళ్లకి చెకుముకిరాయి వుండేది.

చెకుముకిరాయి తరిగిపోయేదాకా వాళ్లు యీ రాగిని గుర్తించలేదు. రాయి తరిగిపోవడానికి కారణమూ మనుషులే. యేమంటే వాళ్లు దాన్ని యెన్నడూ పొదుపుగా వాడలేదు. ఒక కొత్త పనిముట్టుని చేసుకోవాలంటే బొడిపి అని పిలిచే



సోవియట్ యూనియన్ దక్షిణాదిన తవ్వకాలలో బయటపడిన చరిత్రాత్పూర్వపు నెగడు

పెద్ద రాతిని తీసుకుని చిన్న చిన్న పెచ్చులు చెక్కేస్తూ పోయేవాడు, ఆఖరికి చిన్న పనిముట్టు మిగిలేది. యే పనిముట్టు చేసుకోడానికీ పనికి రాని రాతి తునకల గుట్టలు వాళ్ల నివాసాల దగ్గర కనిపించాయి. యివాళ కూడా చుట్టూతా పడి వున్న రద్దుని చూసి యిది వంద్రడంగం పనివాడి కార్ఖానా అని మీరు చెప్పగలరు.

వందల వేల సంవత్సరాల కాలంలో రాతి నిధులు తరిగిపోయాయి.

చాలా ప్రాంతాలలో రాతి కరువు సంభవించింది. అది దారుణమైన విపత్తు. తగినంత యినుము లేకపోతే మన ఫాక్టరీలకీ, కర్మాగారాలకీ యే గతి పడుతుందో వూహించండి. భూమికి దగ్గరగా వుండే నిలవలు అయిపోతాయి కాబట్టి ముడిపదార్థం కోసమని గని పనివాళ్లు భూమిలోకి యింకా యింకా లోతుగా తవ్వాలి.

సరిగ్గా అదే ఆనాటి మానవులు చేసింది. వాళ్లు గనులనీ తవ్వడం మొదలెట్టారు. అవే ప్రపంచంలో మొదటి గనులు.

సున్నపురాయి నిలవల్లో మనకి పురాతన కాలపు గనులు కనిపిస్తాయి, యేమంటే చెకుముకీ, సున్నపురాయీ కలిసే వుంటాయి.

భూమి లోపల ముప్పై, నలభై అడుగుల లోతులో పనిచెయ్యడం ఆ రోజుల్లో భయంకరంగా వుండేది. మనుషులు గనుల్లోకి తాటి సాయంతోటో, గంటు పెట్టిన కర్రతోటో దిగేవాళ్లు. లోపల చీకటిగా, పొగ కమ్మినట్టు వుండేది. కాగడా వెలుతురులోనో, చిన్న సూనె దీపం వెలుతురులోనో మనుషులు పనిచేసేవాళ్లు. యివాళ అయితే గని రక్షణ చర్యల్లో బరువైన దుంగల్ని పెట్టడం, గోడలకీ, కప్పుకీ దన్ను వుంచడం లాంటివన్నీ వున్నాయి. ఆ రోజుల్లో

యివేమీ తెలియవు. ఒకో సారి పెద్ద రాయి విరిగి పడి లోపల వున్న వాళ్లందరూ భూస్థాపితమై పోయేవాళ్ళు. ప్రాచీన రాతి గనుల్లో కూరుకుపోయి పెద్ద సున్నపురాయి కింద సమాధి అయిపోయిన గని పనివాళ్ల అస్థిపంజరాలు దొరికాయి. వాళ్ల అస్థిపంజరాల పక్కనే జింక కొమ్ములతో చేసిన పికాస పనిముట్లు కనిపించాయి.

ఒక గనిలో అలాంటి అస్థిపంజరాలు రెండు దొరికాయి. ఒకటేమో పెద్దతనిది, యింకోటి చిన్న పిల్లాడిది. యెవరో తండ్రి బహుశా తన కొడుకుని తనతో తీసికెళ్లి వుంటాడు, మళ్లీ తిరిగి రాలేదు.

యేళ్లు గడిచే కొద్దీ చెకుముకిరాయీ తరిగిపోయింది. గని తవ్వడం యింకా యింకా కష్టమై పోయింది. యేమైనా ఆ నాటి మానవుడికి చెకుముకిరాయి కావాలి. అతను దాంతోటే తన గొడ్డళ్లనీ, చాకులనీ, తొల్లికలనీ చేసుకున్నాడు.

ఆ రాతికి బదులుగా మరొక దాని కోసం పిచ్చిగా వెతికాడు.

అప్పుడూ అతనికి సహజమైన రాగి దొరికి వూపిరి పీల్చుకోనిచ్చింది. మనుషులు దానికేసి బహుపరిశీలనగా చూశారు: యీ ఆకుపచ్చ రాయి యేమిటి, దీన్ని యెలా వాడుకోగలం?

అసలైన రాగి వాళ్లకి దొరికినప్పుడు దాన్ని సుత్తితో కొట్టారు. రాతితో చేసినట్టుగానే దానితోటీ చెయ్యవచ్చని వాళ్ళు భావించారు. రాగిని రాతి సుత్తితో కొట్టేటప్పటికి అది గట్టి పడింది, దాని ఆకారం మారింది. కాని దాన్ని కొట్టాల్సిన పద్ధతి వేరే వుంది. దెబ్బలు మరీ గట్టివైతే అది పెళుసెక్కి విరిగిపోతుంది.

మానవుడు మొదట్లో యీ రకంగా లోహాన్ని సుత్తితో కొట్టి సాగతీశాడు. అది కాల్చకుండా సాగతియ్యడమే, కాల్చికాదు.

ఒక అసలైన రాగి ముక్కో, ముడి రాగో నిప్పులో పడ్డం యెప్పుడేనా జరిగేది. లేదా మట్టికుండల్ని కాల్చినట్టు మనిషి దాన్ని కాల్చి వుండవచ్చు. నిప్పు చల్లారాక ఆ బూడిదలోనూ, పొయ్యి కట్టురాళ్లల్లోనూ కరిగిన రాగి ముద్ద వుండేది.

వాళ్లు సాధించిన ''అద్భుతం'' కేసి మనుషులు కళ్లప్పచెప్పి చూసే వాళ్ళు. ''అగ్ని శక్తి'' ఆకుపచ్చని రాతిని ధగధగ మెరిసే యెర్రని రాగిగా మార్చిందని వాళ్ల నమ్మేవాళ్లు. దాంతోటి తమకేమీ సంబంధం లేదనే వాళ్ల భావన.

ఆ రాగి ముద్దని ముక్కలుగా కొట్టి, వాటిని రాతి సుత్తితోటి గొడ్డళ్లలాగా, పికాసలలాగా, బాకులలాగా చేసేవాళ్ళు.

ఆరకంగా మానవుడు అద్భుతమైన గాదెలోపల దృఢమైన, ధగధగ మెరిసే లోహాన్ని కనిపెట్టాడు. అతను ఒక ముడి ముక్కని నిప్పులో పడేశాడు, అది రాగి రూపంలో తిరిగి వచ్చింది.

యీ అద్భుతం మానవ శ్రమవల్ల లభించింది.

# రష్యాలో మొదటి సాగుదార్లు

కీయెవ్ నగరం ప్రాంతంలో త్రిపోల్యె గ్రామం వుంది. దాని దగ్గర రష్యన్ పురాతత్వవేత్త వి. ఖ్వోయికో 19వ శతాబ్దపు చివరలో ప్రాచీన వ్యావసాయిక స్థిర నివాసాన్ని కనిపెట్టాడు.

తర్వాత రష్యా దక్షిణాన అలాంటి గ్రామాలు చాలా కనిపించాయి.

అక్టోబరు విప్లవం తర్వాత టి. పాసెక్, బి. బొగాయెవ్‌స్కీలు యీ పరిశోధనని కొనసాగించారు. వాళ్ల కృషి వల్ల అయిదు వేల సంవత్సరాల క్రితం భూమిని దున్నేవాళ్లు యెలా జీవించిందీ వూహించుకునే వీలు చిక్కింది.

ఆనాటి గ్రామం చుట్టూతా యెత్తైన కంచె వుండేది. మధ్యలో పశువులకోసం పెద్ద దొడ్డి వుండేది. దానికి చుట్టూతా కొయ్య పలకలు తగిలించి, కోసుగా లేచిన కప్పులున్న యిళ్లు వుండేవి.

వేల సంవత్సరాల నాటి యింటి మట్టి నమూనా ఒకటి దొరికింది. అది ఆట వస్తువు అయివుండదు, బహుశా మంత్ర కర్మల్లో వాడే వస్తువై వుండాలి.

చిన్న చిన్న ఆడ బొమ్మలు యీ చిన్ని యింటి లోపల వున్నాయి. తమ పెద్ద యింటిని దుష్ట శక్తులనుంచీ, దురదృష్టాన్నుంచీ యీ బొమ్మ యిల్లు కాపాడుతుందని వాళ్లు భావించి వుంటారు.

యీ చిన్ని నమూనాలో సింహద్వారానికి పక్కనే ఒక పొయ్యి, యెడమవైపు యెన్నో వస్తువులు దాచుకోడానికి పాత్రలు, ఆ నాటి నన్నిటినీ పెట్టిన యెత్తైన తీనె వున్నాయి. ఆ తీనెకి పక్కనే ధాన్యం పిండి కొట్టే రోటిమీదకి వంగి వున్న ఆడమనిషి బొమ్మ వుంది. సింహద్వారానికి యెదురుగా ఒక కిటికీ దగ్గర పూజా పీఠం వుంది. పొయ్యిని చూసే ఆడమనిషి బొమ్మ పొయ్యిదగ్గర వుంది.

యిలాంటి యింటిని అన్ని విధాలా యిల్లని పిలవవచ్చు. దాని కప్పకి వాసాలు వున్నాయి. పొయ్యి గూటితోటి ఆ పొయ్యి రష్యన్ పొయ్యి లాగానే వుంది. ఆ యింటిని కట్టేటప్పుడు ప్రత్యేకం యేర్పాటు చేసిన నిప్పుతోటి నేలంతా కాలి వుంది. మట్టితో అలికిన గోడలమీద బొమ్మలున్నాయి.

ప్రతి యింటిలోనూ అలాంటి కొన్ని గదులు, అడ్డం కట్టి వేర్పాటు చేసి వున్నాయి.

అయినా గ్రామాల్లో పెద్ద సారంగ నివాసాలూ వున్నాయి.

యీ పాటికి నిపుణులైన కుమ్మరివాళ్లూ, కమ్మరివాళ్లూ, రాగి పనివాళ్లూ తయారయారు.

కుండలు చేసేవాళ్లు మూడడుగుల యెత్తున్న పాత్రలని తయారుచేసి, వాటిని రకరకాల చిత్రాలతో అలంకరించే వాళ్లు. పురాతత్వశాస్త్రజ్ఞులకి దొరికిన వాటిల్లో ఎర్ర మట్టితో చేసిన పాత్రలు వున్నాయి. వాటిమీద రకరకాల చిత్రమైన లతలూ, శంకువుకుండే వృత్త రేఖలూ, వంకీలూ వున్నాయి. ఒకో చోట అవి పెద్ద కళ్లున్న మానవ ముఖాకృతి లాగో, జంతువు ముఖాకృతిలాగో, సూర్యుని ఆకారంలాగో వున్నాయి.

భూగర్భంలో పదిలంగా వున్న పనిముట్లని మనం పరిశీలిస్తే రాతి పనిముట్లనుంచి రాగి పనిముట్లకి వచ్చే మార్పు మనకి తెలుస్తుంది.

అతి ప్రాచీనమైన పనిముట్లన్నీ, అంటే కత్తెరల్లాంటివీ, గోకుడు పనిముట్లు లాంటివీ, బాణాల్లాంటివీ, అన్నీ కూడా రాతితోటో, యెముకతోటో తయారైనవే.

పారలని రాతితోటో, జింక యెముకతోటో చేసేవాళ్లు. పారకి రంధ్రం చేసి దాంట్లో పిడిని బిగించేవాళ్లు.

ఆవు భుజపు టెముకతోటో, కొయ్యతోటో ధాన్యం కోసే కొడవళ్లని చేసేవాళ్లు. కొయ్య కొడవలి మొక్క మొదళ్లని కొయ్యలేదు. కాబట్టి దానికి రాతి పళ్లని బిగించేవాళ్లు.

యీ గ్రామాల్లోనే మొదటి రాగి పనిముట్లని—, పెద్ద అలుగు వున్న గొడ్డళ్లని పోతపొయ్యడానికి ఉపయోగించిన మూసలు మనకి కనిపిస్తాయి.

వాళ్ళు యే ధాన్యపు గింజలని విత్తేవాళ్లో కూడా మనకి తెలుసు. కొలొమిషినొ గ్రామంలోని యిళ్ళల్లో గోడలని అలకడానికి వాడిన మట్టిలో గోధుమ, బార్లీ, రై, జొన్న గింజలు పురాతత్వవేత్తలకి కనిపించాయి.

వ్యవసాయదారులు సేద్యంలో నిపుణులవుతున్నారన్న మాట. వాళ్లకి కొంచెం అనుభవం కూడా వెనక వుందాయిరి: సరిగ్గా చెప్పాలంటే అయిదు వేల సంవత్సరాల అనుభవం.

## మానవ శ్రమ పంచాంగం

కాలాన్ని సంవత్సరాల్లోనూ, శతాబ్దాల్లోనూ, మన్వంతరాల్లోనూ లెక్కపెట్టడానికి మనం అలవాటు పడ్డాం. అదిమ మానవుడి జీవితాన్ని అధ్యయనం చేసేవాళ్లు వేరే రకమైన పంచాంగాన్ని వాడాలి, వేరే రకపు కాలమానాన్ని వాడాలి. ''యిన్ని వేల సంవత్సరాలకి పూర్వం'' అనడానికి బదులుగా మనం ''పాత రాతియుగంలో,'' ''కొత్త రాతియుగంలో,'' ''రాగి యుగంలో,'' ''కంచు యుగంలో'' అనాలి.

యిది సాంవత్సరిక పంచాంగం కాదు, మానవ శ్రమ పంచాంగం. మానవాళి తన పురోగమనంలో యే దశనీ, యే స్థాయినీ కచ్చితంగా అందుకున్నదీ యిది తెలియజేస్తుంది.

మామూలు పంచాంగానికి పెద్దా, చిన్నా కాలమానాలుంటాయి: ఒక శతాబ్దం, సంవత్సరం, నెల, రోజు, గంట అని.

మానవ శ్రమ పంచాంగానికి కూడా పెద్దా, చిన్నా కాలమానం వుంది. ''రాతియుగం, చెక్కిన పనిముట్లు,'' ''రాతి యుగం, నునుపైన పనిముట్లు'' అని మనం ప్రత్యేకం చెప్పవచ్చు.

రాతి పనిముట్లకి బదులుగా లోహపు పనిముట్లు వచ్చిన కాలానికి, మొదట వ్యవసాయమూ, పశుపోషణా ప్రత్యక్షమైన కాలానికి మానవ చరిత్రలో యీ మార్పులు జరిగిన కాలానికి మన కథ చేరింది. యీ శ్రమ విభజన వస్తు మార్పిడికి కారణమైంది. రాగి గొడ్డళ్లు ఒక చోట తయారైతే, అవి క్రమేపీ మిగతా తెగలకీ అందేవి.

మనుషులు తమ పడవల్లో నదులమీద ప్రయాణం చేసి ధాన్యాన్ని చర్మానికీ, గుడ్డని మట్టి పాత్రలకీ బదలాయించుకుంటూ ఒక గ్రామంనుంచి యింకో గ్రామానికి వెళ్లేవాళ్లు. ఒక తెగలో చాలా యెక్కువ రాగి వుండచ్చు, యింకో తెగలోని కుమ్మరి పనివాళ్లు చాలా ప్రసిద్ధి పొంది వుండవచ్చు. సరస్సుమీద యెక్కణ్నో కొయ్య గుంజల గ్రామ వాసులకి తమ సరుకుల్ని వినిమయం చేసుకోడానికి వచ్చిన పొరుగూరి వాళ్లు తటస్థ పడవచ్చు. యీ వస్తు వినిమయం అనుభవాల మార్పిడికీ, నూతన శ్రమ పద్ధతుల మార్పిడికీ కారణమైంది.

యిక్కడ మనుషులు సంజ్ఞా భాషని వాడుకోవాల్సి వచ్చేది. యేమంటే ప్రతి తెగకీ దాని భాష దానికుండేది. యేమైనా అలా వచ్చినవాళ్లు తిరిగివెళ్లిపోయేటప్పుడు తమతో బాటుగా యితరుల సామాన్లనే కాకుండా, యితరులనుంచి తాము నేర్చుకున్న పదాలని కూడా తీసికెళ్లేవాళ్లు. యీవిధంగా తెగల మాండలికాలు హద్దులుదాటి మిశ్రితమైపోయేవి. అదే సమయంలో కొత్త పదంతో బాటుగా దాని వెనక వున్న అర్థం కూడా వినియోగంలోకి వచ్చేది. పొరుగు తెగల దేవుళ్లు తమ దేవుళ్ల సరసనే చేరారు. చాలా నమ్మకాలనుంచి వేరే యితరమైన నమ్మకాలు, మొత్తం జాతి అంతటికీ ఉమ్మడి అయినవి యేర్పడ్డాయి.

దేవుళ్లు చాలా వేగంగా ప్రయాణం చేశారు. కొత్త స్థలాల్లో వాళ్లకి కొత్త పేర్లు వచ్చాయి కాని వాళ్లని గుర్తు పట్టడం సులభమే.

ప్రాచీన ప్రజల మతాలని పరిశీలించేటప్పుడు బాబిలోనియన్ తమ్మూజ్ అయినా, ఈజిప్టు ఒసిరిస్ అయినా, గ్రీకుల ఆడోనిస్ అయినా పేర్లు తేడా కాని అసలు సరుకు ఒకటేనని మనం గుర్తుపడతాం. ఆకురాలు కాలంలో చచ్చిపోయి, మళ్లీ ప్రతి వసంత రుతువులోనూ పాతాళలోకంనుంచి వచ్చే ప్రాచీన వ్యావసాయిక దేవుడు అన్ని చోట్లా ఒక్కటే మచ్చు.

ఒకో అప్పుడు దేవుళ్ల యాత్రలని మనం పటంమీద గీయవచ్చు.

సీమైట్స్ నివసించే దేశాలనుంచీ, సిరియానుంచీ ఆడోనిస్ గ్రీసుకి వచ్చాడు. ఆ పేరునిబట్టే ఆ సంగతి చెప్పవచ్చు. సీమైట్ భాషలో ''ఆడోనిస్'' అంటే ''యజమాని'' అని అర్థం. అది ఒక పదమని గ్రీకులకి తెలియక దాన్ని ఒకళ్ల పేరుగా గ్రహించారు.

యీ రకంగా వస్తువులూ, పదాలూ, మతాలూ మార్పిడి అయ్యాయి.

యీ వినిమయాలన్నీ శాంతియుతంగా జరిగేవని చెప్పడం పొరపాటు అవుతుంది. రాగీ, బట్టలూ, ధాన్యాలూ బలవంతంగా యీ ''అతిథులు'' లాక్కోగలిగితే కించిత్తు సంకోచం కూడా లేకుండా అలా చేసేవాళ్లు. యీ విధంగా, తరచుగా అన్యాయంగా వుండే వినిమయం, పచ్చి దోపిడీగా తయారయ్యేది. ఆ వచ్చిన వాళ్లూ, వీళ్లూ, ఒకళ్లమీద ఒకళ్లు దాడి చేసేవాళ్లు. ఎవడు బలవంతుడో వాడు నెగ్గుతాడు కదా! పరాయి వాణ్ణి చంపడంలో గాని, దోచుకోవడంలో గాని దోషమేమీ లేదు!

అందుకనే అప్పట్లో ప్రతి గ్రామమూ ఒక దుర్గంలా కనిపించడంలో ఆశ్చర్యమేమీ లేదు. అనుకోకుండా, అవసరం లేని ''అతిథులు'' రాకుండా వుండేందుకని గ్రామం చుట్టూ మట్టి గోడ, గుంజల దడీ వుండేవి.

మిగతా తెగల వాళ్లంటే మనుషులకి నమ్మకం తక్కువ. ప్రతి తెగా తమని ''జనం'' అని పిలుచుకునే వాళ్లు. మిగతా వాళ్లని అలా చూసే వాళ్లు కాదు. తమని ''సూర్యసంతానం'' అనీ, ''ఆకాశ సంతానం'' అనీ పిలుచుకుంటూ, మిగతా తెగలకి అవమానకరమైన మారుపేర్లు పెట్టేవాళ్లు. ఒకో అప్పుడు ఆ మారుపేర్లే స్థిరపడిపోయి, ఆఖరికి ఆ తెగ ప్రజలు ఆ పేరుతోనే నలుగురికీ తెలిసేవాళ్లు.

అధికమైన జాతి అనేదేదీ లేదని చరిత్ర మనకి తెలియచేసింది. సాంస్కృతికంగా ఎక్కువ పురోగమించిన వాళ్లూ, వెనకబడిన వాళ్లూనే వున్నదల్లా. మానవ శ్రమ పంచాంగం ప్రకారం సమకాలికులందరూ ఒకే చారిత్రక యుగానికి చెందిన వాళ్లు కాదు.

అక్టోబరు సోషలిస్టు మహా విప్లవానికి ముందు రష్యా ప్రజలందరూ ఒకే స్థాయి అభివృద్ధిని అందుకున్న వాళ్లు



తమ సరుకుల్ని యితరుల సరుకులతో బదలాయించుకోవడానికి జనం నదులమీద తీరం వెంబడే పడవల్లో వెళ్లేవాళ్లు. ప్రాచీన స్కాండినేవియన్ పడవ చిత్రం



ప్రాచీన ఈజిప్టులో వస్తు వినిమయం

కాదు. కొంతమంది యంత్ర యుగంలో జీవిస్తూవుంటే మరి కొంతమంది పురాతన కొయ్య నాగళ్లని వాడుతూనూ, ఆనాటి మగ్గాలమీద బట్ట నేసుకుంటూనూ జీవించేవాళ్లు. యెముకలతో తన పనిముట్లని చేసుకుంటూ, ఇనుము అంటే యేమిటో యెరగని వాళ్లు కూడా వుండేవాళ్లు.

యివాళ యెక్కువ అభివృద్ధి చెందిన సోవియట్ యూనియన్ ప్రజలు వెనకబడి గతంలో వున్న వాళ్లకి సాయం చేశారు. కొన్ని దశాబ్దాల కాలంలో మధ్య ఆసియా, సైబీరియా, దూర ఉత్తర ప్రాంతాల ప్రజలు కొన్ని శతాబ్దాల పురోగతిని సాధించారు.

మానవ శ్రమ పంచాంగం ప్రకారం మన దేశపు ప్రజలందరూ సోషలిస్టు యుగపు ప్రజలు.

# ప్రకరణం పది

## రెండు ధర్మాలు

సముద్రంమీద ప్రయాణించే పరిశోధకులు కొత్త దేశాలనే కాకుండా, చరిత్రలో యేనాడో మరుగైన యుగాలని కూడా దర్శించడం తరుచుగా జరిగింది.

యూరపియన్లు ఆస్ట్రేలియాని కనిపెట్టినప్పుడు అదొక బ్రహ్మాండమైన విజయం అనే చెప్పాలి. యేమంటే ఒక నూతన ఖండాన్నే వాళ్లు కనిపెట్టి, స్వాధీనం చేసుకున్నారు.

కాని వాళ్ల విజయం ఆస్ట్రేలియన్లకి చాలా దురదృష్టకరమైంది. మానవ శ్రమ పంచాంగం ప్రకారం వాళ్లు యింకో యుగంలో వున్నారు. వాళ్లు యూరపియన్ సంప్రదాయాలని అర్థం చేసుకోలేకపోయారు, యూరపియన్ పద్ధతులకి లొంగడానికి సమ్మతించలేదు. యీ ''పాపాని''కి వాళ్లకి క్షమ లేకపోయింది, వాళ్లని అడవి జంతువులని వేటాడినట్టు వేటాడి తరిమికొట్టారు. ఆస్ట్రేలియన్లు యింకా గుడారాల్లో వుండగానే యూరపియన్ నగరాల్లో బ్రహ్మాండమైన భవనాలు లేస్తున్నాయి. యూరప్‌లో ఓ జమీందారుగారి అడివిలోని లేడిని చంపినందుకు యెవరేనా జైల్లో పడితే, ఆస్ట్రేలియన్లకేమో వ్యక్తిగత ఆస్తి అనేదే తెలియదు.

ఆస్ట్రేలియన్లకి ధర్మం అయింది యూరపియన్లకి నేరం.

ఆస్ట్రేలియన్ వేటగాళ్లకి గొర్రెల మంద తటస్థపడితే వాళ్లు దాన్ని సంతోషాతిరేకంతో అరుస్తూ చుట్టు ముట్టేవాళ్లు. వాళ్లు తమ బల్లేలనీ, విష్ణుచక్రాల్లాంటి బూమరాంగ్ అనే ఆయుధాలనీ మందమీదకి విసిరే వాళ్లు. కాని యీ పరిస్థితి వచ్చేటప్పటికి యూరపియన్ల రైఫిళ్లు పోటీ వచ్చేవి.

యూరపియన్ రైతు గొర్రెల్ని వ్యక్తిగత ఆస్తిగా భావిస్తే ఆదిమ ఆస్ట్రేలియన్ వేటగాడికి అది వరప్రసాదం. ''గొర్రెని కొనుక్కుని పెంచుకున్న రైతుకి ఆ గొర్రె చెందుతుంది'' అనేది యూరపియన్ ధర్మం అయితే, ''దాన్ని చేజిక్కించుకున్న వేటగాడికి ఆ జంతువు చెందుతుంది'' అనేది ఆస్ట్రేలియన్ల ధర్మం.

ఆస్ట్రేలియన్లు తమ కాలపు ధర్మాన్ని అనుసరించినందుకు, వాళ్లేదో గొర్రెల మందలోకి ప్రవేశించిన తోడేళ్లైనట్టూ, మనుషులు కానట్టూ యూరపియన్లు వాళ్లని కాల్చేసేవాళ్లు.

ఆస్ట్రేలియన్ ఆడవాళ్లు బంగాళాదుంపల పొలంలోకి వెళ్లడం జరిగినప్పుడు యీ రెండు ధర్మాలూ మళ్లీ స్పర్థించేవి. ఒక్క క్షణం కూడా సంకోచించకుండా వాళ్లు ఆ కమ్మని దుంపల్ని తవ్వడం మొదలెట్టేవాళ్లు. అందులో ఆశ్చర్యంలేదు: యిక్కడ యెన్ని దుంపలో, అదీ ఒక్కచోట!

ఆ హఠాత్తుగా దిగివచ్చిన అదృష్టమే వాళ్ల పాలిట శాపం అయింది. ధనధనా తుపాకులు పేలేవి, తమ బుట్ట లతో సహా ఆడవాళ్లు తమని యెవరు చంపుతున్నదీ, యెందుకు చంపుతున్నదీ అనేది కూడా తెలియకుండా నేల పాలైపోయేవాళ్లు.

అమెరికా ఆవిష్కరణ యిలా రెండు విరుద్ధ ప్రపంచాల మధ్య యుద్ధాన్నీ తిరిగి నడిపించింది.

# పాత "క్రొత్త ప్రపంచం"

అమెరికాని కనిపెట్టిన యూరపియన్లు తామో కొత్త ప్రపంచాన్ని కనిపెట్టా మనుకున్నారు.

యీ సంఘటన జ్ఞాపకార్థంగా కొలంబస్‌కి గొప్పవంశీకుల అలంకారంలాంటి ప్రత్యేక కేతనం కూడా లభించింది.

కాని యీ "నూతన ప్రపంచం" వాస్తవానికి పాత ప్రపంచమే. యూరపియన్లు, తామెప్పుడో మర్చిపోయిన తమ గతాన్నే తెలియకుండా కనిపెట్టారు.

ఎర్ర యిండియన్ల ఆచారాలు ఆటవికమైనవనీ, వింతగా వుండేవనీ వాళ్లనుకున్నారు. ఎర్ర యిండియన్ల ఇళ్లు గాని, దుస్తులుగాని, పద్ధతులుగాని పిసరు కూడా తమ వాటిలా లేవు.



ఎర్ర ఇండియన్లు కొయ్య యిళ్లల్లో వుండేవాళ్లు. ఎత్తైన కొయ్య గుంజలతోటి గ్రామానికి చుట్టూ కంచె కట్టే వాళ్లు (16వ శతాబ్దపు చిత్రం)

ఉత్తర ప్రాంతపు ఎర్ర యిండియన్లు తమ బాణాలనీ, విల్లులనీ రాతితోటీ, ఎముకతోటీ చేసుకునేవాళ్లు. వాళ్లకి ఇనుముని గురించి యేమీ తెలీదు. కాని వాళ్లకి వ్యవసాయంతోటి పరిచయం వుంది. మొక్కజొన్న, గుమ్మడి, చిక్కుళ్ళు, పొగాకూ వాళ్లు పండించేవాళ్లు. వాళ్ల ముఖ్య వృత్తి వేట. వాళ్లు కొయ్య యిళ్లల్లో వుండేవాళ్లు. వాళ్ల గ్రామాల చుట్టూతా యెత్తైన గుంజల కంచె వుండేది.

దక్షిణాన, మెక్సికోలో వుండే ఎర్ర యిండియన్లకి రాగి పనిముట్లూ, బంగారు నగలూ వుండేవి. వాళ్ల యిళ్ళు కూడా కాల్చకుండా పూత పెట్టిన యిటికలతో కట్టినవీ, పెద్దవీనీ.

ఆమెరికాకి మొదటగా వలసవెళ్లిన వాళ్లు దీన్నంతటినీ చాలా వివరంగా కచ్చితంగా తమ డైరీల్లో వర్ణించారు.

ఒక జీవిత విధానాన్ని వర్ణించడంకంటే వస్తువుల్ని వర్ణించడం తేలిక.

అమెరికాలోని జీవిత విధానం యూరపియన్లకి వింతగా కనిపించింది. వాళ్లు దాన్ని అర్థం చేసుకోలేకపోయారు. దాన్ని గురించిన వాళ్ల వర్ణనలు చాలా అస్పష్టంగా, గందరగోళంగా వున్నాయి.

ఆ ''నూతన ప్రపంచం''లో డబ్బు అనేది లేదు, వర్తకులు లేరు, ధనికులూ, పేదవాళ్లూ లేరు. బంగారంతోటి వస్తువుల్ని తయారుచేసుకోవడం తెలిసిన ఎర్ర యిండియను తెగలున్నాయి. కాని వాళ్లకి బంగారం విలువ తెలియదు.

కొలంబసుతో వెళ్లిన నావికులకి కనిపించిన తొలి ఎర్ర యిండియన్లకి బంగారపు బేసర్లు వున్నాయి, మెళ్లో బంగారు గొలుసులున్నాయి. కాని వాళ్లు గాజుపూసలకీ, చిల్లర వస్తువులకీ బదులుగా యీ బంగారు నగలని సంతోషంగా యిచ్చేశారు.

సముద్రం దాటి వచ్చిన పరాయివాళ్లకి తమ ప్రపంచంలోని మనుషులు యజమానులనీ సేవకులనీ, భూస్వాములనీ రైతులనీ విభజితమైపోయి వుండటం తెలుసు. కాని యిక్కడ అంతా సమానంగానే వున్నారు. తెగవాళ్లు శత్రువుని పట్టుకుంటే అతన్ని బానిస కిందో, సేవకుని కిందో మార్చేవాళ్లు కాదు. అతన్ని సరాసరి చంపనేనా చంపేసేవాళ్లు లేదా తమలో కలిపేసుకోనేనా కలిపేసుకునేవాళ్లు.

యిక్కడ యెవళ్లకీ సొంత భవనం కాని, యిల్లు గాని, భూమిగాని లేవు. ప్రజలు ''పొడుగాటి యిళ్లు'' అని పిలిచే సామూహిక నివాసాల్లో వుండేవాళ్లు. మొత్తం పెద్ద కుటుంబం కలిసి వుండేది. దానికి తిండీ, బట్టా యేర్పాటు చెయ్యడం అందరి బాధ్యతానూ. భూమి యే వ్యక్తికీ సొంతం కాదు, మొత్తం తెగ అంతటిదీనీ. భూస్వామి పొలంలో పనిచేసే భూదాసులు లేరు. అందరు మనుషులూ స్వతంత్రులే.

ఫ్యూడల్ కాలంలో జీవిస్తూ, భూదాసులు వుండడమనేది చట్టంగా చలామణీలో వున్న యూరపియన్లు గందరగోళ పడి తికమకలవడానికి యిది సరిపోయింది.

ఎవళ్లేనా గానీ యింకొకళ్ల వస్తువుని తీసుకుంటే మునసబుగారు చొక్కాపట్టుకుని, జైల్లో పడేస్తాడని యూరప్‌లో ప్రతి వాళ్లకీ తెలుసు. కాని యిక్కడ మునసబుల్లేరు, జైళ్లు లేవు, వ్యక్తిగత ఆస్తిలేదు. కాని ప్రతిదానికీ నియమం వుంది. ఆ ప్రజలు యీ నియమాన్ని పాటించారు, యూరప్‌లో వాళ్లు పాటించేదానికి భిన్నంగానైనా.

బీదవాళ్లు ధనికులకి చెందిన వేటనీ తీసుకోకుండా వుండేటట్టూ, సేవకులు యజమానులకి విధేయులై వుండేటట్టూ, భూస్వామ్యదాసులు యావజ్జీవితమూ భూస్వాముల క్షేత్రాల్లో పనిచేసేటట్టూ కట్టుదిట్టం చేసే పద్ధతిలో యూరప్‌లో చట్టాలున్నాయి.

కాని యిక్కడ ప్రతి వ్యక్తికీ అతని కుటుంబమూ తెగా రక్షణ. ఎవళ్లనేనా యింకొకళ్లు చంపేస్తే మొత్తం తెగ అంతా పగదీర్చుకునేవాళ్లు. చంపినవాడి బంధువులు, చచ్చిపోయినవాడి బంధువుల్ని క్షమించమని వేడుకుని, శాంతి కానుకలు తెచ్చినప్పుడే ఆ గొడవ ప్రశాంతంగా ముగిసేది.

యూరప్‌లో చక్రవర్తులు, రాజులు, యువరాజులు వున్నారు. కాని యిక్కడ రాజులూ లేరు, సింహాసనాలూ లేవు. మొత్తం తెగ అంతటి సమక్షంలోనూ కుల పెద్దల సభ వ్యవహారాలని పరిష్కరించేది. వాళ్ల వాళ్ల సామర్థ్యాన్ని బట్టి ఆ పెద్దల్ని ఎన్నుకునేవాళ్లు. వాళ్లు గనక విధినిర్వహణ సరిగా సమర్థవంతంగా చెయ్యలేకపోతే వాళ్లని తొలగించేసేవాళ్లు. పెద్ద అనగానే తెగకి యజమానేం కాదు. కొన్ని ఎర్ర యిండియను భాషల్లో ''పెద్ద'' అంటే ''వక్త'' అని అర్థం.

పాత ప్రపంచంలో, అంటే యూరప్‌లో, రాజు దేశానికి అధినేత, తండ్రి కుటుంబానికి అధినేత. రాజ్యం అంటే అతి యెక్కువ మంది సమాజం కలిసి వున్నది, కుటుంబం అతితక్కువ మంది సమాజం. రాజు జనం చేసిన తప్పుల్ని విచారించి శిక్ష వేసేవాడు. తండ్రి పిల్లల తప్పుల్ని విచారించి దండించేవాడు. రాజు రాజ్యాన్ని కొడుక్కి అప్పగించేవాడు, తండ్రి తన ఆస్తిని కొడుక్కి అప్పగించేవాడు.

కాని యీ కొత్త ప్రపంచంలో తండ్రికి పిల్లలమీద పెత్తనం లేదు. పిల్లలు తల్లికి చెంది, ఆమెతోనే వుండే వాళ్లు. ఆ ''పొడుగాటి యింట్లో'' ఆడవాళ్లదే అధికారం. యూరపియన్ కుటుంబాల్లో ఆడపిల్లలు అత్తవారిళ్లకి వెళ్లిపోయేవాళ్లు, మగపిల్లలు తల్లిదండ్రులతో వుండిపోయేవాళ్లు. యిక్కడ వ్యతిరేక పద్ధతి: ఆడపిల్ల తన పెనిమిటిని పుట్టింటికి తెచ్చుకునేది. ఆడపిల్లే కుటుంబానికి పెద్ద.

తొలినాటి పరిశోధకుడొకరు రాసింది యిదీ:

''ఆడవాళ్లే సామాన్యంగా గృహ నిర్వహణ బాధ్యత వహించేవాళ్లు. ఒకళ్లనొకళ్లు బలపరచుకుంటూ వుండే వాళ్లు. వాళ్ల కొట్టుగది ఉమ్మడిగానే వుండేది. సంపాదన లేని భర్త దురదృష్టం! 'నడుపీనుగ వచ్చెననుచు నగుదురు సుమతీ.' అతనికి యెన్ని వస్తువులుండనీ, యెంతమంది పిల్లలుండనీ, దుప్పటి మడిచి పక్క యెత్తుకుని నోట్లో మాట నోట్లో వుండగానే పనిచెయ్యాల్సిందే. అతను యెదురు చెప్పాడో, అంతే అతని ఖర్మ. అతని జీవితం దుర్భరమైపోతుంది. అతని అత్తో, మామ్మో అతన్ని సమర్థిస్తూ రెండు ముక్కలు చెప్పకపోతే గనక అతను తన తెగకి మళ్లీ తిరిగిపోవడమో, యింకో తెగ పిల్లని పెళ్లి చేసుకోవడమో జరగాల్సిందే. ఆడవాళ్లకి చాలా అధికారం వుండేది. అవసరమైతే యే కుల పెద్ద 'కొమ్ములేనా విరిచేసేందుకు' (వాళ్లు అలా అనేవాళ్లు) అంటే అతగాడి హోదా వూడగొట్టేసి అతన్ని తెగలోని మిగతా వాళ్లల్లాగానే ఒక మామూలు సభ్యుడుగా చేసేందుకు ఒక క్షణం కూడా ఆలోచించేవాళ్లు కాదు. అలాగే యింకో కులపెద్దని యెన్నుకోవడంలో కూడా ఆడవాళ్ల మాటే నెగ్గుతుంది.''

యూరప్‌లో ఆడది మగాడి పనిమనిషి. కాని ఎర్ర యిండియన్ల తెగల్లో ఆడది కుటుంబానికి పెద్ద. ఒకో అప్పుడు ఆమె తెగకి కూడా పెద్దే. పూష్కిన్ కవి జాన్ టాన్నర్ అనే అమెరికన్ గురించి ఒక వ్యాసం రాశాడు. ఆ అమెరికన్‌ని ఎర్ర యిండియన్లు పట్టుకున్నారు. నెట్-నొ-క్వా అనే ఎర్ర యిండియన్ స్త్రీ అతన్ని చేరదీసింది. యిది నిజమైన కథ. నెట్-నొ-క్వా ఆట్టావా అనే తెగకి పెద్ద. ఆమె యుద్ధ నౌకమీద పతాకం యెగిరేది. ఆమె బ్రిటిష్ ఓడరేవుకి వచ్చినప్పుడు ఆమెకి ఫిరంగి పేల్చి స్వాగతం చెప్పేవాళ్లు. ఎర్ర యిండియన్లే కాకుండా, శ్వేతజాతి వాళ్లు కూడా ఆమెని గౌరవించేవాళ్లు.

యీ కుటుంబాల్లో వంశం తండ్రినుంచి కాకుండా తల్లినుంచి వుండటంలో వింతేమీ లేదు. యూరప్‌లో పిల్ల



''పొడుగాటి యింటి'' లోపలి భాగం. పైపు పట్టుకున్న మనిషే పెద్ద

లకి తండ్రుల వంశనామం వస్తే, యిక్కడి పిల్లలకి తల్లి వంశనామం వచ్చేది. తండ్రి ''జింక'' తెగకి, తల్లి ''ఎలుగు బంటి'' తెగకీ చెందిన వాళ్లైతే పిల్లలు ''ఎలుగుబంటి'' తెగకు చెందుతారు. ప్రతి తెగా కూడా ఆడవాళ్లతోటీ, వాళ్ల పిల్లలతోటీ, వాళ్ల కూతుళ్ల పిల్లలతోటీ, మనవరాళ్లతోటీ, మనవలతోటీ వుండేది.

యూరపియన్లకి యిదంతా కూడా గందరగోళంగా వుండేది. ఎర్ర యిండియన్ల పద్ధతులు ఆటవికమైనవనీ, వాళ్లే ఆటవికులనీ యూరపియన్లు అనేవాళ్లు.

తమ ముత్తాత ముత్తాతల నాటి పూర్వులకి కూడా, విల్లంబులనాటి రోజుల్లో, మొదటి పడవలూ తొల్లికలూ వుండేనాటి కాలంలో వాళ్లకి కూడా యిలాంటి ఆచారాలే వుండేవన్న విషయం వాళ్లు మరిచిపోయారు.

మొదట వలసవెళ్లిన వాళ్లూ, ఖండాన్ని జయించిన వాళ్లూ యీ తెగల పెద్దల్ని ఘనత వహించిన వాళ్లనీ, భూస్వాములనీ వర్ణించారు. ''పెద్ద'' అనే హోదా ప్రభు హోదా అనీ, వంశలాంఛనపు బొమ్మ తత్సంబంధమైన కేతనం లాంటిదనీ వాళ్లు భావించారు. పెద్దల సభ శాసన సభ అనీ, ముఖ్య యోధుడు రాజు అనీ వాళ్లు అన్నారు. మనం మన సైన్యాధ్యక్షుణ్ణి రాజంటే యెంత హాస్యాస్పదంగా వుంటుందో అలాగే వుంది యిది.

శతాబ్దాలు గడిచిపోయాయి గాని అమెరికాలోని శ్వేతజాతి స్థిరనివాసులు స్థానిక ప్రజల ఆచారాలని అర్థం చేసుకోలేదు. లూయీ హెచ్. మోర్గన్ అనే అమెరికన్ పండితుడు ''ప్రాచీన సమాజం'' అనే తన పుస్తకంలో అమెరికాని పునర్దర్శించేదాకా యీ దురభిప్రాయం వుండిపోయింది. అందులో ఇరాక్వ్యాలా, అజ్టెక్ యిండియన్ తెగలా జీవన విధానం యూరపియన్లు యేనాడో మర్చిపోయిన దశలో వుందని ఆయన రుజువు చేశాడు.



మెక్సికన్ ఎర్ర ఇండియన్ తెగలవాళ్లు 'పూబ్లో'లలో వుండేవాళ్లు

మోర్గన్ పుస్తకం 1877లో వెలువడింది. కాని యింకా మనం అమెరికాని మొదట జయించిన వాళ్ల గురించి మాట్లాడుకుంటున్నాం.

తెల్లవాళ్లు యిండియన్ తెగలని అర్థంచేసుకోలేదు. అలాగే యిండియన్ తెగలూ తెల్లవాళ్లని అర్థం చేసుకోలేదు. ఒక తెల్లవాడు గుప్పెడు బంగారం కోసం యింకో తెల్లవాణ్ణి యెందుకు పీక నులిమి చంపేస్తాడా అన్నది వాళ్లకి అర్థం కాలేదు. తెల్లవాళ్లు అమెరికాకి యెందుకు వచ్చిందీ, ''యింకొకడి భూభాగాన్ని జయించడం'' అంటే యేమిటైందీ వాళ్లకి అర్థం కాలేదు.

భూమి మనుషులందరికీ చెందిందనీ, పితృదేవతల రక్షణలో వుందనీ ఆదిమ మానవులు విశ్వసించారు. మరొకళ్ల భూమిని లాక్కోవడం అంటే ఆ తెగదేవతలకి ఆగ్రహం తెప్పించడమన్నమాట.

ఎర్ర యిండియన్లు కూడా ఒకళ్లతో ఒకళ్లు యుద్ధాలు చేసుకునేవాళ్లు. కాని ఒక తెగ యింకో తెగని ఓడించినప్పుడు వాళ్లని బానిసలుగా చేసుకునేవాళ్లు కాదు. వాళ్లని తమ ఆచారాలని అనుసరించేటట్టు చేసేవాళ్లు కాదు, వాళ్ల పెద్దల్ని కూలదోసేవాళ్లు కాదు. ఓడిపోయిన తెగ తమకి కప్పం కట్టేటట్టు మాత్రమే వాళ్లు చేసే వాళ్లు.

రెండు ప్రపంచాలూ, రెండు సాంఘిక వ్యవస్థలూ స్పర్ధించాయి. అమెరికాని జయించడమనే చరిత్ర రెండు ప్రపంచాల మధ్య జరిగిన పోరాట చరిత్ర.

స్పానిష్ వాళ్లు మెక్సికోని జయించడం యింకా చక్కని ఉదాహరణ అవుతుంది.

## తప్పులతడక

1519వ సంవత్సరంలో మూడు తెరచాప కొయ్యలుండే పదకొండు నౌకలు మెక్సికో తీరంలో ప్రత్యక్షమయ్యాయి. ఓడల పక్కభాగాలు పీపాల్లా గుండ్రంగా వున్నాయి. ఓడల ముందుభాగమూ వెనకభాగమూ నీళ్లమీద యెత్తుగా వున్నాయి. ఫిరంగి గొట్టాలు నలుచదరపు డెక్కులమీదనుంచి ముందుకు వచ్చాయి. వారన సైనికుల బల్లేలూ, తుపాకులూ మెరుస్తున్నాయి.

విశాల భుజుడైన గడ్డపు మనిషి ఒకతను, నుదుటిమీదదాకా టోపీ లాక్కుని పెట్టుకున్నాడు. కేతన నౌకపైన నుంచున్నాడు. అయన తీక్ష్నమైన కళ్లు తీరంకేసీ, అక్కడ చేరిన అర్ధనగ్న ఎర్ర యిండియన్ గుంపులకేసీ పరీక్షగా చూస్తున్నాయి.

అయన పేరు కార్టెజ్. మెక్సికోని జయించడానికని పంపిన బృందానికి అయన నాయకుడు. స్పానిష్ గవర్నర్ ఆ నియామకాన్ని రద్దు చేస్తూ జారీచేసిన ఉత్తరం అయన దగ్గరున్న మాట నిజమే. కాని కార్టెజ్ లాంటి సాహసోపే తుడికి అలాంటి రద్దుచేసే ఫర్మానాలు లెక్కా! స్పెయిన్నుంచి అతన్ని మహోదధి విడదీస్తోంది. యిక్కడ తన నౌకలమీద అయనే చక్రవర్తి.

ఓడలు లంగర్లు దించాయి. దారిలో ద్వీపాలమీద కార్టెజ్ బంధించిన యిండియన్ బానిసలు ఫిరంగులనీ, తుపాకీ బళ్లనీ, ఆహారపదార్థాల పెట్టెలనీ, తుపాకీలనీ చిన్న పడవల్లోకి చేరవేస్తున్నారు. భయపడిపోయి

వెనక కాళ్లమీద నుంచుంటున్న గుఱ్రాలని ఓడ లోపలినుంచి పైకి తీసుకువచ్చారు. కష్టమైన పని అల్లా వాటిని పడవల్లోకి దింపి ఒడ్డుకు చేర్చడం.

నీళ్లల్లో తేలుతూవచ్చే యిళ్లకేసీ, తానులు తానులు బట్టలతో తమ శరీరాలని కప్పుకున్న పాలిన ముఖం మనుషుల కేసీ, వాళ్ల వింత ఆయుధాలకేసీ ఆ ఎఱ్ఱ యిండియన్లు అలా గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయారు. ఎగిరెగిరి పడే జూలూ,




తెనోక్టిట్లాన్ పటం

తోకలూ వున్న ఆ సకిలించే జంతువులు వాళ్లకి మరీ ఆశ్చర్యం కలిగించాయి. వాళ్ళు అంతకు ముందు ఆ వింత రాక్షసుల్ని చూసియెరగరు.

తెల్లవాడి రాక గురించిన వార్త క్షణాలమీద తీరం అంతా, లోపలి భూభాగంలోని కొండలదాకా చొచ్చుకుపోయింది. పెద్ద పర్వతపు గోడవెనక లోయలో ఆజ్టెక్కుల గూడేలు వున్నాయి. అన్ని గూడేల్లోకీ తెనోక్టిట్లాన్ అనేది పెద్దది. అది ఒక సరస్సు మధ్యలో వుంది. దాన్ని ఒడ్డుకు కలుపుతూ వంతెనలున్నాయి. ఆ గ్రామపు వెల్లవేసిన యిళ్ళూ, పూతబెట్టిన గుళ్ళూ దూరానికి కనిపిస్తాయి. ఆజ్టెక్కు యోధుల పెద్ద అయిన మాంటేజుమా తన యోధులతోటి అతి పెద్ద యింట్లో వుంటాడు.

తెల్లవాడి రాకని గురించిన వార్త మాంటేజుమాని చేరగానే అతను యితర పెద్దల సభని సమావేశపరచాడు. ఆ ముఖ్యులంతా చాలా సేపు తీవ్రంగా, గంభీరంగా యేం చెయ్యాలా అని ఆలోచించారు. యీ తెల్లవాళ్ళు తమ దేశానికి యెందుకు వచ్చారా, వాళ్లకి కావాల్సిందేమిటా అనేదే సభ ముందున్న సమస్య అల్లా.

ఆ తెల్లవాళ్లకి బంగారం అంటే యిష్టమని వార్తలని బట్టి వాళ్లకి తెలిసింది. అంచేత తెల్లవాళ్లకి బంగారపు బహుమతులు పంపించి, వెనక్కి వెళ్లండి బాబులూ అని చెప్పాలని పెద్దల సభ నిర్ణయించింది.



రాయబారులు కార్టెజ్‌కి బహుమతులు తేవడం (మెక్సికన్ చిత్రం)




మాంటేజుమా యింటి కప్పుమీద నుంచుని ఆజ్టెక్కులతో మాట్లాడేడు (సమకాలీన చిత్రం)

అదే ఘోరమైన తప్పు అయిపోయింది. బంగారం తెల్లవాళ్లకి మరింత పిచ్చెక్కించేసి ఆశపోతులుగా చేస్తుంది. కాని ఆజ్టెక్కులకది తెలియదు. తెలుసుకునే మార్గమూ లేదు. యేమంటే ఎర్ర యిండియన్లూ, తెల్లవాళ్లూ వేర్వేరు యుగాలకి చెందిన మనుషులు.

బండి చక్రాలంతేసి బంగారు పళ్లేలనీ, బంగారు నగలనీ, బొమ్మలనీ యిచ్చి, మాంటేజుమా తన రాయబారుల్ని పంపాడు.

యీ సంపదనంతటినీ గొయ్యితీసి పూడ్చిపెట్టి వుంటే తెలివైన పని అయివుండేది!

కార్టెజ్, అతని మనుషులూ యీ బంగారాన్ని చూస్తారు. అంతే, ఆజ్టెక్కులకి మూడింది.

కార్టెజ్‌ని తిరిగి తన దేశానికి వెళ్లిపొమ్మని రాయబారులు ప్రాధేయపడ్డం వృధా అయింది.

కార్టెజ్ బృందం భూభాగంలోకి చొచ్చుకువస్తే చాలా కష్టనష్టాలని భరించాల్సివస్తుందని బెదిరించడం వృధా అయింది.

అంతకుముందు స్పానిష్‌వాళ్లు మెక్సికోలోని బంగారాన్ని గురించి కథలు విన్నారంతే, యిప్పుడు కళ్లారా చూస్తున్నారు. వాళ్ల కళ్లు దురాశతో వేడెక్కిపోయాయి, ఆ కథలు నిజమే!

రాయబారుల మాటలు వాళ్లకి తెలివితక్కువతనంగా కనిపించాయి. వాళ్లు ఆశించింది అంత దగ్గర్లో వుంటే వాళ్లు మళ్లీ సముద్రంమీద ప్రయాణం కట్టి వెళ్లిపోవడమా!

అలా చెయ్యడం పిచ్చిపని కాదూ! అంత దూరం సముద్ర ప్రయాణంలో వాళ్లు యెన్ని బాధలు పడ్డారు! రాళ్లల్లాంటి బిస్కట్లు, తొడతొక్కిడిగా వుండే ఓడగదులా, నడుములు విరిగిపోయేటట్టు తారు పగ్గాలని లాగడమా, తుఫాన్లా, తెరచాపలని ముడచడమా, ఒకటా, ఎన్ని బాధలు! అయినా తమ ముందున్న ఐశ్వర్యం కోసమని కదూ వాటి నన్నిటినీ భరించింది.

దాడి చెయ్యడంకోసం తరలి వెళ్లాలని కార్టెజ్ తన మనుషులకి ఆజ్ఞ జారీచేశాడు. తమ బానిసల వీపులమీద ఆయుధాలనీ, ఆహారపదార్థాలనీ చేర్చారు. పశువుల్లాగా మారిపోయిన ఆ మనుషులు ఒగరుస్తూ మూలుగుతూ రోడ్డు మీద కాళ్లు యీడ్చుకుంటూ పోయారు. కాని వాళ్లు యెలా నిరోధించగలరు? వెనకబడిపోయిన వాళ్లనేమో తెల్ల వాళ్లు కత్తులతో తరముతున్నారు, ఎదురు తిరిగిన వాళ్ల తలలని తరుగుతున్నారు.

యీ మొదటి యాత్రని చిత్రించే ఆజ్టెక్ చిత్రం ఒకటి దొరికింది. కొల్లాయి గుడ్డలు కట్టుకున్న మనుషులు మూడు రోడ్లమీద నడుస్తూ వుంటారు. ఒకడు వీపుమీద ఫిరంగి బండి చక్రాన్నీ, యింకొకడు మోపుగట్టిన తుపాకీ లనీ, మూడో వాడు ఆహారపదార్థాల పెట్టెనీ మోస్తూ వుంటారు. ఒక స్పానిష్ అధికారి ఒక ఎర్ర యిండియన్ నెత్తి మీద దుడ్డుకర్రని యెత్తి పట్టుకుని వుంటాడు. అతను ఎర్ర యిండియన్ జుట్టు పట్టుకొని డొక్కతో తంతూ వుంటాడు. పక్కనే కొండమీద ఏసుక్రీస్తు సిలువ ప్రతిమ వుంది.

విజేతలు తాము ''యోగ్యులైన కాథలిక్కుల''మని అనుకునేవాళ్లు. ఆ జయించిన దేశాలకి శిలువని తీసుకుని వెడుతూ వుండేవాళ్లు.

నరికేసిన ఎర్ర యిండియన్ల తలలూ, చేతులూ బొమ్మలో అటూ యిటూ చెల్లాచెదురై పడిపోయి వున్నాయి.

స్వేచ్ఛాయుతులైన ఎర్ర ఇండియన్లు యీ విధంగా మనిషిని మనిషి అణగదొక్కడ మనేదాన్ని మొదటి సారిగా చూశారు.

మొత్తంమీద స్పానిష్‌వాళ్లు ముందుకు వెళ్లారు. అప్పుడొక ఎత్తైన కొండ కనుమనుంచి ఒక సరస్సునీ, దాని మధ్యలో వున్న రాజనగరాన్నీ వాళ్లు చూశారు.

ఆజ్టెక్కులు యేమీ ఎదిరించకపోవడంవల్ల యీ ''అతిథులు'' నగర ప్రవేశం చేశారు. వాళ్లు మొట్టమొదట చేసిన పని తమ ఆతిథేయుడైన యోధుల పెద్ద మాంటేజుమాని బంధించడం.

కార్టెజ్ ఆజ్ఞ మేరకి మాంటేజుమాని శృంఖలాలతో బంధించారు. తమ ఖైదీ స్పెయిన్ రాజుకి సామంతునిగా వుండేటట్టు ప్రమాణం చెయ్యాలని కార్టెజ్ అధికారంతో అడిగాడు. ఆ ఖైదీ తనని వల్లించమని చెప్పిన మాట లన్నిటినీ తు. చ. తప్పకుండా వల్లించాడు. రాజు అంటే యేమిటో, ఒట్టు అంటే యేమిటో అతనికి తెలిస్తే కదా.

తాను నెగ్గినట్టేనని కార్టెజ్ భావించాడు. మెక్సికో రాజుని తను జయించానని అతను అనుకున్నాడు. ఓడి పోయిన రాజు స్పెయిన్ రాజుకి తన అధికారాన్ని అప్పగించడంతోటే అంతా దివ్యంగా జరిగిపోయింది. అదీ కార్టెజ్ అను కున్నది. కాని అతను చాలా ఘోరంగా పొరబడ్డాడు. మాంటేజుమాకి స్పానిష్ పద్ధతుల గురించిన జ్ఞానం యెంత వుందో కార్టెజ్‌కి మెక్సికో పద్ధతుల గురించిన జ్ఞానమూ అంతే వుంది. అతను మాంటేజుమాని రాజు అనుకున్నాడు, కాని వాస్తవానికి మాంటేజుమా యోధుల పెద్ద, తన దేశపు పాలనాధికారం యేదీ అతనికి లేదు.

కార్టెజ్ తొందరపడిపోయి విజయోత్సవం జరిపేసుకున్నాడు.

అతను అనుకోని విధంగా అజ్టెక్కులు ఓ పని చేశారు. వాళ్ళు మాంటేజుమా సోదరుణ్ణి యోధుల పెద్దగా యెన్నుకున్నారు.

స్పానిష్‌వాళ్ళు మకాం వున్న పెద్ద యింటిమీదకి అతను తన యోధులచేత దాడి నడిపించాడు.

స్పానిష్‌వాళ్ళు ఫిరంగులతోటీ, తుపాకులతోటీ పోరాడారు.

అజ్టెక్కులు రాళ్లతోటీ, విల్లులతోటీ, బాణాలతోటీ పోరాడారు. ఫిరంగి గుండూ, తుపాకీ గుండూ బాణం కంటేనూ, రాతి కంటేనూ బలమైనవి కదా. కాని అజ్టెక్కులు తమ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నారు. వాళ్లని యేదీ అడ్డలేకపోయింది. పదిమంది చచ్చిపోతే వాళ్ల స్థానంలో వందమంది వచ్చేవాళ్ళు. సోదరుడికి ప్రతీకారంగా సోద



బందీలైన ఎర్ర ఇండియన్ తెగల వాళ్లని స్పానిష్‌వాళ్ళు తీసుకుపోవడం

రుడు, అల్లుడికి ప్రతీకారంగా మామ. మృత్యువంటే యెవళ్ళకీ భయంలేదు. తన తెగా, తన గణం ప్రమాదంలో వున్న ప్పుడు అజ్టెక్‌కి జీవితమంటే తృణప్రాయం.

పరిస్థితి విషమిస్తోందని గమనించిన కార్టెజ్ అజ్టెక్కులతోటి రాజీ బేరాలు సాగించాలని నిర్ణయించుకున్నాడు. మెక్సికో రాజుకాబట్టి, మాంటేజుమాయే, ఉత్తమమైన రాయబారి అవుతాడని అతను భావించాడు. తన వాళ్ళని ఆయుధాలు కింద పడెయ్యవలసిందిగా ఆజ్ఞాపించమని మాంటేజుమాని అడిగాడు.

స్పానిష్‌వాళ్ళు మాంటేజుమా శృంఖలాలని విప్పారు. అతన్ని ఒక యింటి చదును కప్పుమీదకి తీసికెళ్లారు. కాని అక్కడ అతనికి పిరికివాడికీ, దేశద్రోహికీ జరిగే మర్యాద జరిగింది. బాణాలూ, రాళ్ళూ అతనిమీద వర్షంలా కురిసాయి. అన్ని వేపులనుంచీ అరుపులూ, కేకలూ ఆకాశం అంటాయి:

''ఛప్, నీచుడా! నువ్వు యోధుడివా? నువ్వు గాజులు తొడుక్కున్న ఆడదానివి, కదుళ్ళు వడుక్కో. యీ కుక్కలు నిన్ను బందీగా పట్టుకుంటారా? నువ్వు పిరికివాజమ్మవి!''

తీవ్రమైన గాయాలు తగిలి, మాంటేజుమా ఒరిగిపోయాడు.

దాడిచేసేవాళ్ల శ్రేణుల్లోనుంచి చావుతప్పి కన్ను లొట్టపోయినట్టుగా కార్టెజ్ అతికష్టంమీద పోగలిగాడు. అతని మనుషులు సగంమంది హతులైపోయారు. అతని అదృష్టం బాగుండి అజ్టెక్కులు అతన్ని తరిమి వెంటాడలేదు. లేకపోయివుంటే అతను ప్రాణంతో తెనోక్టిట్లాన్‌నుండి బయటపడివుండేవాడు కాదు.

అజ్టెక్కులు అతన్ని పారిపోనిచ్చి మరో ఘోర తప్పిదం చేశారు. ఏమంటే కార్టెజ్ మళ్లీ సైన్యాన్ని కూడగట్టుకుని తెనోక్టిట్లాన్‌ని ముట్టడించడానికి తిరిగివచ్చాడు.

అజ్టెక్కులు సాహసోపేతంగా స్పానిష్‌వాళ్లనుంచి తమ పట్టణాన్ని రక్షించుకోడానికి కొన్ని నెలలు యుద్ధం చేశారు. కాని వాళ్ల విల్లులూ, బాణాలూ ఫిరంగుల ముందు యేపాటి? తెనోక్టిట్లాన్ ఆఖరికి ఓడిపోయింది, పతనం అయిపోయింది.

ఇనుము యుగానికి చెందిన వాళ్లు రాగి యుగానికి చెందిన వాళ్లని ఓడించారు. పురోగమించే నూతన వ్యవస్థ ముందు పాత వ్యవస్థ తగ్గాల్సివచ్చింది.

# ప్రకరణం పదకొండు

## మాయా పాదరక్షలు

19వ శతాబ్దం నాటి కథ ఒకటి వుంది. ఒక యువకుడు వుంటాడు. అతనికి మామూలుగా అందరికీ అమ్మే చెప్పలు కాకుండా మాయా పాదరక్షలని అమ్ముతారు. యీ కథలోని కుర్రాడు కొంచెం పరాకుగా వుండి యీ సంఘటనని వెంటనే గమనించడు. సంతనుంచి యింటికి పోతూవుంటే అతను దీర్ఘాలోచనలో మునిగిపోతాడు. హఠాత్తుగా అతనికి విపరీతమైన చలి పుట్టేస్తుంది. అతను చుట్టూతా చూస్తే యేముందీ! అంతా మంచే, పాలిపోయిన ఎర్రని సూర్యుడు ఆకాశం అవతల కుంగిపోతున్నాడు. జరిగిన దేమిటంటే అతను గమనించకుండానే ఆ చెప్పలతన్ని ఆర్కిటిక్ వలయం అవతలికి తీసుకు పోయాయి!

యీ అద్భుతమైన వస్తువునుంచి వేరే యెవళ్లేనా అయితే వీలైనంత లాభం కొట్టేసి వుండేవాళ్లు. కాని యీ కథలోని యువకుడికి డబ్బుమీద ఆసక్తే లేదు. అతనికి విజ్ఞానశాస్త్రమంటే ఆసక్తి. అంచేత యీ అదృష్టాన్ని విని యోగించుకుని ప్రపంచాన్ని గురించి మొత్తం తెలుసుకోవాలని నిర్ణయించుకున్నాడు. తన మాయా పాదరక్షలతోటి అతను ఉత్తరాన్నుంచి దక్షిణాదికి, దక్షిణాదినుంచి ఉత్తరాదికి సంచారం చేశాడు. శీతాకాలంలో సైబీరియా అడవుల నుంచి ఆఫ్రికా ఎడారులకి వెళ్లాడు. రాత్రిళ్లు తూర్పు అర్ధగోళంనుంచి పశ్చిమార్ధగోళం వేపు వెళ్లాడు.

దుమ్ము కొట్టుకుపోయిన నల్లని చొక్కాతోటీ, దొరికిన వాటిని పోగేసుకోడానికి భుజాన సంచీతోటీ అతను ఒక ద్వీపంనుంచి యింకో ద్వీపానికి, ఆస్ట్రేలియానుంచి ఆసియాకి, ఆసియానుంచి అమెరికాకి మెట్లెక్కినట్టు వెళ్లాడు.

పర్వతంమీదనుంచి పర్వతంమీదకి భగభగ మండే అగ్నిపర్వతాలమీదనుంచి హిమ శిఖరాలమీదకి అలవోకగా గెంతుతూ అతను ఖనిజాలనీ, గరికల్నీ పోగుచేశాడు. ప్రాచీన గుళ్లనీ, గుహలనీ పరిశీలించాడు, భూమినీ సజీవమైన ప్రతిదాన్నీ అధ్యయనం చేశాడు.

మానవ జీవితాన్ని అధ్యయనం చేసే చరిత్రకారుడికి కూడా మాయా పాదరక్షలుండాలి. యీ పుస్తకపు పేజీల మీద మనం ఒక ఖండంనుంచి యింకో ఖండానికి, ఒక యుగంనుంచి యింకో యుగానికి వెళ్లాం.

పెద్ద జాగాల మధ్య అంతరాలు దూసుకుపోయినప్పుడూ, కాలం ఊపిరిసలపకుండా యెగిరిపోయినప్పుడూ మనకి కళ్లు తిరిగాయి. అయినా మనం ఆక్కుండా పోయాం. మామూలు పాదరక్షలు తొడుకున్న వాళ్ల మాదిరీ ఆగి ఆగి అన్నిటినీ విమర్శగా చూసుకుంటూ, ఆగుతూ పరిశీలించలేకపోయాం మనం.

యుగాలమీదనుంచి గెంతుకుంటూ పోయినప్పుడు కొన్ని విషయాలు దృష్టిపడకుండా పోయివుండవచ్చు. మనం మన మాయా పాదరక్షలని ఒకక్షణం తీసేసి, మామూలుగా అడుగులేసుకుంటూ వెళ్లినట్లయితే, విడివిడి అంశాల రాశినుంచి యివతలికి వచ్చి దారిలో పడి వుండేవాళ్లం కాదేమో. అడవిలోని ప్రతి చెట్టునీ మీరు సూక్ష్మంగా పరిశీలించ మొదలుపెడితే మీరు చెట్లనేగాని అడివిని చూడలేరు.



నెగడుని జాగ్రత్తగా చూసే ఆడదేవతని చిత్రించే మట్టి బొమ్మలు (రాతి యుగం)

మనం మాయా పాదరక్షలతోటి యుగంనుంచి యుగానికే కాదు, విజ్ఞానశాస్త్రంనుంచి విజ్ఞానశాస్త్రాని క్కూడా వెళ్లాం.

మనం వృక్ష, జంతుశాస్త్రంనుంచి భాషాశాస్త్రం దగ్గరికి వెళ్లాం, భాషాశాస్త్రంనుంచి పనిముట్ల చరిత్రకి, పని ముట్ల చరిత్రనుంచి విశ్వాసాల చరిత్రకి, మత చరిత్రనుంచి భూమి చరిత్రకి వెళ్లాం.

యిది తేలికైన పని కాదు. కాని వేరే మార్గం లేదు. మానవుడు తనకి ఉపయోగపడటం కోసమే శాస్త్రాలని సృష్టించుకున్నాడు. భూమ్మీద మానవుని చరిత్రని గురించి చెప్పుకునేటప్పుడూ, ప్రపంచంలో అతని స్థానాన్ని గురించి చెప్పుకునేటప్పుడూ అన్ని శాస్త్రాలూ అవసరమే.

అమెరికామీద స్పానిష్ దాడి జరిగిన సమయంలో యిప్పుడే మనం అక్కడ వున్నాం.

క్రీ. పూ. 4000–3000 యేళ్ల నాటి యూరప్‌కి వద్దాం. ఇరాక్వ్యాల, ఆజ్టెక్కుల్లాంటి తెగలే మనకి కనిపిస్తాయి. సామూహిక ''పొడుగాటి యిళ్లూ,'' అక్కడ ఆడవాళ్లే అన్నీ నిర్వహించడమూ మనకి కనిపిస్తాయి.

ఆడవాళ్లకి యిక్కడ గౌరవం వుంది. వాళ్లే యింటినీ తెగనీ నిలబెట్టేవాళ్లు. శీతాకాలపు ఆహార నిల వలని వాళ్లే జాగ్రత్త చేస్తారు. వాళ్లే భూమిని దున్నుతారు, విత్తనాలు నాటతారు, పంటని కోస్తారు.

ఆడవాళ్లు మగవాళ్లకంటే చాలా యెక్కువ పనిచేస్తారు. వాళ్లకి గౌరవమూ అలాగే లభిస్తుంది. అందుకనే ప్రతి యింటిలోనూ, ప్రతి గ్రామంలోనూ యెముకమీదగాని, రాతిమీదగాని చెక్కిన స్త్రీ ప్రతిమ వుంది. అది తెగకి ప్రతిబింబమైన మాతృమూర్తి అన్నమాట. ఆమె శక్తి యింటిని కాపాడేది. పుష్కలంగా పంటని యిమ్మనీ, శత్రువుల బారినుండి కాపాడమనీ ప్రజలావిడని ప్రార్థించేవాళ్లు.

గృహాన్ని కాపాడే యీ మాతృమూర్తి శతాబ్దాల తర్వాత గ్రీకు నగరం ఏథెన్స్‌లో ప్రత్యక్షమైంది. ఆమె అక్కడ చేతిలో బల్లెం ఆయుధం గల, గ్రీకు దేవత అథీనాగా అంటే నగరాన్ని రక్షించే దేవతగా మారింది. తన పేరున్న ఏథెన్స్ నగరాన్ని కాపాడే యీావిడ విగ్రహం చాలా పెద్దది, వూరికే చిన్న బొమ్మ కాదు.

## పాత భవనంలోని మొదటి బీటలు

మన పూర్వపు సామూహిక జీవిత అవశేషాలని మన భాష నిలబెట్టింది.

పిల్లలు కొత్తవాళ్లని ''అత్త'', ''మామ'' అనీ, పెద్ద వాళ్లని ''తాత'', ''మామ్మ'' అనీ పిలవడం తెగ సమాజంలో అందరూ బంధువులుగా వుండేనాటి అవశేషం.

ఏథెన్స్ నగర పాలక దేవత



అలాగే మనం తరచుగా కొంతమందిని సంబోధించేటప్పుడు ''సోదరు''లంటాం, చిన్న పిల్లలని ''బాబులూ'' అంటాం వాళ్లు మన కొడుకులు కాకపోయినా.

ప్రాచీన కాలపు చిహ్నాల్ని మిగతా భాషలు కూడా నిలబెట్టుకున్నాయి. జర్మనీలో ''సోదరుల పిల్లలు'' అనడానికి బదులుగా ''మా మేనల్లుళ్లు'' అంటూ వుంటారు. సోదరి బిడ్డలే తెగతో వుండి, సోదరుడి బిడ్డలు అతని భార్య తెగతో కలిసిపోయే సంప్రదాయం, యేనాడో మరిచిపోయిన నాటిది, యిది. సోదరి బిడ్డలు బంధువులు ''మేనల్లుళ్లూ, మేనకోడళ్లూ'', సోదరుడి బిడ్డలు కారు. వాళ్లు వేరే తెగవాళ్లు.

ప్రాచీన సాక్స్ రాజ్యంలో రాజుకి వారసుడు సోదరి కొడుకు, తన కొడుకు కాదు.

మొన్నీ మధ్య దాకా, గత శతాబ్దంలో కూడా, ఆఫ్రికాలో అషాంతీ జాతి వుండేది. వాళ్లు రాజుని ''నానె'' అనేవారు. అంటే ''అమ్మలకి అమ్మ.''

మధ్య ఆసియాలోని సమర్‌ఖండ్‌లో రాజుని ''అఫ్షిన్'' అని పిలిచారు. పూర్వం రోజుల్లో దాని అర్థం ''యింటి యజమానురాలు'' అని.

మాతృస్వామిక సమాజపు స్మృతిని ప్రజల మనస్సులు యెలా నిలుపుకున్నదీ చూపించడానికి యింకా చాలా ఉదాహరణలు మనకి దొరుకుతాయి. ఆ సమాజంలో తల్లి యజమానురాలు, గృహరాజ్ఞి.

ప్రజలు అంత కాలం దాన్ని గుర్తుంచుకున్నారంటే ఆ తెగ చాలా బలమైన దన్నమాట. కాని ఆ తెగని యేది నాశనం చేసింది?

అమెరికాలో యూరపియన్ల రాకతోటి ఆ జీవిత విధానం నాశనం అయింది. అమెరికాని కనిపెట్టడానికి వేల సంవత్సరాల ముందే యూరప్‌లో, చెదలుపట్టిన యిల్లు కూలిపోయినట్టుగా, యీ వ్యవస్థ కూలిపోయింది.

మగవాళ్లు యింకా యింకా యెక్కువగా తెగ వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడం దగ్గర యిదంతా మొదలైంది.

ఆదినుంచీ కూడా మగవాళ్లు పశుపోషణలో వుంటే, ఆడవాళ్లే భూమిని దున్నేవారు. పశుగణాలు చాలా తక్కువ వున్నప్పుడు భూమిని దున్నే ఆడవాళ్ల పని చాలా ముఖ్యమైంది. అప్పుడు మాంసం చాలా తక్కువగా వుండేది, సరిపడా పాలూ వుండేవి కావు. ఆడవాళ్లూ వాళ్ల ధాన్యం గింజలూ లేకపోయినట్లయితే తిండికి యేమీ వుండేది కాదు. ఒకో

అప్పుడు ఓ గుప్పెడు గింజలో, పల్చటి బార్లీ రొట్టో మాత్రమే ఆహారం. దీనికి అడవిలో దొరికిన తేనే, చేసి ఆడవాళ్లు పోగుచేసిన పళ్లూ జత అయేవి. ఆడవాళ్లే ఆరకంగా గృహనిర్వహణ చేసేవాళ్లు. గృహాన్ని యేలేవాళ్లు.

అన్ని వేళలా అలా జరిగేది కాదు. పచ్చికమైదానంలో ధాన్యాలని పెంచడం చాలా కష్టమయ్యేది. మైదానాల్లో యేపుగా పెరిగే అడవి తృణాలు ధాన్యపు గింజలకి జాగా యివ్వకుండా పెరిగిపోయేవి. వాటి వేళ్లు భూమిలో లోతుగా చొచ్చుకుపోయేవి. పలుగో పారో నేలని తవ్వినా, లోపలికి పోయేవి కావు. అడుగున గట్టి నేల, యెన్నడూ దున్నడానికి వీలుపడని నేల వుండేది.

అంచేత ముగ్గురు నలుగురు ఆడవాళ్లు పలుగుని పట్టుకుని పని చేసేవాళ్లు. అయినా పైపొరని మాత్రమే గీక గలిగేవాళ్లు.

తగినంత లోతులేని చాలులో విత్తిన గింజలు ఎండకి ఎండిపోయేవి. పకులు వాటిని తినేసేవి. మొలక లెత్తేవి చాలా తక్కువ, చాలా పల్చన.

వర్షాభావంతోటి లేత మొక్కలు చచ్చిపోయేవి. గట్టిగా వుండే కలుపు మొక్కలు బతికిపోయేవి.

కోత కాలం వచ్చేటప్పటికి ఆడవాళ్లకి కోసేందుకేమీ మిగిలేది కాదు. పొడుగాటి కలుపు మొక్కల్లో వాళ్లకి ధాన్యపు కంకులు కనిపించేవే కావు. ఓడగొట్టినా, తిరిగి నెగ్గుకొచ్చిన శత్రు సైన్యపు జెండాలల్లా పచ్చిక బీటి గడ్డి కాండాలు గాలిలో వూగిపోయేవి.

ధాన్యానికి బదులు కలుపు మొక్కలు! నడుములు విరగ్గొట్టుకుని పడ్డ శ్రమకి ఫలితం యిదా?

మనుషులకి కలుపు అయినా పశువులకి మేతే. ఆవులూ, గొర్రెలూ మైదానాల్లో తృప్తిగా జీవించాయి. వాటికి యెక్కడ పడితే అక్కడ విందే.

సంవత్సరం సంవత్సరానికీ మందలు పెరిగాయి. బాకులు మొలల్లో దోపుకుని ఓ మగవాడు వాటిని అనుసరించే వాడు. గొర్రెల కాపరి నమ్మకమైన మిత్రమైన కుక్క మందని కాపలా కాస్తూ అవి చెదిరిపోకుండా చూడ్డంలో అతనికి సాయపడేది. మందలు యింకా వేగంగా వృద్ధిపొందాయి. మనుషులకి పాలూ, మాంసమూ, వున్నీ ప్రతి సంవత్సరమూ యెక్కువగా యిచ్చేవి.

యిప్పుడు యింట్లో ధాన్యం సరిపడా లేకపోయినా, గొర్రెపాలతో లభించేవి మాత్రం పుష్కలంగా వున్నాయి. వంటయింటి కుండల్లో లేగ మాంసం కుతకుత ఉడికేది.

పచ్చిక మైదానాల్లో గొర్రెలని కాసే మగవాడి పని ప్రాముఖ్యం సంతరించుకుంది.

ఉత్తర అరణ్యాల్లో కూడా మగవాడు తెగకి నాయకుడిగా అవడం మొదలెట్టాడు.

స్వీడెన్‌లో ప్రాచీన పర్వత సానువుమీద చెక్కిన భూమిని హాలికుడి బొమ్మ దొరికింది. ఆ బొమ్మ



స్వీడెన్‌లో ఒక శిఖరంమీద హాలికుడి చిత్రం బయటపడింది



కెనడా ఎఱ్ఱ ఇండియన్ల లాగుడు బండి

బాగా లేదు. దున్నేవాడు చిన్న పిల్లలు గీసే హాస్యగాడి బొమ్మలా వున్నాడు. సరే అది బాగుంటే మనకేం, బాగా వుండకపోతే మనకేం గాని, మనకి బొమ్మతో పెద్ద పని లేదు. అది ఒక ఆధారంగా మాత్రమే మనకి ముఖ్యం. అందులో వున్నదేమంటే నాగలి వెనక దున్నేవాడున్నాడు. నాగలిని రెండు ఎద్దులు లాగుతున్నాయి.

మానవ జాతి చరిత్రలో బహుశా యిదే మొదటి నాగలి అయివుంటుంది. అది యింకా పలుగు మాదిరీ వుంది. తేడా ఏమిటంటే దానికి ఒక పొడుగాటి కఱ్ఱని కట్టారు, మనుషులు కాకుండా ఎద్దులు దాన్ని లాగుతున్నాయి.

అంచేత మానవుడు మొట్టమొదటి ''మోటారు''ని కనిపెట్టాడన్నమాట. నాగలికి కట్టిన ఎద్దు మరి నిజంగా సజీవమైన మోటారే, యీ నాటి మన ఉక్కు ట్రాక్టరుకి సజీవ ప్రాచీనుడే కదా. ఎద్దు మెడమీద నాగలి కాడిని మానవుడు పెట్టినప్పుడు తన బరువుని జంతువుకి బదలాయించాడన్నమాట. ఆరకంగా మానవుడికి పాలూ, మాంసం, చర్మం యిచ్చిన పశువు అతనికి శక్తిని కూడా యిచ్చింది.

మెడలమీద కఱ్ఱ కాడితోటి మందంగా, బలంగా నడిచే ఎద్దులు మొదటి కొయ్య నాగళ్లని లాగడం మొదలెట్టాయి. యీ నాగళ్లు పలుగుల కంటే లోతుగా భూమిలోకి చొచ్చుకుపోయేవి. తిరగబడిన మట్టి నల్లని రిబ్బను లాగా పరచుకుని వుంది.

తొలి సేద్యగాడు తన శక్తినంతటినీ నాగలి కొయ్యమీద ఆన్చి వుంటాడు.

యిప్పుడు అతని బరువుని ఎద్దు తీసుకుంది. ఎద్దు నేలని దున్నేది. ధాన్యం నూర్చేది. దాన్ని యింటికి చేరవేసేది. ఆకురాలుకాలంలో నూర్పిడి కళ్లాల్లో ఎద్దులు తమ గిట్టలతో ధాన్యాన్ని నూర్చేవి. అప్పుడు ధాన్యం బస్తాలు నింపిన బళ్లని యిళ్లకి లాక్కొచ్చేవి. ఆ బళ్లకి చక్రాలు లేవు. అవి లాగుడు బళ్లు.

వ్యవసాయానికి పశుపోషణ అనుబంధమైంది. పశుపోషకుడు నేలని దున్నేవాడుగానూ మారాడు. దాంతోటి యింట్లో అతనికి యింకా యెక్కువ అధికారమూ వచ్చింది.

ఆడవాళ్లకి వాళ్ల పూర్తివాటా పని వున్న మాట నిజమే. వాళ్లు దారం తీసేవాళ్లు, బట్టలు నేసే వాళ్లు, పంట కోసేవాళ్లు, పిల్లల్ని పెంచేవాళ్లు.

కాని వాళ్లకి పూర్వపు అధికారమూ, హోదా పోయాయి. మగవాళ్లే పచ్చికబీళ్లమీదా పొలాలమీదా యజమానులు. వాళ్లకేదేనా అయిష్టంగా కనిపించినప్పుడు యిదవరలో లాగా ఆడవాళ్లు మగవాళ్లమీద గంయ్యిమని రంకెలెయ్యడం మానేశారు. మగవాళ్లు ఎదురు తిరిగి మాటకి మాట బదులు చెప్పేవాళ్లు, వూరికే తమని సమర్థించుకోవడం మేరకే కాదు. పూర్వం అత్తగార్లకీ, పినతల్లులకీ, అమ్మమ్మలకీ మగాణ్ణి యింట్లోంచి తరిమెయ్యడం అతితేలికైన పనిగా వుండేది. యిప్పుడు వాళ్లు యీ పరాయివాణ్ణి మన్నించడం మొదలుపెట్టారు, యేమంటే యింకో తెగనుంచి తమ కుటుంబంలోకి వచ్చిన వాడు తమకోసం అన్నీ చేసి పెడుతున్నాడు, తమ తెగకి తిండి పెట్టడానికి సహాయ పడుతున్నాడు. యిప్పుడు తమ మగాళ్లని వేరే తెగలకి అప్పగించడానికి ఏ తెగా ఆసక్తి కనబర్చడం లేదు.

తెగలమీద అధికారం సంపాదించడం కోసమని మగాళ్లు తమలో తాము సైనిక సంధులు కుదుర్చుకున్నారు.

అంతకుముందు మగవాడు చనిపోతే అతని సోదరి పిల్లలు న్యాయమైన వారసులయ్యేవాళ్లు. యీ గణన్యాయాన్ని మగాళ్లు మార్చాడానికి ప్రయత్నించారు.

టుయారెగ్ తెగ అనేది ఆఫ్రికాలో ఓ సంచార తెగ. వాళ్లల్లో వారసత్వం అనేది ''ధర్మబద్ధమైంది'' ''యితరమైంది'' అని రెండుగా విభజితమై వుంది. ''ధర్మబద్ధమైన'' వాటా సోదరి పిల్లలకి చెందేది. అందులో మృతునికి తన తల్లినుంచి సంక్రమించినవి, ఉమ్మడి గృహంలో పని చేసేటప్పుడు పోగు పడినవి అన్నీ వుండేవి. ''యితరమైం'' దాంట్లో యుద్ధ పతకాలూ, వ్యాపారంద్వారా పోగుపడిన ప్రతీదీ వుండేవి. అవి అతని సొంత పిల్లలకి చెందేవి.

మాతృస్వామిక సమాజం వేల సంవత్సరాలు సాగింది. అప్పుడు, పాత కాలపు ఓక్ చెట్టులాగా, పాత జీవిత విధానం బీటలు తీయడం ప్రారంభించింది.

యింకా యింకా యెక్కువగా తెగలోని మనుషులు పాత పద్ధతులకి వ్యతిరేకం అయిపోవడం మొదలుపెట్టారు.



ఎద్దుల్ని నాగళ్లకి కట్టేవాళ్లు (ఈజిప్షియన్ చిత్రం)

అంతకుముందు, భార్య భర్తని తన కుటుంబంలోకి యిల్లరికం తెచ్చుకునేది. యిప్పుడు భర్త భార్యని తన యింటికి తెచ్చుకుంటున్నాడు.

యీ పద్ధతి పాత విధానానికి వ్యతిరేకంగా వుండబట్టి అలా ఆచారాన్ని ఉల్లంఘించిన వాణ్ణి దోషిగా చూసేవాళ్ళు.

ఏ యువకుడూ మరో తెగ అమ్మాయిని చెయ్యిపట్టుకుని వూరికే తీసుకుపోకూడదు. ఆమెని ఎత్తుకుపోవాలి, దొంగిలించాలి. ఆ యువకుడికి భార్యగా ఎంచుకున్న అమ్మాయి యింటికి అర్ధరాత్రి ఆ యువకుడూ, అతని బంధువులూ బల్లేలూ, బాకులూ పట్టుకుని దొంగతనంగా చేరేవాళ్ళు. కుక్కలు మొరిగి మొత్తం యింట్లో వాళ్లంతా లేచేవాళ్ళు. ఆ పెళ్లికూతురి తలపండిన తాతా, మీసాలూ గడ్డాలూ రాని అన్నదమ్ములూ ఆయుధాల కోసం పరిగెత్తేవాళ్ళు. మగవాళ్ల యుద్ధారావాల్లో ఆడవాళ్ల యేడుపులు కలిసిపోయేవి. ఆఖరికి పెళ్లికొడుకు తన సజీవ సంపద అయిన పెళ్లి కూతుర్ని తీసుకుని, తన తెగవాళ్ల ముసుగు కింద పారిపోయేవాడు.

సంవత్సరాలు గడిచాయి. తెగ ధర్మాన్ని యిలా ఉల్లంఘించడం తెగ ఆచారమైంది. పెళ్లికూతురి వాళ్లకీ, పెళ్లి కొడుకు వాళ్లకీ మధ్యన ''పోరు'' తంతుగా మారింది.

రక్తం బదులుగా బహుమతులూ, సుంకాలూ వచ్చాయి. యేడుస్తూవుండే తల్లీ, అక్కచెల్లెళ్ళూ, స్నేహితులూ కూడా యీ వివాహపు తంతులో పాల్గొనేవాళ్ళు. పెళ్లి పెద్దవిందుతో ముగిసేది.

పాతకాలపు విచారకరమైన పెళ్లి పాటలు గుర్తున్న వాళ్లు యింకా వున్నారు. ఆ పాటల్లో పరాయి తెగలోకి వచ్చిన ఆడపిల్ల తన దురదృష్టానికి విలపిస్తుంది.

ఆమె అదృష్టం చూసి యెవళ్లకీ కళ్లు కుట్టక్కర్లేదు. ఆమె కొత్త యింట్లో భర్త కృపాపాత్రురాలై వుండాలి. ఆమెకి తన గోడు చెప్పకోడానికి యెవరూ వుండేవాళ్లు కాదు. అత్త, మామ, ఆడబడుచులు అంతా అతని పక్షమే వుండే వాళ్ళు. ఎవడేనా యువకుడు పెళ్లికూతుర్ని యింటికి తెచ్చాడూ అంటే యింకో పనిమనిషిని యింటికి తెచ్చినట్టే. ఆమె ఒక్క క్షణం కూర్చుంటుందేమో, తన వాటా కంటే యెక్కువ తింటుందేమోనని అందరూ కాపలా కాసే వాళ్లే. తల్లే ప్రతీదీ శాసించే కుటుంబం తండ్రే యజమాని అయిన కుటుంబంగా మారింది.

పిల్లలు తల్లి తరపున వుండేవాళ్లు కాదు, తండ్రి వైపునుంచి వచ్చినట్టు చూసేవాళ్ళు. బంధుత్వం కూడా తండ్రి వేపునుంచి నిర్ణయమయ్యేది, తల్లి వైపునించి కాదు. రష్యాలో మనిషి పేరుకి ''ఫలానా వారి కొడుకు'' అని తండ్రి పేరు జతచేర్చడం మొదలెట్టారు.

ఆ రకంగా పితృనామాలు వచ్చాయి. అందుకనే ''పీటర్ ఇవానొవిచ్'' అంటున్నామంటే పూర్వం రోజుల్లో ''పీటర్, ఇవాన్ కొడుకు'' అని అర్థం.

## తొలి సంచారులు

ఒకసారి తను కనిపెట్టిన అద్భుతమైన గాదెనుంచి మానవుడు యింకా యింకా యెక్కువ బహుమతులని పొందుతూనే వున్నాడు. పచ్చికమైదానాల్లో వేలాది గొర్రెలు మేసేవి. మెత్తని నల్లరేగడి మట్టిని దున్నుతూ సేద్యగాళ్లు ఎద్దుల కేసి చూసి హేయ్ అని అరిచేవాళ్ళు.

సారవంతమైన లోయల్లో కమ్మని గాలులు వీస్తూంటే, మొదటి ఫలవృక్షాల తోటలూ, ద్రాక్షతోటలూ, వికసించాయి. సాయంత్రం వేళల్లో మనుషులు అత్తిపళ్ల చెట్లకింద కబుర్లాడుకునేందుకు చేరేవాళ్ళు.

మానవుడి శ్రమ అతనికి చాలా వరాలని యిచ్చింది. కాని అతను యిప్పుడు యింకా కష్టంగా, యింకా యెక్కువ సేపు పని చెయ్యాల్సి వచ్చేది. ప్రతి ద్రాక్షగుత్తీ, ప్రతి గోధుమ కంకూ మానవ శ్రమతోటి ఉబ్బినవే.

ద్రాక్షతోటల్ని పెంచడంలో చాలా కష్టభూయిష్టమైన శ్రమ వుండేది. బరువైన ద్రాక్షగుత్తులన్నిటినీ యేరాక వాటిని రాతి తిరగళ్లకింద పెట్టి రసం తీయాల్సి వచ్చేది. ద్రాక్షలు నలిగి పిప్పయిపోయేవి. వాటి రసం మేకతోలు సంచీల్లోకి పోయేది. మేకతోలు కప్పుకున్న దేవుడికి, అతను పడ్డ కష్టాలన్నిటికీ, ద్రాక్షసారాయి కోసం, ప్రజలు మంత్ర సంబంధమైన పాటలని పాడేవాళ్ళు.

నదీ ముఖాల్లో ప్రతి వసంతంలోనూ వరదనీరు భూమిని సారవంతం చేసేది. ప్రకృతే మంచి పంట దిగుబడికి పూతనిస్తూన్నట్టు వుండేది.

యిక్కడ కూడా సాగుదారుడి చేతులు వూరికే వుండేవి కావు. మనుషులు పొలాల్లో నీటిని వుంచడానికి అనకట్టల్లాంటి వాటిని కట్టేవాళ్ళు. నీరు ఎక్కువ అవసరమైన చోటకి దాన్ని మళ్లించడానికి గుంటలు తవ్వేవాళ్ళు.

ప్రజలు తమ భూమిని సారవంతం చేసినందుకు నదిని ప్రార్థించేవాళ్ళు. తమ కష్టభూయిష్టమైన శ్రమలేకపోతే అక్కడ కలుపు తప్ప మరేమీ పెరగదనే సంగతే మర్చిపోయారు.

కాలం గడిచే కొద్దీ భూమిని దున్నేవాడికి యింకా యింకా యెక్కువ బాధలు వచ్చాయి. పశుపోషకుడికి కూడా విశ్రాంతి తీసుకునే వ్యవధి వుండేది కాదు. పచ్చిక బీళ్ల పుష్కలమైన గడ్డి మేసి మందలు అతని కళ్ల ముందే వృద్ధి పొందుతున్నాయి. మంద పెద్దదయే కొద్దీ గొర్రెలకాపరి పని యెక్కువైంది. ఓ డజను గొర్రెల్ని కాసుకోవడం ఒకటి, వెయ్యి వున్న మందని కాయడం యింకోటి. పెద్ద మంద పచ్చిక బీటిని త్వరగా స్వాహాచేసేది, దాన్ని మిగతా చోటకి మేతకి తోలుకెళ్లాల్సి వచ్చేది, వూరికి యింకా యింకా దూరంగా పోవాల్సి వచ్చేది.



బరువైన ద్రాక్ష గుత్తుల్ని పోగు చేసాక వాటిని రాతి తిరగళ్లకింద పెట్టారు

మంగోలియన్ సంచారులు (ప్రాచీన చైనా చిత్రం)



కడకి గ్రామాలకి గ్రామాలు గుడిసెలని పీక్కుని మంద వెంటపోయేవి. మనుషులు గుడారాల్ని పీకి, వాటిని ఒంటెల వీపులమీద వేసి, ముందు తమ సజీవ సంపదని తోలుకుంటూ పోయేవాళ్లు. వాళ్లు బీటి భూముల్ని వదిలివెళ్లి పోయేవాళ్లు. వాటిమీద కలుపు మొక్కలు పెరిగేవి. కాని అలా వదిలిపెట్టి వెళ్లి పోతున్నందుకు వాళ్లు విచారించలేదు. యేమంటే యెండిపోయిన బీళ్లమీద మంచి దిగుబడి రాదు.

మొట్టమొదటి సారిగా చరిత్రలో ఒక తెగలోని మనుషుల మధ్యనే కాకుండా, అనేక తెగల మధ్య కూడా శ్రమ విభజన యేర్పడింది.

పచ్చికమైదానాల్లో పశువులని పెంచుకున్న గొర్రెల కాపరుల తెగలు బయల్దేరాయి. వాళ్లు వాటిని ధాన్యానికి బదలాయించుకునేవాళ్లు. వాళ్లు యెప్పుడూ ఒక చోట వుండేవాళ్లు కాదు, ఒక పచ్చిక బీటినుంచి యింకో పచ్చిక బీటికి అలా సంచారం చేస్తూనే వుండే వాళ్లు.

సంచారుల జీవితం అడ్డూ అయిపూ లేకుండా వుండేది.

వాళ్లు ఆరు బయట మైదానంమీద గుడారాలని వేసుకునేవాళ్లు. పైన ఆస్తరణ వినీల నక్షత్ర ఆకాశమే. విశాల మైన పచ్చిక బీడే నివాసం. వాళ్ల దీర్ఘ యాత్రల్లో పిల్లలకి ఒంటె మూపుల కదలికలే వుయ్యాలా జోలలు. అదే వాళ్లకి తెలిసిన వుయ్యాలా.

ఏమైనా, మనం ప్రస్తావించుకునే కాలంలో, గొర్రెల కాపరుల తెగల్లో నిజమైన సంచారులు యింకా చాలా కొద్ది మంది వుండేవాళ్లు.

# సజీవ పరికరం

సంచార తెగ జీవితం ప్రశాంతంగానూ వుండేది కాదు, నిమ్మకి నీరెత్తినట్టూ వుండేది కాదు. తమ సంచారంలో వాళ్లకి సేద్యగాళ్ల పొలాలూ, మందలూ తటస్థపడితే తాము సాగుచెయ్యని దాన్ని వాళ్లు బలవంతంగా లాగేసుకునే వాళ్లు. నదీ లోయలోకి విరుచుకుపడో, అడవి శివారు దాకా పచ్చిక బీటిమీదకి పోయో వాళ్లు దారిలో వున్న గ్రామాన్ని

తగల బెట్టి దోచుకునేవాళ్ళు, పంటల్ని ధ్వంసం చేసేవాళ్ళు, పశువుల్ని తోలుకుపోయేవాళ్ళు, గ్రామవాసుల్ని బందీలుగా పట్టుకునేవాళ్ళు.

వాళ్ళకి బందీలు యెక్కువగా కావాల్సి వచ్చారు, ఎందుకంటే మనుషులచేత పని చేయించుకోవచ్చు, మందల పెంపకం వాళ్ళకి అప్పగించవచ్చు.

సంచార గొర్రెల కాపరులు అలా జీవించేవాళ్ళు. కానీ వ్యవసాయదారులూ శాంతికాముకులు కారు.

కోతకాలం తర్వాత పొరుగు వాళ్ల ధాన్యపు నిల్వలని బట్టలనీ, నగలనీ, ఆయుధాలనీ దోచుకోడానికి వాళ్ళు సంకోచించేవాళ్ళు కాదు. మరో సారి మంచి ఐశ్వర్యంగా దక్కేది యేమిటంటే బందీలు.

రైతులకి కూడా కుంటలని తవ్వడానికీ, ఆనకట్టల్ని కట్టడానికీ, ఎద్దుల్ని తోలడానికీ పనివాళ్ళు కావాలి.

మొదట్లో బందీలని బానిసలుగా చేసేవాళ్ళు కాదు. ఓ జత చేతులు రావడంవల్ల అదనంగా ఒరిగేదేమీ లేకపోయింది. మనిషి పనిచేసినా అంతమేరకీ తినేవాడు కదా.

పెద్ద మందలు రావడంతోటీ సారవంతమైన పచ్చిక బీళ్లు రావడంతోటీ పరిస్థితి మారింది. ఒక వ్యక్తి చేసిన పని వల్ల అతను వాడుకునేదాని కంటే యెక్కువ ధాన్యమూ, మాంసమూ, వూలూ ఉత్పత్తి అయేవి. రైతులు తమకి అవసరమైన దాని కంటే యెక్కువ ధాన్యాన్ని పండించేవాళ్ళు. ఎందుకంటే అదనపు గింజల్ని వూలుకి బదలాయించేవాళ్ళు. అదేరకంగా గొర్రెల కాపరులు తమ బట్టల కోసమూ, మాంసం కోసమూ అవసరమైన దానికంటే యెక్కువ సంఖ్యలో గొర్రెల్ని పెంచేవాళ్ళు, యెందుకంటే మిగులు వున్నిని తిండిగింజలకీ, ఆయుధాలకీ బదలాయించుకో వచ్చును.

యీ మార్పిళ్లవల్లా, దోపిడీలవల్లా కొన్ని తెగలూ, కుటుంబాలూ మిగతా వాటి కంటే సంపద్వంతమయాయి. వాళ్ల మందలు పెద్దవి, వాళ్లు యెక్కువ ధాన్యపు విత్తనాలని నాటేవాళ్ళు. కాని వాళ్ళకి యీ మందల్ని కాయడానికీ,



ఈజిప్టువాసులు యుద్ధంలో గెలుచుకున్న వస్తువులు



నేలని దున్నుతున్న బానిసలు (ఈజిప్షియన్ చిత్రం).

భూమిని దున్నడానికీ సరిపడా మనుషులు వుండేవాళ్లు కారు. కొంతమంది మనుషులు మిగతా వాళ్లని బానిసలని చేసుకోవడం మొదలుపెట్టినప్పుడన్నమాట.

బానిస చేసే పనివల్ల యజమానికీ, తనకీ కూడా ఆహారం లభించేది. యజమానులు చెయ్యవలసిందంతా బానిసలు యెక్కువ పనిచేసి తక్కువ తినేటట్టు చూడ్డమే. అంచేత ఒక మనిషి యింకో మనిషిని తన సజీవ పరికరంగా మార్చాడు.

మానవుణ్ణి హీనంగా చేసి, అతను ఎద్దు అయినట్టుగా అతని మెడమీద కాడిని పెట్టడం జరిగింది.

స్వేచ్ఛా మార్గంమీద, ప్రకృతిమీద తన ఆధిపత్యాన్ని సాధించుకునే దారిలో, మానవుడు తోటి మానవుడికి బానిస అయాడు.

అంతకుముందు సాగు చేసుకునే వాళ్లందరికీ భూమి ఉమ్మడి ఆస్తిగా వుండేది. యిప్పుడు బానిస తనకి చెందని భూమిని సాగు చెయ్యాల్సి వచ్చేది.

తను తోలే యెద్దు తనది కాదు. తను పండించే పంట తనది కాదు.

పురాతన యీజిప్టులో ఎద్దుల్ని తోలుతూ బానిసలు పాడేవాళ్లు:

వృషభాల్లారా తొక్కెయ్యండి,
తొక్కెయ్యండి గోధుమ కంకుల్ని!
యీ పంటంతా యజమానిది కద.

చరిత్రలో మొదటి సారిగా యజమానులూ, బానిసలూ యేర్పడ్డారు.

# స్మృతీ – స్మృతిచిహ్నమూ

గతంలోకి మన ప్రయాణం కష్టంగా వుంది కదూ. యేమంటే మనం సందర్శకుల్లాగా కాకుండా పరిశోధకుల్లాగా గుహల మయసభల్లో తిరిగాం. మనకి కనిపించిన ప్రతి వస్తువూ పరిష్కరించుకోవాల్సిన నిగూఢ రహస్యమే. మన దారిలో మనకి సహాయపడే సైన్ పోస్టులూ లేవు, యెటు వెళ్లాలో చెప్పే గుర్తులూ లేవు. రాతియుగంలో బతికిన ఆదిమ మానవుడు యెలాంటి గుర్తుల్ని మనకి వదిలిపెట్ట గలడు? అతనికి రాయడమెలాగో కూడా తెలియదాయిరి!

ఆఖరికి యిప్పుడూ మనం మార్గ సూచకాలున్న రోడ్డుమీదకి వచ్చాం. గోరీలమీదా, గుళ్ల గోడలమీదా చెక్కిన మొదటి మాటలు మనకి కనిపిస్తాయి. దుష్టశక్తుల్ని తొలగించడానికి ఉద్దేశించిన మంత్ర విహిత గుర్తులు కావు. యివి బొమ్మల్లో వున్న కథలు, మనుషుల కోసమూ, మనుషుల గురించీ వున్న కథలు.

అయినా మన అక్షరాలని పోలింది యేమీ లేదు. ఎద్దు అంటే ఎద్దు బొమ్మ. చెట్టు అంటే అన్ని కొమ్మలతోటీ గీసిన చెట్టు బొమ్మ.

రాత చరిత్ర బొమ్మల మాటలతో మొదలవుతుంది. యీ బొమ్మలు సూక్ష్మమై, గుర్తులుగా మారడానికి చాలా శతాబ్దాలు గడిచాయి.



మన వర్ణమాలలోని అక్షరాలు యే బొమ్మలనుంచి వచ్చాయో చెప్పడం కష్టం. "A" అనే లాటిన్ అక్షరం యెద్దు తల అని ఎవళ్లు వూహించగలరు? కాని ఈ అక్షరాన్ని తల కిందులుగా పెడితే కొమ్ములున్న ఎద్దని కనిపిస్తుంది. ప్రాచీన సెమెటిక్ భాషలో కొమ్ముల తల "A"కి సంకేతంగా వుండేది, మొదటి అక్షరాన్ని ''అలెఫ్'' అనే వాళ్లు, అంటే ''ఎద్దు'' అని అర్థం.

అదే రకంగా వర్ణమాలలోని అన్ని లాటిన్ అక్షరాల చరిత్రనీ మనం సాధించవచ్చు. "O" అనే లాటిన్ అక్షరం కంటికి గుర్తు. "P" అనేది పొడుగాటి మెడమీద వున్న తల.

కాని మన మాయా పాదరక్షలు మనల్ని చాలా దూరం తీసికెళ్లిపోయాయి.

వాస్తవానికి మన కథలో మొదటి బొమ్మల మాటలు ప్రత్యక్షమైన చోటికి మనం వచ్చాం.

మానవుడు జంకుతూ చాలా నెమ్మదిగా రాయడం నేర్చుకున్నాడు. కాని అదునులోనే అతను నేర్చుకున్నాడు.

ఎర్ర ఇండియన్ తెగ ముఖ్యుని గోరీ

పెద్ద విజ్ఞానం గాని, సాధించవలసిన వాస్తవాలుగాని లేకపోబట్టి మానవులకి తెలిసినదంతా వాళ్ళ జ్ఞాపక పేటికలోనే వుంచుకునేవాళ్ళు. కథలు, గాథలు, అద్భుత కథలు మనిషినుంచి మనిషికి వాగ్రూపంలో అందేవి. వృద్ధుడైన ప్రతివాడూ సజీవ గ్రంథమే. మనుషులు కథల్ని గాథల్ని గుర్తుంచుకుని, ఇంగితజ్ఞానాన్ని మననం చేసుకుని వాటిని తమ సంతతికి అందించేవాళ్ళు. వాళ్ళూ తమ వంతుగా తమ పిల్లలకి అందజేసేవాళ్ళు. బరువు ఎక్కువయ్యే కొద్దీ దాన్నంతటినీ గుర్తుపెట్టుకోవడం కష్టమయ్యేది.

దాంతోటి స్మృతి చిహ్నం మనిషికి ఆసరా అయింది. అనుభవాన్ని తర్వాతి తరానికి అందించేటప్పుడు నోటి మాటకి లిపి సహాయపడింది. ఒక సైనిక నాయకుడి దండ యాత్రలనీ యుద్ధాలనీ అతని సమాధిమీద చిత్రించి తర్వాత తరాల వాళ్ళ జ్ఞాపకాల్లో మాసిపోకుండా నిలిచేటట్టు చేశారు.

యితర మిత్ర తెగల ముఖ్యుల దగ్గరికి వార్తాహరులని పంపినప్పుడు చెట్టు బెరడుమీదనో, మట్టి పలకమీదనో గుర్తుండడం కోసమని బొమ్మల మాటలని గీసేవాళ్ళు.

సమాధి రాయి తొలి పుస్తకం. చిన్న చెట్టు బెరడు తొలి ఉత్తరం.

కాలాన్నీ, స్థలాన్నీ జయించడానికి మనకి సహాయపడే మన టెలిఫోన్, రేడియో, టేప్ రికార్డర్ వీటన్నిటినీ



ఉత్తర అమెరికన్ ఎర్ర ఇండియన్ తెగల బొమ్మల కథ



బానిస తాపీవాళ్లు గుడి కట్టడం. పర్యవేక్షకుడు చేత్తో కర్ర పుచ్చుకుని కుడి వేపున పైన కూర్చున్నాడు (ఈజిప్షియన్ చిత్రం)

చూసి మనం గర్వపడతాం. మన మాటలని వందల వేల కిలోమీటర్ల దూరం ప్రసారం చేస్తాం. టేప్ రికార్డులమీద మన మాటలు వందల సంవత్సరాల తర్వాత స్పష్టంగా వినగలుగుతారు. మనం చాలా అభివృద్ధి చెందాం. కాని మనకి ముందు జీవించిన వాళ్ల విజయాలని మనం మరిచిపోకూడదు. మనం పుట్టక ముందే యేనాడో మన ప్రాచీనులు బర్చ్ పట్టామీద అక్షరాలని రాసి స్థలాన్ని జయించారు, రాతి స్మృతి చిహ్నాలమీద వార్తలు చెక్కి కాలాన్ని జయించారు.

వేలాది సంవత్సరాల క్రితం జరిగిన దండయాత్రలని గురించీ, యుద్ధాల గురించీ తమ కథని చెప్పేందుకు ఎన్నో స్మృతి చిహ్నాలు యీ నాటికీ నిలిచి వున్నాయి. కత్తులూ యీటెలూ వూపే యోధుల బొమ్మలని రాతిమీద చెక్కారు. వీళ్లు విజేతలన్న మాట. యింటికి విజయోత్సాహంతో తిరిగి వస్తూవుంటే, వాళ్ల వెనక్కాల తలలు వంచుకుని, చేతులు వెనక్కి విరిచి కట్టేసి వున్న బందీలు యీడ్చుకుంటూ వస్తున్నారు. యీ బొమ్మల మాటల్లో చేతి గొలుసుల బొమ్మ వుంది. బానిసత్వానికీ, అసమానతకీ అది చిహ్నం. మానవ చరిత్రలో నూతన అధ్యాయపు ఆరంభాన్ని, భానిసత్వపు ఆరంభాన్ని యీ చిహ్నం తెలియజేస్తుంది.

యీజిప్షియన్ గుళ్ల గోడలమీద మనకి తర్వాత అలాంటి బొమ్మలు చాలా కనిపిస్తాయి.

బానిసలు ఒక నిర్మాణ స్థలం దగ్గరకి యిటికలని లాక్కురావడం ఒక బొమ్మలో వుంది. ఒక బానిస భుజంమీద యిటికలని పేర్చుకుని దాన్ని రెండు చేతులతోటీ ఆపుకుంటున్నాడు. రైతులు కావడిలో రెండు కుండలతో నీళ్లు మోసు కెళ్లుతున్నట్టుగానే యింకో అతను కావడిలో యిటికలు మోస్తున్నాడు. తాపీవాళ్లు గోడలని కడుతున్నారు. ఒక యిటి కల గుట్ట దగ్గర అజమాయిషీ చేసే మనిషి కూర్చున్నాడు. మోకాళ్లమీద మోచేతులు ఆన్చి కూర్చున్నాడు, చేతిలో కర్ర వుంది. అతను పనిలో దిగాల్సిన అవసరం లేదు. అతని పని అల్లా మిగతావాళ్లచేత పని చేయించడమే. యింకో పర్యవేక్షకుడు భవన స్థలందగ్గర అటూ యిటూ నడుస్తున్నాడు. అతను ఒక బానిస నెత్తిమీద కర్ర ఝుళిపిస్తున్నాడు. ఆ బానిస బహుశా అతని కిష్టంలేనిదేదో చేసివుంటాడు.

# బానిసలూ, స్వేచ్ఛాయుతులూ

ఉల్లికోళ్లనుంచి మల్లిపువ్వు రాదు,
బానిసీడు బిడ్డ స్వేచ్ఛగాడు కాదు.

అలా అని చెప్పి థియోగ్నిస్ అనే గ్రీకు కవి బానిస విధానం బాగా వేళ్లు తన్నుకున్నాక రాశాడు.

యేమైనా మొదట్లో బానిసల స్థాయి హీనంగా వుండేది కాదు. స్వేచ్ఛాయుతులూ, బానిసలూ కలిసే బతికేవాళ్లు. కలిసే పనిచేసేవాళ్లు. అంతా కలిపి ఒకే పెద్ద కుటుంబం లాగా అయేవాళ్లు.

కుటుంబ సమూహానికి పెద్ద, యజమాని, పూజ్యనీయుడు తండ్రి. అతని మగపిల్లలు, వాళ్ల భార్యలు, వాళ్ల పిల్లలు, అతని బానిసలు అంతా ఒకే యింట్లో వుంటూ అతనికి పూర్తిగా లొంగి వుండేవాళ్లు. తండ్రి చెప్పిన మాట వినని కొడుకుని, చెప్పిన మాట వినని బానిసని దండించినట్టే దండించవచ్చు.

యజమానితో మాట్లాడేటప్పుడు ముసలి బానిస అతన్ని వూరికే "అబ్బాయి" అనేవాడు, ఆచారం ప్రకారం యజమాని ముసలి బానిసని "అయ్యా" అనేవాడు.

మీరు పురాతన గ్రీసు కవి హోమెర్ రాసిన కావ్యం "ఒడెస్సీ" చదివి వుంటే ఎయుమాయెన్ గుర్తుండివుండాలి. ఆ ముసలి పందుల కాపరి తన యజమాని సరసన కూర్చుని తాగేవాడు, తినేవాడు. ఒక తెగ ముఖ్యుడు "దేవుడి సముడి"గా అయినట్టే, ఎయుమాయెన్ని కూడా "దేవుడి సముడు" అని పిలిచేవాళ్లు.



బానిస గొర్రెలకాపరి, మంద యజమాని (ఈజిప్షియన్ చిత్రం)



ఈజిప్టులో బందీలుగా పట్టుకున్న నీగ్రోలని లెక్కపెట్టడం

అయినా కథల్లోని మాటలని అస్తమానూ నమ్మలేం. పందుల కాపరి ఎయుమాయెస్ దేవుడి సముడూ కాదు, తన యజమాని సముడూ కాదు. పని చెయ్యాల్సిందని అతన్ని నిర్బంధించేవాళ్లు. అతని యజమానికైతే పని చేసే స్వేచ్ఛ వుండేది. కుటుంబంలోని సభ్యుని కంటే బానిస యెక్కువ పని చెయ్యాల్సి వచ్చేది, కాని అతనికి ముట్టే వాటా చాలా తక్కువ. బానిసేమో యజమాని ఆస్తి, యజమానైతేకి ఆస్తికే యజమాని.

పెద్ద యజమాని చచ్చిపోయినప్పుడు, అతనికి చెందిన గాదెలూ, పశువుల మందలూ అతని కొడుకులకి చెందినట్టుగానే అతని బానిసలు కూడా కొడుకులకి చెందేవాళ్లు.

యీ కుటుంబ — సమాజంలో సమానత్వ చిహ్నాలు యే మాత్రమూ లేవు.

యిక్కడ తండ్రి పిల్లలమీద పెత్తనం చేసేవాడు, భర్త భార్యమీద అధికారం చెలాయించేవాడు, అత్తగారు కోడలి మీద హుంకరించేది, పెద్ద కోడళ్లు చిన్న కోడళ్లమీద దర్పం చూపించేవాళ్లు. కాని బానిస మాత్రం నిచ్చెన కడపటి మెట్టుమీద వుండేవాడు. ప్రతివాళ్లూ అతనిమీద అజమాయిషీ చేసేవాళ్లే.

తెగలమధ్యా, సమాజాలమధ్యా పూర్వం వున్న సమానత్వం కూడా మాయమైపోయింది. కొన్నింటికి యెక్కువ పశువులు వుండేవి, కొన్నింటికి తక్కువ వుండేవి. పశువులు సంపదకి చిహ్నం. బట్టలకీ, ఆయుధాలకీ ఎద్దుని బదలాయించవచ్చు. మొదటి కంచు నాణేలని సాగదీసిన ఎద్దు చర్మంలాగా ముద్రించడంలో ఆంతర్యం అదే అయివుంటుంది.

యేమైనా బానిస యింకా ఎద్దుకంటే విలువైన వాడే కదా.

బానిస పందుల్ని కాసేవాడు, ఆవుల్నీ గొర్రెల్నీ కాసేవాడు. పగలంతా వాటిని మేపుకొచ్చి సాయంత్రం వేళ వాటిని దొడ్లల్లోకీ, కొట్టాల్లోకీ తోలుకొచ్చేవాడు. పంటకోతలో సాయం చేసేవాడు, ద్రాక్షరసం తియ్యడానికి, ఆలివ్ నూనె తియ్యడంలో సాయపడేవాడు. బంగారు ధాన్యపు గుట్టలు గాదెలు నిండేవి. గానుగనుంచి ఆడితీసిన సువాసన నూనె ''అమ్‌ఫోర్'' అని పిలిచే రెండు చెవుల జాడీల నిండుగా వుండేవి.

బానిస స్వేచ్ఛాయుతునికి సహాయం చేసేవాడు, కాని బానిస కష్టాతికష్టమైన, నికృష్టమైన పని చేసేవాడు. అప్పుడు యుద్ధాలు లాభదాయకం అయ్యాయి. వాటి వల్లనే బానిసలు వచ్చేవాళ్ళు, బానిసలే వాళ్ల యజమానులకి ఐశ్వర్యాన్ని సృష్టించేవాళ్ళు.

మందల్ని కాయడానికీ, భూమి దున్నడానికీ బానిసలని వెనక్కాల వుంచేసి, స్వేచ్ఛాయుతులు యుద్ధాలకి పోయే వాళ్ళు.

యుద్ధం అంటే పని యెక్కువైందన్న మాట. యింకో తెగని ముట్టడించాలంటే మనుషులకి కత్తులూ, బల్లేలూ, కావాలాయిరి. యోధులు వేగంగా పోయే గుర్రాలని తమ రథాలకి కట్టి యుద్ధ భూమిలో వేగంగా పోయేవాళ్ళు.

కాని యుద్ధరంగం అన్నాక ఎదురు దాడీ వుంటుంది, ఆత్మరక్షణా వుంటుంది. మరి ఆత్మరక్షణ కోసం యోధులు శిరస్త్రాణాల్నీ ధరించాల్సి వచ్చేది, డాలుని తీసికెళ్లాల్సి వచ్చేది. క్రమేపీ సామూహిక నివాసాలకి చుట్టూతా రాతితో కట్టిన కోటగోడల్లాంటివి లేచాయి.

తెగ యెంత సంపద్వంతమైందె తే, బలమైందైతే, అంత వ్యవధీ, కృషీ దాని రక్షణకి వినియోగం అయ్యేవి. రక్షించుకోవాల్సింది ఎంతో వుంది.

త్వరలోనే కొండలపైన ప్రాకారాలతోటి డజన్ల కొద్దీ గదులూ, గాదెలూ, గోడమ్మటే బురుజులూ వున్న పెద్ద పెద్ద కోటలు లేచాయి.

## గుడారం యిల్లుగా మారింది, యిల్లు నగరంగా మారింది

మధ్య ఆసియా ఎడారుల్లో తను కనిపెట్టిన కోటల శిధిలాల గురించి ఎస్. టాల్‌స్టోవ్ అనే సోవియట్ పురా తత్వవేత "ప్రాచీన ఖొరెజ్మ్" అనే తన పుస్తకంలో రాశాడు.

యీ నిర్మాణాలు ఒక యింటి కంటే కూడా ఒక పట్టణం ప్రమాణంలో వున్నాయి.

మందమైన మట్టి గోడలు. బ్రహ్మాండమైన ఖాళీ చదరాన్ని చుట్టి కంచెలాగా మైళ్ల కొద్దీ విస్తరించి వుండేవి. ఆ సమాజపు మనుషులు గోడల్లో వుండేవాళ్ళు, పైన కమాను వున్న వసారాల్లో. వాటి కప్పులకి కిటికీలుండేవి.

మధ్య చదరం ఖాళీగా వుంటే వేలాదిమంది మనుషులు కిక్కిరిసి పోయి, చీకటిగా వుండే వసారాల్లో వుండే వాళ్లంటే ఆశ్చర్యంగానే వుంటుంది.

టాల్‌స్టోవ్ సులభంగా సమాధానం చెప్పాడు. ఆ రోజుల్లో ఖొరెజ్మ్ ప్రజల ప్రధాన సంపద పశువులు. యీ చదరం వాస్తవానికి బ్రహ్మాండమైన ఆవరణ, గోడలూ వాటి కానాలూ ఆ సంపదని శత్రువు బారినుంచి కాపాడే బురుజులు.

ఒక వేళ శత్రువు దాడి చేస్తే యీలోపల వుండే మనుషులంతా యీ కానాల దగ్గరకి చేరి దాడి చేసిన వాళ్లమీద అంబుల వర్షం కురిపించేవాళ్ళు.

కాని వాళ్లంతా కలిసి కాపాడుకునే ఆ సంపద వాళ్ల ఉమ్మడి ఆస్తి కాదు. అంతా ఒకళ్లకొకళ్లు బంధువులే అయినా కొన్ని కుటుంబాలకి యెక్కువ గొర్రెలూ, ఎద్దులూ, గుర్రాలూ వుండేవి.

ఆ రోజుల్లో ''సంపద'' అనే మాట ఒక పదబంధంలో భాగంగా వుండేదని పాతకాలపు కథలు తెలియచేస్తున్నాయి. ఎవళ్ళకి సంబంధించేనా ''సంపదగలవాడు'' అని వూరికే అనేవాళ్ళు కాదు. ''గ్రొరెల మంద సంపదకలవాడు,'' ''గుర్రాల సంపదకలవాడు'' అనేవాళ్ళు.

పొరుగు కోటలమీద చేసిన ప్రతి ముట్టడివల్లా యుద్ధ ముఖ్యుని మందలూ పెరిగేవి, ధనిక — బీద మధ్య అంతరాలూ పెరిగేవి.

తర్వాత కాలంలో కట్టిన వేరే కోటలనీ, యిళ్లనీ పట్టణాలనీ కూడా టాల్‌స్టోవ్, అతని సహచరులూ కనిపెట్టారు.

ఎడారిలో వాళ్ల తవ్వకాలు చాలా యేళ్లు సాగాయి. అది చాలా కష్టభూయిష్టమైన పని. ఏనాడో విస్మృతమైన నాగరికత కోసం అన్వేషణ చేస్తూ సోవియట్ పండితులు ఒంటెలమీద, కారులమీద, మోటారు బోటులమీద, విమానాల మీద ప్రయాణం చేశారు. ఒకో అప్పుడు ఒంటె మూపురం మీదనుంచో, కొండ పైనుంచో వాళ్లకి కనిపించిందల్లా గుట్టల్ని కప్పిన బూడిదరంగు ఉప్పుపొర. కాని విమానంలో యెడారికి చేరువగా వసే వాళ్లకి గోడల స్థూల రేఖలూ, వీధులూ, పెద్ద సామూహిక గృహాలూ కనిపించాయి.

యీ యిళ్లనీ, పట్టణాలనీ పోల్చి అధ్యయనం చేసి వాళ్లు ఆదిమ సామూహిక వ్యవస్థనుంచి బానిస వ్యవస్థకి జరిగిన మార్పుని కూర్చగలిగారు.

జన్‌బస్-కాలా దగ్గర మత్స్యకారుల గుడారం యిదిగో. యిక్కడ గొప్ప, బీదా తేడాలేదు. అన్ని పొయ్యిలూ ఒకటే పరిమాణం వున్నవి. మనుషులందరూ సమమే, ఏమంటే అంతా సమంగా బీదవాళ్లే. యీ యింటికి గోడ రక్షణ లేదు. అక్కడ దాచుకోవాల్సిన సంపదలేమీ లేవు.

యీ మకాంకి దగ్గర్లోనే ఒక మట్టితో కట్టిన ''పొడుగాటి యింటి'' అవశేషాలు శాస్త్రజ్ఞులకి కనిపించాయి. ఆ 150 అడుగుల వసారాలోనూ పొయ్యిలు ఒకదాని తర్వాత ఒకటిగా పొడుగాటి పంక్తిలో వున్నాయి.

యీ యింటికీ గోడ రక్షణ లేదు.

కాని యుగాలు గడిచిపోయాయి. కొన్ని ''పొడుగాటి యిళ్లు'' ఒక దాని దగ్గరగా ఒకటి చేరి బ్రహ్మాండమైన ఖాళీజాగా చుట్టూతా కాపరం వుండే గోడగా తయారయ్యాయి.

కుజెల్-గీర్ అలాంటి చుట్టు కంచెలాంటి యిల్లు. యిక్కడ మనకి గోడలో కంతలూ, బురుజులూ కనిపిస్తాయి. శత్రు దాడులనుంచి యీ మనుషులు తమ మందల్ని కాపాడుకునేవాళ్లు. కాని తాము మాత్రం పొరుగు వాళ్ల మందలమీద దాడిచేసి, దోచి, తెచ్చేసుకునేవాళ్లు. యిక్కడ కొన్ని కుటుంబాలు మిగతా వాటి కంటే ధనికమైనవి. అయినా దీనికి కచ్చితంగా రుజువు లేదు. ప్రపంచంలో మిగతా చోట్లా, మిగతా దేశాల్లోనూ వున్న మనుషుల ఆచారాలని అధ్యయనం చేసి పురాతత్వవేత్తలు వూరికే వూహించగలిగారంతే.

తర్వాత జన్‌బస్-కాలా దుర్గం. లోపల వున్న చదరం ఖాళీగా లేదు. రెండు పెద్ద యిళ్లు, యెన్నో గదులున్న సామూహిక యిళ్లన్న మాట, ఆ ఖాళీ జాగాలో వున్నాయి. యీ రెండిళ్ల మధ్యనుంచీ వీధి. ఆ వీధి ''నిప్పు యింటి'' దగ్గరికి పోతుంది. ప్రాచీన కాలంనాటి పొయ్యి, ప్రాచీనకాలపు మత్స్యకారుడి నిత్యాగ్ని, యిక్కడ గుడి అయింది.

యీ కోటలో ఒక్క తెగ కూడా యిప్పుడు వుండటం లేదు. యిక్కడ రెండు తెగల గ్రూపులు వున్నాయి. ప్రతి దానికీ, దాని యిల్లు వుంది. యిక్కడ పశువులకోసం ఖాళీజాగా లేదు. వాళ్లకి ప్రధాన వృత్తి వ్యవసాయం కాని, పశుపోషణ

కాదు. కోటగోడల బయట పొలాలు వున్నాయి, పంట కాలవలతోటి అల్లి బిల్లిగా వున్నాయి. కోట పొలాలనీ, కాలవలనీ సంచారులనుంచి కాపాడుతుంది.

యిక్కడ యింకా తర్వాతి కాలపు తో(ప్రాక్-కాలా కోట వుంది. యీ కోటగోడల లోపల చాలా గదులున్న యిళ్లు దగ్గరగా డజను వున్నాయి.

నగరాన్ని నాలుగు వేపులనుంచీ చాలా బురుజులున్న గోడలు చుట్టివున్నాయి. చూడవచ్చిన వాడెవడూ వెంఠనే లోపలికి ప్రవేశించలేడు, మొదటగా లోపలికి వెళ్లే దారులని చుట్టివుండే మయసభని దాటి పోవాలి.

ప్రవేశ ద్వారం దగ్గర ప్రధాన వీధి మొదలవుతుంది. అది నగరంలో ఒక మూలనుంచి యింకో మూలకి నిబ్బరంగా పోతుంది. దానికి రెండు వేపులా వందల కొద్దీ గదులున్న యిళ్లు, చిన్న బురుజులున్న పెరళ్లు వున్నాయి. ప్రధాన వీధి ''నిప్పు యింటి'' దగ్గరికీ, నగర పాలకుడి మూడు బురుజులున్న బ్రహ్మాండమైన ప్రాసాదానికీ దారితీస్తుంది.

యివాళ యిక్కడ మిగిలిందల్లా, అక్కడా అక్కడా మట్టితోటీ, యిసకతోటీ కప్పడిపోయిన శిథిలాలు. యీ నగర ఆకృతిని పునర్నిర్మించడానికి పురాతత్వవేత్తలు చాలా కాలం, చాలా కష్టపడాల్సి వచ్చింది.

ఒక దాని తర్వాత ఒకటిగా ఆవిష్కరణలు వచ్చి వాళ్ల శ్రమకి తగ్గ ఫలంగా లభించాయి. ఆ మూడు బురుజులున్న ప్రాసాదంలో చాలా ఆసక్తికరమైన విషయాలు లభించాయి. ఆ భవనపు దర్బారు మందిరాల్లో గోడల మీద నిపుణులు చెక్కిన బొమ్మలున్నాయి. యీ నిర్జీవమైన యిసక యెడారిలో, ఆ భవనపు గోడలమీద సజీవమైనవా అన్నట్టు దృశ్యాలు గోచరించాయి. ఒక అమ్మాయి వీణ వాయిస్తోంది. ఒక అమ్మాయి ద్రాక్షపళ్ల బుట్టని నెత్తిమీద పడిపోకుండా పట్టుకుంది. నల్లని కోటు తొడుక్కున్న మనిషీ, గుర్రాలూ, పెద్దపులులూ, అడివి కోళ్లూ వున్నాయి. మంచి శిల్పులు చెక్కిన శిల్పాల ఖండాలు కూడా వున్నాయి.

యీ ప్రాసాదంలో ప్రతీదీ దాని యజమానులు నగరంలోని మిగతావాళ్ల కంటే యెక్కువ ధనికులనీ, కులీనులనీ చాటుతోంది.

ప్రాసాదం యితర యిళ్లని మింగేసేటట్టు వుంది. దాని యజమానులు మిగతావాళ్ల కంటే బాగా వున్న వాళ్లనడానికి దాఖలా.

ఆ నగరానికీ, దేశానికీ, పాలకుడైన ఖోరెజ్మ్ షా నివాసం అది. యిక్కడ అతను తన కుటుంబంతోనూ చాలామంది బానిసలతోనూ వున్నాడు.

ఆ నగరమే సిసలైన రాజ్యం. బానిసలనీ, బీదవాళ్లనీ అణగదొక్కడానికీ, ధనవంతులా కులీనులా హక్కుల్ని కాపాడ్డానికీ, పంటకాలవల నిర్మాణం పర్యవేక్షించడానికీ పాలకుడికి సైన్యం వుండేది. ఒక పెద్ద కాలవని తవ్వాలంటే వేల మంది బానిసలు కావాలి. ఒకకోట గాదు, చాలా కోటలూ, స్థిరమైన సైన్యమూ పొలాలనీ, కాలవలనీ, రక్షణ లేని ఖోరెజ్మ్ రైతుల యిళ్లనీ కాపాడేవి.

ఆరకంగా వేల సంవత్సరాల గుండా ప్రయాణం చేస్తూ ఒక గుడారం యిల్లుగా యెలా మారిందో, యిల్లు పట్టణంగా ఎలా మారిందో, అందరూ సమానంగా వుండే సమాజం బానిస సమాజంగా యెలా మారిందో పండితులు తమ కళ్లతో తాము దర్శించారు.

మధ్య ఆసియాలో బాటుగా వేరు చోట్ల కూడా పురాతత్వవేత్తలు యీ పెద కోట – యిళ్లని చూశారు. శత్రువు బారినుండి సంపదని కాపాడుకోవాల్సి వుండిన చోటనల్లా అలాంటి యిళ్లు వాళ్లకి కనిపించాయి.

# కోట ముట్టడి

కోటగోడలమీదనుండి అటూ యిటూ యెంతో దూరం కనిపిస్తుంది. దూరంలో ధూళి మేఘం లేచి యీటెలు ఎండలో మెరుస్తాయి. కోట గబగబా రక్షణకి సన్నద్ధమవుతుంది. దున్నేవాడు ఎద్దుల్ని తోలుకొచ్చేస్తాడు, గొర్రెల కాపరి మందని మళ్లించుకొస్తాడు. అందరూ వచ్చేసింతర్వాత గేటు తలుపులు మూసేసి గడియపెట్టేస్తారు. యోధులు గోడలమీద బురుజులమీదా స్థానాలాక్రమించి కూర్చుని శత్రువు దగ్గరికి రాగానే అంబులతోటి వర్షిం చెయ్యడానికి సిద్ధంగా వుంటారు.

దాడి చేసేవాళ్లు కోటకి దగ్గరగా వచ్చి శిబిరం వేస్తారు. కోట సులభంగా లొంగిపోదని వాళ్లకి తెలుసు. ఆ యెత్తైన గోడల్ని కూల్చాలంటే కొన్ని నెలలు పడు తుంది. ప్రతి ఉదయమూ గేటు తలుపులు తెరుచుకునేటప్పుడు కిర్రుమని మూలు గుతాయి. బల్లేలని వూపుతూ యోధుల గుంపు దుముకుతుంది. యుద్ధం అటో యిటో ఆరుబయట పోరులో తేలిపోవాలని వాళ్లు యివతలికి వచ్చారు. శత్రువుల గుర్రపుతోక తురాయిల శిరస్త్రాణాలపై వాళ్లు తమ కత్తుల్ని ఆగ్రహపూరితంగా వూపుతారు. శత్రువుని వదలకుండా, తాము భీతిలేకుండా కొన వూపిరి దాకా పోరాడతారు.

ఒక వైపు తమ యిళ్లనీ, కుటుం బాలనీ రక్షించుకోవాలన్న ప్రేరణతో ఉత్తే జితులైన వాళ్లు. రెండో వైపున అంత దగ్గర్లో వున్న సంపద అందకుండా



ఒక దుర్గాన్ని ముట్టడిస్తున్న అస్సీరియన్లు. (కింద) తమ బందీలని నడిపించుకుపోతున్న యోధులు

పోతోందే అన్న ఆగ్రహం. రక్షించుకునే సైన్యంలో సజీవంగా వున్నవాళ్లు చీకటి పడుతూ వుండగానే వెనక్కి వెళ్లిపోతారు. మర్నాటి ప్రభాతం దాకా యుద్ధం ఆగింది.

రోజులు గడుస్తాయి. ముట్టడికి గురైన వాళ్లు దండయాత్ర చేసిన వాళ్లతోటి ధైర్యంగా పోరాడతారు. కాని ఆకలి శత్రువు బల్లేలకంటే, బాణాలకంటే దారుణమైంది.

ఒకప్పుడు నిండుగా ధాన్యం వున్న మాళిగలో దుమ్ము తప్ప మరేమీ మిగలకపోతే, జాడీల్లో నూనె అయిపోయి ఒక్కొక్క బొట్టుకీ దిగితే అప్పుడు కోటలో ఆర్తనాదాలు అందుకుంటాయి. ఆకలితో వున్న పిల్లలు యేడుస్తారు, మగాళ్లకి కోపం వస్తుందని ఆడవాళ్లు దిగమింగి కళ్లు తుడుచుకుంటారు.

ఒక్కొక్క రోజూ యుద్ధం అవుతూ వుంటే, కోటని రక్షించే వాళ్ల సంఖ్యా అలా అలా తగ్గిపోతూనే వుంటుంది. ఆఖరికి కాలికి బుద్ధిచెప్పి పారిపోయే యోధులని తరుముకుంటూ దాడిచేసిన వాళ్లు కోటలోకి దూరేస్తారు. బ్రహ్మాండమైన గోడల్లో ఒక్క రాయిని కూడా మిగల్చరు. ఒకనాడు మనుషులు జీవించి, శ్రమించి, వినోదించిన చోట శిథిలాలూ, శవాలూ తప్ప యింకేమీ లేవు. విజేతలు పెద్దా, చిన్నా, సజీవంగా వున్న వాళ్లందర్నీ తీసుకెళ్లిపోయి బానిసలుగా చేసుకుంటారు.

## చనిపోయినవాళ్లు బతికినవాళ్ల గురించి మనకి చెప్తారు

రష్యాకి దక్షిణంగా విస్తరించుకున్న పచ్చిక బీళ్లలో చూపు ఆనినంత మేర వరకూ ఎత్తైన గుట్టలు గొలుసులుగా వుండే చోట్లు వున్నాయి. చదునైన బీళ్లల్లో యీ గుట్టలు యెలా వచ్చాయో, యెవరు వాటిని కట్టారో స్థానికులకి తెలియదు.

మీరు మరీ మొండిగా అడిగితే ముసలాడెవడేనా అవి ''మమాయీల'', ''మమాయీల కూతుళ్ల'' సమాధులని చెపుతాడు. కాని ఆ ''మమాయీ''లెవరో, ఎప్పటివాళ్లో వాళ్లు చెప్పలేరు.

ఆ ముసలాడు కొంచెం వాగుడు పిట్ట అయితే ఒకప్పుడు అక్కడ తన యజమాని అయిన భూస్వామి వుండేవాడనీ, గుట్టని కొన్ని యేళ్లు తవ్వుతూ గడిపాడనీ, అతని చేతిలో యేదో పటం వుండేదనీ, అక్కడేదో దాగిన సంపద కోసం వెదుకుతున్నాడనీ చెప్తాడు. కాని అతనికి యేమీ దొరకలేదట.

యేమైనా యీ ముసలాళ్లని గుట్టల్ని గురించి అడగడం అనవసరంగా సమయం వ్యర్థం చేసుకోవడమే. నిజంగా తెలుసుకోవాలనుకుంటే తవ్వకాలు జరిపే పురాతత్వవేత్తలని అడగాలి.

ఒక ముసలాడికి తన జీవిత కాలంలో జరిగినవే గుర్తుంటాయి, పురాతత్వవేత్తలకి యెన్నో శతాబ్దాల క్రితం జరిగినవి తెలుస్తాయి.

ఒకప్పుడు పచ్చికమైదానాల్లో వుండేవాళ్ల సమాధులు, ప్రాచీన సమాధులు ఆ గుట్టలు.

యీ గుట్టల లోపల పురాతత్వవేత్తలకి మానవ అస్థిపంజరాలు దొరికాయి. వాటిపక్కనే రకరకాల వస్తువులు వున్నాయి: మట్టి కుండలు, రాతివీ లేక కంచువీ పనిముట్లు, కొన్ని గుర్రపు యెముకలు. చనిపోయిన వాడి దీర్ఘ ప్రయాణానికి అదీ మూట.

చనిపోయింతర్వాతా మనిషి తినాలనీ, తాగాలనీ, పనిచేయాలనీ, ఆడవాళ్ల ఆత్మకి అయితే కదురు కావాలనీ, మగ వాడికైతే బల్లెం కావాలనీ మనుషులు నమ్మేవాళ్లు.

అతిప్రాచీన సమాధి గుట్టలన్నీ ఒక్కలాగే వుండేవి. చచ్చిపోయన వాడి వస్తువులని వాడి పక్కన పెట్టే వాళ్లు, ఆ రోజుల్లో వ్యక్తికి చాలా తక్కువ వస్తువులు వుండేవి. అతని సొంతమైంది యేమిటి? మెళ్లో వేసుకున్న హారం, యుద్ధానికి తీసికెళ్లే బల్లెం.

యింట్లో వుండే ప్రతీదీ ఉమ్మడి ఆస్తే. యింటి వ్యవహారాలన్నీ ఉమ్మడిగానే జరిగేవి. కుటుంబం మొత్తంగా వాటిని నిర్వహించేది. అందుకనే అతి పురాతన గుట్టల్లో ధనికమైనవీ, బీదవీ అనే సమాధులు లేవు. చచ్చిపోయిన వాళ్లంతా సమానమే.

చచ్చిపోయిన వాళ్లల్లో గొప్పా, పేదా అనే తేడాలు తర్వాత వచ్చాయి.

దోన్ నది తీరంలో, యెలిసవేతొవ్‌స్కయా గ్రామందగ్గర సమాధి గుట్టలున్న శ్మశానం కనిపించింది. అక్కడ మూడు రకాల సమాధులున్నాయి. ధనవంతుల అవశేషాలున్నవీ, మధ్య తరగతి వాళ్లవీ, బీదవాళ్లవీ.

పెద్ద గుట్టలకి మధ్యలో గుంట వుండేది. అది సమాధి. అందులో గ్రీకు కూజాలూ, బంగారుపూత పెట్టిన అలంకారాలూ, చిత్రమైన లతలు చెక్కిన బాకులూ వున్నాయి.

వాటి కన్న చిన్న గుట్టల్లో బంగారు వస్తువులుండటం అరుదు, అలంకారంగా వుండే కూజాల సంగతి సరేసరి. అయినా వాటిని బీద సమాధులు అనలేం. చచ్చిపోయిన వాడు బీదవాడే అయితే సమాధిలో మెరుగుపూత పెట్టిన నల్లటి పళ్లెంగాని, చక్కగా లోహపు నగిషీతో వున్న అలంకార వస్తువు గాని పక్కన వుండవు.

అతిచిన్న గుట్టలే చాలా యెక్కువగా వున్నాయి. అవి బీదవాళ్ల సమాధులు. చనిపోయిన వాడి కుడి వేపున ఒక బల్లెం, యెడం వేపున ఒక కుండ, అతనికి దాహం వేస్తే మంచినీళ్ల కోసమని. బీదవాడు సమాధిలో కూడా బీదవాడు గానే మిగిలిపోయాడు!

''సమాధి అంత నిశ్శబ్దంగా'' అని సామెత వుంది. కాని యీ సమాధులు నిజంగా నిశ్శబ్దమైనవే? ఆనాడెప్పుడో ధనిక బీద అంతరాలు యేర్పడ్డ కాలం గురించి అవి చెప్పవూ? చనిపోయిన వాళ్లు బతికున్న వాళ్ల గురించి మనకి చాలా విషయాలు చెప్తారు.

సమాధి గుట్టల్ని వదిలిపెట్టి అక్కడ కనిపించే స్థిర నివాసపు శిధిలాల దగ్గరకి వెడితే పూర్వపు ఐశ్వర్యమూ బీదరికమూ అక్కడా మనకి కనిపిస్తాయి. ఆ నివాసానికి రెండు కంచెలున్నాయని పురాతత్వవేత్తలు కనిపెట్టారు. ఒకటి నివాసాన్ని బయటినుంచి కమ్ముకుని వస్తే, రెండోది నది ఒడ్డున వున్న భాగాన్ని చుట్టుకొని వుంది. యిక్కడ యెక్కడ్నో గ్రీసులో కొన్న కూజాలవీ, చక్కని పాత్రలవీ తునకలు కనిపించాయి. యీ రెండు కంచెలకీ నడుమ వున్న జాగాలో అలాంటి తునకలు బహు తక్కువ కనిపించాయి. అక్కడ వాళ్లకి కనిపించినవల్లా అతి సాదా మట్టికుండల పెంకులు. ఆ నివాసపు మధ్య భాగంలో జీవించిన వాళ్లు శివార్లలో వుండే వాళ్ల కంటే ధనికులై వుండాలి. లేకపోతే యింత ఖరీదైన వాటిని కొనుక్కోలేరు కదా.

దూరంగా కనిపించే ఎత్తైన గుట్టలు వాళ్ల సమాధులమీద కట్టినవి.

అక్కడ పూడ్చిపెట్టబడిన వాళ్ల గురించి ఆ సమాధులూ చెపుతాయి. తమ యజమానితో పాటుగా పూడ్చి



పెద్ద రాతి పలకలతో కట్టిన పురాతన సమాధి

పెట్టడానికి బానిసలని చంపెయ్యడం గురించి, లేదా చనిపోయిన భర్తతోటి సహగమనం చేసిన భార్యల గురించి అవి ఒకో అప్పుడు తెలియజేస్తాయి.

ధనవంతమైన తెగ పెద్ద, తండ్రి యెంత క్రూరంగా వుండేవాళ్లో ఆ విషయం గురించి యే పుస్తకమూ చెప్పలేనంత యెక్కువ యీ సమాధులు చెబుతాయి. అతను చచ్చిపోయినప్పుడు అతని భార్యలూ, బానిసలూ అతనితో బాటు సమాధిలోకి పోవాల్సిందే. మరి వాళ్లు అతనికి చెందిన వాళ్లు. బంగారం, కంచూ నగల్లాగా అతని ఆస్తి.

# మానవుడు కొత్త లోహాన్ని తయారు చేస్తాడు

వేల సంవత్సరాలుగా యీ శ్మశానాల్లో, శిధిలాల్లో చీకట్లో వుండిపోయిన అమూల్యమైన వస్తువులు యివాళ మ్యూజియంలలో ప్రదర్శనలో వున్నాయి. గతాన్ని గురించి తెలుసుకో గోరిన వాళ్లందరూ శతాబ్దాలుగా కనుమరుగైన వస్తువులని యివాళ చూడచ్చు.

మ్యూజియంలని సందర్శించే వాళ్లు ప్రతి అద్దాల పెట్టె దగ్గరా ఆగి బంగారు పిడి వున్న కత్తులనీ, అద్భుతమైన హారాలనీ, ఒకో పూసా బొమ్మలోని లక్ష్మీదేవి తల అంత సైజు వున్న పూసల దండలనీ, ఎద్దుల్లాగా, జింకల్లాగా చేసిన వెండిపాత్రలనీ చూస్తారు.

యీా వస్తువుల్లో ప్రతిదానికీ యెంత శ్రమా, కళా దృష్టీ అవసరమయ్యాయో!

అతి సులభమైన కంచు బాకుని తయారుచెయ్యడానికి చాలా రోజులు పట్టేది.

మొదటగా గనినుంచి ముడి లోహాన్ని తేవాలి. వెదకక్కర్లేకుండా కాళ్లకిందే రాగి దొరికే రోజులు పోయాయి. యిప్పుడు ముడి రాగిలోహం కోసం భూగర్భంలోకి లోతుగా వెళ్లాల్సి వచ్చింది. లోపలి చీకటి బావుల్లోనుంచి పికాస ల్తోటి గని పనివాళ్లు ముడిలోహాన్ని తవ్వి పైకి తోలు సంచీలలో పంపించేవాళ్లు.

పెద్ద రాళ్లని సులభంగా పగల గొట్టడానికని లోపల నిప్పు ముట్టించేవాళ్లు. రాళ్లు ఎర్రగా కాలినప్పుడు, వాటి మీద నీళ్లు పోసేవాళ్లు. నీళ్లు సలసల మరిగిపోయి ఆవిరి మేఘాలు చిమ్మేది. రాళ్లు బీటలు దీసి, ముక్కలు కింద పేలి పోయేవి. ఆరకంగా నిప్పూ నీరూ మానవుడి పికాసకి సాయపడేవి.

అప్పుడు గని అగ్నిపర్వతం లాగా వుండేది. అడుగునుంచి నిప్పువల్ల ఆవిరిమేఘాలు, అగ్నిపర్వతంలోనుంచి వచ్చి నట్టుగా, పైకి చిమ్మేవి. అందుకనే ఇంగ్లీషు భాషలో యిప్పటికీ అగ్నిపర్వతాలని రోమన్ అగ్ని దేవుడి పేర ''వల్కాన్'' అని పిలుస్తున్నారు.

ముడిలోహాన్ని తీసాక దాన్ని కరిగించేవాళ్లు. దానిక్కూడా యెంతో నేర్పు అవసరమయ్యేది. ముడి రాగిని గట్టి పరచడం కోసమని తగరాన్ని కలిపేవాళ్లు. అప్పుడు దాన్ని మూసల్లోకి పొయ్యడం సులభమయ్యేది.

యీా కరిగిన ముడిలోహమూ, తగరమూ కలిసి రాగీ తగరపు మిశ్రం అయేది. అదిప్పుడు వూరికే రాగి కాదు, నూతన గుణాలున్న, మానవ నిర్మితమైన, నూతన లోహం — కంచు.

పూర్వం చెకుముకిరాతితోటి ముతక పనిముట్లని తయారు చేసుకునేటప్పుడు, అవసరమయితే ఒక మనిషి యింకో మనిషి పని చేసేవాడు. ఆనాటి మానవుడికి తెలిసిన కొద్ది నైపుణ్యాలనీ నేర్చుకోవడం అతనికి కష్టమయ్యేది కాదు. ఆదిమకాలపు వేట రోజుల్లో తెగ అంతా వేటగాళ్లే, ప్రతివాడూ తన విల్లంబుల్ని తను చేసుకునేవాడే.



ప్రాచీన కంచు ఖడ్గం

ఓ కర్రముక్కని తీసుకుని వంచి ఆ అంచుకీ యీా అంచుకీ ముడేసి తాడు కట్టడం ఒక యెత్తూ, కాస్త ముడి లోహాన్ని తళతళ మెరిసే కంచుకత్తిగా మార్చడం యింకో యెత్తూనూ.

ఆయుధాలు చేసే దానికి యెవళ్లనేనా తయారు చెయ్యాలంటే యేళ్లు పట్టేది. ఒక ఆయుధ నిపుణుడు తన కొడుక్కి తన నైపుణ్యాన్నంతట్నీ నేర్పేవాడు. అతని నైపుణ్యం అతని తెగ ఆస్తి, దాని వంశ పారంపర్య సంపద. కుమ్మరి వాళ్లూ, ఆయుధ నిపుణులూ, రాగి పనివాళ్లూ వాడలకి వాడలే వుండేవాళ్లు. వాళ్ల పేరుప్రతిష్ఠలు దశ దిశలా వ్యాపించేవి.

# నాదీ నీదీ

మొదట్లో ప్రతి వృత్తిపనివాడూ తన తెగకోసమూ, తన గ్రామంకోసమూ పనిచేసేవాడు.

క్రమేపీ ఆయుధ నిపుణుడుగాని, కుమ్మరివాడుగాని తమ పనిముట్లని తరుచుగా ధాన్యానికీ, బట్టలకీ, మిగతా వాళ్ళు తయారుచేసిన మిగతా పనిముట్లకీ మార్పిడిచేసుకునేవాళ్లు.

నీళ్లతో తడిపినప్పుడు కాలిన గనిలోని రాయిలాగా ప్రాచీన గణ వ్యవస్థ బీటలు దీస్తోంది.

మొదట్లో గ్రామంలోని వాళ్లంతా సమమే. యిప్పుడు వున్నవాళ్లనీ లేనివాళ్లనీ ఒక బీట విడదీసింది. యింకోబీట వృత్తిపనివాళ్లని రైతులనుంచి విడదీసింది.

వృత్తిపనివాడు సమాజంకోసం పనిచేసినంత కాలమూ సమాజమే అతన్ని పోషించింది. మనుషులు కలిసి పనిచేసి తాము చేసిందీ, పండించిందీ ఉమ్మడిగా పంచుకునేవాళ్లు.

కాని వృత్తి పనివాడు తన పాత్రలనీ, ఆయుధాలనీ వేరే వూళ్లో మార్పిడి చేసుకోవడం యెప్పుడు మొదలుపెట్టాడో అప్పుడే తన బంధువులతో బాటుగా తనకీ లభించే ధాన్యాన్ని గాని, బట్టని గాని బదులుగా పుచ్చుకోవడం మానేశాడన్న మాట.

యింతకీ తనూ, తన కొడుకులూ యీ ధాన్యపు గింజల్నీ బట్టనీ సంపాదించుకున్నారు, తమకి యెవళ్లూ సాయపడలేదు!

ఆరకంగా మానవుడు ''నాది'' ''నీది'' అనే భేదాన్ని తన కుటుంబానికీ, బంధువులకీ మధ్య చూడనారంభించాడు.

మనుషులు చిన్న కుటుంబ గ్రూపులుగా జీవించడం మొదలుపెట్టారు. మికెనీ, టిరిన్స్ అనే ప్రాచీన గ్రీకు పట్టణాల్లోని నివాసాల్లో యీ విభేదాన్ని సూచించే శిథిలాలని పురాతత్వవేత్తలు కనుక్కున్నారు.

అతి సంపద్వంతమైన, శక్తివంతమైన కుటుంబం కొండమీద వుండేది, మంచి ప్రహారీ గోడల వెనక వుండేది. ఆ గోడల వెనక్కాల దాచుకోవడానికి మరి సరిపడా దాచుకునే వుండాలి! తెగ యుద్ధముఖ్యుడు యిక్కడ తన కొడుకులతోటీ, కోడళ్లతోటీ, మనవలతోటీ వుండేవాడు. బీదవాళ్లైన రైతులు కింద మైదానంమీద గుడిసెల్లో ఒకళ్ల దగ్గరసా ఒకళ్లు కిక్కిరిసి పోయి వుండేవాళ్లు. పరిసరంలో వున్న గుట్టలమీద వృత్తిపనివాళ్లనీ, ఆయుధ నిపుణులవీ, కుమ్మరి వాళ్లవీ, రాగిపని వాళ్లవీ యిళ్లు చెదురుమదురుగా వుండేవి.

గ్రామంలో మనుషులు ఒకళ్లనొకళ్లు సమానస్థులుగా పిలుచుకోవడం పోయింది. ధనికుడైన శక్తివంతుడైన కులపెద్దని చూసినప్పుడు రైతులు వంగి దణ్ణంపెట్టి పక్కనుంచి వెళ్లేవాళ్లు. దేముళ్లే బలవంతులకి పోషకులని వాళ్లు విశ్వసించేవాళ్లు.

పురోహితులు యీ విషయాన్ని వాళ్లకి చెప్పి, పసితనంనుంచీ ఉగ్గుబాలతో నూరిపోసేవాళ్లు.

వృత్తిపనివాణ్ణి గాని, గని పనివాణ్ణి గాని రైతు తన సమానస్థుడుగా భావించేవాడు కాదు, సోదరునిగా చూసేవాడు కాదు. పొగలూ, సెగలూ చిమ్మే భూగర్భంలోనుంచి రాగిని తీసే యీ మనిషి మంత్రగాడు కాడూ? గనిలో యేం జరిగిందో అతనికి యెలా తెలుస్తుంది? గని పనివాడికి ముడిలోహం యెలా దొరికింది? అదెక్కడ వుందో యెవళ్లో చూపించాలి, అది యెలా సంపాదించవచ్చో యెవళ్లో చెప్పాలి, యే మహిమవల్ల దాన్ని రాగికిందా, కంచుకిందా



యిప్పుడు పాత్రల్ని కంచుతో కూడా సేవాచేళ్ళ

మార్చవచ్చునో చెప్పాలి. అక్కడ భూగర్భంలో గని పనివాడికి తెలియని రక్షకులెవరో వున్నారు. అలాంటి వాళ్ళనుంచి భూమ్మీద వాళ్ళు దూరంగా వుండడమే మంచిది.

యీ ఆలోచనలు గ్రీకు ప్రజలవే కాదు, ఆదిమ మానవులందరికీ, అన్ని చోట్లా వుండినవే.

రాగి పనివాడు — మంత్రగాడు కథలు చాలా ప్రాచీన కాలంనుంచీ మనకి సంక్రమించాయి.

సంపదనీ, దారిద్ర్యాన్నీ యెలా పరిగణించేవాళ్ళో చెప్పే మాటలు మన భాషలో యింకా వున్నాయి. సమాజం ధనికుల కిందా, బీదవాళ్ళ కిందా యెలా విడిపోయిందో ఆదిమ మానవులకి తెలీదు. ఒక వ్యక్తి అదృష్టం దేవతలు నిర్ణయించేసి వుంచారని వాళ్ళు భావించే వాళ్ళు.

రష్యన్ భాషలో ''బొగాతీ'' అంటే ''ధనికమై''న అని. యిది ''దేవుడు'' అని అర్థం వచ్చే ''బొగ్'' అనే పదంనుంచి వచ్చింది. దేముళ్ళు ధనికులకే ఆసరా వుంటారనీ, బీదవాళ్ళకీ యాతనా బాధలూనే ప్రాప్తమనీ ప్రజలు నమ్మే రోజుల్లో యీ పదం భాషలోకి ప్రవేశించింది.

## నూతన వ్యవస్థకి ఆరంభం

మానవుడు నడిచి వచ్చిన పథంకేసి ఒకసారి మళ్ళీ చూద్దాం.

ధనికులూ పేదవాళ్ళూ లేని, బానిసలూ బానిస యజమానులూ లేని కాలం ఒకటి వుండేది.

భూసారంగ నివాసాల్లో యిరుక్కు యిరుక్కు పోయి కూర్చున్న ప్రాచీనకాలపు వేటగాళ్ళు అందరూ సమంగానే బీదవాళ్ళు. రాతితోటీ, ఎముకతోటీ చేసిన వాళ్ళ పనిముట్లు ముతకవి. ఆకలినుంచీ అడవి జంతువులనుంచీ, చలినుంచీ వాళ్ళని కాపాడిందల్లా వాళ్ళు కలిసి జీవించడం, కలిసి వేటాడం, ఉమ్మడిగా, కలిసి కట్టుగా వుండి తమని ప్రమాదం నుంచి రక్షించుకోవడం, ఉమ్మడి నివాసాలు యేర్పాటు చేసుకోవడం.

ఒక వ్యక్తి తనకి తానుగా మామత్‌ని కాదు కదా, కనీసం ఎలుగుబంటిని కూడా చంపలేడు. ఒక వ్యక్తి తనకి తానుగా తన పొయ్యికోసం రాతిని యీడ్చుకుని రాలేడు, పైన కప్పుగా వున్న అంచు దాకా గోడలు పేర్చలేడు.

అప్పట్లో మనుషులందరికీ అన్నీ ఉమ్మడిగానే వుండేవి. వేట అనుకూలంగా వుంటే ముసలాళ్ళ మాంసం ముక్కల్ని కోసి వేటలో పాల్గొన్న వాళ్ళందరికీ యిచ్చేవాళ్ళు.

కాని వేల సంవత్సరాలు గడిచిపోయాయి. ప్రాచీనకాలపు సొరంగాల స్థానంలో యిళ్ళు వచ్చాయి. రాతీ, యెముక పనిముట్ల స్థానంలో లోహపు పనిముట్లు వచ్చాయి.

మనుషులు మొదట్లో తొళ్లికలతోనూ, తర్వాత నాగళ్లతోనూ దున్నడం మొదలుపెట్టారు. వాళ్లు గుర్రాన్నీ, ఆవునీ, గొర్రెనీ మచ్చిక చేసుకున్నారు. కార్ఖానాలనుంచి దాయలమీద సుత్తులు చేసే చప్పుడు వినిపించింది. కుమ్మరి వాళ్ల చక్రాలు తిరిగాయి. శ్రమ విభజన జరుగుతోంది. ధాన్యం కోసం కొడవలినో, గొడ్డలినో బదలాయించుకో గలిగినప్పుడు కమ్మరివాడు మేడి పట్టుకుని పొలం దున్నడం అనవసరం. తనకి కావలసినంత వూలుకి ధాన్యం యిచ్చి మారకం చేసుకోగలిగినప్పుడు రైతు గొర్రెల కాపరిగా వుండటం అనవసరం.

ఒక గ్రామంనుంచి యింకో గ్రామానికి తెరచాపలు కట్టి మొదటి బోట్లు ప్రయాణం అయ్యాయి. వాటిల్లో ధాన్యం, వూలు, గొడ్డళ్లు, మట్టిపాత్రలు వున్నాయి. దూర ప్రాంతపు ''యాత్రీకులు'' దోపిడీగాళ్లుగా తయారయారు, దోపిడీ, వర్తక మారకం కలిసే వుంటాయి.

పూర్వం యెవరూ తన బంధువుల కంటే ధనికుడవలేదు. అందరూ సమంగానే బీదవాళ్లు.

కాలక్రమేణా పేదవాళ్ల గుడిసెలని మింగేస్తూ కొండలమీద ధనవంతుల, బలవంతుల ప్రాకార పరివేష్టిత ప్రాసాదాలు లేచాయి. ధనవంతుల గాదెలు సరుకుతోటి ఉబ్బిపోతున్నాయి. ఏటి ఏటికీ వాళ్ల సంపద పెరిగి యిబ్బడి ముబ్బడి అయింది.

బీదవాళ్లని లొంగదీసుకుని ధనికులు సమాజపు అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. బీదవాడు యింకా యింకా తరచుగా తన ధనికుడైన పొరుగువాడిమీద ఆధారపడాల్సివచ్చింది. యీ ఆధారపడ్డం చాలా వ్యయ పూరితంగా తయారైంది, యేమంటే కష్టకాలంలో తను తెచ్చుకున్న తిండిగింజల బాకీ తీర్చడం కోసమని బీదవాడు యేళ్ల తరబడి ధనికుడి దగ్గర పనిచెయ్యాల్సి వచ్చింది.

యీరకంగా కొందరు కొందర్ని బానిసలని చేశారు.

కాని యీ ఒక్క రకంగానే బానిస విధానం పరిణామం చెందలేదు. యుద్ధాలప్పుడు పట్టుబడిన స్వేచ్ఛాయుతులు కూడా బానిసలయ్యారు.

ఒకప్పుడు ప్రతివాడూ పనిచేశాడు. కొంతకాలానికి కొంతమంది పూర్తిగా పనిచెయ్యడం మానేశారు, కొంతమంది చేత కొట్టి పని చేయించే వాళ్లు.

ఒకప్పుడు వేటాడే ఆయుధాలూ, చంపిన జంతువూ అన్నీ ఉమ్మడిగానే వుండేవి. యిప్పుడు బానిసయజమాని విస్తారమైన భూములకి, గొర్రెల మందలకి, కార్ఖానాలకే కాక అతని పొలం దున్నేవాళ్లకి, గొర్రెల్ని కాసేవాళ్లకి, కార్ఖానాల్లో పనిచేసే బానిసలకు కూడా యజమాని.

ఒకప్పుడు ఒకే సమాజానికి చెందిన వాళ్లు తమలో తాము యుద్ధం చేసుకోలేదు. వాళ్లు ప్రశాంతంగా జీవించారు. రష్యన్‌లో ''మీర్'' అనే మాట ''శాంతి''కీ, ''సమాజాని''కీ రెంటికీ వర్తిస్తుంది.

బానిసత్వం ప్రవేశించడంతోటి ప్రతి గ్రామంలోనూ, పట్టణంలోనూ యుద్ధం మొదలైంది.

యజమానులు బానిసలని అసహ్యించుకునేవాళ్లు. బానిసలు యజమానులని ద్వేషించేవాళ్లు.

బానిస పారిపోవాలని కలగనేవాడు. తన సజీవ పరికరాన్ని, మాట్లాడే పనిముట్టు ఆస్తిని అన్ని విధాలా జాగ్రత్త చేసుకోవాలని యజమాని చూసేవాడు. బానిసలున్న రాజ్యం యజమాని ఆస్తిని సైన్యంతో కాపాడేది. బానిసలు యజమానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చెయ్య ప్రయత్నించారో, వాళ్లని బలవంతంగా అణిచేసి, నిర్దాక్షిణ్యంగా శిక్షించేవాళ్లు.

ఆరకంగా ఆదిమ గణ వ్యవస్థ స్థానంలో నూతన బానిస వ్యవస్థ వచ్చింది.

# ప్రకరణం పన్నెండు

## విజ్ఞానశాస్త్రపు ఆరంభం

ప్రపంచమంతా ఒక మాయగా మానవుడికి కనిపించిన కాలం వుండింది. ప్రతిదీ వింతగా, గందరగోళంగా వుండింది. వేసే ప్రతి అడుగూ, చేసే ప్రతి చేతి కదలికా తెలియని శక్తుల్ని తీసుకువచ్చేది, అవి మేలు చెయ్యొచ్చు కీడు చెయ్యొచ్చు.

మానవాళి అనుభవం యెంత తక్కువ అంటే, మానవాళి యెంత నిస్సహాయంగా బాధపడ్డారంటే రాత్రి తర్వాత పగలు వస్తుందో రాదో, శీతాకాలం తర్వాత వసంత రుతువు వస్తుందో రాదో నమ్మకం లేనంత అసందిగ్ధంగా వుండి పోయేవాళ్ళు.

ఆకాశంలో సూర్యుడు ఉదయించడం కోసమని ఆదిమ మానవులు పూజలు చేసేవాళ్ళు. భూమ్మీద సూర్యుడి ప్రతిరూపం అనుకునే యీజిప్టు ఫారో, సూర్యుని దిన భ్రమణం ఖాయంగా జరిగేందుకు, తను దేవాలయం చుట్టూతా ప్రదక్షిణం చేసేవాడు.

ఆకురాలు కాలంలో యీజిప్టు వాసులు ''సూర్యదండం'' విందు జరుపుకునే వాళ్ళు. ఆకురాలు కాలంలో నీరసంగా వుండే సూర్యుడికి తన ప్రయాణంలో సాయితా వుండటానికి దండం అవసరమైంది.

కాని మానవుడు పరిశ్రమ చేశాడు. పదార్థ స్వభావాన్ని గురించీ, ప్రపంచాన్ని గురించీ యింకా యింకా యెక్కువ గ్రహించాడు.

చెకుముకి రాతిని పదునుబెట్టీ, సాపు చేసీ తయారుచేసుకున్న ప్రాచీనకాలపు వృత్తి పనివాడు తొలిగా ఆ రాతి స్వభావాన్ని గురించి తెలుసుకున్నాడు. రాయి గట్టిగా వుండేదనీ ఒక రాతిని యింకో రాతితో కొడితే పగుల్తుంది కాని పేగులు చించుకుని యేడవదనీ అతనికి తెలుసు. చాలా రకాల రాళ్ళున్నాయి, నిజమే. రాతిని పగల గొట్టినప్పుడు అది యేడవని మాట నిజమే. కాని యింకో రాయి యేడుస్తుందేమో? అలాంటి వూహలు మనకి నవ్వు తెప్పిస్తాయి. కాని ఆదిమ మానవుడికి అది వేళాకోళంగా కనిపించేది కానే కాదు.

సామాన్య నియమాలు కనిపెట్టడం అతనికి తెలియదు. అందుకనే అతని బతుకునకన్నీ మినహాయింపులే. యే రెండు రాళ్ళూ ఒక్కలాగే వుండటం అతను చూళ్ళేదు. అందుకనే వాటికి భిన్న వస్తు గుణాలుంటాయని అతను అనుకున్నాడు. కొత్త రాతి తొళ్ళికని చేసినప్పుడు, అచ్చు పాతదాని లాగానే వుండేటట్టు చేసేవాడు, పాతదాని లాగానే కొత్తదీ నేలని తవ్వాలని.

వందల, వేల సంవత్సరాలు గడిచిపోయాయి. తన చేతిలో తిరిగిన ఆనేక రాళ్లనుంచి రాళ్ల సామాన్య గుణాల్ని గ్రహించాడు. అన్ని రాళ్ళూ గట్టిగా వుండబట్టి, రాయి గట్టిగా వుంటుంది అని అతను ఖాయంగా చెప్పగలిగాడు. ఏ రాయీ యెప్పుడూ మాట్లాడలేదు కాబట్టి రాళ్ల మాట్లాడవు అని చెప్పగలిగాడు.



సూర్యుడికి నైవేద్యం అర్పిస్తున్న ఫారో

ఆరకంగా విజ్ఞానశాస్త్రపు తొలి విత్తనాలు, భావనలు, ప్రత్యక్షమయ్యాయి.

వృత్తి పనివాడు చెకుముకిరాయి గట్టిగా వుంది అని అంటే, తన చేతిలో ఆ క్షణంలో వున్నదే కాదు మామూలుగా రాయే గట్టిగా వుందనే భావంతో అంటున్నాడన్న మాట.

కాబట్టి అతనికి ఒక ప్రకృతి ధర్మం, ప్రపంచంలో వున్న ఒక సామాన్య నియమం కొంత తెలిసింది.

''శీతాకాలం తర్వాత వసంతం వస్తుంది.'' దీన్ని గురించి ఆశ్చర్యపడాల్సింది యేదీ లేదు. శీతాకాలం తర్వాత ఆకురాలు కాలం కాదు, వసంత ఋతువే వస్తుందన్నది స్పష్టమే. కాని యెంతో పరిశీలన తర్వాత ఋతువుల మార్పుని

గురించి మన ప్రాచీనుల తెలుసుకున్నది, శాస్త్రీయ సత్యాల ఆవిష్కరణల్లో ఒకటి. శీతాకాలం వేసవికాలం యాదృచ్ఛికంగా రావనీ వసంతరుతువు శీతాకాలం తర్వాతా, ఆ తర్వాత వేసవీ, ఆకురాలు కాలమూ వస్తాయనీ గమనించినాకనే మనుషులు సంవత్సరాలని లెక్కపెట్టడం నేర్చుకున్నారు.

నైలు నది వరదలతో పూటుగా నిండడం పరిశీలించాక యీజిప్టు దేశీయులీ విషయాన్ని గ్రహించారు. ఒక వరద కాలంనుంచి యింకో వరద కాలానికి ఒక సంవత్సరం అని లెక్కేశారు.

నదిని దేవుడని ప్రజలు భావించడం వల్ల మహా పురోహితులు నదిని పరిశీలించేవాళ్ళు. పురోహితులు నీటి మట్టాన్ని గుర్తులు పెట్టే గీతలు యివాళ్టికీ నైలు నది నీటిని తాకే గుడి గోడలమీద వున్నాయి.

జులై నెలలో నేల యెండకి బీటలు దీసినప్పుడు, నైలు నది జేగురు రంగు నీళ్ళ ఒండ్రు మట్టితో యెప్పుడు కొట్టుకువస్తాయా అని ఆతృతగా రైతులు చూస్తూ వుండేవాళ్ళు. యీ యేడు నీళ్ళు రావేమో? దేముళ్ళకి కోపం వచ్చి పొలాలకి నీళ్ళని పంపకపోతే?

నలు మూలలనుంచీ గుళ్ళోకి కానుకలనీ, బలులనీ తెచ్చేవాళ్ళు. బీద రైతులు తము దాచుకున్న పిడికెడు గింజలూ తెచ్చి పురోహితుడికి యిచ్చి దేముళ్ళని గట్టిగా ప్రార్థించమనేవాళ్ళు.

పురోహితులు ప్రతి రోజూ ఉదయం నీటి మట్టం పెరిగిందో లేదో చూడ్డానికి నది దగ్గరకి వెళ్ళేవాళ్ళు.

ప్రతి సాయంత్రమూ వాళ్ళు గుడి మందిరం పైకెక్కి ఆకాశంకేసి చూసేవాళ్ళు. నక్షత్రాలతో వున్న ఆకాశమే వాళ్లకు పంచాంగం.

ఒక రోజున గంభీరంగా పురోహితులు అంటారు: ''దేవతలకి మీమీద కరుణ కలిగింది. నేటినుండి మూడు రోజుల్లో మీ పొలాలకి నీళ్ళు వస్తాయి.''

క్రమేపీ, ఒక్కొక్క మెట్టే, ప్రజలు తాము బతికే వింత ప్రపంచాన్ని గురించి జ్ఞానం సంపాదించ మొదలెట్టారు: యిది జ్ఞాన ప్రపంచం, మాయా ప్రపంచం కాదు. గుడి మందిరాల కప్పులే తొలి ఖగోళ వేధశాలలు. తొలి ప్రయోగాలు జరిపిన ప్రయోగశాలలే కుమ్మరి, కమ్మరి వాళ్ల కార్ఖానాలు.

ప్రజలు తాము చూసిందాన్నుంచి నిర్ధారణలు చెయ్యడం, పరిశీలించడం, గణించడం నేర్చుకున్నారు.

యీ రకపు విజ్ఞానశాస్త్రానికీ, ఆధునిక విజ్ఞానశాస్త్రానికీ పోలిక అసలు లేదు. అది యింకా మహిమాన్విత తంత్రం లాగా, అందులో భాగంగా వుండేది. ప్రజలు ఖగోళాన్ని, నక్షత్రాలని పరిశీలించడమే కాదు, వాటిని బట్టి జోస్యాలు కూడా చెప్పేవాళ్ళు. భూమినీ, ఆకాశాన్నీ అధ్యయనం చేసి వాళ్ళు ఆకాశదేవతలకీ, భూదేవతలకీ ప్రార్థన చేసేవాళ్ళు. అయినా దట్టమైన అజ్ఞానపు పొగమంచు విడిపోతోంది.

## దేవతలు స్వర్గానికి పోతారు

అద్భుత ప్రపంచపు పొగమంచు మధ్యన వస్తువుల స్థూల రేఖలు మానవుడికి గోచరమవడం మొదలెట్టాయి. ప్రతి రాతిలోనూ, ప్రతి చెట్టులోనూ, ప్రతి పశువులోనూ శక్తులేవో వున్నాయని ఆదిమ మానవుడు నమ్మిన కాలం వుండేది.

క్రమేణా యీ నమ్మకం మాయమైంది. ప్రతి పశువులోనూ దేవతా శక్తులుంటాయని అనుకోవడం మానేశారు. దట్టమైన పొదల్లో వుండే వనదేవత, యిప్పుడతని వూహల్లో జంతు దేవతల స్థానం ఆక్రమించింది.

ప్రతి గోధుమ కంకులోనూ దేవతా శక్తి వుందని రైతులు నమ్మడం మానేశారు. ధాన్యపు గింజల దేవతా శక్తులన్నీ కలిసి ధాన్య దేవత రూపం తీసుకున్నాయి. ప్రతిదాని వృద్ధికీ ఆ దేవతే కారణం.

యీ దేవతలు పాత శక్తుల స్థానంలో వచ్చారు. యీ దేవతలు సాదా మనుషుల సరసన వుండలేదు. విజ్ఞానం వాళ్లని మానవ నివాసాలనుంచి యింకా యింకా దూరం గెంటేసింది. దాంతోటి దేవుళ్లకి యింతకు ముందెన్నడూ మానవుడు యెరుగని చీకటి మయమైన పవిత్ర స్థలాల్లోకీ, వృక్షతతితో నిండిన కొండ శిఖరాల్లోకీ పోవడమే శరణ్యం అయింది.

కాలక్రమేణా మానవుడు యీ స్థలాల్లోకీ ప్రవేశించాడు. చీకటి అరణ్యాలనీ, పర్వతాలని కమ్మిన చిక్కని పొగ మంచునీ కూడా విజ్ఞానం అధిరోహించింది.

దాంతోటి దేవతలు మరోసారి యింకో చోటికి పోవాల్సి వచ్చింది. యిప్పుడు వాళ్లు ఆకాశంలోకి పోయారు, సముద్ర గర్భంలోని లోతుల్లోకి పోయారు, భూమి దిగువ పొరల చీకటి పాతాళంలోకి పోయారు.

దేవతలు భూమిమీదకి దిగిరావడం అరుదైపోయింది. వాళ్లు పైనుంచి కిందికి యేదేనా యుద్ధంలో పాల్గొడానికో, దుర్గపు ముట్టడిలో పాల్గొడానికో దిగివచ్చే వాళ్లనే కథలు తరం తర్వాత తరానికి సంక్రమించాయి.

గదలతోటీ, కత్తులతోటీ వచ్చి దేవతలు మనుషుల దెబ్బలాటల్లో తల దూర్చేవాళ్లు. అటో యిటో తేలిపోయే వ్యవధిలో వాళ్లు నాయకుణ్ణి నల్లని మేఘం మాటున దాచి శత్రువుని పిడుగుతోటీ, మెరుపుతోటీ హతం చేసేవాళ్లు. కాని యిదంతా అనగా అనగా యెప్పుడో జరిగిందనే కథలల్లే వాళ్లు చెబుతారు.

అంచేత దేవుళ్లని దగ్గర్నుంచి దూరానికి, వర్తమానంనుంచి గతానికి, యీ ప్రపంచంనుంచి ''మరో ప్రపంచానికి'' తరిమేస్తూ మానవ అనుభవం యింకా యింకా విస్తరించి, యింకా విస్తృతమై శోభాయమానమైంది.

దేవతలతోటి వ్యవహారం పెట్టుకోవడం కష్టమైంది. యింతకు పూర్వం ప్రతివాడూ మంత్రాలూ తంత్రాలూ వున్నవాడే, కర్మ కాండలు నడిపించేవాడే. ఆ క్రతువులే చాలా సులభంగా వుండేవి. వాన కురిపించుకోవాలనుకుంటే, నోటినిండా పుక్కిలిసెడు నీళ్లు పట్టి, ఒక ప్రత్యేక నృత్యం చేస్తూ, చుట్టూతా చిమ్మడమే. మేఘాల్ని చెల్లాచెదురు చెయ్యాలీ అంటే యింటి కప్పు యెక్కి గాలిని అనుకరిస్తూ వూదడమే.

యిలా చేసి మనం వాన కురిపించగలమా, మేఘాల్ని తరమగలమా? దేవతలు తన ప్రార్థనని వెంటనే పట్టించేసుకోరనే నిర్ణయానికి మానవుడు వచ్చాడు. అదిగో అప్పుడు పురోహితుడు సామాన్య జనానికీ, దేవుడికీ మధ్య నిలిచాడు, యెందుకంటే మంత్ర తంత్రాలూ, దేవ రహస్యాలూ అతనికి తెలుసు.

పూర్వం మంత్రగాడు వేటనృత్యాన్ని నడిపించేవాడు. అప్పట్లో అతను తనతోటి వాళ్లకంటే దేముళ్లకి దగ్గరేం కాదు.

యిప్పుడు పురోహితుడు పూర్తిగా భిన్నమైన వాడు అయాడు. అతను ఒక పవిత్రమైన స్థలంలో, దేవతలకి దగ్గరగా వుండేవాడు. నక్షత్రాల పుస్తకంలో దేవతల అభీష్టం అధ్యయనం చెయ్యడానికి అతను గుడి మందిరం పైకి యెక్కేవాడు. ఆ పుస్తకాన్ని అతనొక్కడే చదవగలడు. వూరికే బలిపశువు పేగులు చూసి యుద్ధానికి ముందే గెలుపు ఓటములని జోస్యం చెప్పేవాడు. ఆఖరికి పురోహితులు దేవతలకీ మనుషులకి మధ్యన దళారులయ్యారు.



యుద్ధానికి ముందు ఒక తెగ అధిపతికి సలహా యిస్తున్న దేవత ఏథెన్స్

కాని దేవతలు సాదా మనుషులనుంచి యింకా యింకా దూరం పోయారు. మనుషులంతా సమమే అని దేవతలు భావించే రోజులు పోయాయి. ప్రజలు తమ చుట్టూతా చూసుకుని పూర్వపు సమానత్వం పోయిందని గుర్తించారు. ''అది అలాగే వుండాలి. మనిషి అన్నీ దేవుడిమీదే వదిలెయ్యాలి. ప్రజలని కుల పెద్దలూ, రాజులూ పాలించినట్టుగా దేవుడు ప్రపంచాన్ని పాలిస్తాడు'' అన్నారు పురోహితులు. కాని అందరు ప్రజలూ బుర్రవూపి పూజారులు చెప్పే మాటలని విని తృప్తి పడలేదు. దేవతల యిచ్చని ఖాతరు చెయ్యని వాళ్ళూ వున్నారు.

''మంచితనం మగ్గిపోతూ వుంటే, పాపులు పరమానందంగా వుండటంలో జ్యూస్ (ఇంద్రుడు) న్యాయం యెక్కడ వుంది, తండ్రుల పాపానికి పిల్లలని శిక్షించడంలో ధర్మమేమిటి? మిగిలిందల్లా ప్రజల మధ్యలో యింకా మిగిలి వున్న ఆశా దేవతని ప్రార్థించడమే, మిగతా దేవతలంతా స్వర్గానికి వలసపోయారు'' అని ఒక ప్రాచీన గ్రీకు కవి అడిగాడు.

# విస్తరిస్తున్న చైతన్య పరిధి

సత్యానికీ అభూత కల్పనకీ, విజ్ఞానానికీ మూఢ నమ్మకానికీ వున్న తేడా ఆదిమ మానవుడికి తెలియదు. పాలనుంచి మీగడ వేరుపడినట్టుగా మూఢ నమ్మకాల్నుంచి విజ్ఞానం విడడానికి వేలవేల సంవత్సరాలు పట్టింది. మనకి సంక్రమించిన పాటల్లోనూ, పురాణ గాథల్లోనూ, అనేకమంది తెగలా, పెద్దలా చరిత్రని అభూత కల్ప

నలనుంచి వీడదియ్యడమూ, కల్పిత లోకాలనుంచి అసలు భూగోళాన్నీ, నక్షత్రాలని గురించి మొదటి శాస్త్రీయ అవగాహననీ జల్లించి పట్టడం కష్టం.

''ఇలియడ్'', ''ఓడిస్సే'' అనే రెండు గ్రీకు పురాణాలు మనకి మిగిలాయి. అనేక ప్రాచీన గీతాలూ కథలూ వాటిల్లో — చేరివున్నాయి. ట్రాయ్ నగరాన్ని గ్రీకులు ముట్టడించి వశం చేసుకోవడం, గ్రీకు అతి రథుడు ఓడిస్సూస్ (యూలిసిస్) విదేశాల్లో, సముద్రాలమీద చేసిన యాత్రలు, ఆఖరికి అతను స్వస్థలమైన ఇథాకాకి తిరిగిరావడం యీ పురాణంలోని కథలు. ట్రాయ్ నగర ప్రాకారం దగ్గర దేవతలు ఒకళ్లు దాడిచేసిన వాళ్ల పక్షంగానూ, యింకొకళ్లు యెదిరి పక్షంగానూ భుజం, భుజం కలిపి సామాన్య మానవుల సరసన పోరాడారు. దేవతలకి ప్రియమైన వాడు యెవడేనా గాయపడితే, వాడిని వెంటనే రణరంగంనుంచి రక్షిత ప్రాంతానికి తీసుకుపోయేవాళ్లు. ఒలింపస్‌మీద విందు చేసుకుంటూ యుద్ధాన్ని కొనసాగించాలా పోరాడేవాళ్ల మధ్య రాజీచెయ్యాలా అని చర్చించుకునేవాళ్లు.

యీ కథల్లో కల్పనా, నిజమూ కలిసిపోయాయి. కాని యెక్కడ కల్పన ముగిసి, నిజం యెక్కడ మొదలవుతుంది? అసలు గ్రీకులు ట్రోయ్‌ని ముట్టడించారా? అసలు ట్రోయ్ నగరం అనేది వుందా?

పండితులు చాలాకాలం యీ మీమాంసలో పడి కొట్టుమిట్టాడారు. ఆఖరికి పురాతత్వవేత్తల పికాస అన్ని సందేహాలకీ స్వస్తిచెప్పింది. ఇలియడ్‌లో వర్ణించిన మేరకి పురాతత్వవేత్తలు ఆసియా మైనరు ప్రాంతానికి వెళ్లి యెక్కడ తవ్వాల్సివుందో అక్కడ ట్రోయ్ నగర శిథిలాలని తవ్వారు!

''ఓడిస్సే''లో నిజం కూడా వుంది. యూలిసిస్ యాత్రని పటంమీద అనుసరించిన భౌగోళిక శాస్త్రజ్ఞులు రుజువు చేశారు. మీరు పటం తెరిచి చూస్తే అయోలస్ ద్వీపాలనీ, పద్మ భోక్తల దేశాన్ని చూడవచ్చు. యూలిసిస్ ఓడ వాటి మధ్యలోనుంచి వెడుతూవుంటే, దాన్ని నాశనం చెయ్యడానికి సిద్ధమైన సిల్లా, చారిబ్డిస్‌లని కూడా చూడవచ్చు.

ఆఫ్రికాలోని ట్రిపోలి తీరమే పద్మ భోక్తల దేశం. ఇటలీలో మనకి లిపారీ ద్వీపాలని తెలిసినవే అయోలస్ ద్వీపాలు. సిసిలీకీ ఇటలీకీ మధ్యన వున్న జల సంధే సిల్లా, చారిబ్డిస్.

ఓడిస్సేలో నిజం వున్నది. కాని అంత మాత్రం చేత ప్రాచీన ప్రపంచపు భూగోళాన్ని ఓడిస్సేని బట్టి చదవదలచుకుంటే మీరు పప్పులో కాలు వేసినట్టే.

యీ సాహసకృత్యాల, యాత్రల పుస్తకంలో భూగోళం చిత్ర విచిత్రమైన దుస్తులలో ప్రత్యక్షమవుతుంది. పర్వతాలు భూతాలుగా మారిపోతాయి. ఆ ద్వీపాల్లో వుండే ఆటవికులు రాక్షస యేకాక్షి నరమాంస భక్షకులైపోతారు.

ఆ రోజుల్లో ప్రజలకి తమ తక్షణ పరిసరాలతోటే పరిచయం వుండేది. వర్తకులు ఓడల్లో ప్రయాణం చేసిన మాట నిజమే. కాని వాళ్లు కూడా తీరం వదిలి దూరంగా లోపలికి పోవడానికి జంకేవాళ్లు. సముద్రం లోపలికంటూ పోవడం భయం కలిగించేది. ఆరోజుల్లో నావికా దిక్సూచిలా, పటాలా యేమన్నానా? నావికులు సుర్యుణ్ణి బట్టీ, నక్షత్రాలని బట్టీ తమ దారిని తడుముకునేవాళ్లు. ఒడ్డున వున్న పొడుగాటి చెట్లో, కొండశిఖరమో వాళ్ల పాలిట దీపస్తంభాలు.

సముద్రం అడుగున యెన్ని ప్రమాదాలున్నాయో. విశాలమైన, చదును మట్టు వున్న ఓడలు పిసరు గాలి వీస్తే అలలమీద వూగిపోయేవి. నిటారుగా వుండే తెరచాపలని లొంగదియ్యడం ఓ పట్టాన అయ్యేది కాదు. వాయుదేవుడు మనిషి మాట వినేవాడు కాదు, అతని ఓడలు అలలమీద చిల్ల పెంకుల్లాగా వూగిపోయేవి.



యులిసెస్ నౌక

కాని ఆఖరికి ఓడ తీరం చేరేది. అలిసిపోయిన నావికులు దాన్ని ఒడ్డుకు లాగేవాళ్లు. అమ్మయ్య, యీ పొడి నేల మీద వాళ్లు విశ్రాంతి తీసుకోవచ్చు. కాని వాళ్లకి శాంతిలేదు. యీ వింత ప్రపంచం సముద్రం కంటే భయంకరంగా వుంది. తోటి నావికులద్వారా ఆటవికుల గురించి వినివుండడం వల్ల నరమాంస భక్షకులు తమమీదకి లంఘిస్తున్నట్టు యీ నావికులు భయపడేవాళ్లు. భయపడ్డ వాళ్ల కళ్లకి ప్రతి కొత్త జంతువూ భూతంలాగే వుండేది. వాళ్లు భూభాగం లోపలి కంటా చొచ్చుకుపోయే సాహసం చేసేవాళ్లు కాదు.

అయినా ప్రతి నూతన ప్రయాణమూ మానవుడి పరిధిని విస్తృతం చేసింది. అజ్ఞాత హద్దులు, అద్భుత కథల యెల్లలు యింకా యింకా వెనక్కిపోయాయి. అత్యంత సాహసవంతులైన నావికులు సముద్రపు అంతఃపురంలోకంటా పోయారు, దాని అవతలే మహాసముద్రం మొదలైంది. యీ మహాసముద్రం విశ్వమంత అనంతమైందని వాళ్లు భావించారు. యిళ్లకి తిరిగి వచ్చాక ప్రపంచపుటంచుల దాకా తాము పోయామనీ, భూమికి అన్ని వేపులా సముద్రమే ననీ మిత్రులతో చెప్పేవాళ్లు.

వేల సంవత్సరాల తర్వాత జనం యూరప్‌నుంచి ఇండియాకీ, చైనానుంచి యూరప్‌కీ ప్రయాణం చేసేవాళ్లు. సముద్ర యాత్రికులు మహాసముద్రాన్ని దాటి అవతలి వేపున భూమిని, మనుషులు వాసం చేసే భూమిని, చూశారు.

అయినా భూగోళం గురించి అద్భుత కథల వర్ణనలు విజ్ఞానశాస్త్రంలో చాలా కాలం నిలిచి వుండిపోయాయి.

అమెరికాని కనిపెట్టిన క్రిస్టఫర్ కొలంబస్ యీ భూమ్మీద ఎక్కడ్నో యెత్తైన కొండ వుందనీ, అది స్వర్గం వుండే చోటు అనీ నిజంగా నమ్మాడు. తను స్వర్గానికి చాలా దగ్గరగా రాగలననీ, దాని పరిసరాలని పరిశోధించగలననీ ఆశగా వున్నట్టు స్పెయిన్ రాణీకి ఉత్తరం రాశాడు.

మొన్నీ మధ్య 15వ శతాబ్దందాకా, ఉరల్స్ పర్వతాల అవతల శీతాకాలంలో యెలుగుబంట్లకి మల్లే దీర్ఘనిద్రలోకి పోయే మనుషులు వున్నారని రష్యాలోని యూరపియన్ ప్రాంతంలో నమ్మేవాళ్లు. ఒక ప్రాచీన పత్రం దొరికింది. ''తూర్పు దేశంలో తెలియని ప్రజలు'' అని దాని పేరు. తలమీద యెత్తుగా నోళ్లు వున్నట్టూ, తలల్లేని మనుషులకి కళ్లు ఛాతీమీద వున్నట్టూ మనుషులని గురించి యిందులో వర్ణనలు వున్నాయి.

యిదంతా మనకు తమాషాగా కనిపిస్తుంది. అయినా యిప్పుడు కూడా వైజ్ఞానిక నవలలు రాసేవాళ్లు తెలియని ప్రపంచాలలో భయంకర రాక్షసులున్నట్టు రాస్తారు.

యీ భూమి ఉపరితలాన్ని విస్తృతంగా అధ్యయనం చేశారు. అందుకనే యీ రచయితలు తమ పాత్రలని భూమి మధ్యకీ, కుజగ్రహానికీ, చంద్రగోళానికీ పంపుతారు.

# తొలి గాయకులు

ఒక్కొక్క శతాబ్దమే గడిచేకొద్దీ జీవితాన్ని గురించిన అజ్ఞానం అంతరించి, తెలియని విషయాలు తెలియసాగాయి. వృత్తి నిపుణులకి తమమీద తమకే నమ్మకం పెరిగింది, దేవతలని ప్రార్థించడం తగ్గించారు. సూర్యుడు ఉదయించగానే పొగ మంచు కరిగిపోయినట్టుగా, మంత్రతంత్రాలు నిత్యజీవితంనుంచి మాయమవడం మొదలుపెట్టాయి.

మంత్రతంత్రాలు అనేక ఆచారాల్లోనూ, ఆటల్లోనూ పాటల్లోనూ, నృత్యాల్లోనూ మిగిలాయి. మానవుడి జాగ్ర తమవుతున్న చైతన్యం మంత్రతంత్రాలని వీటిల్లోంచి కూడా గెంటేసేంది, సొంత యింటినుంచి మనిషిని గెంటే సినట్టుగా.

కర్మకాండలకి చెందిన నృత్యాల్లోనుంచీ, పాటల్లోనుంచీ మంత్రతంత్రాలు మాయమైపోయి వూరికే పాటలూ, నాట్యాలూ మిగిలాయి.

గ్రీకులు డయోనిసస్ (బాకస్) విందుని జరుపుకున్నప్పుడు, ఆ దేవుడు తమకి ద్రాక్షపళ్లని యిచ్చాడని భావించి, మొదట్లో దాన్నంతటినీ పవిత్రంగానే జరుపుకునేవాళ్లు. శీతాకాలంలో దీర్ఘనిద్ర తర్వాత లేచి ప్రజలకి ధాన్యం, పళ్లూ, ద్రాక్షసారాయి యివ్వడానికి, ప్రకృతికి సాయం చెయ్యడంకోసం బాకస్ పునర్జన్మ పొందడం గురించి బృందగానం వుండేది.

ఆ విందు సందర్భంగా ముసుగులు వేసుకున్న వాళ్లు జంతు చర్మాలని ధరించి, గ్రామపు బలివితర్ది చుట్టూతా నృత్యం చేసేవాళ్లు.

మొదటి గాయకుడు బాకస్ పడ్డ బాధల్ని గురించి పాడేవాడు, బృందగానం బదులు చెప్పేది, పల్లవి పాడేది.

ప్రాచీన మంత్రక్రీడ ఒక నాటకంలాగా వుండేది. భవిష్యత్‌లో రాబోయే నటకులు యీ ముసుగు ధరించిన వాళ్లలో వున్నారు. మొదటి వాడు దేవుడి బాధలని వర్ణించడమే కాదు, తను వాటిని నటించేవాడు కూడా. చేతుల్ని గుండెకేసి బాదుకునేవాడు. ఆకాశం కేసి చాచేవాడు.

బాకస్ పునరుజ్జీవితుడవగానే యీ ముసుగు నటులు ఉల్లాసభరితులైపోయేవాళ్లు, ఒకళ్ల నొకళ్లు వేళాకోళం చేసుకునేవాళ్లు, హాస్యాలాడుకునేవాళ్లు.

కొన్ని శతాబ్దాల తర్వాత యీ మంత్ర విహితమైన ప్రదర్శననుంచి మంత్రమంతా మాయమైపోయింది. ఆ ప్రదర్శన మాత్రం మిగిలిపోయింది. ముందటిలాగానే మనుషులు ఆడేవాళ్లు, పాడేవాళ్లు. కాని వాళ్లు దేవుళ్ల బాధలని చిత్రించేవాళ్లు కాదు, మనుషుల బాధలని చిత్రించేవాళ్లు. వాళ్లు ప్రదర్శిస్తూ వుంటే చూసి జనం నవ్వేవాళ్లు, యేడ్చేవాళ్లు, సాహసాన్ని సాహస కృత్యాల్నీ మెచ్చుకునేవాళ్లు, తెలివితక్కువతనం, పనికిమాలినతనం అంటే అసహ్యించుకునేవాళ్లు.

ఆరకంగా ప్రాచీన బృందగానంలోని మొదటి పాటగాడు విషాదనటుడైతే, ఉల్లాసంగా వుండే ముసుగు నటులు వినోదం కలిగించేవాళ్లుగా, సరస సల్లాపం చేసేవాళ్లుగా, విదూషకులుగా తయారయారు.

కాని మొదటి గాయకుడు మొదటి నటుడే కాదు, అతను తొలి గాయకుడు కూడా. మొదట్లో అతను బృందంలో పాడేవాడు. తర్వాత ఒక్కడే పాడేవాడు.

కాలక్రమేణా పాట కర్మకాండనుంచి విడిపోయింది. ఆ పాటగాడు పవిత్రమైన ఆటలప్పుడూ, యుద్ధ ముఖ్యుని



బాకస్ గౌరవార్థం నృత్యం

విందు భోజనాల దగ్గరా పాడేవాడు. తన వాయిద్యాన్ని మోగిస్తూ, అప్పుడప్పుడు నృత్యంచేస్తూ, పాత ఆచారం ప్రకారం మాటలనీ, సంగీతాన్నీ, నటననీ మేళవిస్తూ పాటగాడు పాడేవాడు. అతను మొదటి గాయకుడూ, బృందమూ కూడా అయాడు. అతను పాటనీ పల్లవినీ కూడా పాడేవాడు.

అతను దేన్ని గురించి పాడేవాడు? అతను దేవతల గురించీ, వీరుల గురించీ, శత్రువులని తరిమివేసిన తన తెగ ముఖ్యుని గురించీ పాడేవాడు. యుద్ధంలో చనిపోయిన యోధుల గురించీ, పగతీర్చుకోవాల్సిన సోదరుల గురించీ పాడే వాడు.

పాట ప్రార్థనా కాదు, మంత్రమూ కాదు. అది సాహసకృత్యాల గాథ, సాహసకృత్యాలని ఉద్దీపన చేసే పిలుపు.

ప్రేమని గురించీ, వసంతరుతువు గురించీ, విషాదం గురించీ వున్న పాటల మాటేమిటి? అవెక్కడ్నుంచి వచ్చాయి? అవి కూడా పెళ్లిళ్లప్పుడూ, చనిపోయిన తర్వాత కర్మలప్పుడూ, కోతలప్పుడూ, ద్రాక్షపళ్లని కోసేటప్పుడూ పాడేవే. అప్పుడు రెండు బృందాలు చిన్న పాటలని మార్చుకునేవి.

రాట్నం తిప్పే ఆడపిల్ల యీ పాటలని గుర్తు చేసుకునేది. పిల్లని నిద్రపుచ్చడానికి వుయ్యాలా వూపే తల్లి పాట పాడేది.

యీ రోజుల్లో వసంతగీతాలు వసంతంలోనే మాత్రమే పాడరు, ప్రేమగీతాలని పెళ్లిళ్లప్పుడు మాత్రమే పాడరు, ఎప్పుడూ పాడతారు.

వీరుల్ని గురించీ, ప్రేమ గురించీ వున్న మొదటి పాటల్ని యెవరు సృష్టించారు?

మనకి జవాబు తెలియదు, మొదటి కత్తినీ, మొదటి రాట్నాన్నీ యెవరు చేశారో మనకి తెలియనట్లుగానే. ఏ ఒక్క వ్యక్తీ అయివుండడు. వందలాది తరాల మానవులు మన శ్రమ సాధనాలనీ, పాటలనీ, మాటలనీ తయారుచేశారు.

పాటగాడు తనే పాటని తయారుచేసుకోలేదు. అతను వూరికే తను విన్న దాన్ని యితరులకి అందిచ్చేవాడంతే. కాని ఒక పాటగాడినుంచి యింకో పాటగాడి దగ్గరకి పాట పోయేటప్పటికి అది మారేది, దాని విరివి పెరిగేది. ఒక నది ఉప నదులవల్ల పెద్దదయినట్టుగానే, మహా కావ్యాలు కూడా తొలి పాటలనుంచి వృద్ధిచెందాయి.

''ఇలియడ్''ని రాసినవాడు హోమర్ అంటాం మనం. కాని హోమర్ యెవరు? అతన్ని గురించి మనకి పురాణ కథలద్వారానే తెలుసు. ఆ పురాణగాథల్లోని వీరులెంత కల్పితులో హోమరూ అంతే కల్పిత వ్యక్తి.

సాహస వీరుల గురించి తొలి పాటలు పుట్టినప్పుడు, పాడేవాడు యింకా తన తెగకీ, తన గణానికీ సన్నిహితంగా వుండేవాడు. అప్పట్లో మనుషులు అన్నీ కలిపే చేసేవాళ్లు. పాటలు కూడా సమష్టి శ్రమవల్లనే పుట్టేవి.

పాటగాడు తరతరాలుగా వారసత్వంగా వచ్చిన దాన్ని తను మార్చి మెరుగులు పెట్టినా కూడా తను ఆ పాట రాసిన వాడనో, సృష్టించిన వాడనో అనుకునేవాడు కాదు.

కాని కాలక్రమేణా మనిషి ''నాది'' అనే దాన్ని ''నీది'' అనే దాన్నుంచి విడదీశాడు. తెగలు చీలిపోయాయి, పూర్వపు ఐక్యం పోయింది. వృత్తి నిపుణుడు యిప్పుడు తన కోసమే పనిచేసుకోవడం మొదలెట్టాడు, తను తన తెగ అభీష్టాన్ని నిర్వర్తించే పనిముట్టు అని అనుకోవడం మానేశాడు.

కొన్ని శతాబ్దాల తర్వాత మియగ్రా పట్టణానికి చెందిన ప్రాచీన గ్రీసు కవి థెయాగ్నిస్ రాశాడు:

> నా పాటలమీద నా ముద్రవేశాను, నా కళమీద నా బొమ్మచెక్కాను. ఎవరూ దాన్ని కాజెయ్యలేరు,
> ఎవరూ దాన్ని మార్చలేరు. అందరూ కూడా అనాలి:
> ''ఇవిగో మియగ్రా థెయోగ్నిస్ కృతులు.''

గణసమాజ వ్యవస్థనాటి మనిషి యీ మాటలు అనివుండేవాడు కాదు.

క్రమేపీ మానవుడు ''నేను'' అనే మాటని తరచుగా వాడటం మొదలుపెట్టాడు. పని చేసేది తను కాదు, యేదో తన చేత చేయిస్తోంది అనుకునే రోజులు పోయాయి. పాడేవాడు తన పాట వరప్రసాదలబ్ధమనీ, సరస్వతీ దేవి కటాక్షమనీ అనేవాడు, కాని తన గురించి మరిచిపోయేవాడు కాదు.

> ''నా పేరు నిలుస్తుందని దేవతలు వరమిచ్చారు.''

యీ పాదం ప్రాచీన గ్రీకు కవయిత్రి సాఫో రాసింది. యిందులో పాత కొత్తలు కలిశాయి. తనకి దేవతలు యీ మాటల వరం యిచ్చారనీ, గనులు తవ్వేవాళ్లు కొండల్లో ముడి వస్తువుని కనిపెట్టినట్టుగా తనంతగా తను భాషలో దీనిని కనిపెట్టలేదనీ అంది. కాని అదే పాదంలో కృతి నిర్మించాననే ఆత్మభావం, తన పేరు నిలుస్తుందని కవి గర్వభావం మనకి కనిపిస్తాయి.

ఆ విధంగా మానవుడు పెరిగాడు. అతను యెత్తుకు అధిరోహించేకొద్దీ అతని చైతన్య పరిధి విస్తరించింది.

# యీ పుస్తకాన్ని గురించి మరి కొన్ని మాటలు

ఆదిమ మానవుడి గురించి చెప్పిన కథను మీరు యిప్పుడు చదివారు.

యీ పుస్తకం మొదలుపెట్టే ముందు మేం చాలా పుస్తకాలు చదివాం.

భూమిమీద మానవ ఆవిర్భావం జరిగేదాకా సకల ప్రాణులూ యెలా మారుతూ, పరిణామం చెందుతూ వున్నాయో ఛార్లెస్ డార్విన్ నుంచీ, ఆయన అనుయాయులు వ్లదీమిర్ కొవలేవ్‌స్కీ, క్లేమెన్త్ తిమిర్యాజెవ్‌నుంచీ తెలుసుకున్నాం.

శ్రమ వానరుణ్ణి నరునిగా మార్చిందని ఫ్రెడరిక్ ఎంగెల్స్ పుస్తకాలనుంచి తెలుసుకున్నాం.

ఆదిమ మానవుడు ఆలోచించడం, మాట్లాడ్డం యెలా నేర్చుకున్నదీ అర్థం చేసుకోవడానికి ఇవాన్ పావ్‌లోవ్ సహాయం చేశాడు.

వేల సంవత్సరాల కాలంలో మానవ సమాజాభివృద్ధి మహత్తర ద్వారాలు మన ముందు కార్ల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్స్, వి. ఐ. లెనిన్‌ల రచనలు తెరిచాయి.

ప్రకృతిశాస్త్రజ్ఞులు రాసినవీ, చరిత్రకారులు రాసినవీ, పరిశోధకులు రాసినవీ యింకా చాలా పుస్తకాలు చదివాం.

మానవ జాతి చరిత్ర గురించి యెక్కువ తెలుసుకోవాలనుకుంటే మేము చేసినట్టే చెయ్యండి: విజ్ఞానశాస్త్రపు ప్రాథమిక ఆధారాలైన పుస్తకాలు చదవండి. యీ భూమి గురించీ, మానవ జాతి అభివృద్ధి గురించీ అధ్యయనం చేసిన శాస్త్రజ్ఞుల పుస్తకాలని చదవండి.

మిమ్మల్ని విజ్ఞాన శాస్త్రపు సింహద్వారం దగ్గరికి తీసుకొచ్చి అక్కడ వదిలిపెట్టి, యిలా అనడమే మా లక్ష్యం: ''ప్రవేశించండి.''

మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్
4–1–435 బేంక్ వీధి
హైదరాబాదు – 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్
ఏలూరు రోడ్డు
విజయవాడ – 520 002

విశాలాంధ్ర బుక్ హౌస్
సుల్తాన్ బజారు
హైదరాబాదు – 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్
కాలేజి రోడ్డు
అనంతపురం – 515 004

విశాలాంధ్ర బుక్ హౌస్
11–1–37 గాంధీ రోడ్డు
తిరుపతి – 517 501

విశాలాంధ్ర బుక్ హౌస్
సూపర్ బజారు ఎదుట
మెయిన్ రోడ్డు
విశాఖపట్నం – 530 002

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
హనుమకొండ
వరంగల్ – 506 011

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
అరండల్ పేట
గుంటూరు – 522 002

పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించీ, దీని అనువాదం గురించీ మీ అభిప్రాయాలను "రాదుగ" ప్రచురణాలయానికి దయచేసి తెలుపండి. మీ అభిప్రాయాలను ఈకింది చిరునామాకు పంపండి:

Raduga Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

# మహా యుగం

1,50,000
యేళ్లకు పూర్వం

40,000
యేళ్లకు పూర్వం



రొడీషియా నరుడు

నియాండర్తల్ నరుడు

క్రోమాన్యాన్, పై గుహ, బాస్కోప్‌ల నరులు

ఆధునిక మానవుడు హోమో సపియన్స్

1972 ఆగస్టు – సెప్టెంబరుల్లో ''ది యునెస్కో కేరియర్''
అన్న పత్రికలో ఆర్. జాలిగర్ గీసిన చిత్రం

